# చిరస్మరణ

కన్నడ మూలం :

నిరంజన

తెలుగు :

తిరుమల రామచంద్ర

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్సు విజయవాడ-520004



ప్రచురణ సంఖ్య : 981

ప్రతుల సంఖ్య : 2000

ప్రథమ ముద్రణ : మార్చి, 1981



వెల: రు. 14/-





ముద్రణ :

స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్స్,

విజయవాడ-520004.

# చిరస్మరణ

కయ్యూరు మృతవీరులు పరాయి పాలకులకు ఫ్యూడల్ అణిచివేతదార్లకు వ్యతిరేకంగా జరిగిన ఘర్షణలో తమ ప్రాణాలు బలిదానం గావించి చరిత్రలో స్మరణీయులైనారు. కేరళలోని ఉత్తరభాగాన జాతీయోద్యమంలో భాగంగా రైతు పోరాటం ఏ విధంగా ప్రారంభమైందీ, దోపిడీ వర్గాలవారు, బ్రిటిష్‌వారు సంయుక్తంగా రేకెత్తించిన ఘర్షణల ఫలితంగా అతి సామాన్యులైన వ్యవసాయదారులు నిర్బంధంలో ఏ విధంగా అణచరాని ఒక శక్తిగా రూపొందిందీ, చివరకు ఏ విధంగా మరణశిక్షకు గురయిందీ – అంతా ఈ నవలలో చిత్రించబడివుంది. ఐతిహాసికమనదగిన రీతిలో, ఉత్కంఠతో, మృదురీతిలో హృదయాన్ని హత్తుకునేట్లుగా చిత్రించబడింది.

ఈ నవల మళయాళ అనువాదం కేరళలోని అన్ని వర్గాల ప్రజల మన్ననలను పొందింది.

'అనోఖీ యాద్' అనే పేరుతో లోక్ ప్రకాశన్‌వారు హిందీలో ప్రచురించారు.

'ది స్టార్స్ షైన్ బ్రైట్' అనే పేరుతో పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్ వారు ఇంగ్లీషులో ప్రచురించారు.

బెంగాలీలో కూడా ముద్రింపబడింది. మృణాల్ సేన్ ఈ నవల ఆధారంగా ఒక చలన చిత్రం నిర్మింపబోతున్నారు. కన్నడంలో కూడా చలన చిత్రంగా రాబోతున్నది.

ఈ నవల 1974లో సోవియట్ భూమి నెహ్రూ అవార్డు అందుకున్నది.

## సమీక్షలలోని కొన్ని భాగాలు

**కన్నడ చిరస్మరణ గురించి :**

* ఈ శతాబ్దపు నవల...."చిరస్మరణ" జాతీయ స్వభావంతో కూడిన సోషలిస్టు నవల.... — శ్రీకాంత్ 'అరుణ'లో
* 'నిరంజన అభ్యుదయ మార్గగామి. 'చిరస్మరణ' ఆయన అత్యుత్తమ రచన. కన్నడ నవలల్లో మైలురాయి అనదగిన నవల....' —ప్రొ॥ కీర్తినాథ్ కుర్తకోటి తన 'సాహిత్య సమీక్ష'లలో
* ఈ రచన అతి వివరంగా చిత్తశుద్ధితో వ్రాయబడింది. 'నిరంజన' కథనం సాదాగా, నిశితంగా వుంటుంది. పాత్రలలో గొప్ప వైవిధ్యం వుంది.
  — Ch. ప్రహ్లాదరావు 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో

**మళయాళం చిరస్మరణ గురించి**

* 'మానవత్వంతో, దేశభక్తితో నిండిన అభ్యుదయ రచన.' —సి. పి. శ్రీధరన్ తన 'ముందుమాట'లో
* 'వ్యవసాయ కార్మికుల పోరాట సర్వస్వం' ఈ నవల.... — 'కర్షక తొలిలాలి'
* అత్యుత్తమ నవలల్లో ఒకటి —ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్ ('పీపుల్స్ డెమొక్రసీ'లో)
* 'నిరంజన' తన రచన ద్వారా సాహిత్య చరిత్రలో కొత్త అధ్యాయం సృష్టించారు. — 'చింత'
* గత రెండు దశాబ్దాలలో అత్యుత్తమ మళయాళ నవల. — 'దేశాభిమాని'
* ఆద్యంతమూ స్వానుభవాన్ని కళ్ళకు కట్టినట్లు చూపిస్తూ కఠిన సత్యాల నిష్ఠురతను చిత్రించిన కళాఖండం.... — MOB
* ఆదినుండి విషాదాంతం వరకూ ఉద్వేగంతో సాగిన ఉద్విగ్న రచన. చివరి అధ్యాయాలు పాఠకుల కళ్ళవెంట నీళ్ళు తెప్పిస్తాయి. నిజ జీవితం చూస్తున్నట్టే పాఠకుడు అనుభూతి చెందుతాడు.
  — హృదయకుమారి 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో

## మనవి మాటలు

మద్రాసు కుట్రకేసు, కాకినాడ బాంబుకేసు, కయ్యూరు దొమ్మీకేసు మూడు దశాబ్దాల క్రితం దేశాన్ని ఊపివేసిన ప్రజోద్యమాలు. మొదటి రెండు కేసుల్లో ఉరిశిక్ష ఎవరికీ పడలేదుగాని, మూడవ కేసులో ఉరిశిక్ష నలుగురికి పడింది. వారు నలుగురూ విజయనినాదాలుచేస్తూ ఉరికంబము ఎక్కారు.

ఈ వీరగాథను శ్రీ నిరంజనగారు ద్వితీయ ముద్రణ పీఠికలో అన్నట్టు సమక్షసత్య దర్శనం కోసం చిన్న చిన్న వాస్తవాంశాలను అప్రధానమని వదలి, అనేక పాత్రలను వాస్తవ జీవితంనుంచే గ్రహించి కళాదృష్టిని జోడించి నవలగా రూపొందించారు. కనుక ఇది ప్రచార సాహిత్యంగా కనిపించనందున కన్నడ ప్రజాసామాన్యం వీరగాథను చదివినట్టే చదివి ఆనందించగలిగింది.

కన్నడ ప్రజలలాగే తెలుగు ప్రజలు — ముఖ్యంగా స్వాతంత్ర్య సమరంలో పరిచయం గలవారు – ఆనందించగలరనే నమ్మినాను. కనుకనే విశాలాంధ్ర ప్రచురణాలయం దీనిని అనువదించమన్నప్పుడు సంతోషంతో అంగీకరించాను. దీని మూలంగా కొంతకు కొంత ప్రజాసేవ చేసినట్లవుతుందనీ సంతృప్తిపడ్డాను.

నా అనువాద పద్ధతిని గురించి రెండు మాటలు చెప్పాలి. నాలుగైదు భాషల నుంచి చాల గ్రంథాలు తెలుగుచేసిన వాడిని గనుక నేనొక పద్ధతిని అనుసరించాను. విదేశభాషల అనువాదాలు తు.చ. తప్పక చేయడం

అవసరంలేదని. మూల భావాన్ని నుడికారంతో తెస్తే చాలునని, స్వదేశ భాషలు ముఖ్యంగా తెనుగు తోబుట్టువులు చాలవరకు తెలుగుకు అన్నివిధాల దగ్గరివి గనుక, వాటిని యథాతథంగా అనువదించాలని నిశ్చితాభిప్రాయం గలవాడిని కనుక, తక్కిన కన్నడ, తమిళ గ్రంథాలు అనువదించినట్లే, దీనిని యథామూలంగా అనువదించాను. మూలకాదని భావం కాని, భావావేశంగాని జారిపోగూడదను అనువాదంలోని నా నియమము. ఈ నియమాన్ని పూర్తిగా పాటించాను. సహృదయ పాఠకులు చూస్తారుగా.

ఈ ఉత్తమ నవలను అనువదించే అవకాశం నాకు కలిగించినందుకు విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి నా కృతజ్ఞతలు.

60, ఆదర్శనగర్,
హైదరాబాద్.
పింగళ మకర సంక్రాంతి

భాషా సేవకుడు
తిరుమల రామచంద్ర

కయ్యూరు రైతుల
ప్రియ నాయకులు
మాధవన్
గణపతి కామత్
వి. వి.
గారలకు
సమర్పణ

# "చిరస్మరణ"ను గురించి

"చిరస్మరణ" నవల రచనకు సంబంధించి ఈ సందర్భంలో ఒకటి రెండు మాటలు వ్రాయడం అప్రస్తుత మనిపించదు.

* * * *

భారతదేశ శ్రమజీవులు కొనసాగిస్తూ వచ్చిన వర్గ సమర ఇతిహాసం సుదీర్ఘమయింది. దాని రోమాంచకారి అయిన ఒక అధ్యాయం కేరళలోని కయ్యూరు రైతుల పోరాటం. అదే 'చిరస్మరణ' రచనకు ప్రేరణ. ఆ ఇతివృత్తం నా మనస్సును తాకినది, తట్టినది నా విద్యార్థి దశలో.

పూర్వం దక్షిణ కన్నర జిల్లా కాసరగోడు తాలూకాలోని ఒక పల్లె కయ్యూరు. దాని సమీపంలో వున్న చిన్న వూరు నీలేశ్వరం. అక్కడ ఒక రాజవంశం వుండేది. ఆ వంశంవారు పరదేశీయుల పాలనలో నామమాత్రపు రాజులుగా వుండేవారు. మరేమీ కాకపోయినా, వారి నుంచి జరిగిన ఒక మంచిపని ఒక ఉన్నత పాఠశాల స్థాపనం. అది రాజాస్ హైస్కూలు. అక్కడ తక్కువ వ్యయంతో ఉన్నత స్థాయి విద్య లభించేది. దూరదూరాల నుంచి కన్నడ విద్యార్థులు అక్కడికి వచ్చి మలయాళీ బాలుర జతలో విద్యార్జన చేసేవారు.

1938–41 మధ్యకాలంలో నీలేశ్వరం రాజాస్ హైస్కూలులో వున్న విద్యార్థులలో నేనూ ఒకణ్ని.

అప్పుడు కర్ణాటకంలో ప్రధానంగా వున్నది స్వాతంత్ర్యసంగ్రామ రాజకీయోద్యమం మాత్రం. కేరళలో స్వాతంత్ర్యసమరంతోపాటు వర్గ సమరమూ వ్యాపించింది. అసాధారణ మనిపించేట్టు వుండేది ఆ ప్రాంతపు రాజకీయ జాగృతి. ముఖ్యమైన బహిరంగ రాజకీయవాదాలు గాంధీ వాదం,

సోషలిజం; రహస్యంగా వ్యాపించి ప్రభావశాలి అయినది కమ్యూనిజం. పరిపాలిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వానికి కమ్యూనిస్టు విప్లవకారులు అప్పుడు సింహస్వప్నం.

నీలేశ్వరం ఉన్నత పాఠశాలలో చేరిన పదునాల్గు సంవత్సరాల పసివాడయిన నాకు చదువు అంటే ఇష్టం; దానంతే యిష్టమైనది పాఠ్యేతర కార్యక్రమం కూడా. నా పాలిటికి "పాఠ్యేతర"మయినది ఇతర సహపాఠులతో పాటు హరిజన వాడలను శుభ్రపరచడం, ఒంటరిగా కూర్చుని తకిలీతో నూలు వడకడం, ఆ నూలుకు వినిమయంగా ముతక ఖద్దరు తీసుకొని కట్టుకోడం, ప్రపంచ యుద్ధం ఆరంభమయిన పిదపదినమూ "హిందూ" పత్రిక కోసం కాచుకొని కూచుని, బ్రిటిష్ సైన్యాలు తిరోగమించిన వార్త కానవచ్చినప్పుడు పొంగిపోవడం, రాజు బొమ్మ వున్న టపా బిళ్ళను తలకిందులుగా లకోటా(కవరు)పైన అతికించి సంతోషపడడం, అవకాశం చిక్కినప్పుడెల్లా వీరావేశంతో సామ్రాజ్యవాదానికి విరుద్ధంగా ప్రసంగించడం, చిన్న కథలు వ్రాయడం, "హరిజన" పత్రిక పఠించడం, పోలీసుల బారిని బడక తలదాచుకొన్న విప్లవకారులను రహస్యంగా కలుసుకొని పులకాంకితుడు కావడం ఇత్యాది....

అప్పుడు నాకు పరిచయమయినవారు ఎన్. గణపతి కామత్. ఆయన మాతృభాష కొంకణి. మలయాళ, కన్నడాలు రెండింటినీ చక్కగా తెలిసినవారు. (తరువాత కొన్ని మలయాళీ కథలను కన్నడీకరించారు. ఆ కథలలో ఒకటి తగళి శివశంకరం పిళ్ళెగారి "ఆ సుందరిమగడు". నేను 1945లో "ప్రజామత" లో వున్నప్పుడు ఆ పత్రికలో దానిని ప్రచురించాను.) ఆయనది సదాఉద్విగ్నమైన, అంకితమైన జీవితం. నాకంటే నాలుగైదు సంవత్సరాలు పెద్దవారు కావచ్చు. కుశలుడైన మాటకారి. ఆయనకూ అజ్ఞాతవాసంలో వున్న కమ్యూనిస్టులకు సంబంధం వుండినట్టు తర్వాత తెలుసుకున్నాను.

ఆయన ద్వారా పరిచితులయినవారు కె. మాధవన్ కాఞంగాడి వాస్తవ్యులు. హిందీలో పరిణితి చెందిన విద్వాంసులు. ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుల అనుమతి పొంది ఆసక్తి గల విద్యార్థులకు హిందీ పాఠం చెప్పేవారు, తెల్లవారుజామున కొవ్వొత్తుల వెలుగులో. నేను



ఆయన విద్యార్థిని. ("బర్ సేరిమ్ ఝిమ్ పానీ, పంఛీ బోలే బానీ") చిక్కచిక్కిన ఆ యువకుడు రాత్రిళ్ళు పల్లెనుంచి పల్లెకు విప్లవ సాహిత్యం మోసుకొని తిరిగేవాడు; రైతు సంఘటన కార్యంలో భాగస్వామి అవుతుండేవాడు. హిందీ మాస్టరుగిరి పోలీసుల కళ్ళలో దుమ్ము కొట్టడానికి మంచి "బాహ్య రూపం" అని తెలుసుకున్నప్పుడు, నాకు ఆయన ఎడల గౌరవభావం కలిగింది. రాజకీయ స్థాయిలో ఆయనతో అప్పుడు నాకు పొందికలేకున్నా వైయక్తిక దృక్పథంతో ఆయన నాకు ఆత్మీయులయ్యారు.

తర్వాత నాకు ఆ ప్రాంతపు జనప్రియులైన రైతు నాయకుడు, విప్లవకారుడుగా మారిన అధ్యాపకుడు వి. వి. కుఞంబుగారి పరిచయమయింది.

ఈ ముగ్గురిలోను నన్ను ఎక్కువగా ఆకర్షించినది కష్టసహిష్ణుతా గుణం, నిరాడంబర జీవితం, ప్రజా సామాన్యంతో అతి సహజంగా వారు సాధించిన సామరస్యం. నేను చూచిన బాహ్యాడంబరులైన నాయకులకూ, వీరికీ ఏ పోలికా లేదు.

రాజాస్ హైస్కూలులో నేను చివరి సంవత్సరం విద్యార్థిగా వున్నప్పుడు, దేశంలో స్వాతంత్ర్య సమరం వేడి ఉత్కటమైంది. దానితో పాటు విప్లవకారుల నాయకత్వమున్న శ్రమజీవి వర్గ పోరాటం కూడ. ఒక్కమారుగా నీలేశ్వరం రైతుల పరిసరాలు భగ్గుమన్నాయి. ఆ దావాగ్నికి కేంద్రం కయ్యూరు. కలవారికీ, ప్రభుత్వానికీ సవాలయిన రైతు సంఘటనను అణచివేయడానికి పాలిస్తున్న ప్రభుత్వం సర్వశక్తులను వినియోగించింది. వేయారు సంవత్సరాలుగా భూస్వాముల ఆటసామగ్రి అయిన కయ్యూరు దళితుల పోరాటానికి సంకేతమయింది.

నేను పరీక్షా ఫలితం – యోగ్యతా పత్రం దారి చూడక ఆ ముందు వేసవిలో మంగుళూరుకు బయలుదేరాను – జీవితాంగణంలో కాలూనడానికి, పెద్ద అంగలు వేయడానికి.

జిల్లా కేంద్ర పట్టణం మంగుళూరు. పట్టుబడిన కయ్యూరు రైతు సంఘం కార్యకర్తలను మంగుళూరు జెయిలులో పెట్టారు. పత్రికావృత్తి ప్రారంభించిన నేను జెయిలులో వారిని కలుసుకొన్నాను. మంగుళూరులో

జరిగిన విచారణ పెక్కు అంకాల గొప్ప నాటకం. మంగుళూరులో బందీల పక్షాన వకాల్తా తీసుకొన్నవారు విఖ్యాత న్యాయవాదులైన రంగరావ్ తలచేరీకర్, ఎస్. నరసప్పయ్య; మదరాసు నుంచి వచ్చి సహాయపడిన వారు ఎం. ఎన్. రాయ్ వర్గం విప్లవకారులు, ప్రసిద్ధ న్యాయవాదులు ఎ. కె. పిళ్ళెగారు. విచారణ చివరివరకూ నేను ప్రేక్షకుడిని.

కయ్యూరికి నేను వెళ్ళి చూచింది – తర్వాత రెండుసార్లు: ఒక మారు – అప్పటి భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి పూర్ణచంద్ర జోషి ఆయన బృందంతో; మరొకసారి కయ్యూరువారు నలుగురు మరణ శిక్షకు గురయి అమరజీవులయిన పిదప, కయ్యూరు దినోత్సవంలో పాల్గొనడానికి.

ఆ రెండుసార్లు నేనున్నది రంగంమీద. దానితోపాటు విశిష్టమైన మరొక పాత్ర వుంది. అది – రంగం మీద వున్నా రచయితగా కొంచెం దూరంలో వుండడం, జరుగుతున్న దానిని విషయైక దృష్టితో చూచి అర్థం చేసుకొన్న దానినంతా లోతుగా ఆకళించుకోడం.

నేను చూస్తూ చూస్తూ వుండగానే కయ్యూరు దళితులు చరిత్ర సృష్టించారు; కథ అయ్యారు; దంత కథ అయ్యారు.

* * * *

ఒక సంఘటన కథ అయినతర్వాత, దంతకథ అయిన తర్వాత దానికి చావులేదు. నిరంతరం సంస్మరణ. నవలలో వ్యాప్తే కావాలి దానికి. ఆ కళాసిద్ధికోసం చేయి చాచాను.

చిన్న కథలు, అభ్యుదయోద్యమం, పత్రికోద్యమం, పార్టీ పని. దీర్ఘమైన వ్రాతకు కావలసిన శాంతి ఉండలేదు.

అప్పుడు నా నడక ఎర్ర జెండాతోపాటు. ఐదు సంవత్సరాలు కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా, మరి ఐదు సంవత్సరాలు పార్టీ క్రియాశీల కార్యకర్తగా ('జనశక్తి' సంపాదకత్వం ఇత్యాది) నా జీవితపు ఒక అధ్యాయం వ్రాశాను.

భారత కమ్యూనిస్టు పార్టీ 1948 లో సిద్ధాంత సంఘర్షణకు లోనైంది. తర్వాత మూడు సంవత్సరాలు అజ్ఞాతవాసం. ఆ సైద్ధాంతిక సంఘర్షణలో మండిపోతున్నానని అనుకున్నప్పుడు పార్టీ నుంచి వేరయ్యాను.



పట్టి తెల్లకాయితాలు నా ఎదుట. పెక్కు కార్యకలాపాల కుడుకుంద శివరావు సాహితీ నిరంజనుడయ్యాడు.

"విమోచన" నుంచి ఆరంభమైన నా నవల రచన "బవశంకరి", "రంగమ్మనవతార" లలో ఒక కళాత్మకమైన స్థాయికి చేరింది. అది తొందర తొందర పయనం. డబ్బు సంపాదన అంతంత మాత్రంగానే వున్నా, చదువరుల ప్రేమ సంపాదన విరాళంగా ఉండేది. కయ్యూరు కథను వ్రాయడానికి ఇది సముచిత కాలమనిపించింది. "వ్రాసేయండి" అన్నారు, మైసూరు ప్రింటింగ్ అండ్ పబ్లిషింగ్ హౌస్ జి. హెచ్. రామారావుగారు (అభ్యుదయ కార్యక్రమానికి మొదటి నుంచి ఆయన ఆసరా). ప్రచురించడానికి భారతి ప్రకాశన బి. నరసింగరావుగారు ముందుకు వచ్చారు.

అప్పుడు నేను నివసిస్తున్నది బెంగుళూరులోని విల్సన్ గార్డన్‌లో. వైవాహిక బంధనానికి ఇంకా లోబడలేదు. ('సాధన' ఇంటికి రాలేదు). పొద్దు పద్దు తెలీకుండా వ్రాయసాగినాను. పద్నాలుగు సంవత్సరాలు మనస్సులో నానుతున్న దానిని పాకంగా దింపాను, అనాయాసంగా వ్రాసినట్లెల్లా ప్రతిదినమూ సాయంకాలం టపాకు పంపాను. లిఖితప్రతి కాయితాలు రాత్రి ప్రయాణం ముగించి మరునటి ఉదయం తమ చేతికి అందగానే జి. హెచ్. ఆర్. వాటిని కంపోజింగ్‌కు ఇచ్చేవారు. ప్రూఫు కూడ రాత్రి పయనించి నా మెప్పు పొందడానికి వచ్చేది. వ్రాసినంత తొందరగానే ముద్రణ. ఇలా పద్దెనిమిది రోజులు నడిచి, 25 అధ్యాయాల నవల రచన ముగిసి, పుస్తకం సిద్ధమయింది. 1954 ఏప్రిల్‌లో 'చిరస్మరణ' వెలుగు చూచింది.

* * *

'చిరస్మరణ' సృష్టి నాకు కొంతవరకు సంతృప్తి కలిగించింది. వాస్తవం.

కాని, చదువరులకు సంతృప్తి?

నేను వ్రాసింది కయ్యూరు రైతుల పోరాటం నివేదిక కాదు. ఆ నివేదిక కేరళ కర్షక జాగృతి చరిత్రలో ఒక భాగం.

నేను చేసింది. కయ్యూరు పోరాటం అంతస్సత్త్వాన్ని, చైతన్యాన్ని - కళలో చెరపట్టడానికి ప్రయత్నం. ప్రయత్నం విజయవంతం అయిందా లేదా అనేదాన్ని నిర్ధారించడానికి అదొకటే కొలబద్ద.

"చిరస్మరణ"లోని అనేక పాత్రలు వాస్తవ జీవితం నుంచే నవల పుటలకు నడిచి వచ్చాయి. అయితే అవి ఇక్కడి పాత్ర నిర్వహణ కోసం రంగ ప్రసాదన వేష భూషణాలను నిరాకరించలేదు. మాస్టర్ పాత్రకు మాధవన్-మాధవేట్టన్-స్ఫూర్తి, ప్రభు పాత్రకు కామత్. మరి కొన్ని పాత్రల విషయంలో జనాభా లెక్కలు చప్పుమొగం వేయవచ్చు. కాని, అలాటివారు ఉండి ఉండరు — అని ఖరాఖండిగా చెప్పడం కష్టం.

సుమారు 50 సంవత్సరాల క్రితం సోవియట్ చలనచిత్ర దర్శకుడు ఐసెన్‌స్టీన్ "యుద్ధ నౌక పొటెమాకిన్" కథా చిత్రాన్ని నిర్మించాడు. అందరూ కొనియాడారు. అయినా, "ఇది చరిత్రకు యథాతథ చిత్రణ కాదు"— అనే విమర్శ వచ్చింది.

దానికి 200 సంవత్సరాల ముందు జర్మన్ మహాకవి గెటె "సమ్యక్ సత్య దర్శనం కోసం చిన్న చిన్న వాస్తవాంశాలు అప్రధానమవుతాయి" అన్నాడు. ఆ మాటలు "పొటెమాకిన్' కళాఖండాన్ని విమర్శించిన వారికి సమాధానమయింది.

సమ్యక్ సత్యదర్శనం కోసం చిన్న చిన్న వాస్తవాంశాలు అప్రధానం - అనే నాదాన్ని నేనూ మీటవచ్చునా?

* * *

"చిరస్మరణ" మున్నుడిలో ఒక అభిప్రాయం వ్యక్తపరిచాను: "నా తక్కిన రచనలకన్న భిన్నమైన ఈ నవలను ఎప్పటి ఆదరంతో చదువరులు ఆహ్వానిస్తారని నమ్మినాను" అని.

ఆ ఎప్పటి ఆదరం "చిరస్మరణ"కు అంతగా లభించలేదు. అప్పటిది దొంగ నాణేల కాలం. కల్పనా ప్రపంచపు అరకొరగా వుడికిన పంట, తానే గట్టి ఆహారమని ఊరేగేది. కన్నడంలో రోగపీడితమై వుండినది వాస్తవికతా ప్రవృత్తి. ప్రగతిశీలురని బడాయి కొట్టుకున్న కొందరు సానివాడల రహస్య కథనంతోనే తృప్తిపడేవారు.



"చిరస్మరణ"కు లేవు నానా ప్రకారమైన సాధనాల ముంగిటి సేవలు. మఠం స్థాపించని వానికి ఎక్కడివి బహు పరాకులు? చాలా మంది విమర్శక మిత్రులు ఆ నవల గొడవకు పోలేదు.

వ్రాసిన తర్వాత "నా పని పూర్తయింది" అనే ధోరణి నాది. వ్రాసినదాని జిజ్ఞాసలోనే కాలం గడిపితే, పొయ్యి ఆరిపోవచ్చు!

"చిరస్మరణ" జయప్రియతను సంపాదించక పోయినా, అల్పసంఖ్యాకులైన పాఠకులకు చాలా యిష్టమయిందనితోస్తుంది. ఒకరు-ఢిల్లీలో వున్న వాసుదేవగారు-"దేశంలోని అన్ని భాషలలోను ఈ రచన ప్రకటితం కావాలి" అన్నారు. రచయితకు ఇంపైనమాట. అయితే ఆయన ఆశయాన్ని కార్యరూపం చేసేవారెవరు? అలాటి పని సాహిత్య అకాడెమినుంచి సాధ్యం. అయితే, అకాడెమి ఉనికి ప్రభుత్వ వంది మాగధుల సప్త ప్రాకారాల కోటలో. దళితుల పోరాటం చిత్రణకు అక్కడ ప్రవేశమా? మట్టి, చెమట, రక్తం అంటిన సాహిత్యం ఎలా సహ్యమవుతుంది ప్రభుత్వ సమర్థకులకు? ఇక సాహిత్య పట్టభద్రుల చూపిన ఉపేక్ష సహజమైనదే.

ప్రభుత్వానుగ్రహాశ్రయం లేకపోతే భాషాంతరీకరణాలు ప్రకటన కావని కాదు. ప్రాశస్త్యం వెంటనే అమ్ముడు పోయే స్వంత రచనలకు ప్రతిఫలం గందరగోళం లేకపోతేనో, లేక పాఠ్య పుస్తకమయే అవకాశం వుంటేనో భాషాంతరీకరణాల వైపు ఒక్కొక్కమారు ప్రచురణ కర్తల దృష్టి ప్రసరించవచ్చు. "చిరస్మరణ"కు ఈ రెండు షరతులు అన్వయించేట్టు లేదు.

అయినా హెచ్. ఎస్. పార్వతిగారు (హిందీలో ఎం.ఎ.పట్టభద్ర) 'చిరస్మరణ'ను జాతీయ భాషకు అనువదించారు. ప్రచురణ కర్తలు లంభించలేదు.

మైసూరు విశ్వవిద్యాలయంలో కన్నడం ఎం. ఎ. చదువుతున్న కేరళీయుడు శ్రీ కె. ఎస్. కరుణాకరన్ తన సోదరి కౌసల్యగారితో కలిసి దీనిని మలయాళ భాషకు అనువదించారు. లిఖిత ప్రతిని చదివి చూద్దామని నానుంచి తీసుకువెళ్ళిన ఒకరు ఎన్ని జాబులు వ్రాసినా తిప్పి పంపేదయ చూపలేదు.

కన్నడ, తమిళ భాషలు రెండింటిలోను చేయి తిరిగిన రచయిత శేషనారాయణగారు 'చిరస్మరణ'ను తమిళంలో సిద్ధపరచారు. ప్రచురణ కర్తలు లభించలేదు.

పైన పేర్కొన్న మూడూ స్వప్రేరణతో మిత్రులు ఒప్పుకొన్న పరిశ్రమ; ఫలితం లేక ఎంగిలి గుటక వేయడమే జరిగింది.

* * *

ఏడు సంపుటాల పిల్లల విజ్ఞాన సర్వస్వం. "జ్ఞాన గంగోత్రి" రచన చివరిదశలో వున్నప్పుడు విజ్ఞాన సంపాదకులు అధ్యనడ్క కృష్ణ భట్టరు అన్నారు "కాసరగోడు నుంచి అన్న (నరసింహభట్టరు) జాబు వ్రాశారు. 'చిరస్మరణ' ప్రతి ఒకటి కావాలట. రాఘవన్ అట...మలయాళ భాషలోకి అనువదిస్తారట. ఉందా?" అని.

వేరే భాషలలో రాకపోతే చింతేమీ లేదు, నా పాత్రల మాతృభాష అయిన మలయాళంలో నైనా 'చిరస్మరణ' రావాలి అనే ఆశనాకు ఉండేది- పేరుకొన్న పాత ఆశ....

రెండు వేల ప్రతులను అమ్మడానికి భారత ప్రకాశన వారికి పది సంవత్సరాలు పట్టి వుంటుంది. అటు తర్వాత పుస్తకాల దుకాణాలలో ఆ పుస్తకం దొరికేది కాదు. అది పునర్ముద్రణకు యోగ్యమని ఏ ప్రచురణ కర్తా భావించలేదు.

"ప్రతి లేదు" అని నేను నిట్టూర్చాను.

కాని కాసరగోడు ఉపాధ్యాయ రచయిత, కన్నడం వాడు అయిన కె. శ్రీధరగారి వద్ద ఒక ప్రతి ఉండినది. ('చిరస్మరణ'ను మెచ్చుకొన్న వారిలో వారూ ఒకరు) శిక్షణ నిపుణుడు సి.రాఘవన్ (మలయాళ భాషతో పాటు కన్నడ మీద అధికారం గలవారు. ఆంగ్ల సాహిత్యంలో ఎం.ఎ.) శ్రీధరగారి ప్రతిని తీసుకొన్నారు. కోట్టయం సాహిత్య ప్రవర్తక సహకరణ సంఘం సంపాదకులు సి. వి. శ్రీధరన్‌గారి సహాయంతో అనువాదం త్వరగా ముగిసింది. నిరుడు(1974) అక్టోబర్‌లో 'చిరస్మరణ' ప్రకటితమూ అయింది.

మాడుకట్టిని చేరిన కొంతకాలానికే "చిరస్మరణ" జనప్రియ మయిందని విన్నాను. సాధారణ పాఠకుని అభిప్రాయ మిది : "ఇది మలయాళం కథ. మలయాళ భాషలో వుండడం సహజం. కన్నడంది అంటే



ఏమిటి?" రాఘవన్ అనువాదంలో నాపాత్రలు కాసరగోడు ప్రాంతపు విశిష్టమైన మలయాళం మాట్లాడుతాయట. మలయాళం సాహిత్యంలో కేరళ రాష్ట్రం ఉత్తరపు కొన మాండలికానికీ స్థానం లభించినట్లయిందని అక్కడి మిత్రులకు సంతోషం. నిజానికి ఇది అనువాదకుని సాధన. ఒక రచన అన్య భాషలో మరల పుట్టి స్పందించ వచ్చుననడానికి సి. రాఘవన్ గారు అనువదించిన 'చిరస్మరణ' సాక్షి.

పేరుకొని గడ్డకట్టిన ఆశ కరిగింది. చిన్ననాడు మూడు సంవత్సరాల పాటు తిరుగాడిన నేలకు, ఎదలో నిండిన ఆ వాతావరణపు విశిష్టమైన ఊపిరికి, సఖ్యపు చవిని చూపిన ఆ ప్రజలకు నేను చాల ఋణపడి వున్నాను. దానికి ప్రతిగా నేను వారికి అర్పించినది "చిరస్మరణ" చిరు కానుక. దానిని తమ భాషలోనే కేరళీయ బాంధవులు స్వీకరించారని నేను సంతుష్టి చెందాను.

....ఇక యితర భాషలలోను "చిరస్మరణ" ప్రచురణ సాధ్యమయితే?

ఆశకూ ఒక మితి ఉండాలికదా: ఏడు ప్రాకారాల కోట కాసలా రక్కసులను నేను మరచిపోవడం సరేనా ?

* * *

మొదటి ప్రచురణ తర్వాత సరిగ్గా ఇరవై సంవత్సరాలకు కన్నడ 'చిరస్మరణ' రెండవ ముద్రణ భాగ్యం పొందింది. ఇది సాధ్యమయింది 'కెంబావుటా' వారపత్రిక సంపాదకులు ఎస్. రామచంద్రభట్, నవ కర్నాటక ప్రకాశనం ఆర్. ఎస్. రాజారామ్, సి. ఆర్. కృష్ణరావు చూపిన అభిమానంతో.

పునర్ముద్రణ నిర్ణయాన్నేమో నవకర్నాటక పబ్లికేషన్స్ వారు నిరుడు చేశారు. కాని, వారికి అందజేయడానికి నా వద్ద 'చిరస్మరణ' ప్రతి

ఒకటి కూడ ఉండలేదు. మలయాళంలోకి అనువదించిన మిత్రుల వద్ద ఉండాలి కదా! జీర్ణావస్థలో వున్న ప్రతిని రాఘవన్ పంపారు. పుస్తకాన్ని విడివిడి కాయితాలుగా విడదీసి, నేనే వ్రాశానా అని ఆశ్చర్యపడుతూ, చదివాను. ముడితే పొడి పొడి అయ్యే న్యూస్‌ప్రింట్ కాయితం—ఆధునిక తాళపత్రం. కాయితాలను కట్టి బిగించి ప్రచురణ కర్తలకు అప్పగించాను.

(చివరి అధ్యాయం వ్రాసినప్పుడయితే వెక్కి వెక్కి ఏడ్చాను. రెండు దశాబ్దాల తర్వాత ఆ అధ్యాయం చదువుతున్నప్పుడు కళ్ళు మళ్ళీ ధారలు గట్టాయి. ఎడారి వేడి తగిలే వేళలో పట్టిపోయిన బావులనుంచి ఊట!)

నవంబరులో 'చిరస్మరణ' కు సోవియట్ ల్యాండ్ నెహ్రూ బహుమతి లభించిన వార్త వచ్చింది. కొత్త చదువరులు రచన ఎడల కుతూహలపడే సన్నివేశం. ప్రతులు త్వరగా అమ్ముడుపోయే అవకాశం....

అచ్చు కాయితం కరవైనందున ప్రచురణ ప్రపంచం గాభరా పడింది. అయినా నవ కర్నాటక పబ్లికేషన్స్ వారు వెనుకంజ వేయలేదు. పరిణామం; 'చిరస్మరణ' సొగసైన కొత్త ముద్రణం.*

ముద్రణం అందంగా వుంది. దానికి కారణమయిన వారు జనశక్తి ప్రింటర్స్ కార్మిక బంధువులు.

---

* చిరస్మరణను నేను అర్పించిన ముగ్గురు మహానుభావులలో గణపతి కామత్ ఇప్పుడు లేరు. యౌవనం దాటడానికి ముందే ఆయన మరణించారు. వి వి. గారూ లేరు. ఇప్పుడు అర్పణ వదలిపెట్టిపోయిన బంధువులను స్మరించి దుఃఖంతో ఆర్ద్రిమయింది.



జాకెట్ ఆకర్షకంగా వుంది. దానిని గీచిన వారు కేరళ కళావేత్త పి. వి. కృష్ణన్.

ఈ అందరు మిత్రులకు అత్యంత కృతజ్ఞుణ్ని.

* * *

ఐదు సంవత్సరాల కాలం ప్రపంచ పర్యటనలో నిరతుడై వున్న వాడిని కన్నడ నవలా కృషికి మరలినాను. ఆ క్షేత్రంలోనే ఇప్పుడు నా పాటు. కొత్త నవల– "మృత్యుంజయ" సిద్ధ మవుతున్నది. దానిని అప్పగించడానికి ముందుగా, చిరస్మరణ ఈ పునర్ముద్రణం. చదువరులు స్వీకరించాలి.

—నిరంజన

ఏప్రిల్ 25, 1975,
'కథె' 515
7 వ మెయిన్‌స్ట్రీటు, 5 వ బ్లాకు జయనగర్,
బెంగుళూరు–560041

# మొదటి అధ్యాయానికి ముందుమాట

బెంగుళూరు నుంచి మంగుళూరుకు, మంగుళూరు నుంచి చర్వత్తూరుకు....

రండి, రైలు బండి ఇక్కడినుండి బయలు దేరడం ఇంకా ఆలస్యం. ఊరు ఉన్నది ఆ భాగంలో. వెనక్కుసాగి, రైలు పట్టాలు దాటి వెళ్ళిపోదాము. ఇంతమంది జనం ఎందుకు రావలసి వచ్చింది- అంటారా? మంచి ప్రశ్నే! ఈనాటి మహోత్సవానికి ఇంతదూరం నుంచి వచ్చిన ప్రేక్షకులను సరిగ్గా చూచుకోకపోతే, ఊరివాళ్ళు ఏమనేరు ?

ఎందుకు అటు చూస్తారు? టికెట్ కలెక్టర్ పిలువ వచ్చుననా? ఇక్కడ ఇవ్వండి టికెట్. అతనికి పంపించి వేస్తాము. అతడు తనకు తానుగా మనను పిలవడు. ఇక్కడ దిగి మా పల్లెకు వెళ్ళేవారిలో మోస గాళ్ళెవరూ ఉండరన్నది అతనికి తెలుసు.

హెచ్చరికతో దాటండి. రెక్కమాను తీగెల వరుస కింద వుంది. తడుముకొని పడేరు.

రండి యిటు. ఎందుకు నిలబడి రైలు బండివైపు చూచారు ? అదొక విచిత్రమైన అనుభవం, కదూ? వెయ్యార్ల జనాన్ని మోసుకొని, మిమ్మల్ని ఒక్కర్నే యిక్కడ దింపివేసి, సముద్రతీరం పొడువునా దక్షిణాభిముఖంగా ముందుకు, ముందుకుసాగే పొగబండి....

పొలాల నడుమ నడిచే అలవాటు మీకు ఉందో లేదో! ఏమన్నారు? మీరూ పల్లెటూళ్ళోనే పుట్టినవారనా? మంటి మనిషిననా? సంతోషం. నేనూ అలాగే ఊహించాను.

ఈ పొలాల గట్లమీద ఒక్కొక్కరొక్కరే నడవాలి. ఒకరి వెంట మరొకరు, సాలు సాలుగా. ముందున్నవారు నిలబడితే, వెనుకవారు



నిలబడిపోవాలి. పట్టణాల్లో మోటారు వాహనాలు ఒక దానివెంట మరొకటి పోవూ?- అలాగ.

ఎండ మండిపోతున్నా విశాలమయిన భూమి పచ్చగా ఉంది, చూచారా? దీనికి కారణం నది. అదిగో, దూరాన పారుతున్నది కదూ. కనిపించీ కనిపించనట్టు తేజస్విని. పేరు బాగుంది, అన్నారా? ఉండదూ! నామకరణం చేసినవారు మా జనం.

ఈ దినం పొలాలలో ఎవరూ లేరని దిగాలు పడ్డారా! సంతోష సంభ్రమాల ఈ దినం ఎవరు పనిచేస్తారు చెప్పండి? నాగళ్ళు నిద్రపోతున్నవి. గిత్తలు మేతమేసి నెమరువేస్తూ పడుకున్నాయి. పిల్లలు, పెద్దలు. మగవాళ్ళు, ఆడవాళ్ళు అందరూ ఉత్సవం పనులలో తల మునకలయి వున్నారు.

ఆ కాలిబాట చూశారా? దానికి అవతలివైపుఉన్నదే మాస్వగ్రామం. అదే కయ్యూరు. కయ్యూరు పొలిమేర మొదలవుతున్న చోటే మామిడాకుల కమానుకట్టి, 'సుస్వాగతం' అని వ్రాశారు. ఇది మలయాళ భాష. మీకు రాదు కదూ! ఆ కమానుమీద అలంకారంగా నిలబడిన పెద్ద కొడవలి; దానికి అడ్డంగా వరికంకులు ఉన్నాయి. ఇక ఇక్కడినుంచి మీరు చూసేదంతా కయ్యూరు కళావేత్తల కళా కౌశలం.... ఆ చేతిసంచి ఇలా ఇవ్వండి. చేతులు విసురుకుంటూ నడుద్దురుగాని....

....కొలబద్ద కొలతమేరకు ఈ దూరం మూడు మైళ్ళు. అయితే దూరమని అనుకోకుండానే మనం నడిచివస్తున్నాము కదూ ?

సింగారించిన ఆ పొలం చూచారా? అది సమాజానిది. అర్థం అయిందా ? అది సమాజం ఆస్తి. ఆ పల్లెలోని రైతులంతా అక్కడ ఉచితంగా పనిచేస్తారు. ఆ పొలం పంట సమాజం సంపద.

ఏమిటీ సవ్వడి అంటారా? పొలంనుంచి పొలానికి పారే నీటి కలకల నినాదం.... అది కాదంటారా? ఓ! తెలిసింది!

కొండలు కోనలు దాటివచ్చి ఊరు చేరగానే, నగర మధ్యంలోని సంత బజారును సమీపించినట్టు ఈ పల్లెలో ఇంతమంది జనమా- అని ఆశ్చర్యమయిందా? గుజగుజమంటూ వెయ్యారు గొంతుల నుంచి

వెయ్యూరు మాటలు బయలు వెడలి ఒకే స్వరంగా ఆకాశాన్ని అంటే సంఘటన. ఇలాటి చోటికి వస్తూ, ఏకాకి అయిన మనిషి ఒక్కొక్కసారి మూగవాడై పోతాడు కదూ? ఒకరి కొకరికి పోలికలేని వేలాది జనం. కాని బ్రతుకువైపు నుంచి నడిచివచ్చే ఒంటిప్రాణికి కనిపించేది భిన్నత కాదు, అభిన్నత- ఐక్యం.

మీ ఊహ నిజం. వీరంతా ఉత్సవం కోసం చుట్టుపట్టు పల్లెల నుంచి వచ్చిన రైతు బాంధవులు. మా అతిథులు. మా ఊరి జనసంఖ్య రెండు వేలు. అయితే, ఈ దినం మీరు పదివేల ముఖాల నయినా చూస్తారు. అదిగో! నది ఆవలి గట్టు కనిపిస్తున్నది కదూ! అక్కడ, జనాన్ని మోసుకొని వచ్చిన ఎడ్లబండ్లు బారులుతీరి విడిశాయి. పైనుంచి పడవలమీద తేలివచ్చినవారు ఎంతోమంది! మా పల్లెకు ఈనదే ఒకవైపు. మరొకవైపు మనం నడిచి వస్తున్న బయలు. తక్కిన రెండువైపులా కొన్ని మైళ్ళవరకు విస్తరించిన ఏటవాలు గుట్టలు, దట్టమైన అడవి. ఆ దారినా రావున్న, మురళ్ళు తొక్కుతూ జనం ఈ దినం వచ్చారు. మరి యింత మంది నడిరేయివరకు వస్తూనే ఉంటారు.

ఈ పేర్లన్నీ మీకు తెలుసు కదూ? మఠం అప్పు, కోయితట్టి చిరుకండడు, పొడవ కుఞంబు, అబూబకర్.... ఎన్నడో పసికందులకు తల్లి దండ్రులు అలా పేరు పెట్టినప్పుడు, ముందు ఒకనాడు ఇలా కావచ్చునని ఎవరైనా అనుకొన్నారా? ఈ నాల్గుపేర్లు లోకం నాలుగంచులకు సంచరిస్తాయని, ఏదో ఆశకు, ఆకాంక్షకు సంకేతా లవుతాయని ఎవరైనా ఊహించారా?

అప్పు— చిరుకండడు- కుఞంబు- అబూబకర్....

ఆ స్మృతి ఉదయింపచేసే భావన ఏమిటి? సంతోషమా? దుఃఖమా? మనలో కలిగే ప్రతిస్పందన ఏమిటి?— బుజాలు అదరడమా? కన్నులలో కన్నీరా?

మీరు మౌనంగా ఉన్నారు. మౌనానికీ అర్థముంది. నాకు తెలుసు. భావనలు ముమ్మరంగా వచ్చినపుడు ఎన్నోసార్లు మనం మూగవారమై పోతాము. కయ్యూరిలోని మాకు ఈ అనుభవం కొత్తకాదు. పెక్కు సంవత్సరాల కాలం మాట్లాడవలసినదంతా మేము మాట్లాడాము. ఆ



మాటలు గుట్టలంత ఎత్తయ్యేవి. ఏడవ్వాలి అనుకొన్నప్పుడల్లా మేము ఏడ్చివుంటే, తేజస్విని నదిలో ఎన్నటికీ వట్టిపోని మహాప్రవాహమే ఉండేది. అయితే మనస్సులో ఉన్నదంతా ఎప్పుడూ మనం చేయము; తోచిన దాన్నంతా ఎన్నడూ అనము.

ఇక పదడుగులు దాటగానే పల్లె.

కొబ్బరి, పోక, అరటి, కూర నార, చెట్టు చేమ....ఇదంతా భూమి తల్లిలో మేము నాటిపెంచిన ఫలసంపద. వాతావరణం వాసనే మారి పోయింది కదూ! దీర్ఘంగా ఊపిరి తీసుకోవాలనే ఆశ.... ఈ చల్లని గాలి, చల్లని నీరు, ఆత్మీయులయిన మానవులు....

కయ్యూరిలో చాల ఎత్తయిన రెండు కానుగ చెట్లను మేము నరికి వేశాము. ఇక్కడినుంచే కనిపిస్తున్నాయి కదూ ఆ ధ్వజ స్తంభాలూ, ఆ బావుటాలు రెండూ? ఒకటి మూడురంగుల జాతీయపతాక, మరొకటి శ్రమజీవుల పోరాటం లక్ష్యాన్ని సూచించే గుర్తు. అదిగో! అక్కడ కొంచెం దిగువ వేరే నాలుగు బావుటాలు. కయ్యూరు వీరులు నలుగురి నాల్గిళ్ళమీద అవి ఎగురుతున్నాయి.

...ఏమైనా కయ్యూరు చేరారు మీరు! దేశపటంలో ఇదొక కుగ్రామం. భారతదేశంలోని వెయ్యూరు గ్రామాలలో ఒకటి. కాని, మా పాలిటికి యిదే ఊరు, యిదే మహానగరం.

...రండి, ఇలారండి. ఇది కయ్యూరు సంఘం కట్టడం. వేరే వేరే ప్రాంతాలనుంచి వచ్చిన అతిథులంతా ఇక్కడ కమ్ముకొని ఉన్నారు. మీలాగే రచయితలు కొందరు, ఇతర రంగాలలో ప్రతిష్ఠితులైన ప్రముఖులు, ఆయుస్సులో చాలభాగం కారాగారంలోనే గడిపిన వృద్ధ నాయకులు. రండి, పరిచయం చేసుకోండి.

"ఓయ్ కామ్రేడ్!"

....అదిగో. కార్యదర్శి గద్దిస్తున్నారు. మొదట మీ భోజన వసతి ఏర్పాటు చేయాలట. ఈ గడబిడలో అంత మాత్రం నాకు తోచవద్దూ! ఇంతదూరంనుంచి పరదేశం వచ్చిన మీకు విశ్రాంతి అవసరమన్న జ్ఞానమన్నా నాకు ఉండవద్దూ?

రండి తేజస్వినీ నదిలో స్నానం చేదురుగాని. అటు తర్వాత మా వూరి భోజనం. భోజనం అయిన తర్వాత కునుకు.

* * * *

లేచారా ? అప్పుడే రెండుసార్లు చూచి వెళ్ళాను, మందహాసంతో పడుకున్నారు. ఏ స్వప్నలోకంలో ఉన్నారో ! లేపడానికి మనసు కాలేదు.

చూడండి అప్పుడే ఎండ మాయమయింది. ఇక ఒక్క గడియకు చీకటి.

ముఖానికింత నీటి చుక్కలు జల్లుకోండి. ఏమి తెప్పించను ! కాఫీయా ? కాఫీ ఊరివారు మీరు....'మీ ఊరికి వచ్చినప్పుడు మీ ఊరి పానీయం' అన్నారా ! జనంతో సామరస్యం కోరే ఈ మనఃప్రవృత్తి నాకు తెలియదా ? మా వూరి చాయ్ తాగి చూడండి, బాగుంది.

లేద్దామిక. రేయి పగటిని తనవైపు లాక్కొని తనలో లీనం చేసుకొనే దృశ్యాన్ని మా వూరిలో మీరు చూడాలి. ఈ సొబగు అద్వితీయం. 'అన్ని ఊళ్ళవాళ్లూ ఇలాగే చెబుతారు' అన్నారా ! హహ....! మీతో మాట్లాడడమే కష్టం, నాకు తెలుసు.

—కళ్ళు బైర్లు కమ్మేట్లు దీపమాలికలు దీపావళి జ్ఞాపకం వచ్చిందా ? పగలు చూచిన పల్లె వేరే, ఈ మాయానగరే వేరే, అన్నట్టు లేదూ ? మా వూరికి విద్యుచ్ఛక్తి ఇంకా రాలేదు. (అయితే, ఆలోచనల కొత్త వెలుగు ధారాళంగా ఉంది....ధారాళంగా....!) ఇక్కడ వెలిగే వన్నీ నూనె దీపాలు, లాంతర్లు, చర్వత్తూరు, త్రికరపురం, నీలేశ్వరం. హొసదుర్గాలనుంచి విరాళంగా తెచ్చిన పెట్రోమాక్సులు....

ఎడమ దిక్కున తేజస్వినీ నదివైపు చూడండి. చీకటిలో దాని నీరు కనిపించడం లేదు కదూ! అయితే ఆ కదలాడే దీపాలు నీటిమీది వెలుగు....జనమింకా తెప్పలమీద నదిని దాటివస్తున్నారు. తెలిసిందా ? కుడిపక్కన గుట్టవైపు చూడండి. ఎండిన తాటాకులను కట్టగా కట్టి, మండే దీపంగాచేసి, కయ్యూరికి దిగివస్తున్నారు. కొరివి దయ్యాలు ! నేను చిన్న పిల్లవాడుగా ఉన్నప్పుడు నిద్రపోకుండా హఠంపడితే, మా అవ్వ బెదిరించేది : "కొరివిదయ్యం వస్తుంది. హు!" అని. ఉత్తిత్తినే. పెద్దవా



డయిన తర్వాత తెలిసింది. దెయ్యం ఏది ? మనుషులు ఎవరు ?– అనేది బాగా తెలిసింది.

ఈ ఉత్సవం కోసం ధ్వనివర్ధక యంత్రాలు (మైక్‌లు) కూడా తెచ్చారు తలచేరినుంచి. ఇలా అన్నానంటే, మా వూరివారికి గట్టి గొంతుకలేదని – అనుకోకండి. నది ఆవలి గట్టునుంచి 'కూ' అంటే చాలు, అరమైలు ఇవతల గట్టుకు వినిపిస్తుంది. అడవి మధ్యనుంచి పిలుపు యిస్తే చాలు, ఈ వూరికి అది వచ్చి చేరుతుంది. అయినా, సభ, ప్రసంగాలు, పాట, పద్యం, నాటకం అన్నమీదట ధ్వనివర్ధక యంత్రం ఒకటి ఉండడమే మేలు కదా !

రండి ఉత్సవం ఏర్పాటయిన బయలువైపు వెళ్ళుదాము. సింగారించిన సభాంగణం. తమతమ చాపలను తామే మోసుకొనివచ్చి సుఖాసీనులవుతున్నారు. తెల్లవారేవరకు ఇక్కడే ఉండడానికి ఇది సన్నాహం. మీ దేశంలోను వీధి భాగవతాలకు ఇలాగే వస్తారు కదూ !

"కార్యక్రమం ఏమిటి ?" అంటారా ? అదిగో ? వేదికమీద నుంచి ప్రకటిస్తున్నారు. ఇక సంఘభోజనం ప్రారంభం. రాత్రి తొమ్మిదిన్నర వరకు. ఒక్కొక్కసారి వెయ్యివెయ్యి మంది కూర్చోవడానికి వ్యవస్థ చేశాము. ఇది మా వూరి ఆతిథ్యం. భోజనం తర్వాత ఈ ఉత్సవానికి పెద్దరికం వహించడానికి వచ్చిన మాగాడు వృద్ధనాయకుల ప్రారంభ ప్రసంగం. అదయిన తర్వాత నేపథ్యగానంతో నృత్యనాటకం 'కయ్యూరు వీరగాథ' అటు తర్వాత సూర్యోదయానికి సరిగ్గా చివరకు....

ఆ పఠనాలయం, చలువరాతి స్తూపం, కనిపిస్తున్నవి కదూ !

"కయ్యూరు వీరగాథ". మరి ఆస్మృతి....

అదిగో ! అక్కడ చూడండి. స్వయం సేవకుల దుస్తులు ధరించి నిలుచున్న కర్షక యువకులిద్దరిని చూచారా ? వాళ్ళు మఠం అప్పు తమ్ముళ్లు. వేదికమీద కుడివైపు కూర్చున్న వృద్ధ దంపతులను చూడండి. వారు అప్పు తల్లిదండ్రులు. వారి ప్రక్కన కూర్చున్న ఆవిడ అప్పు భార్య. ఇంకా చిన్నారి పాపదన్నట్లు నిండుసుఖం గల ఆ పిల్లవాడిని ప్రక్కనే కూర్చోబెట్టుకున్నది ఆ తల్లి.

ఆ కుటుంబానికి ఆవల వున్న వృద్ధుడు, వృద్ధురాలు - వాళ్ళే కోయితట్టి చిరుకండని తల్లి, దండ్రి. వారి ఏకైక పుత్రుడు చిరుకండడు. పక్కన కూర్చున్నావిడే ఆ దంపతుల కోడలు.

మూడో కుటుంబం కొంచెం పెద్దది.... వేదికమీద ఎడమ భాగంలో ఉండే వయస్సయిన భార్యాభర్తలే పొడవ కుఞంబును కన్నవారు. కుఞంబు అంటే మీ భాషలో చిన్నన్న అన్నట్టు. అతని అన్న కేళునాయర్ కింద నిలుచున్నాడు. తమ్ముడు రామన్ నాయర్. ఆ సోదరులలో చివరివాడు నారాయన్ నాయర్. ఇతడే మా వూరి మొదటి పట్టభద్రుడు. వచ్చే జూన్ నెలలో తలచేరి కాలేజీలో అతడు అధ్యాపకుడు అవుతాడు. మేము కేరళ నాడుకు ఇస్తున్న కయ్యూరు మొదటి ప్రొఫెసర్ నారాయణ నాయర్. ఆడవాళ్ళ సందడి వున్న ఆ భాగంలో తెల్లచీర కట్టుకున్న, స్వయం సేవకుల కందరికీ ఆదేశాలిస్తున్న ఆ సోదరిని చూశారా? ఆమే శ్రీదేవి యమ్మ, కుఞంబ పాణీగృహీతి.

ఉత్సవం కోసం వేసిన అంగళ్ళ వరుసకు ఆవల సంఘ నాయకత్వంలో ఉచిత పానీయశాల చూస్తున్న ఆ యువకుడు – అతడే అబూబకర్ తమ్ముడు. ఎంతో చురుగ్గా ఉన్నాడు, కదూ? అతని పక్కనే తలమీద కొంగు వేసుకొని ఊతకర్రను ఊని నిలుచున్నావిడ అబూబకర్ తల్లి....

ఇక రండి. మీరు వీరుల కుటుంబాల పరిచయం చేసుకోటం అయింది. భోజన కార్యక్రమం ముగిద్దాం, ఇటురండి.

పండుగవంట. భక్ష్యభోజ్యాలు. తీపి. నదీ సముద్రాల చేపలు. ఈ ఉత్సవం కోసమే సాకి పెంచిన కోళ్ళు, చుట్టుపక్క పల్లెలనుంచి కానుకగా వచ్చిన గొర్రెలు. రకరకాల కూరగాయలు. పండ్లు ఫలాలు. మీరు శాకాహారులో ఏమో! ఏది కావలిస్తే అదే రండి—

'ఈ దృశ్యం చూచే కడుపు నిండింది' అన్నారా? అలా అవుతుంది ఎన్నోసార్లు. కాని, ఇక్కడ ఈ దినం 'వద్దు' అనేట్టేలేదు. వచ్చిన అతిథులు ఒక ముద్ద ఎక్కువగానే తినాలి. లేకపోతే ఊరికే అవమానం.

* * * *



ఎక్కడ కూర్చుందాము? వేదిక పక్కకు వెళ్ళుదామా? ఇక్కడే దూరంలో కూర్చుని తన్మయులవుదామనా! అలాగే కానీ.

నిద్రమబ్బు ముంచుకు వస్తున్నది కదూ?

ఇక రెండే నిమిషాలు.

ప్రసంగాలు ముగిశాయి.

అదిగో! నినాదాలు!

"ఇంక్విలాబ్ జిందాబాద్!"

"విప్లవానికి జయమగుగాక!"

"కయ్యూరు వీరులు జిందాబాద్"

నేపథ్య సంగీతం సిద్ధమవుతున్నది. నటులు రంగస్థలంలో ప్రవేశించారు. వారికి అడ్డంగా తెర....

ఠణ్ ఠణ్ ఠణ్....

నృత్యం చూస్తూండండి. పాటల అర్థం నేను చెబుతాను.

"కయ్యూరు వీరగాథ."

# 1

పరతంత్ర భారతంలో కరినాడు కేరళం. ఆ నాడులో ఒక చిరుపల్లె కయ్యూరు. ఇది మునుపటి కథ : ఎన్నో సంవత్సరాల మునుపటి కథ.

అప్పుడే సూర్యోదయ మయింది. మగవారంతా నాగేళ్ళను, కాడిమానులను భుజాన వేసుకొని, ఎడ్లను ముందుకు తోలుతూ, పొలాలకు సాగిపోతున్నారు. చీకటి కరిగి మసక వెలుతురు మెలమెల్లగ తెల్లబడు తున్నది.

ఆ గుడిసె వెలుపల పధ్నాలుగేళ్ళ పిల్లవాడొకడు వెదురు తడక సందులనుంచి లోపలికి తొంగి చూస్తూ సన్నని ధ్వనితో పిలుస్తున్నాడు.

"శ్....ఏయ్....శ్....అప్పూ!"

లోపల అప్పు తల్లి తనకు తెలిసిన ఒకే ఒక పాటను కోమలమూ, కర్కశమూ కాని స్వరంతో పాడుతున్నది.

"ఓరుక కిడావే...."

"ఓ ముద్దు పట్టీ...."

ఆ పాట ఆలాపనకు అడ్డు తగిలేట్టు ఆ పిలుపు :

"శ్...అప్పూ లేవరా...."

ఆ తల్లి తిరిగి చూచింది. వచ్చి చాపమీద పలుచని ఒక కంబడి కప్పుకొని పడుకున్న ఆమె కుమారుడు అప్పటికే పదిహేనేళ్ళ వాడు; పసికూనేమీ కాడు! అయినా, పడుకొన్న కొడుకును ఎవరో పరాయివాళ్ళు పిలిచి నిద్రకు భంగం కలిగించడం తల్లి సహించలేదు.

పాట నిలిపి, గొంతుక పెద్దది చేసి తల్లి అన్నది :

"ఎవర్రా అది? అప్పు పడుకొని వున్నాడు."



ఆ తల్లి గొంతుక విని అక్కడినుంచి పరిగెత్తి పోవాలనిపించింది వెలుపల ఉన్న పిల్లవాడికి. "కుంభకర్ణుని నిద్ర. ఈ మహారాజుకు ఒక్కమారు మెలుకువయితే—" అనిపించింది. అప్పు తల్లి మళ్ళీ అడిగింది : "ఎవర్రా అది?" ఆ ప్రశ్నకు తాను జవాబు ఇవ్వాలో? వ్వరాదో?...

ఆలోచన తడబడింది, గొంతుక ఎండిపోయింది.

జవాబు రాలేదని లోపల ఉన్న తల్లి గుడిసె తలుపువైపు నడిచింది. వెలుపల పిల్లవాడు ఏమి చేయాలో తెలియక నిలబడి వుండగానే తలుపు కిర్రుమన్నది.

"ఓహ! నీవటరా?"

ఉలిక్కి పడిన పిల్లవాడు పళ్ళికిలించాడు. కట్టుకున్నది మోకాళ్ళ వరకు ఒక అంగవస్త్రం. ఒంటిపైన ఉన్నదొక చిరిగిన చొక్కా. ఆ వస్త్రాల వెలుపలికి కనిపించేదల్లా నల్లని బక్కచిక్కిన శరీరం.

"వెలుపల ఎందుకు నిలబడ్డావురా? రా లోపలికి."

అలా ఆదేశించిం దా తల్లి, కొడుకువైపు వంగి అతని శరీరం తాకింది.

మేలుకొన్న అప్పు ముఖం మీద కంబళిని జరిపి కళ్ళు తెరిచి తన మీదికి వంగిన తల్లిని చూచాడు. ఆమె కట్టుకొన్నది మాసిన అడ్డగుడ్డ; రొమ్ముమీద అంతగా మాయని తెల్లని రవిక; వదులుగా అల్లిన నిండు జడ; నల్లని జడకు ప్రతిద్వంది అయిన తెల్లని ముఖం; ఆ తెలుపును సిగ్గిలజేసే, దంత పంక్తిని తెలిపే నవ్వు....

"ఎందుకురా అలా చూస్తావు? లే చిరుకండదు పిలుస్తున్నాడు."

తల్లిలాగ చిరునవ్వు నవ్వుతున్న అప్పు ఒక్కసారిగా దడదడ లేచాడు. త్వరగా లేస్తానని మాట ఇవ్వడం అప్పుడు జ్ఞాపకం వచ్చింది. అతని చూపు తలుపువైపు ప్రసరించింది. పిలవడానికి వచ్చిన చిరుకండదు అక్కడ నిలుచుని వున్నాడు.

అప్పు తనూ ఒక అంగవస్త్రాన్ని నడుముకు అడ్డంగా కట్టుకొని, తనకున్న ఒక ఆకుపచ్చషర్టు తొడుక్కొని బయలు దేరాడు.

లోపల పొయ్యివద్దకు వెళ్ళిన తల్లి అడిగింది :

"ఎక్కడికి బయలుదేరార్రా ఇంత తెల్లవారే?"

"ఎక్కడికీ లేదమ్మా! ఇక్కడే...."

అలా అంటున్న అప్పును చిరుకందని కళ్ళు గాభరాతో చూచాయి. ఆ చూపును అప్పు గమనించకపోలేదు. అతని సురుసటి చూపులో "గాభరాపడవద్దు, చెప్పనులే" అనే సమాశ్వాసం ఉండినది.

"తెల్లవారే లేచి ఆటకు బయలుదేరారుకదూ? చిన్నపిల్ల లలాగ—థూ...."

అంటూ తల్లి ప్రీతితో గద్దించి అన్నది.

పెద్దలకు తెలియని పనికి పూనుకున్న పిన్నలు తమ పెద్దతనానికి తామే అభిమానపడుతూ, ఒకరి నొకరు చూచుకొని మందహాసం చేశారు.

దానినిచూచి తల్లి గొంతుక పెద్దచేసి అడిగింది :

"ఏమిటిరా అది?"

"ఏమీ లేదమ్మా, ఇక్కడికే వెళ్ళివస్తాను"

....తల్లికి ఎలాటి సందేహమూ కలుగనట్టు నమ్మించే ధ్వనితో అప్పు అన్నాడు.

తల్లి పొయ్యిలోని నిప్పుల మీదినుంచి రెండు నేంద్రం పండ్లను (పొడుగాటి అరటిపళ్ళను) వెలుపలికి లాగింది. లావుగా, పొడవుగా వున్న పండ్లు కాలి ఎర్రగా, బక్కచిక్కినట్లున్నాయి. చిరుకందడు అది చూచాడు.

పిల్లలవైపు దృష్టి సారిస్తూ తల్లి అన్నది :

"ముఖం కడుక్కోరా అప్పు! ఈ పండ్లు తిని వెళ్ళండి. పరగడుపుతో తిరక్కండి.

అప్పు ఒకేదాటుతో వెలుపలికి పరుగెత్తాడు. ఆవరణం లేని చిన్న బావినుంచి చేదిన నీటికుండ అరటిచెట్ల పాదులో సిద్ధంగావుంది. అప్పు ముఖం కడుక్కున్నా ననిపించాడు.

తనకొకటీ కొడుక్కొకటీ అని కాల్చిన నేంద్రంపండ్లని కొడుక్కీ, కొడుకు స్నేహితునికి ఇచ్చింది తల్లి. పిల్లవాళ్లు లొట్టలువేస్తూ, కాలి పోయిన తొక్కను ఒలిచి, పొగలు లేస్తున్న వేడివేడిగావున్న రుచిగా వున్న పండును సద్దు చేస్తూ తిన్నారు.



అక్కడినుంచి బయలుదేరి ఆ స్నేహితు లిద్దరూ పొలంగట్లమీద నడిచి వెళ్ళారు.

అంతా సవ్యంగా లేదన్నట్టు చిరుకందడు అన్నాడు :

"ఏమిటోయ్ నీవు, తెల్లవారగట్ల తొందరగా లేస్తాను అన్నవాడివి...."

"నన్నేమి చేయమంటావురా? నాన్న లేచినప్పుడు నన్ను లేపమని అమ్మకు చెప్పాను. అమ్మ లేపనేలేదు."

"ఎందుకూ అని అడగలేదా అమ్మ?"

చిరుకందని ప్రశ్నలో కాతరత ఛాయ కనిపించింది.

"చాలు లేవోయ్! నేనేమి పిల్లవాడినా అలా చెప్పడానికి."

....నొప్పిపడిన స్వరంతో అప్పు జవాబు.

ముందు అప్పు, వెంట చిరుకందడు — ఇద్దరు పొలాలను వెనుక వదలి నది గట్టువైపు నడిచారు.

అది ఏరుదాటే రేవు. అక్కడ మెగువ, దిగువ బండరాళ్ళున్నాయి! అవి గుడ్డలు ఉతికే బండలు. అదే స్నాన ఘట్టమూ కూడా. అక్కడవున్న అడవిమానులు ఎక్కి, నీటి పొడవునా వ్యాపించిన కొమ్మలమీద నడిచిపోయి లోతైన నీటిలోకి చేపలాగ దూకడం అప్పుకు ఇష్టమయిన ఆట. అప్పుడు వాడి సంగాతగాళ్ళు చాలా మంది. చిరుకందనికి కూడా ఈతకొట్టడం వచ్చు. కానీ జలక్రీడలో వాడికి అంత ఆసక్తిలేదు.

అయితే, ఈ తెల్లవారి అప్పు, చిరుకందడు గట్టెక్కి నిలబడి, మౌనంగా మందగమనంతో పారుతున్న తేజస్వినిని చూచారు. కూరగాయల మూటలతో నీలేశ్వరం బజారుకు బయలుదేరిన కర్షక మహిళలను మోసుకొని పడవ నడి ఏరు దాటి ఆవలిగట్టువైపు సాగి పోతున్నది. మరికొన్ని పడవలూ దృష్టి గోచరమయ్యాయి. చేపలు పట్టడానికి బయలుదేరిన వారి పడవలు అడ్డదిడ్డంగా నడుస్తున్నవి.

ఈ మిత్రులు ఆవలిగట్టుకు వెళ్ళాలి.

"ఏమి చేద్దాం రా చిరుకందా?

"అదే ఆలోచిస్తున్నాను."

"రేవుపడవలో వెళ్ళితే డబ్బు లివ్వాలి."

"ఔను....డబ్బులు ఎక్కడనుంచి తెద్దాం ఇప్పుడు."

"తిరిగి వచ్చేప్పుడు ఇస్తామని చెబుదాము."

అయితే, చిరుకండని మెదడులో ముందు జాగ్రతగా యోచనలు అలలు అలలుగా లేచాయి.

"ఎక్కడికి వెళ్ళుతారని పడవవాడు అడగనే అడుగుతాడు."

"అడగనీ లేవోయ్, ఏదో చెప్పి దబాయించి పోతే సరి."

"అలా వద్దు అప్పూ, సందేహం వచ్చిని. పల్లెలో అందరూ ఏదేదో అంటారు తర్వాత. ఎవ్వరికీ తెలీకుండా రాండి అని చెప్పలేదూ మాస్టరు?"

చిరుకండని ముఖం ముందుదారి తోచక చప్పగయిపోగానే, అప్పు ముఖం అకారణంగానే కోపంతో ఎర్రబడింది.

"ఎలా రావాలి అన్నది మాస్టారే చెప్పవలసింది."

మాస్టారు మీది వ్యాఖ్య చిరుకండనికి నచ్చలేదు.

"తొందరలో గదూ ఆయన వెళ్ళడం? అలా ఆలోచించి చెప్పడానికి ఆయనకు పురసత్తు (తీరిక) ఎక్కడ?"

అది నిజమేనని మనస్సుకు తోచిన అప్పు ఒక్క క్షణం ఆగి అన్నాడు:

"ఇప్పుడు ఏమి చేద్దాం అయితే?"

చిరుకండడు తనకు తోచిన ఉపాయాన్ని తలలోనే బాగా ఆలోచించుకుని అప్పుకు తెలిపాడు :

"ఎగువ తోట ముసలాడులేదూ? వాడివొక పాతపడవ చిల్లులుపడి వుంది. మరామత్తు చేయలేదు."

ఆ సలహాను అప్పుడే ఒప్పేసుకొన్నట్టు అప్పు అన్నాడు:

"చిల్లులు పెద్దవా!"

"చిన్నవి. నీవు తెడ్డువేసేట్టయితే, నేను నీళ్ళు తోడేస్తూ వుంటాను."

"ముసలయ్య ఇస్తాడో, లేదో?"

"చేపలు పట్టడానికి వెళ్ళుతాము-నీకూ చేపలు ఇస్తాము, అందాము."

"అది సరే, వాడికి ఇవ్వడానికి చేపలు ఎక్కడ నుంచి తెద్దాము?"



"ఇవాళ దొరకలేదు రేపు ఇస్తాము అంటే సరి."

అప్పు సంతోషంతో మౌనంగా కనుబొమ లెగరేస్తూ తల ఊపాడు. నిమిషమయినా ఆలస్యం చేయక ముందుకు వడివడిగా అడుగులు వేశాడు. వాడంతటి బలశాలి కాని చిరుకండడు కొంచెం కష్టపడుతూనే అప్పును వెంబడించాడు.

నది ఒడ్డు పొడుగునా పైకి వెళ్ళినప్పుడు చేలు, పంటలు కళ్ళకు కనిపించాయి. నది నుంచి ఒడ్డుకు లాగి బోర్లవేసిన చిన్న పడవా కనిపించింది.

సగం పని అయినప్పుడు ఏదో అడ్డు వచ్చినట్టు అప్పు నెమ్మదిగా అడిగాడు:

"చేపలు పట్టడానికి వల ఎక్కడ. గాలమెక్కడ-అని అతడు అడిగితే?"

"చేతిలో వున్నాయి అందాము"

"ఏమిటి చేతుల్లో వుండడం?"

"ముసలాడికి కళ్ళు కనిపించవోయ్!"

ఇద్దరూ చిన్నగా నవ్వుకున్నారు. కాని, అప్పుకు మరొక సందేహమూ కలిగింది.

"పడవ ఇవ్వను అని ముసలాడు అంటే?"

"వద్దు అందాము."

"మరి?"

"అప్పుడే అనలేదూ, ముసలాడికి కళ్ళు కనిపించవు అని. చెవులూ సరిగ్గా వినపడడం సంశయమే! వాడి ఎదుటే పడవ ఎత్తి నీట్లో దింపి బయలుదేరడమే."

ఏ సాహసానికయినా సిద్ధంగా వుండే అప్పుకు సాధారణంగా చచ్చుగావుండే చిరుకండడే ఉత్సాహంతో అలా మాట్లాడడం చాల సంతోషం కలిగించింది.

....కొడుకును, కోడలిని పొలానికి పంపిన ముసలయ్య ఆ పిల్లవాళ్ళకు అడ్డు తగులలేదు కాని, పడవ చిల్లులు మూసి సరిచేసుకొనే నీటిలో దిగాలి అని పట్టుబట్టాడు. మనమలు లేని తనను ఆ పిల్లవాళ్ళ

"తాతయ్యా" అని పిలిచినప్పుడు ఆ ముసలయ్య మనస్సు పొంగిపోయింది. చూపు మందగించినా, అతడు అంతా కనిపిస్తున్నట్టే చేపలు పట్టవలసిన ప్రదేశాలను తెలిపాడు.

"మరువకుండా చేపలు ఇచ్చిపోండి" అని అతడు రెండుసార్లు హెచ్చరించాడు.

అప్పు, చిరుకండడు మరమ్మత్తు నాటకం ముగించి పడవతోపాటు నీళ్ళలోదిగి వెళ్ళిపోయారు.

పడవ నడపడంలో ఆరితేరిన అప్పు చేతిలో పడవ బాణంలాగ దూసుకుపోయింది. చిరుకండడు లోపలికి తోసుకొని వస్తున్న నీటిని త్వరత్వరగా ఎత్తిపోస్తూ కూర్చున్నాడు. త్వరగా గట్టు చేరుతామనే ఉత్సాహంతో ఎవ్వరూ మాట్లాడలేదు.

ఒడ్డు చేరిన పిదప పడవను ఇద్దరూ పైకిలాగి పొదలమాటున బోర్లవేశారు.

ఆ మీదట వాళ్ళు నడవవలసింది రెండు ఫర్లాంగుల దూరం మాత్రం. చెప్పులు చూడని ఆ పాదాలకు రాళ్ళు ముళ్ళు తొక్కకనే నడిచే అలవాటుంది.

అనుకున్న లక్ష్యం సమీపించిన సందర్భంలో, ఆ ఆతురతలో, గుండె దడదడ కొట్టుకుంటున్నప్పుడు మౌనం అర్థం లేనిదని అప్పుకు తోచింది. నడుస్తూనే అన్నాడు:

"చిరుకండా. ఏ చోటో నీకు సరిగ్గా తెలుసా?"

"హాఁ అవతల పల్లె ప్రారంభం కావడానికి ముందే ఒక చాకొట్టు లేదూ? అక్కడే."

ప్రశ్నకు తగిన సమాధానమిచ్చి మళ్ళీ యథాస్థానంచేరి మౌనంగా వుండే మనస్సు చిరుకండనిది. అది బాగా గ్రహించిన అప్పు, ఆ మౌనానికి అవకాశం చిక్కకుండా మరొక ప్రశ్న వేశాడు:

"అంతావదలి చాకొట్టులో కూర్చోదమా? ఎవరికన్నా సందేహం కలిగితే?"

మాటలధ్వని గట్టిగా వుంది. మొదట దానికి ఆక్షేపిస్తూ చిరుకండడు అన్నాడు:



"నెమ్మదిగా మాట్లాడు అప్పు!"

తప్పుచేసినట్లు అప్పు ముఖం అరక్షణం రంగుమారింది. తన మాటల ప్రభావాన్ని పరీక్షించి చూచి సంతోషంతో చిరుకండడు సంభాషణ సాగించాడు.

"చాకొట్టులోనే భద్రమట-మాస్టరు చెప్పారు. దారిని పోయేవారు వస్తారు; పోతారు. దానివల్ల ఏమీకాదు. అంతేకాక, శత్రువుల వైపువారు ఎవరయినావస్తే చాకొట్టువారికే మొదట తెలుస్తుంది."

మనం, మరి శత్రువులూ.... ఒకపక్షం: దానికి ఎదిరిగా మరో పక్షం. ఇది స్వారస్యమనిపించింది అప్పుకు. ఒళ్ళు గగుర్పొడిచేలాగ వుంది ఈ కథనం ఆలోచన.

ఆ కథా కమామీషు మనస్సుకు సంతోషం కలిగించగా, అప్పు తన కుతూహలానికి సమాధానం కోసం మరొక ప్రశ్న వేశాడు:

"ఆయన ఎలా వుంటారు చూడటానికి చిరుకండా?"

చిరుకండనికి అది తెలియదు.

"ఎలా ఉంటారో? మాస్టరు చెప్పనేలేదు."

ఆయనను మరచి అప్పు మాస్టరును గురించి ఆలోచించాడు. ఆ ఆలోచన తియ్యగా ఉంది.

"చిరుకండా, మన మాస్టరు చాలా మంచివారు కదూ?"

ఆ విషయంలో ఎలాటి సందేహమూ లేని చిరుకండడు ఉత్సాహంతో జవాబు చెప్పాడు:

"ఔను మరి!"

ఆ పిల్లవాళ్ళిద్దరూ కయ్యూరులో ప్రాథమిక పాఠశాల చదువు పూర్తయిన వెంటనే పై చదువుకోసం నీలేశ్వరానికి వెళ్ళాలని ఆ 'మంచి మాస్టరు' కోరాడు. కాని, అది సాధ్యం కాలేదు. అప్పు ఇంట్లో పెద్ద కొడుకు. చిరుకండడు తలిదండ్రుల ఏకైక సంతానం. పొలం పనులలో పెద్దవారికి వాళ్ళు తోడు కావలసి వచ్చి, చదువు అక్కడికే ఆగిపోయింది.

మాస్టరు మాట వచ్చినప్పుడల్లా ముందుకు కొనసాగని తమ చదువు సంగతి రాకుండా ఉండేదికాదు.

వారు చివరి పరీక్షలో ఉత్తీర్ణులయి అప్పుడే ఐదేళ్ళు గడిచి పోయాయి.

తప్పనిసరిగా ఆ జ్ఞాపకం వచ్చి అప్పు అన్నాడు:

"మనమింకా చదువవలసింది కదూ చిరుకండా?"

ఆ ప్రశ్నకు జవాబు చెప్పడానికి మారు చిరుకండడు "శ్" అంటూ అప్పు చేయి పట్టుకొని లాగాడు.

"చూచావా? చా కొట్టు వచ్చింది. నెమ్మదిగా పోదాము."

అప్పు గుండె మరింత తీవ్రంగా కొట్టుకుంది.

"అక్కడికి వెళ్ళి ఏమని అడుగుదాం? డబ్బున్నా వుంటే, చా తాగడానికి వచ్చామని చెప్పేవాళ్ళం."

"ఊరికే అక్కడికి వెళ్ళి కూర్చుందాము....మాస్టరు అక్కడ వుండినా ఉండవచ్చు."

"హూ!"

"ఎవరయినా అడిగితే, కూలి కోసం నీలేశ్వరం సంతకు బయలుదేరాము అని చెబుదాం."

"హూ!"



# 2

చా కొట్టువాడు దగ్గరికి వచ్చిన ఆ పిల్లవాళ్ళిద్దరిని కుతూహలంతో చూచాడు.

"రండి లోపలికి, కూర్చోండి."

—చిరునవ్వు నవ్వి, తల ఊపుతూ అతడు ఆహ్వానించాడు.

అప్పుకు, చిరుకండనికీ సంకోచం అనిపించినా, లోపలికి వచ్చి విరిగిన బెంచీమీద కూర్చున్నారు. ఆ కొట్టువాడు యువకుడు, తలకు చుట్టుకొన్న తువ్వాలు నుంచి పొడుగాటి క్రాపు దూరి బయటికి వచ్చింది. ఒంటిమీద ఏమీ లేదు. నడుము నుంచి కిందికి మోకాళ్ళ వరకు మురికి అడ్డ గుడ్డ ఒకటి అంటుకొని వుంది. గోడలులేక, వెదురు తడకలతో తయారయిన హోటలు. ఒక మూల సన్నగా మండుతున్న కట్టెలపొయ్యి. దాని మీద ఆవిరి కక్కుతున్న ఒక రాగిపాత్ర. పక్కనే నాలుగుకాళ్ళు నేలలోకి నాటి, వాటి మీద పలకలుపరచి తయారుచేసిన మేజాబల్ల, ఆ మేజామీద నాల్గు గ్లాసులు, చెక్కెర, చాపొడి డబ్బాలు, చానీళ్ళు శోధించి లావెక్కిన గుడ్డ. మరొక డబ్బా, దాని పక్కన బీడీల కట్టలు.

అప్పు, చిరుకండడు అక్కడే స్తంభానికి ఆనుకొని భూమ్మీద కూర్చున్న దుబ్బోణ్ణి ఒకణ్ణి చూశారు. రేగిన జుట్టు, బీడి తాగుతున్నాడు. దట్టమయిన కనుబొమలు. ఆ కనుబొమల కింద లోతయిన చూపుతో పొడిచి చూచే కళ్ళు.

చా కొట్టువాడి చిరునవ్వు ఆత్మీయంగా ఉంది. మరొకని చూపు ఆత్మీయంగా లేదు.

వచ్చినవారిని చూచి కొట్టువాడన్నాడు :

"ఒక్కొక్క ఆఫ్ చా ఇవ్వనా ?"

ఒక గ్లాసు చాను రెండు గ్లాసులలో సమంగా పోస్తే అది ఒక్కొక్క ఆఫ్-ఒన్ బై టు. ఒక్కొక్కరికి మూడు మూడు దమ్మిడీలు. కాని, ఆ కుర్రవాళ్ళు వట్టి చేతులతో వచ్చారు.

తల్లిని అడిగి అణానో, ఆరు దమ్మిడీలో అడిగి తేవలసింది, అని అప్పు అనుకున్నాడు........చిరుకండడు మాత్రం మౌనం సరికాదని జవాబు చెప్పాడు :

"మా దగ్గర డబ్బు లేదు."

ఆ జవాబు అనిరీక్షితం కాదన్నట్టు కొట్టువాడన్నాడు :

"అంతే కదూ? మా కొట్టుకు డబ్బున్న వాళ్ళే వస్తారు అనుకుంటున్నారా ?"

ఆ మాటవిని డుబ్బోడు గొల్లున నవ్వాడు. లేచి పొయ్యి దగ్గరికి వెళ్ళి తాను తాగుతున్న బీడీ ముక్కను నిప్పులో పడేశాడు. కొట్టువాడిని చూస్తూ అన్నాడు :

"నేను వస్తానయ్యో ! ఈరోజుదీ లెక్కలో వ్రాసుకో. ఎంతయింది మొత్తం ?"

"ఐదణాలు. సాయంకాలం ఒక సేరు బియ్యం తెచ్చియ్యి. లేకపోతే నేను ఉపాసంతో చచ్చిపోతాను. రేపు చా చేసి నీకు ఇచ్చేవాళ్ళే ఉండరు చూడు."

డుబ్బోడు మరోసారి గట్టిగా నవ్వి, పిల్లవాళ్ళను మరొకమారు తీవ్రంగా చూచి, వెళ్ళిపోయాడు.

అప్పుకు, చిరుకండనికి ఇప్పుడు ఎక్కువ సరాగంగా ఊపిరి ఆడుతుందని అనిపించింది.

కొట్టువాడు అప్పుడే చా చేయసాగాడు. పిల్లవాళ్ళు ఒకరి ముఖం ఒకరు చూచుకొని వూరికే ఉండిపోయారు.

పెద్దడబ్బా తాకి చూపుతూ కొట్టువాడు అన్నాడు :

"అటుకులు ఉన్నాయి, తింటారా ?"

ఇలా అప్పు చేయడం చిరుకండనికి సరి అనిపించలేదు. అసమ్మతి చూపుతూ అతడు అన్నాడు :



"వద్దు, వద్దు. మేము తిండితినే వచ్చాము."

"అలాగేలే. చా తీసోకోండి. డబ్బు చింత వద్దు. ఎప్పుడయినా యివ్వవచ్చు."

కయ్యూరిలో ఒక చిన్న హోటలుంది. మూడు నాలుసార్లు గుట్టుగ అక్కడికి వెళ్ళిన ఆ పిల్లవాళ్ళను అంగడి చా రుచి కొత్తదేమీ కాదు. ఇక్కడ కూడా అంతే రుచిగా వుంది చా. వేడిగా ఉన్న ఆ గుక్క పానీయం వారి నాలుకలను చురుకు మనిపించింది.

పిల్లవాళ్ళు వూ వూ అని ఊదుకుంటూ ఆర్చి చా తాగడం కొట్టువాడు అదే పనిగా చూచాడు.

అప్పుకు కొంచెం అసంతృప్తి కలిగింది. తాము వచ్చిన పనేమిటి? చేస్తున్న పనేమిటి ? అతడు చిరుకండణ్ని చూచాడు. అతణ్ని కూడా ఆ ఆలోచనే వేధిస్తున్నది. అతడు అప్పును చూచాడు.

పిల్లవాళ్ళు చా తాగి గ్లాసులు కింద పెడుతుండగా కొట్టువాడన్నాడు:

"ఎక్కడికి బయలుదేరారు ?"

ఇద్దరికి ఒకేమారు దిగులయింది. అయినా, చిరుకండడు దిగులు పొక్కకుండ ఉండడానికి ప్రయత్నిస్తూ అన్నాడు :

"ఇలాగే వచ్చాం."

"అలాగా!"

అది, "అంతా తెలుసు" అనే నవ్వు ధ్వని. అప్పుకు ఆ నవ్వు ఇష్టం కాలేదు.

కొంచెంసేపు మౌనంగా ఉన్న పిదప కొట్టువాడు మరొక ప్రశ్న వేశాడు :

"మీ పేర్లు చిరుకండ, అప్పు కదూ ?"

పిల్లవాళ్ళు అదిరిపడ్డారు. కాదు అనడమే ఉచిత మనిపించింది. కాని మాట పెగల్లేదు.

కొట్టువాడు నవ్వుతూనే అన్నాడు :

"భయపడకండి. మీ మాస్టరు రాత్రే చెప్పి వెళ్ళారు."

ఇద్దరి ముఖాలు విప్పారినవి. ఉత్సాహంతో అప్పు అడిగాడు :

"మా మాస్టరు తెలుసా మీకు ?

"ఓహో ! ఎందుకు తెలియదు ?"

చిరుకండడు అన్నాడు :

"మేము మాస్టరును చూడాలి. ఆయన మమ్మల్ని ఇక్కడికి రమ్మన్నారు."

"రెండు నిమిషాలు ఇక్కడే వుండండి. మీరు రావడం తెలిసిన తక్షణం కబురు చేస్తారు."

"ఎలా తెలుస్తుంది మేము రావడం ?"

"దుబ్బోడు అప్పుడే వెళ్ళాడు కదా !"

"దుబ్బోడు ?"

"ఊఁ, దుబ్బోడు అనే మేము అతన్ని పిలుస్తాము."

"వాడు-వాడూ మనవాడేనా ?"

ప్రశ్నలో ఆశ్చర్యం నిండింది. కొట్టువాడు నవ్వి అన్నాడు :

"ఎందుకు ? వాణ్ణి చూసి జడుస్తున్నారా ?"

"అప్పుకు ఆ ప్రశ్న నచ్చలేదు. దుబ్బోడి సంగతి తాను అలా అడగకుండా వుండవలసింది అనిపించింది.

"భయ మేమీలేదు. అయినా, ఒక రకంగా అయింది."

"మంచివాడు పాపం !"

ఇదంతా తాను అనుకొన్నట్టుగానే ఉన్నట్టు చిరుకండనికి తోచింది అతని ముఖంలో కళ యెక్కింది.

"మేమే కయ్యూరి వాళ్ళమని అతనికి ఎలా తెలిసింది ?"

ప్రశ్నించిన చిరుకండనిలాగే అప్పు కూడా ఆతురతతో జవాబుకు ఎదురు చూచాడు."

"అదేమంత పెద్ద విషయం ? మీరు ఎలా వుంటారన్న సంగతి మాస్టరు చెప్పనే చెప్పారు. ఇలాంటి వాటిలో దుబ్బోడు పాత పులి. మీరు ఎవరూ అని తెలియడం వల్ల, డబ్బు లేదు అని మీరు అన్న మీదట నేను చా తయారు చేయడానికి బయలుదేరాను. అది చూచి ఖరారై వాడు లేచాడు."

ఆ యిద్దరి విషయంలోను అప్పుకు, చిరుకండనికి అపార గౌరవం ఏర్పడింది. అప్పు అన్నాడు :



"మాస్టరు వుండే స్థలం యిక్కడికి ఎంత దూరం?"

అదంతా అడక్కూడదు. వెళ్ళినప్పుడు మీకే తెలుస్తుంది.

చిన్న తప్పు చేసిన బుద్ధిమంతుడయిన విద్యార్థి లాగ అయింది పిల్లవాళ్ళ పరిస్థితి.

కొట్టువాడు చిన్నగా నవ్వాడు. డబ్బా పక్కన మడిచి పెట్టిన "మాతృభూమి" దినపత్రికను వెలుపలకు తీశాడు.

"పత్రిక చదువుతారా; నిన్నటిది."

పత్రిక చదవడం పెద్దతనం అని భావించిన అప్పు అన్నాడు:

"మాకు పత్రిక చదివే అలవాటు లేదు."

అయితే, మాస్టరు, పత్రిక చదవడం దినమూ చూస్తున్న చిరుకండనికి తమకు ఆ అలవాటు లేదని ఒప్పుకోవడం గర్వకారణంగా తోచలేదు.

కొట్టువాడు తమ మాటలు కొనసాగించాడు.

"మంచివాళ్లు మీరు! బడికి వెళ్ళి చదువు నేర్వడమైనా ఎందుకు? పత్రికో, పుస్తకమో చదువుతూంటే, అక్షర జ్ఞానమైనా మిగులుతుంది. లేకపోతే మరిచిపోతారు."

అప్పుకు కూడా అది ఔననిపించింది. అతడు ఖిన్నుడయ్యాడు. మాటలు ముగించి కొట్టువాడు పత్రికను ముందుకు చాచినప్పుడు చిరుకండడు దానిని అందుకొన్నాడు.

"చిరుకండడంటే నీవే కదూ?"

కొట్టువాడి ఈ ప్రశ్న విని చిరుకండనికీ, ఆశ్చర్యమైంది, అప్పుకూ ఆశ్చర్యమయింది.

"ఎలా తెలిసింది మీకు?"

కొట్టువాడు నవ్వాడు.

"ఊహించి అన్నాను. లావుగా ఉండేవాడు అప్పు, బక్కపలచని వాడు చిరుకండడు కావచ్చునూ అని."

"సరే! సరే!"

కొట్టువాడి వినోద ప్రవృత్తి చూచి పిల్లవాళ్ళకు ఖుషీ అయింది. చిరుకండడు తెరిచి చూస్తున్న పత్రికవైపు అప్పుకూడ దృష్టి సారించాడు.

చదవడం సులభంగా వుంది. అయితే, ఆ పదాలన్నీ విచిత్రంగా వున్నవి. చదివినప్పుడు అప్పుకు ఏమీ అర్థం కాలేదు. అతడు చూపును పత్రిక నుంచి మళ్ళించి కొట్టుకు అవతల చూచాడు. అక్కడే కొంచెం అవతలికి ముంతమామిడి చెట్లు, ఒకటి రెండు మామిడిచెట్లు, అడవి మానులు కొన్ని. వాటిగుండా పొదలు దాటి ఎక్కి దిగిపోతున్న కాలిబాట.... అదంతా చూచిన మీదట అప్పు మళ్ళీ పత్రికపై చూపు విసిరాడు. చిరుకండడు పత్రికను చదవడంలోనే మనస్సును లగ్నం చేయడం చూచి అతనికి ఆశ్చర్యమయింది. క్షణకాలం సహించలేకపోయాడు. మళ్ళీ తన స్నేహితుడు చిరుకండడు మంచివాడు – బుద్ధిమంతుడు – అనే భావన ఆలోచనలను తియ్యగా చేసింది. అయినా తానొక్కడే మౌనంగా ఉండలేక అప్పు చిరుకండని తొడను నెమ్మదిగా పొడిచి గుసగుసగా అడిగాడు:

"ఆయన వచ్చారేమో అడిగి చూడు."

"ఊహూం. అలా అడక్కూడదు."

ఊరికే ఉండు అని సూచించేట్లు వుంది చిరుకండని ధ్వని.

అటుకుల డబ్బా ప్రక్కనుంచి ఒక బీడీ చేత్తో తీసుకొని కొట్టువాడు నవ్వుతూ అడిగాడు:

"మీరు బీడీ తాగుతారా ఏమిటి?"

"లేదండీ!"

అలా యిద్దరి నుంచీ ఒకే సమాధానం వచ్చింది.

"మంచిది. ఇప్పుడే తాకకండి. దీనివల్ల ఏ సుఖమూ వుండదు."

చిరుకండడు పత్రికను మడిచి పక్కకు పెట్టి అడిగాడు :

"సుఖం లేనప్పుడు మీరెందుకు తాగుతారు?"

కొట్టువాడు జవాబు చెప్పలేదు. ఊరికేనే నవ్వి, పొయ్యి వైపు వంగి, నిప్పుకు బీడీ ముట్టించి పెదవుల మధ్య పెట్టుకొని, ఒక దమ్ము లాగి, పై కప్పు చూస్తూ, పొగ వదిలాడు.

అప్పుకు మాస్టారు బీడీ తాగే రీతి గుర్తుకు వచ్చింది.

"మన మాస్టరు చాలా కాలుస్తారు కదూ?"

చిరుకండడు "హుం," అనడం, తెల్ల గూడకట్టు పంచె, లాల్చి తొడుక్కున్న ఒక యువకుడు లోపలికి రావడమూ సరిపోయాయి.



వచ్చినవాడు పిల్లవాళ్ళను ఒకమారు చూచి కొట్టువాడిని అడిగాడు:

"వీళ్ళేనా?"

కొట్టువాడు ఔనన్నట్టు తల వూపిన వెంటనే ఆ యువకుడు పిల్లవాళ్ళవైపు తిరిగాడు.

"నాతోపాటు రండి."

అప్పు, చిరుకండడు గబగబా లేచారు.

"మేము వెళ్ళి వస్తాము." అని కొట్టువాడికి చెప్పారు.

"హూ! వెళ్ళిరండి. అప్పుడప్పుడూ వస్తూ వుండండి. మరొకసారి వచ్చినప్పుడు కేటి చేసి ఇస్తాను స్పెషల్ చా! ఈ కొట్టు మరవకండి. నా పేరు రాముణ్ణి."

కొట్టువాని మాటలు విని పిల్లవాళ్ళకు సంతోషమయింది. అతని పేరు తెలిసిందని సంతృప్తి కలిగింది.

"వస్తాను రాముణ్ణీ" అని ఆ యువకుడు ఆత్మీయతతో చిరునవ్వు నవ్వి అన్నాడు.

.... ఆ యువకుని పెదవులు బిగుసుకొని వున్నాయి–తెలివి తేటల భండారానికి తాళం ముద్ర వేసినట్టు. కాని, ఆ పెదవుల మీద సదా లాస్యం చేస్తూ చిరునవ్వొకటి. కళ్ళలో వున్నది, ఆత్మీయతా దృష్టి.

అతడు ముందు దారితీశాడు. ఎత్తి కట్టిన అతని గూడకట్టు పంచె కింద కనిపించే వట్టికాళ్ళను, పాదాలనూ చూస్తూ, పొడుగ్గా వెనక్కి జారిన తలవెంట్రుకలపై చూపులు సారిస్తూ అప్పు, చిరుకండడు అతని వెంట నడిచారు. నడవలేక వెనుక పడుతున్నారేమోనని ఆ యువకుడు అప్పుడొకసారి, ఇప్పుడొకసారి వెనక్కి తిరిగి పిల్లవాళ్ళను చూచేవాడు. అయితే, నడకవేగంలో పిల్లవాళ్ళు ఓడిపోయేట్టు లేరు.

ఈ మౌన ప్రయాణం అనుభవం లేని అప్పుకు ఏమైనా మాట్లాడాలని తోచింది. ఆ యువకుని పేరయినా అడుగుదా మనిపించింది. అయితే, మాటాడవచ్చునో, కూడదో అనే అనిశ్చిత పరిస్థితి అతనిని బాధించింది. ఒకటి రెండుసార్లు అప్పు తన భుజం మీదగా చూపు సారించి వెనుకవున్న చిరుకండణ్ని చూచాడు.

అప్పు ఏదో అడగదలచుకొన్నాడని చిరుకండనికి స్పష్టమయింది. ఊపిరి, మేను కదలిక, ముఖ భావం, వీటితోనే పరస్పరం మనస్సులో వున్నదాన్ని తెలుసుకొనే బాల్యమిత్రులు వాళ్ళు. అప్పు తన్ను చూసి నప్పుడు చిరుకండడు పెదవులపై వ్రేలు పెట్టి ఊరికే వుండుమని సైగ కూడా చేశాడు.

అప్పు వూరుకున్నాడు. అయితే మనస్సులో అదిమిపెట్టిన భావాల కుదుపు పైకి వస్తున్న సూర్యుని కిరణాలకు పైకిపొంగిందా అన్నట్టు దేహం చెమర్చింది. సదా సర్వకాలమూ బక్కపలచని ఎండు కట్టెలాగున్న చిరుకండనికి ఒళ్ళంతా చెమర్చి స్నానం కాకపోయినా, చంకల్లో చెమట పోసింది.

కొంచెం సేపటికే తాము చూడవలసిన మాస్టరు, ఆయన పరిచయం చేస్తానన్న పెద్దవారు, హోటలులో చూచిన దుబ్బోడు.... ఇంతమంది జనం. అక్కడ యింకా ఎవరున్నారో! "ఆయన" ప్రభుత్వం కళ్ళు కప్పి, పాటుపడుతున్న పెద్ద నాయకులు. తమ మాస్టరు ఆయనను గురించి ఎంత ఆదరంతో మాట్లాడి వుండలేదు! మాస్టరు ఒకమారు అన్నారు: ఆయనే నాకు లోక జ్ఞానం కలిగించినవారు. ఆయనే నా తెలివితేటలకు రూపుతీర్చినవారు. లోక జ్ఞానమంటే ఏమిటో? తెలివితేటలకు రూపుతీర్చడ మంటే ఏమిటో? అవి అస్పష్టమైన మాటలు. అయితే ఇంతమాత్రం స్పష్టం: "ఆయన" మాస్టరుకన్నా దొడ్డవారు....

— అలా ఆలోచిస్తూ, అప్పు చిరుకండడు నడిచారు....

....మాస్టరుకన్న దొడ్డవాడైన ఆ వ్యక్తి ఎలా వుండాలి? ఎత్తయిన శరీరం, బలమైన భుజాలు, విలువైన దుస్తులు, మెలిపెట్టిన మీసాలు, భయభక్తులు కలిగించే కళ్ళు, గంభీరమైన ధ్వని....

— ఆ కల్పనా చిత్రం భవ్యంగా ఉంది. ఆ చిత్రం ఎదుట చనువు అనేది సాధ్యమే కాదు. కాని, మాస్టరు అలా కాదు. ఆయన ఎంత మంచివారు! ఆయన్ను చూడగానే కలిగేది — ఆయన వద్దకుపోయి ఆయనను అంటి కూర్చుందామనే ఆశ. అందరూ ఆయనలాగే ఉంటే ఎంత బాగుండును! అయితే ఆయనకన్న పెద్దవారు మాస్టరులాగ వుండడం సాధ్యంకాదు గదా....



ఇద్దరి తలల్లోను తిరుగుతున్నది అలాంటి ఆలోచనే; కొంచెం హెచ్చు లేక కొంచెం తచ్చు. 'ఏమిటి ఆలోచిస్తున్నావు?' అని చిరుకండని అడుగుదామని అప్పు ఆశ. అయితే, గొంతు హెచ్చించి మాట్లాడేట్టులేదు. 'శ్: ఊరుకో!' అని చిరుకండనితో చివాట్లు పడేవా రెవరు?

అయితే చిరుకండడు మౌనపు కోటలోనే తనంతటతాను మాట్లాడు కొంటున్నాడు. గడచిన నాలుగు నెలల్లోను ఎన్ని చోద్యాలు జరిగాయి! సత్యం, న్యాయం – ఎంత మంచి పదాలు! ఆ మాటలు ఎత్తినప్పుడు మాస్టరు కళ్ళు ఎలా మెరిసిపోతాయి!.... మన పల్లె, సముద్రతీరం, భారత దేశం, దానికి వెలుపల దూర దూరాన వివిధ దేశాలు.... ఎక్కడెక్కడో సత్య న్యాయాల పక్షం వహించి, వసించే జనం....

....నడుస్తున్న చిరుకండడు మౌనంతో ఉన్నా ఒంటరిగా లేడు. అతని లోపలి విశాల ప్రపంచంలో ఎంత మంది జనం — ఎంత మంది జనం!

నెమ్మదిగా వీస్తూ వచ్చిన గాలి మానవుల మాటలను మోసుకొని వచ్చింది. మాటలు ఎవరివో?.... అని చిరుకండడు చెవి రిక్కించాడు. మనవారివే వుండాలి—అని అప్పు ముఖం ఇంత వెడల్పు చేసుకొని, దూరాన చూపు నిలిపాడు.

ముందు నడుస్తున్న యువకు డన్నాడు:

"చూడండి; అక్కడ వున్నారు."

# 3

కొబ్బరితోటలో, మూలలో మొలిచిన ఒక పనసచెట్టు నీడన పచ్చని గరిక మీద నలుగురు కూర్చున్నారు. వారిలో ఇద్దరు అప్పుకు, చిరుకండనికి పరిచితులు— మాస్టరు, చా కొట్టులో వాళ్ళు చూచిన దుబ్బోడు. మూడవవాడు ఒక వయసు మళ్ళిన రైతు. నాల్గవ అతను....

"ఆయన" వచ్చినట్టు తోచలేదు. తమ వారయిన మాస్టరు అక్కడే వున్నారని అప్పుకు, చిరుకండనికి సంతోషమయింది. అయితే తాము చూచిపోదామని వచ్చిన "ఆయన" లేరని దుఃఖమయింది.

నాల్గవ వారితో అదేమిటో నవ్వుతూ మాట్లాడుతున్న మాస్టరు, దగ్గరికి వచ్చిన వారిని చూచి అటు తిరిగి అడిగారు:

"చాలా సే పయిందేమర్రా వచ్చి?"

చిరుకండడు మౌనంగా పళ్ళికిలించాడు. సమాధానం చెప్పడంలో మొదటివాడు కావాలని అప్పు కుతూహలంతో అన్నాడు :

"చాలా సేపేమి కాలేదు సార్."

"రండి కూర్చోండి."

అప్పు చనువుతో మాస్టరుకు దగ్గరగాను, చిరుకండడు ప్రీతి భక్తితో కొంచెం దూరంగాను కూర్చున్నారు. వాళ్ళను పిలుచుకొని వచ్చిన యువకుడూ కూర్చున్నాడు.

పిల్లవాళ్ళ కళ్ళు మరొకసారి, అక్కడ కూర్చున్నవారి ముఖం నుంచి ముఖానికి సంచారం చేశాయి.

చాకొట్టులో తమను చూచినట్టే ఇప్పుడూ పొడిచి చూస్తున్నాడు ఆ దుబ్బోడు. ముసలి రైతు ముఖంమీద నవ్వు నాట్యమాడుతున్నది. ఈ పిల్లలను చూచి అతడు ప్రసరింపజేస్తున్నది వాత్సల్య దృష్టి. అతని



నవ్వుకు ప్రత్యుత్తరంగా, గాంభీర్యం సరికాదని పిల్లవాళ్ళు కూడా చిరునవ్వు నవ్వారు. అయితే, దుబ్బోడివైపు వారు చూడలేదు.

ఆ మరొకరూ యువకులే. శుభ్రమైన తెల్లని గూడకట్టుపంచ, పలుచని నల్లని శరీరం, చెంపల ఎముకలు ఎత్తి కనిపిస్తున్న నీరస ప్రకృతి. శాంతమైన ముఖ కవళిక. కళ్ళు కదులుతూ, జీవం పొంగుతూ, చూపు ఆత్మీయంగాను ఉన్నవి. ఆయన ముఖంమీద సదా సూక్ష్మమయిన మందహాసం.

"ఈయన మాస్టరుస్నేహితులు కావచ్చు. ఆయన ఇంకా వచ్చి వుండరు" అనే నిశ్చయానికి వచ్చారు పిల్ల వాళ్ళు.

"నడిచి నడిచి కాళ్ళు అలిసిపోయి వుండాలి కదూ ప్రభూ!"

"అలా ఏమీ లేదు!"

ఆ యువకుడు నవ్వుతూ జవాబు చెప్పాడు. ఆ ధ్వనిలో వినయం ఉంది. ఇలాటి పరీక్షలలో తాను ఓడిపోయే వాడని కాదు అనే ఆత్మాభిమానం ఉంది.

అప్పు, చిరుకండడు ప్రభువు వైపు చూచారు. ప్రభు. ఇతడు తమ వాడు కాడని- రైతు కాదని- చిరుకండడు సులభంగా గ్రహించాడు. పరీక్షించి చూచినప్పుడు ఆ యువకుని నడతలో, మాటలలో నయం, నాజూకుతనం అతనికి కనిపించాయి. పట్నవాసంవాడు. సందేహంలేదు. అయినా, తమ పక్షంవాడు....!

ఆ మరొకరు, పిల్లవాళ్ళను సూక్ష్మంగా ఎగాదిగచూచి, మాస్టరుతో అన్నారు:

"శిష్యులు మీకు చాల అంటిపెట్టుకొని వున్నారు."

మాస్టరు నవ్వారు. ఆ నవ్వులో చనువు వున్నా ఆయన ముఖంలో వినయం వుంది. ఆ మాటకు సమాధానంగా మాస్టరు ఏమైనా చెబుతారని పిల్లవాళ్ళు ప్రతీక్షించారు. కాని, ఏమీ చెప్పకుండా ఊరకుండడం చూచి పిల్లవాళ్ళు ఆశ్చర్యపడ్డారు.

అంతటా మౌనం. పచ్చని చెట్టుచేమలను చుట్టుముట్టి నెమ్మదిగా వీస్తున్న చల్లగాలి. మీదఎత్తున కొబ్బరిచెట్ల సోగమట్టల కీచుకీచు ధ్వని....

పిల్లవాళ్ళవైపు తిరిగి మాస్టరు అన్నారు:

"వీరేనోయ్. పరిచయం చేయిస్తానని అన్నాను చూడండి. వీరే"

అనుకోకుండా తమను ఉద్దేశించి వచ్చిన ఆ మాట విని పిల్ల వాళ్ళకు ఆశ్చర్యం కలిగింది. వాళ్ళు, మాస్టరు చూపుతున్న వ్యక్తిని మరొకమారు చూచారు. కనురెప్ప వేయకుండా చూచారు. తాము చూడ వచ్చినది ఆ వ్యక్తినే అని తెలిసినప్పుడు అప్పుకు, చిరుకందనికి- ఇద్దరికీ నిరాశ కలిగింది. ఎత్తయిన శరీరం, బలమైన భుజాలు, విలువైన దుసులు, మెలిపెట్టిన మీసాలు, భయం కలిగించే కళ్ళు, గంభీరధ్వని ఉంటాయని- తాము కల్పించుకొన్న వ్యక్తికీ, వీరికీ పోలికేలేదు!

పిల్లవాళ్ళ ఆలోచనను ఊహించినట్లు ఆ వ్యక్తి అన్నారు:

"జోరయిన ఆసామీ ఎవరైనా వుంటారని అనుకున్నారు కదూ?"

పిల్లవాళ్ళిద్దరూ పళ్ళికిలించి నవ్వారు. అలా తప్పుగా ఆలోచించి, నగుబాటు పాలయ్యాము గదా అని వారికి సిగ్గయింది. తమ మనసులో వున్న దాన్ని వారు అంత సరిగ్గా తెలుసుకొన్నారు గదా అని ఆశ్చర్య మయింది. మాస్టరు కన్నా పెద్దవాడయిన వ్యక్తి, ఎలాటి భయానికీ అప్పదం లేకుండా సాదా మనుష్యుడుగా ఉండడం చూచి వారికి సంతోషం కలిగింది.

ఆ పిల్లవాళ్ళలో అప్పు ఎవరు, చిరుకందడు ఎవరు అని మాస్టరు "ఆయనకు" తెలిపారు. వాళ్ళ తలిదండ్రుల వివరాలు తెలిపారు.

"చిరుకందడు తలిదండ్రుల ఏకైక పుత్రుడు. వీడికి వున్నట్టిది మంచి మెదడు. అప్పుకు వున్నది మంచి హృదయం. వీడికి ఇద్దరు తమ్ములున్నారు. తండ్రి కొంచెం తాగడం, తన్నడం ఎక్కువ...."

ఆయన అలా చెప్పి, అప్పువైపు తిరిగి "కాదేమోయ్?" అన్నారు. అందరూ తన్నే చూచి నవ్వుతున్నట్లు వాడిని భాసించింది. 'ఇదంతా చెప్పకపోతే ఏమయ్యేదో?' అని మనసు ముడుచుకుంది.

అంతలోనే మాస్టరు మధురమైన మరొక మాటా చెప్పారు:

"అయితే, ఇతని తల్లి చాల మంచిది."

అది విని, సంతోషంతో, సిగ్గుతో అప్పు ముఖం తేటపడింది.



ఇంతయినా మాస్టరు "ఆయన" పేరు చెప్పలేదు. "చెప్పడం మరచిపోయారేమో? మనమే అడిగితే ఏమవుతుంది?" అని మంచి మెదడు చిరుకందడు యోచించాడు.

అయితే, అలాటి ప్రశ్నకు అవకాశమే లేనట్లు ఆ వ్యక్తే పిల్లవాళ్ళను చూస్తూ అన్నాడు:

"నా పేరు మీకు తెలియదు కదూ! పండితుడు అని."

"పండితులు అంటే కరక్కాయ పండితులు కాదు."

దుబ్బోడు ఆ హాస్యమ్మాటకు తానే పడిపడి నవ్వాడు.

తక్కిన వారికీ నవ్వు వచ్చింది.

మాస్టరు వివరించి చెప్పారు:

"పండితులు అంటే, తెలిసినవారు అని కదూ! ఔషధం ఇచ్చేవారు అంటేనూ తప్పులేదు. అయితే వీరు ఔషధం ఇవ్వడం మానవుల జబ్బులకు కాదు - సమాజపు వ్యాధికి. అర్థమయిందేమర్రా?"

అర్థమయిందేమర్రా! అనేది - ఆయనకు ఇష్టమైన ప్రశ్న. పదే పదే ఆయన అలా అనడం వల్ల బడిపిల్లలు, తాము మాత్రమే ఉన్నప్పుడు తమలో తాము అదే ప్రశ్న అడిగి నవ్వుకొనేవారు. ఆ నవ్వుకు కారణం మొదటిసారి తెలుసుకొన్నప్పుడూ మాస్టరు కోపగించుకోలేదు. ఆ మీదట కూడ ఆయన ఆక్షేపించలేదు.

ఇప్పుడు అది జ్ఞాపకం వచ్చి అప్పుకు నవ్వు వచ్చింది. అయితే చిరుకందడు "సమాజపు వ్యాధికి ఔషధమిచ్చే పండితులు" అనే అర్థపూర్ణమయిన మాటకు తల ఊపాడు. ఆ మాట అన్న మాస్టరు పట్ల అతనికి గౌరవం పెరిగింది.

పండితులు అప్పుతో అన్నారు:

"నీ తమ్ముళ్ళ పేరేమిటి అప్పు?"

అదేమంత గొప్ప ప్రశ్నగా అప్పుకు తోచలేదు. అయినా, అతడు పేర్లు చెప్పాడు. వాటితోపాటు ఒక మాట చేర్చాడు.

"వాళ్ళు నాకన్నా చాల చిన్నవాళ్ళు."

పండితులకు నవ్వు వచ్చింది.

"తెలుసునోయ్, అయినా తెలుసుకొని వుందాము అని అడిగాను. నీలాగే నేనూ పెద్ద కొడుకును. నాకు నలుగురు తమ్ముళ్లు. చివరివాడు నీలేశ్వరం హైస్కూలులో చదువుతున్నాడు. తక్కిన వాళ్ళంతా ఇప్పుడు పెద్దవాళ్ళయ్యారు. అయినా, నీవు అన్నట్టు వాళ్ళందరూ నాకన్న చాల చిన్నవారు అనుకో."

మాస్టరు, ప్రభు చిరునవ్వు నవ్వారు.

అప్పు తన ప్రవర్తన అపార్థానికి కారణం కారాదని చిన్నగా చెప్పాడు :

"నా ఒక్క తమ్ముడు బడికి పోతాడు. చిన్నవాడు ఇంట్లోనే వుంటాడు. ఇంటి పనులు చేస్తాడు. పని లేనప్పుడు అవ్వకు తోడు !"

"అలాగా !"

"హుం. ఇప్పుడు ఒక వారం రోజులుగా మా యింటో గలాటా తక్కువ. అవ్వ వాళ్ళిద్దర్నీ పిలుచుకొని త్రికరపురానికి మా అమ్మ యింటికి వెళ్ళింది."

ఆ పండితులు తామూ పిల్లవాడయిపోయి, అప్పు అతి ముఖ్య విషయాలు చెబుతున్నట్టు అతని మాటలను చెవిఒగ్గి విన్నారు.

చిరుకందనికేమో : 'ఈ అప్పుది వట్టి గప్పాలు' అని అనిపించింది.

అటు తర్వాత పండితులు, బడి మానివేసిన ఆ పిల్లవాళ్ళు ఏమేమి చదువుతున్నారని అడిగాడు.

తప్పు ఒప్పుకుంటున్న స్వరంతో అప్పు అన్నాడు :

"మాకు పేపరు చదివే అలవాటు లేదు."

"అలాగా ? పేపరులో కథలుంటే ?"

"ఓ ! వాటిని చదువవచ్చు."

పండితులు తనవైపు చూచారని చిరుకందడు అన్నాడు :

"ఇకనుంచి పేపరు తప్పక చదువుతాము."

పండితులు చిరునవ్వు నవ్వుతూనే అన్నారు :

"ఔనోయ్. పత్రిక, పుస్తకం రెండూ — చదవాలి. చదివినకొద్దీ జ్ఞానం ఎక్కువవుతుంది. చదువుతూ చదువుతూ ఆలోచన చేయాలి.



ఇది సరేనా ? అని. సరి అయితే, ఎందుకు సరి ? లేక తప్పని తోస్తే, ఎందుకు తప్పు ? – అనేదంతా యోచించాలి."

ఉత్సాహంతో చిరుకందడు ఊగొట్టాడు.

"పొలంలో వరి మొక్కలు సరిగా పెరక్కపోతే, ఎందుకు— అని ఆలోచిస్తాము. కాదేమోయ్ ?"

"ఔను."

"అలాగే ఆలోచించి. నీళ్ళు ఎక్కువ వుంటే తక్కువ చేస్తాము. తక్కువ వుంటే నీళ్ళు పారిస్తాము. ఎందుకు సరిగా పంట పండలేదు ? అని ఆలోచన చేయడం వల్ల కారణం తెలుస్తుంది. అది తెలిసిన తర్వాత పని...."

చిరుకందడు ఔనని తల ఆడించాడు. అప్పు నోరు తెరిచి, ప్రతి ఒక్క మాటనూ తెలుసుకొనదానికి ప్రయత్నిస్తూ చెవి ఒగ్గి విన్నాడు.

అంతలోగా ఒక రైతు కొబ్బరి బోండాల గుత్తిని మోసుకొని వచ్చాడు.

"ఒకటి రెండు తెమ్మంటే ఇన్ని తెచ్చావేమోయ్? కడుపుకు ఏమీ వేయకుండా వట్టి బోండాం నీళ్ళిచ్చి పంపించేద్దా మనుకున్నావేమిటి ?"

—దుబ్బోడు కపట గాంభీర్యం చూపుతూ నిగ్గరగా అడిగాడు.

కొబ్బరి బోండాలు తెచ్చిన రైతుకేమో ఆ మాటలు నాటినట్టు కనిపించలేదు. అతడు దుబ్బోణ్ని ఒకమారు చూచి అన్నాడు :

"ఎప్పుడూ నీకు పొట్టదాకటే యోచన."

"తప్పేమిటోయ్ దాన్లో ! పోయినసారే పండితులు చెప్పలేదూ పొట్ట ప్రశ్న ముఖ్యమని !"

దుబ్బోడి ఆ మాటలకు అందరూ నవ్వారు.

రైతు కొబ్బరి బోండాలు చివర్లు చెక్కి తాగడానికి తయారు చేస్తూ అన్నాడు :

"చూడండి పంతులుగారూ, దుబ్బోడు సోమరి అవుతున్నాడు. పొట్ట ప్రశ్న, బట్ట ప్రశ్న అని మాట్లాడుతూ ఆ హోటలులో కూర్చుని వుంటాడే కాని, మూడు దమ్మిడీల పనీ చేయడు."

రెచ్చిపోయినట్లు దుబ్బోడన్నాడు :

"చాలు. ఎక్కువ విప్పొద్దు నీ పురాణం."

పండితులు తామే పిల్లవాళ్ళకు ఒక్కొక్క బోండాం అందించారు. వాటిని తీసుకోడానికి వెనుకంజ వేసినప్పుడు, మాస్టర్ ప్రోత్సాహపు సైగ చూపు వారిపై ప్రసరించింది.

దుబ్బోడు ఒక్క గుక్కలో బోండాం తాగి దాని లోపలికి వేలు పెట్టి చూచి, దానిని పారేస్తూ అసంతృప్తి గొంతుకతో అన్నాడు :

"మరీ లేతది. ఒక ముక్కయినా కొబ్బరి వుండొద్దూ దాంట్లో! కొంచెం ముదిరింది తెచ్చి వుంటే ఏమి కూల్లబోయేదోయ్ ?"

ఆ రైతుకు కోపం వచ్చింది.

"నిమిషాని కొకమాట మాట్లాడుతావు కదోయ్ ? ఇప్పుడేకదా అన్నావు-బోండాం తాగితే భోజనానికి ఇబ్బంది అవుతుందని."

దుబ్బోడు ఒక బీడి తీసుకుని ముట్టించి, పొగ ఆకాశానికి పోవడం చూస్తూ అన్నాడు :

"కానీ ఇక భోజనం ఎలాంటిది పెడతావో చూద్దాం?"

మాస్టరు తమ బీడీ కట్టను ముందుపెట్టి తామొకటి తీసుకున్నారు. ప్రభు, రైతులు కట్టపై చేయివేశారు.

పండితుడు బీడీ తాకనేలేదు. 'ఆయన బహుశా సిగరెట్టు కాల్చవచ్చు' అని చిరుకండడు అనుకున్నాడు. కాని, ఆయన సిగరెట్టూ తాగలేదు.

దుబ్బోడు పిల్లవాళ్ళను చూస్తూ అన్నాడు :

"మీరు బీడీ తాక్కపోయినా ఒక్కొక్కటి తీసుకోవాలోయ్. తీస్కొని నాబోటి వాడికి ఇవ్వాలి."

ప్రభువు దుబ్బోణ్ణి వీపుమీద ఒక గుద్దు గుద్దాడు. కాని ఆ దేహం కదలనన్నా కదలలేదు. "అయ్యో నాచేతి వేళ్ళు విరిగిపోయాయి" అని గుద్దినవాడే కొట్టుకొన్నాడు.

కొబ్బరి బోండాలు తెచ్చిన రైతు పండితులను చూస్తూ అన్నాడు:

"మీరే పుణ్యాత్ములు. బీడీ తాగే ఈ దుర్వ్యసనం మీకు లేదు."



పండితులు ఊరికే నవ్వి, తలవెనుక అరచేతులు పెట్టుకొని, చెట్టుకు ఆనుకొని పైనవున్న కొమ్మలను, ఆకులను చూచారు. పండుటాకు ఒకటి కిందికి రాలి వారి ఎదపై పడింది. అప్పు చేయి చాచి, దానిని ఎత్తి పక్కకు జరిపాడు.

దూరం నుంచి ఎవరో దగ్గిన చప్పుడైంది. అంత వరకు విగ్రహం లాగ కూర్చున్న దుబ్బోడు సర్రున తిరిగి, వస్తున్నవారు ఎవరని చూచి, పండితుల కాలికి తనచేతి వేలు తాకించాడు. ఆయన వెంటనే పక్కకు పొర్లి, భుజాల మరుగున ముఖంపెట్టి, నిద్రపోతున్నట్లు నటించారు. తక్కినవారు గాబరా పడలేదు.

దగ్గిన వ్యక్తి నడివయస్సు బక్కచిక్కిన ప్రాణి. అతడు సంశయ దృష్టితోనే కూర్చున్న వారినందరినీ చూస్తూ, ఆ వైపు వచ్చి నెమ్మదిగ అన్నాడు :

"చాలమంది స్నేహితులు వచ్చినట్టుందే కేశప్పా ?"

కొబ్బరి బోండాలు తెచ్చిన రైతు లేచి, కొత్తవాడి దగ్గిరకు పోతూ, అబద్ధాల పంచాంగం అల్లడానికి తయారవుతూ సమాధాన మిచ్చాడు:

"ఎవరూ లేదయ్యోయ్. నీలేశ్వరం నుంచి మా పిల్లవాడి మేస్టార్లు పల్లె చూడ్డానికి వచ్చారు. ఈ రోజు వారందరికీ సెలవు చూడు."

"అలాగా? ఎవరు పడుకొన్నది?"

"వారూ ఒక మేస్త్రి."

"మీ పిల్లవాడు ఎక్కడికి వెళ్ళాడు?"

"ఇంతవరకూ యిక్కడే వున్నాడు. ఇపుడు ఎక్కడికి వెళ్ళాడో ఏమో చూడలేదు."

ఆ మానవుడు కూర్చున్నవారిని మళ్ళీ సందేహంతోనే చూస్తూ, దుబ్బోణ్ణి గుర్తుపట్టి అన్నాడు:

"ఓహో! నీవూ వున్నావా?"

"నేను లేని జాగా లేదు! నేను లేని దేశం లేదు!"

ఏదో గొప్ప తత్వం ఉపదేశించే వాడిలాగా సమాధాన మిచ్చాడు.

"సరే, సరే. ఒక్క బీడీ ఇవ్వండి ఎవరైనా."

వచ్చినవాడు ముందుకు చాచాడు చేయి.

రైతు కేశప్ప ఒక బీడీ తీసుకొనిపోయి ఇచ్చాడు. కాలుతున్న తన బీడీ నిప్పుతోనే దానిని ముట్టించాడు. అతడు పొగ వదులుతూ మరింతగా దగ్గి ముందుకు నడిచాడు.

"జమీందారుగారు ఊళ్ళో ఉన్నారా?"

కేశప్ప అతనిని అడిగాడు.

"ఊఁ హొసదుర్గం నుంచి నిన్న వచ్చారు. ఇప్పుడు వారి వద్దకే వెళ్ళుతున్నాను."

అతడు దూరంగా వెళ్ళిపోయిన మీదట దుబ్బోడు పండితుల కాలికి తన చేతివ్రేలు సోకించి సైగచేసిన మీదట పండితులు పక్కకు పొర్లి లేచారు.

పరిస్థితి తీవ్రతను అప్పుడే ఊహించుకొన్న అప్పు, చిరుకండడు ఊపిరి బిగబట్టి కూర్చున్నారు. దగ్గుతూ వచ్చినవాడు తమ శత్రువు అన్నది స్పష్టమయింది. లేచి కూర్చున్న పండితుల ముఖాన్ని పిల్లవాళ్ళు దిగులుతో చూచారు.

ఆ ముఖంలో గాబరాపడిన గుర్తేమీ లేదు. మునుపటిలాగే ముఖం ప్రశాంతంగా వుంది. ఆ చిరునవ్వు మాయమైపోలేదు.

మాస్టరు అప్పును, చిరుకండని చూచి అడిగారు:

"అతడు ఎవరో తెలిసిందేమోయ్?"

ఇద్దరికి తెలిసింది. చిరుకండడు అన్నాడు :

"తెలిసింది. అతడు సర్కారు పక్కవాడు, జమీందారుగారి పక్కవాడు"

పండితులు నవ్వి అన్నారు :

"సరిగ్గా ఊహించుకొన్నారు. పరవాలేదు. ఒక మనిషిని చూచిన తక్షణం అతడు మంచివాడో, చెడ్డవాడో తెలుసుకోవడం నేర్చుకోవాలి. అతని ఒక ముఖ కవళిక, మాట్లాడే ఒక మాట— దానినుంచే అతడు ఎలాటివాడనేది తెలుసుకోవాలి."

పిల్ల వాళ్ళు, తక్కినవారూ ఆ మాటలను శ్రద్ధగా విన్నారు.

పిల్ల వాళ్ళవైపు చూస్తూ పండితులన్నారు:

"మీరు కయ్యూరినుంచి ఎలా వచ్చారో చెప్పనేలేదే...."



అప్పు ముఖం విప్పారింది. చిరుకండనివైపు, మాస్టరువైపు అతడు ఒకమారు దృష్టి సారించాడు. అయితే, వారి అభిప్రాయాలకు ఎదురు చూడకుండా తన స్నేహితునితోపాటు తాను నది దాటి వచ్చిన సాహస గాథను జరిగింది జరిగినట్టు తెలిపాడు.... చెప్పవలసిన విషయాలు ముగియవస్తున్నప్పుడు అప్పు అన్నాడు:

"చిరుకండడు చాల నాజూకు. కొంచెం గట్టిగా మాట్లాడినా నా నోరు మూయించేవాడు. ప్రతి విషయంలోను వాడిది దూరాలోచనే."

స్నేహితుని నోట తన పొగడ్త విని చిరుకండనికి "ఒక విధం" గా అయింది. ప్రశంస వాడికి ఏ కాలంలోను గిట్టదు. అయితే అప్పు అలా కాదు. చేసిన పనికి ఆత్మవిశ్వాసంతో తన ప్రశంస తానే చేసుకొనేవాడు, ఇతరులను ఆ రీతిగానే ముక్తకంఠంతో పొగిడేవాడు. అలా చేసేటప్పుడు సత్యానికి చ్యుతి ఎప్పుడూ కలిగేది కాదు.

అప్పు చెప్పినది విని అందరికీ సంతోషమయింది.

పండితులు ఆ పిల్లవాళ్ళను ఆత్మవిశ్వాసంతో చూస్తూ అన్నారు :

"మన పిల్లవాళ్ళు ఎప్పుడూ ఇలాగే వుండాలి. అలాగే మనలో, చిరుకండనిలో వున్నట్టు దూరాలోచనా వుండాలి. అప్పులో వున్నట్టి ధైర్యం, ఉత్సాహం వుండాలి. అలాంటి గుణాలు వుంటేనే మనుష్యుడు విప్లవకారుడు అవుతాడు."

విప్లవకారుడు అనే పదం విని అప్పుకు, చిరుకండనికి మేను పులకించింది. తమలో విప్లవకారులకు ఉండవలసిన మంచి గుణాలున్నాయని తెలిసి, వారికి ఆనందమయింది.

అంతలోగా కేశప్ప ఏడు సంవత్సరాల కూతురు పరుగెత్తుతూ వచ్చింది.

"ఏమిటే అది?"

....తండ్రి కేశప్ప కూతురిని అడిగాడు.

అంతమంది అక్కడున్నారని ఆ అమ్మాయి సంకోచపడి, తండ్రి దగ్గరికి వెళ్ళి నెమ్మదిగా, అయితే అందరికీ వినపడేట్టు చెప్పింది :

"అమ్మ అన్నది – వంట తయారయిందంట. భోజనంపొద్దయి వుంటే అందరూ రావచ్చునంట. వెళ్ళి చెప్పమన్నది."

కేళప్ప పండితుల ముఖం చూచాడు. పండితులు లేచి, తక్కిన వారిని "లేవండి" అన్నారు. అమ్మాయి చేయి పట్టుకొని ఆయన అడిగారు:

"సిగ్గెందుకమ్మా? పోయినసారి మీ ఇంటికి వచ్చినప్పుడు నీవు అంతగా మాట్లాడావు. ఇప్పుడు మరచిపోయావా?"

అమ్మాయి సిగ్గుపడినా, పండితుల పట్టునుండి విడిపించుకోలేదు. వారి జతతోనే నడిచింది.

అప్పు, చిరుకండడు వెనక వుండడం చూచి పండితులు అన్నారు:

"ఏరీ కయ్యూరు వీరులు? ముందుకు రండి. ముందే నడవండి."

తమను గురించి అలా అన్నందుకు ఆ పిల్లవాళ్ళు ఆత్మ విశ్వాసంతో కేళప్పను అనుసరించి ముందు నడిచారు.

....వాళ్ళకోసం కాచుకున్నది పండుగ భోజనం కాదు. బీదల గుడిసెల సాదా భోజనం. అప్పు తల్లికి అంతకన్నా రుచిగా వంట చేయడం వచ్చు. అయితే అప్పు దానితో దీనిని పోల్చదలచలేదు. చిరుకండడేమో భోజనంలోని తారతమ్యాల యోచన ఎప్పుడూ చేసినవాడు కాడు.... భోజనం కన్నా ముఖ్యంగా స్నేహబాంధవ్యాల వాతావరణం వారినందరినీ హర్షచిత్తులను చేసింది.

కేళప్ప సంకోచపడుతూ ప్రభువును అడిగాడు:

"ఇలాంటి భోజనం మీకు రుచిస్తుందో లేదో?"

"మా యింటి వంటలకు ఈ రుచి ఎక్కడిది?"

—అన్నాడు ప్రభు నవ్వుతూ.

పండితులూ నవ్వారు.

"వంట బాగా చేశారమ్మా."

—అని, ముఖం ఇంత చేసుకొని నిలుచున్న గృహలక్ష్మిని ఆయన పొగిడారు.

ఆమె మరి ఒకటి రెండు గరిటెల అన్నం తెచ్చి దుబ్బోడికి వడ్డించింది. అతడు గంభీరంగానే అన్నాడు:

"ఇక నీవు భోజనం చేయమ్మా. కావలిస్తే నీ భోజనం అయ్యే వరకు కాచుక్కూచుంటాను. నాకేమీ తొందరలేదు."

తక్కినవారంతా ఆ మాటలు విని నవ్వారు.



భోజనం పూర్తయింది. కొందరు తాంబూలం బిగించారు. కొందరు బీడీ తాగారు. కొందరు రెండూ చేశారు. పండితులు ఒక్కరే గడ్డికప్పిన కప్పు పాత బొంగులను ఎంచుతూ ఊరికే ఉన్నారు. పిల్లలిద్దరూ వారి పైన నాటిన తమ చూపులను కదిలించలేదు.

ఒకమారు పండితులు అడిగారు:

"ఇంకెవరైనా వస్తారా?"

ఎక్కువగా మౌనం వహించి వుంటున్న వయసయిన రైతు అన్నాడు:

"భోజనంచేసి వస్తామన్నవారు మరిద్దరున్నారు."

కొంచెం సేపటికి ఆ యిద్దరూ ఒకొరొక్కరుగా వచ్చారు.

"ప్రారంభిద్దామా ఇక ?"

"హూఁ"

అదేమిటో అప్పుకు అర్థం కాలేదు. ఉపన్యాసం ఉండవచ్చని చిరు కండడు అనుకున్నాడు. వెనుకటికి ఒకసారి తండ్రితోపాటు ఏలేశ్వరం బజారుకు వెళ్ళినప్పుడు పొడుగాటి తెల్లచొక్కా తొడుక్కుని తలమీద తెల్లటోపి పెట్టుకున్న ఒకరు చుట్టూ చేరిన జనం మధ్యన నిలబడి ఉపన్యసించడం అతడు చూచాడు. అదేదో తమాషా కావచ్చునని వంగి తొంగి చూసిన తండ్రికీ, కొడుక్కూ నిరాశ కలిగింది. పండితులు ఇప్పుడు లేచి నిలబడి అలాగే ఉపన్యసిస్తారేమోనని చిరుకండడు కుతూహలంతో ఎదురు చూశాడు.

పండితులు లేచి నిలబడలేదు. కూర్చున్నచోటే మాట్లాడారు. భుజాలు, చేతులు విసిరి, పిడికిలి బిగించి, అంగవిన్యాసాలు చేయలేదు. సరళంగా ఒకరు మరొకరితో సంభాషణ జరిపేలాగా మధ్య మధ్యన ఆగి, ఏదైనా ఒక అంశాన్ని హెచ్చుగా వివరిస్తూ మాట్లాడారు.

ప్రపంచ సృష్టి జరిగి, ఈ ప్రపంచంలో మానవుడు జన్మించిన కథ....మానవులు ప్రారంభంలో బ్రతికిన రీతి....అప్పటి సమాజం.... తర్వాత సమాజంలో ఏర్పడిన గుంపు, ఆ గుంపుల మధ్య పోరు.... మానవుడు మానవుణ్ణి గులాముగా చేసుకున్నది...బలవంతులు, బల హీనులు, ఆకలిగొన్నవారు, కాయం వంచి పాటుపడేవారు....మట్టికోసం

పోరాటం—మానవుడు విశేషజ్ఞానం సంపాదించిన వైనం— యంత్ర నిర్మాణం....వర్గ సంఘర్షణ....అభివృద్ధి పొందిన దేశాల ప్రజలు వ్యాపారం కోసం తక్కెడ పట్టుకొని ప్రపంచంలోని నానా ప్రాంతాలకూ వెళ్ళడం....అక్కడ ఆ దేశాలను పాదాక్రాంతం చేసుకొన్నది....భారత దేశం పరతంత్రమయిన కర్మకథ....ఎడతెరిపి లేకుండా యిక్కడ జరిగిన దోపిడి....గత శతాబ్ది చివర జరిగిన ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం....ప్రజల ఓటమి....పరల క్రాంతిమిణుగురులు....ఈ శతాబ్దంలో రష్యా దేశంలో – ప్రపంచంలో ఆరవ భాగంలో—పాటుపడే కార్మికుడే పాలించే ప్రభువు కావడం....విదేశీ దోపిడీ దారులకు విరుద్ధంగా మనలోను నిప్పు భగ్గు మనడం .... జాతీయ సంఘటనం....ప్రజలు సాగించిన గొప్ప పోరాటాలు.

పిల్లవాళ్ళకు అదంతా అర్థం కాలేదు. చిరుకండడు ఒక్కొక్క పదము ఆతురతతో విన్నాడు. అర్థమైనది మనస్సులో నాటింది. అర్థం కానిది స్మృతిలో మిగిలింది. అప్పకు అలా కాదు. అతనిముందు ప్రవహిస్తూ పోతున్నదొక వాక్ ప్రవాహం. ఒక్కొక్కప్పుడు ప్రశాంత మైన వాక, మరొకమారు దుమదుమ దుమికే సెలయేరు....అంతా తేజస్విని నదిలాగే. అతనికి స్పష్టమయిన దొక్కటే—జనం కష్టంలో వున్నారు. జనులకు అన్యాయం జరిగింది. మనం బానిసలం. పరులు మనను పరిపాలిస్తున్నారు. మనం పోరాడి బానిస తనపు బేడీలు తెంచుకోవాలి.

పండితుల గొంతుక ఇప్పుడు ఒకేరీతిగా వినిపించింది :

"పాడుపడే జనమంతా ఒక్కటయితే, దోపిడీ చేసేవారంతా ఓడిపోతారు. మనను బిగించిపట్టిన సంకెలలు పొడిపొడి అయిపోతాయి. మన దేశంలో జన విప్లవం వేరేకాదు, రైతు విప్లవం వేరేకాదు. రైతులంతా మేల్కొవాలి, ఒక్కటి కావాలి....పల్లె పల్లెలోను రైతు సంఘాలు స్థాపించాలి...."

అప్పు ఇలాటి సంఘటన మూలంగా నడిచే పోరాటాన్ని ఊహించుకొంటూ కూర్చున్నాడు.

ఒకేసారి నాలుగైదు గొంతుకలు విన్నట్టయి అప్పు అదిరిపడి పండితులవైపు చూచాడు. ఆయన ఇప్పుడు ఉపన్యసించడం లేదు. ఆయన



ఎప్పుడు ఉపన్యాసం ఆపివేశారన్న సంగతి అతనికి తెలియలేదు. అప్పు చిరుకండని ముఖంవైపు చూచాడు. అతని లక్ష్యం ఇతరుల మాటలపై లగ్నమై వుంది. అప్పు, తానూ ఆ మాటలకు చెవి ఒగ్గాడు.

అప్పుడు మాస్టరు మాట్లాడారు :

మొదట మొదట గుట్టుగా ప్రచారం; తర్వాత ఎక్కువమంది రైతుల ఒత్తాసు పొందిన మీదట బహిరంగంగా రైతుసంఘాల స్థాపన; జనంలో జాగృతి కలిగించడం; రాజకీయ జ్ఞానం పొందటం; అందు కోసం పల్లెకొక దినపత్రిక తెప్పించాలి. చదువు వచ్చినవారు దానిని చదివి ఇతరులకు చెప్పాలి. తర్వాత పల్లెకోసం ఒక పఠనాలయం ప్రారంభించాలి....అప్పుడు దేశంలో పోరాటం జరిగితే, రైతులు పాల్గొనడం సాధ్యం....పాలకుల లాఠీలను, తుపాకిగుండ్లను ఎదిరించడం సాధ్యం.... స్వాతంత్ర్య పతాకను ఎగురవేసి రక్షించడం సాధ్యం....

చిరుకండడు ఆ మాటలను ఒక్కటికూడ విడువకుండా విన్నాడు. అప్పు మళ్ళీ పోరాటం చిత్రించే భావసమాధిలో మునిగాడు.

చివరకు ఉపన్యాసం ముగిసింది. పండితులమీదే దృష్టి నాటిన అప్పు ఆయన గుండ్రటి ఒక గడియారం జేబునుంచి వెలుపలికితీసి పొద్దు ఎంతయిందని చూస్తుండడం చూచాడు. పక్కనవున్న చిరుకండని వ్రేలితో పొడిచి అతనికీ దానిని చూపాడు.

పండితులు మాస్టరుతో నెమ్మదిగా అన్నారు :

"అప్పుడే ఐదు గంటలయింది. ఆరున్నరకల్లా చీకటి పడుతుంది కదూ !"

"అవును బయలుదేరుదాము ఇంక."

అక్కడున్నవారిలో ఒక గుంపు బయలుదేరి వెళ్ళిన తర్వాత, పండితులు, తక్కినవారూ లేచారు. మగవాళ్ళు మాట్లాడుతూన్న మాట లన్నింటినీ వంటింటి మూలనుంచే వింటున్న ఇంటి యజమానురాలు చా చేయడానికి తొందరపడింది. వారి మాటలు అర్థంకాక తన పక్కనే పడి నిద్రపోయిన కూతురును లేపింది. చా ఆలస్యమవుతుందని, "ఇంత సేపూ ఊరికే వున్నావు గదా....నీకేమీ బుద్ధిలేదు ?" అనీ కేళప్పు కేకలు వేశాడు.

పండితులు నెమ్మదిగా అన్నారు :

"ఇప్పుడేమీ వద్దండమ్మా, పోతూపోతూ రాముణ్ణి హోటలులో చా తాగి వెళ్ళుతాము. అంతేకాక పొద్దుపోయింది కూడా. ఇంకోసారి వస్తాం కదా. అప్పుడు ఈ దినందీ కలిపి ఇచ్చేయండి."

"చక్కెర, చా పొడి జాస్తిగా వుందంటే, నేనేమో రేపే వస్తానయ్యోయ్ !"

– అని దుబ్బోడు అని, అందరూ నవ్వేట్టు చేశాడు.

ఇంతకూ వాళ్ళు బయలుదేరారు.

పగటి పొద్దు చెట్టుకింద కూచున్న చోటుకు వచ్చినప్పుడు, అప్పు గుసగుసలాడినట్టు చిరుకండన్ని అడిగాడు :

"ఇప్పుడు పండితులు ఎక్కడికి పోతారోయ్ ?"

చిరుకండనికి కొంచెం కోపం వచ్చింది.

"శ్ ! అలా అడక్కూడదు."

"మన పల్లెకు వచ్చేట్టయితే మనమే పిలుచుకొని పోవచ్చుగదా అని."

ఆ ఆలోచన అర్థవంతమయింది. ఏమి చెప్పడానికి తోచక చిరుకండడు ఊరికే నిలుచున్నాడు.

"మాస్టరు రానే వస్తారు. ఆయన్నయినా పిలుచుకొని పోదాము" అంటూ అప్పే మాట కొనసాగించాడు.

"ఏమిటి ? ఆ ఓటి పడవలోనా ?"

"ఓ ! ఆ జవాబ్దారీ నాకు వదలిపెట్టు. నీవు సరిగ్గా నీళ్లు తోడివేస్తూ వుంటే చాలు."

"వద్దు! ఏమైనా అయితే ?"

అప్పుకు కోపం వచ్చింది. అయితే, మరుసటి క్షణమే, చిరుకండని మాటల్లో కొంత నిజం ఉందని మనస్సుకు తోచి ఊరుకున్నాడు.

అంతలోనే మాస్టర్, పిల్లవాళ్ళ ఆలోచనలకు ఫుల్‌స్టాప్ పెట్టారు.

"చూడండర్రా – ఎడమకు ఈ దారి పోతుందికదా, ఈ దారిన వెళ్ళిపొండి. ఇది మీరు వచ్చిన దారితో కలుస్తుంది."

అప్పు జంకుతూ అడిగాడు :



"మీరు సార్ ?"

మాస్టరు గొంతు తగ్గించి అన్నారు :

"నేనూ వీరి జతలో ఇప్పుడు నీలేశ్వరానికి వెళ్లుతాను. తెల్లవారి రైలులో చర్వత్తూరికి వచ్చి, అక్కడినుంచి నడిచి వస్తాను. పొద్దు కావస్తూంది. మీరిక బయలుదేరండి నాయనా."

ఆయనను వదిలి వెళ్ళిపోవడం అనివార్యమయినప్పుడు పిల్లవాళ్ళకు కష్టమనిపించింది. పండితులు పిల్లవాళ్ళ అరచేతులను పిసికి, వెన్నుతట్టి, చిరునవ్వు నవ్వారు. ప్రభు దూరంగా నిలబడి, తలవంచి పిల్లవాళ్ళ వందనం స్వీకరించాడు. దుబ్బోడు బొంగురు గొంతుతో అన్నాడు :

"నన్ను మరచిపోకండిరా పిల్లల్లారా. ఒకసారి కయ్యూరికి వచ్చి మిమ్మల్నంతా చూస్తాను."

ఆమీదట కూడ పిల్లవాళ్ళు పోకుండా నిలబడినప్పుడు, మాస్టరు అన్నారు :

"వెళ్ళిరండి నాయనా ! యిక్కడికి వచ్చింది ఎవరికీ చెప్పకండి."

అది అనవసరమైన హెచ్చరిక అని తెలిసినా, పిల్లవాళ్ళు ప్రతిఘటించలేదు. "చెప్పము" అన్నట్టు తల వూపారు.

తిరిగి తిరిగి చూస్తూ పిల్లవాళ్ళు వెళ్ళినప్పుడు మాస్టరు అన్నారు:

"ఏరు దాటేప్పుడు జాగ్రత్త. ఓడు పడవ వేరే. నీళ్ళు సరిగ్గా తోడేస్తూ వుండవోయ్ చిరుకండా ! అప్పు చీకటి పడేలోగా ఆవతలిగట్టు చేరాలి సుమా !"

పిల్లవాళ్ళు నడకను హెచ్చిస్తూ "హూ !" అన్నారు.

# 4

తేజస్వీనీనది దాటి పిల్లవాళ్లు ఇవతలిగట్టు సమీపించి నప్పు డింకా చీకటి పడలేదు

"ఆ ముసలయ్య చేతినుంచి ఎలాగోయ్ తప్పించు కోడం?"

—అప్పు చిరుకండనికి, తమ ముందున్న సమస్యను జ్ఞాపక పరిచాడు.

"ముసలయ్య కొడుకు, కోడలు కూడా యింటికి వచ్చి ఉంటారు, ఈ పాటికి."

అని చిరుకండడు సమస్య చిత్రాన్ని పూర్తి చేశాడు.

ఇద్దరికీ తోచింది ఒకే ఉపాయం. చీకటిపడే వరకు గట్టు చేరకుండా వుండడం. అప్పు, ఎగువ తోటవున్న చోటుకు కొంచెం ఎగువకు పడవ తిప్పాడు. తోట నడుమ ఉన్న గుడిసె వెలుపల ఒక స్త్రీ నిలబడి నదివైపు చూస్తుండటం చిరుకండనికి కనిపించింది. అతడు అప్పుతో అన్నాడు :

"ఆ ముసలయ్య కోడలు మననే చూస్తున్నదోయ్?"

"పాపం! చూడక ఏం చేస్తుంది? ఎలాగూ చేపలు వస్తాయికదా అని మచ్చు కత్తి పట్టుకొని సిద్ధంగా వున్నది – అనూ!"

వాళ్లు ఎగువన గట్టు సమీపించి అక్కడే కొంచెంసేపు ఉన్నారు. కొన్ని నిముషాలకే చీకటి పడింది. తర్వాత నెమ్మదిగా గట్టువెంబడే దిగువకు వచ్చి, తోటవద్ద చడీచప్పుడూ లేకుండా గట్టు చేరారు. పడవను ఇద్దరూ ఎత్తి గట్టుమీద పెట్టారు.

పిల్లవాళ్లు ఎంత హెచ్చరికతో వున్నా కొంచెం చప్పుడయింది. అప్పుడు గుడిసె వెలుపల లాంతరుతో నిలుచున్న ముసలయ్య కొడుకు గట్టిగా అరిచాడు:



"ఎవర్రా అది? అప్పువా? దీపం తేనా?"

"మంచి గండమే వచ్చి పడిందే" అని పిల్లవాళ్ళ గుండె దడదడ కొట్టుకుంది. వాళ్లు ఊపిరి బిగబట్టి అటూ ఇటూ కదలక అక్కడే నిలుచున్నారు.

రెండు నిమిషాలు అలాగే నిలుచుని, జవాబు రాకపోవడం చూచి పడవ యజమాని గుడిసె లోపలికి లాంతరుతోపాటు వెళ్ళిపోయాడు.

పున్నమదాటి నాలుగు రోజులయ్యాయి. చంద్రుడు ఉదయించ డానికి చాల పొద్దుంది. అందువల్ల మనసు కుదుట బరచుకొంటూ ఆ చీకటిలో దారి వెదుక్కుంటూ పిల్లవాళ్ళు తమ ఇండ్లవైపు తొందర తొందరగా నడిచారు.

అప్పు గుడిసె దగ్గర పడగానే చిరుకండ డన్నాడు:

"ఎక్కడికి వెళ్ళావు అని అడిగితే ఏం చెప్పాలోయ్ ఇంట్లో?"

"అదంతా చూసుకుంటానులే" అని చెప్పడానికి నోరు తెరిచిన అప్పు ఆగి అడిగాడు:

"ఏమిటోయ్ చెప్పడం?"

"మాస్టరు కనిపించారు, అదేదో బడిసామాను చర్వత్తూరినుంచి తేవలసి వచ్చింది; ఆయన జతతో వెళ్ళాను అని చెప్పు. రేపు ఉదయం మాస్టరు రాగానే, ఇలా చెప్పాను అని తెలిపి తేసరి."

"హూఁ.... రేపు నాకు ఎక్కడ కనబడతావు?"

"నీవు పొలానికి పోతావా?"

"ఊఁ!"

"సరి అక్కడికే వస్తాను. పండితులు చెప్పారే — దాన్నంతా మనమిద్దరం చర్చించుకోవాలి."

—చిరుకండని ఆ మాటలు గుసగుసలాగా వచ్చాయి.

"అలాగే కానీ."

—అని అంటూ అప్పు తన గుడిసె వైపు తిరిగాడు.

అక్కడ తలుపు తీసింది అతని అవ్వ. బక్క చిక్కిన ఒళ్ళు. ముడుతలు పడిన ముఖం, తాటికమ్మలు పెట్టుకొన్నందున పెద్దవై జారి కిందికి వ్రేలాడుతున్న చెవి తమ్మెలు.

తాను నిరీక్షించిన తిట్లను తప్పించుకొనడానికి అప్పే మొదట ప్రశ్నించాడు:

"అరెరే! ఎప్పుడొచ్చావు అవ్వా? నీవు ఇంత త్వరగా వస్తావని నాకు తెలియనే తెలియదు."

నాలుగు నాళ్ల తాను చూడని మనుమణ్ని - నిండుచూపుతో చూస్తూ అవ్వ అన్నది:

"మధ్యాహ్నమే వచ్చానాయనా. నీ అవతారం ఇదేమిటి? ఎక్కడికి వెళ్ళావు? నేను లేకపోతే నిన్ను అడిగేవారూ, అనేవారూ ఎవరూ లేరనుకొన్నావా?"

అప్పు, తాను పడుకొనే మూలకు చూపు సారించాడు. అతని తమ్ములు అప్పుడే అక్కడ నిద్రపోయారు. మరొక మూలలో చల్లని నేలమీద వట్టి ఒళ్లు చాచుకొని అప్పు తండ్రి పడుకున్నాడు. అతడు తాగి రాలేదనడం, చూడగానే అప్పుకు తెలిసింది. తాగని దినాల్లో మాత్రం అలా అతడు భోజనానికి ముందు నేలమీద పడుకొని అలసట తీర్చుకోడం పద్ధతి...ఆ దినం అవ్వరావడం వల్ల తనకు తన్నులు తప్పాయని అప్పుకూ తెలుసు.

కొడుకు రావడం చూడగానే మరొకసారి తల్లి అన్నది:

"తెలతెలవారింది అనగానే ఆ చిరుకండడు వచ్చి పిలుచుకు పోయాడు. అదేమి కథో.... ఏమి పనో...."

"ఎక్కడికిరా వెళ్ళావు?"

—అని అడిగాడు అప్పుతండ్రి. 'ఏటుతప్పినా మాట తప్పదు' అనడం తన చూపులోనే స్పష్టం చేస్తూ.

అప్పు తన చొక్కా తీసి గూటానికి తగిలించాడు. దానికింద నేలమీద మండుతున్న బుడ్డి దీపాన్ని, పొగ చొక్కాకు తగలకుండా, పక్కకు జరిపాడు.

ప్రశ్నకు సమాధానం రాలేదని అప్పు తండ్రికి కోపం వచ్చింది.

"ఏ వల్లకాటికిరా వెళ్ళింది నీవు? ఎక్కడ దిమ్మరిగా తిరిగావు రా?"



దిమ్మరిగా తిరగడం - అనే మాటలకు అప్పుకు అవమాన మయింది. అతడు నోరు తెరిచాడు. చిరుకండు చెప్పిన దాన్నే తడుముకో కుండా చెప్పాడు.

"హూఁ!"

— అని అతని తండ్రి హుంకరించాడు. మాస్టరు పేరు చెప్పడం వల్ల తండ్రి ఊరుకున్నాడని అప్పుకు స్పష్టమయింది.

అవ్వకూ మాస్టరంటే ఇష్టం. ఒకటి రెండు సార్లు ఆమె పగటి వేళల్లో ముంగిట్లో తాటాకుల తడక అల్లుతూ కూర్చున్నప్పుడు ఆ దారిన వచ్చిన మాస్టరు ఆగి నిలబడి, ఆమెను పలుకరించారు. చాల వినయ సంపన్నులు. 'చా తాగి వెళ్ళండి' అన్నా వద్దు అన్నారు.

ఆ మాస్టరు మాట వచ్చిందని అవ్వ అడిగింది:

"ఆయనింకా స్వంతంగా వంట చేసుకుంటూనే వున్నారా?"

"హుఁ ఇంకెవరు చేస్తారన్ని అనుకొన్నావు?"

తన ప్రశ్న ఆంతర్యం అప్పుకు ఎలా తెలిసేది అని అవ్వ నవ్వింది.

అప్పు తల్లి తల వెలుపలపెట్టి అడిగింది తలుపు సందునుంచి:

"మధ్యాహ్నం భోజనం చేశావేంరా?"

"హు! భోజనం చేయకుండా వుంటారా ఎవరయినా?"

తండ్రి గొణిగాడు:

"మహా అధిక ప్రసంగి. చెప్పినదానికల్లా మారుప్రశ్న వేయకుండా వుండడు."

"ఎక్కడ చేశావు?"

—అని తల్లి మరొక ప్రశ్నవేసింది.

"చర్వత్తూరిలోనే. ఇప్పుడు మీదంతా అయిందా లేదా?"

అవ్వకు మండిపోయింది:

"వాగుడు కాయ! చూడు, వాడు ప్రశ్నవేసే రీతి .... హుఁ పిల్లలందరూ ఇంటికి రాకుండా పెద్దవాళ్ళు భోంచేస్తారట్రా?"

అప్పు ఊరుకున్నాడు.

"పో. స్థంభంలాగ నిలబడవద్దు. కాళ్ళు, చేతులు కడుక్కో...."

—అని తండ్రి, లేచి కూర్చుంటూ అన్నాడు.

....అక్కడే తలుపు ఓరగా చేసి, అవ్వ, కొడుకు, మనమడూ భోజనానికి కూర్చున్నారు. అప్పు తల్లి ఆ ముగ్గురికీ వడ్డించింది. అలసిపోయిన అప్పుకు బాగా ఆకలయింది. భోజనం చేస్తూన్నప్పుడు మధ్యాహ్నం చేసిన భోజనం దృశ్యం అతని కళ్ళకు కట్టింది. అక్కడ భోజన సమయంలో నడిచిన మాటలు, మరీ జ్ఞాపకానికి వచ్చాయి. ఆ జ్ఞాపకాన్ని రుచిచూస్తున్న అప్పుకు తల్లి తనముందు నిలుచున్నదే కనిపించలేదు.

"చారు కావాలేమిటిరా?"

కొడుకునుంచి సమాధానం రాలేదని ఆమె మరొకసారి అడిగింది:

"కావాలేంరా చారు?"

అప్పు ఉలికి పడినట్టు తలఎత్తి చూచాడు. తల్లి ముఖం చూచి నవ్వి అన్నాడు:

"వద్దు."

అవ్వ మనవణ్ని చూస్తూ అడిగింది:

"అదేమిటి ఆలోచన చేస్తున్నావు?"

"ఏమీ లేదవ్వా."

"అబద్ధాలాడుతున్నావా?"

ఏ అబద్ధం ఎలా చెప్పాలని ఆలోచిస్తూ అప్పు అన్నాడు:

"మాస్టరు బడి సంగతులు ఏమిటేమిటో చెప్పారు. అది జ్ఞాపకం వచ్చింది."

తండ్రి అన్నాడు:

"ఎప్పుడు చూచినా మాస్టరు మాస్టరు. మాస్టరంటే ఎందుకిలా పడి చస్తారో?"

తన కొడుకు మాటను మార్చడానికో అన్నట్టు అవ్వ అన్నది:

"మంచివారు పాపం!"

అప్పుతల్లి కొన్నాళ్ళుగా తన మనస్సులో కెలకేస్తున్న ఒక విషయం ప్రస్తావించింది:



"మాస్టరు మొన్న కుట్టినికూడ బడికి పిలుచుకొనిరా అని చిన్నవాడితో అన్నారట."

కుట్టి అప్పుకడగొట్టు తమ్ముడు. వారిలో మూడోవాడు. తల్లిమాటకు తండ్రి ఏమి అంటారో అని కుతూహలంతో అప్పు తండ్రి ముఖం చూచాడు.

ఆశ్చర్య పడవలసినంత సమాధానమేమీ అతనినుంచి రాలేదు.

"కుట్టి ఇప్పుడే బడికి వెళ్ళి ఏమిటట చేస్తాడు? వాడికింకా ఆరేళ్ళు. ఇక్కడే వుంటే గిత్తలనయినా కొంచెం చూస్కోవచ్చు. పిల్లలనంతా పంపిస్తే, ఇక్కడ పొలం పనులు చేసే వారెవరు? మాస్టరు చేస్తారేమిటి వచ్చి?"

మాస్టరు విషయంలో తండ్రి తగినంత గౌరవం చూపడంలేదని అప్పు మనస్సు నొప్పి పడింది. అతడు అయిష్టంతోనే అన్నాడు:

"మాస్టరు ఎందుకు చేస్తారు మన యింటి పని?"

"మరి?"

"కుట్టి బడికి వెళ్ళనీ ఇక్కడ చూసుకోడానికి నేనున్నాను గదా!"

అప్పుడే కుట్టిని బడికి పంపడం తల్లికి ఇష్టం లేకపోయినా అప్పు జవాబ్దారీ మాట అన్నాడని సంతోష పడింది.

అయితే తండ్రికి అలా అనిపించలేదు.

"ఓహో! హో! బలే చూస్కుంటున్నావు నీవు? ఈ దినమంతా చూస్కునే ఉన్నావు కదూ!"

అప్పు మాట్లాడలేదు. ఆ దినమంతా తాను చేసిన పనులు మళ్ళీ జ్ఞాపకానికి వచ్చి, మౌనం అవలంబించాడు.

కొంచెం సేపటికే అందరి భోజనాలూ అయ్యాయి. సీమనూనె (కిరసనాయిలు) ఖర్చవుతుందని బుడ్డి దీపం ఆర్పి అందరూ పడుకొన్నారు.

త్రికరపురంలో ఉన్న తన మరొక అవ్వ సంగతి ఈ అవ్వ ప్రస్తావిస్తుందేమోనని అప్పు ఎదురు చూచాడు. తన తల్లి తల్లి, తన తండ్రి తల్లీ చిన్న చిన్న విషయాలపై పోట్లాడు కొంటారని తన తల్లి విసుగుతో ఒకసారి చెప్పింది. అప్పుకు జ్ఞాపకం ఉంది. అంతే కాక, ఈ అవ్వజతలో

తానొకసారి త్రికరపురానికి వెళ్ళినప్పుడు, ఇలాటి పోట్లాట జరగడమూ అతడు చూచాడు. ఈసారి కూడా ఏదో విరసం మాటలు జరిగి అవ్వ అక్కడనుంచి త్వరగా తిరిగి వచ్చి వుండీనా?— అని తెలుసుకోవాలని అప్పు కుతూహలంగా వున్నాడు. చిన్న పిల్లలలాగ వయస్సయినవారూ చేసే జగడాలు తమాషాగా వుండేవి. అయితే అవ్వ మౌనంగానే వుండడం చూచి అతనికి నిరాశ కలిగింది. ఈ పాటికే ఒకమారు తన తండ్రికీ తల్లికీ అన్ని విషయాలు చెప్పి వుంటుంది; మళ్ళీ వాటినే ఇప్పుడు అప్పజెప్ప జాలదు. రేపు పగటి పూట ఆమె ఒంటరిగా వున్నప్పుడు గప్పాలు కొడుతూ ఆ ఊరి సమాచారం తెలుసుకోవాలి — అని అనుకున్నాడు.... అయితే ఒక సంగతి మాత్రం ఇప్పుడే ప్రస్తావించాలనుకొన్నాడు. అది త్రికరపురంలో తన కున్న ఒకే ఒక మిత్రుడు, దూరపు బంధువు అయిన చందు సంగతి.

"అవ్వా—!"

అవ్వకు నిద్రరాలేదు. దగ్గరలోనేవున్న ఆవిడ పక్కకు పొర్లి అడిగింది:

"ఏమిట్రా? నిద్ర రాలేదేమిట్రా?"

"లేదవ్వా...."

"భయంగా వుందా? నా దగ్గర పడుకుంటావా?"

అప్పుకు నవ్వు వచ్చింది. అవ్వ దృష్టిలో తానింకా పసికందు.

"ఊహుఁ అది కాదవ్వా, చందూను చూచావా?"

మనవడు దగ్గరకు రాలేదని నిరాశ పడినా ముసలమ్మ అన్నది :

"హూఁనోయ్! బాగున్నాడు."

"నా సంగతి ఏమైనా అడిగాడా?"

"నీ సంగతి అంతగా చెప్పడానికి, అడగడానికి ఏముందిరా?"

విషయాలు ఎన్నో వున్నవి. అవ్వకు తెలియదు. అంతే. ఆమె అజ్ఞానానికి కనికరించి అప్పు చిన్నగా నవ్వాడు.

మనవడు ఊరికే ఉండడం చూచి అవ్వే అన్నది:

"చందు ఇప్పుడు బీడి అంగడి పెట్టాడు. రోజుకు రెండణాలు, మూడణాలు సంపాదన అవుతున్నది."



"ఓహూ!" అని అప్పుఆశ్చర్యం ప్రకటించాడు.

ఈ సంభాషణేమీ నచ్చక అతని తండ్రి అన్నాడు:

"మాట్లాడడం చాలు. పడుకోండి."

మళ్ళీ అప్పు మాట్లాడలేదు. అవ్వకూడా మాటలు కొనసాగించ లేదు.

చందు విషయంలో అవ్వ చెప్పిన వార్తను అప్పు నెమరు వేసు కున్నాడు. అతని తలపుల చిత్రశాలలో ప్రవేశించాడు చందు. ఒక మారు అప్పుకు చందును చూడాలని ఆశ పుట్టింది. అతనితో మాట్లాడడం సులభం. అతడు చిరుకండనిలా కాదు. తన ఇప్పటి అనుభవాలను తలలో తిరుగు తున్న ఆలోచనలను అన్నిటినీ చందుకును చెబితే అతడు అంతా విని విసు పోవడం తప్పదు. అతని దృష్టికి తను ప్రముఖుడుగా తోచడంలో సందేహంలేదు.

తొందరగా లేవాలని వెనుకటిరాత్రి చిరుకండడు చెప్పినా లేస్తానని తాను మాట ఇచ్చినా, అప్పుకు ఆ ఉదయం మెలకువ కాలేదు. చిరుకం డడే వచ్చి లేపాడు. తల్లి ఉడికించిన నేంద్రంపండ్లను (పెద్ద అరటి పండ్లను) తమకు యిచ్చింది. ఆ తర్వాత వాళ్ళిద్దరూ బయలు దేరారు. ఏదో దేశానికి యాత్ర వెళ్ళినట్టు నది దాటడం, చాకొట్టు, రాముణ్ణి, దుబోర్పుడు, తర్వాత తాము చూచిన నాయక పండితులు, జమిందారు బంటొకడు దగ్గుతూ రావడం, ఆ భోజనం, పండితులు జరిపిన సభ.... ఒక్కొక్కటి ఏలాటి అనుభవాలు! ఈ దినమే పగలు మొదలుకొని పొద్దు గూకే లోపల ఇవన్నీ జరిగాయా? అనడం నమ్మేట్టే లేదు. అయినా అదంతా నిజం. జనం సంఘటన, పోరాటం, విప్లవం, దేశ స్వాతంత్ర్యం ....పండితుల వాత్సల్య పూర్ణ దృష్టి.... ఆ దుబోర్పుడు....

దుబోర్పుడి జ్ఞాపకం వచ్చినప్పుడు అప్పు చప్పుడు కాకుండా చీక ట్లోనే నవ్వాడు. చూడడానికి భయంకరంగా ఉన్నాడు; మనసు పసిపిల్లల లాగ. పలికేవన్నీ నవ్వు మాటలు; ఒక్కొక్కటి విన్నప్పుడు నవ్వు వచ్చేది.

అప్పు ఇప్పుడు నవ్వితే సద్దు కాలేదు. నిజమే. కాని ఒళ్ళంతా కదిలి కొట్టుకున్నట్లయింది.

వెలుపలి వెన్నెల లోపలికి దూరి ఏర్పడిన మసక వెలుతురిలో అప్పు కదలికను ఇంకా మేలుకొనే వున్న తండ్రి గమనించి అన్నాడు:

"అప్పు, నిద్ర రాలేదేమిటిరా?"

అప్పు ఊపిరి బిగబట్టాడు. మాట్లాడలేదు. పిల్లవాడు నిద్రపోయి వుంటాడని అనుకున్నాడు తండ్రి.

కాని, అవ్వ తన కుమారుణ్ని అడిగింది:

"నీకు నిద్రరాలేదా ఇంకా?"

"లేదు." అన్నాడు తండ్రి గొంతు తగ్గించి.

"ఏమాలోచిస్తున్నావు?"

"ఏమీ లేదు."

అలా చెప్పిన మీదట ఒక నిమిషం ఊరికే వుండి తండ్రే అన్నాడు:

"ఏమైనా సరే అప్పును నీలేశ్వరం హైస్కూలుకు పంపవలసిందమ్మా. మెట్రిక్ ప్యాసయివుంటే మాస్టర్ పని సులభంగా దొరికేది. ఈ గుత్త పొలం నమ్ముకొని ఎంతమంది ఉండడానికి అవుతుంది?"

కొడుకు మాటలు నిజమని తెలిసిన అవ్వ మరుమాట చెప్పలేదు. తండ్రే మాటలు కొనసాగించాడు:

"ఇప్పుడేమీ చేసేట్టులేదు. పొలానికైనా వాడిని రోజూ పిలుచుకొని పోవాలి. లేకపోతే పనిదొంగ అయిపోతాడు. ఆకతాయి సావాసంతో చెడిపోతాడు."

అవ్వ అన్నది:

"అలా చేస్తే సరి. ఇప్పు డదంతా యోచన చేయడం మాని ఊరికే పడుకో నీవు."

మళ్ళీ మౌనం ఏర్పడింది. తండ్రి మాటలు విని అప్పు హృదయంలో రకరకాల భావాలు చెలరేగాయి. తనను గురించి, తన భవిష్యత్తును గురించి తండ్రి అంత గంభీరంగా యోచిస్తున్నాడన్న విషయమే అతనికి తెలియదు. ఆ రాత్రి కూడ, తను మెలకువతో వున్నానని తెలిస్తే తండ్రి అలా మాట్లాడేవాడే కాదేమో:.... హైస్కూలుకు పంపక పోవడం తప్పు అంటున్నాడు తండ్రి. అతడు అలా చెప్పడమే ఎంతో ప్రశాంత



విషయం. తాను — ఉపాధ్యాయ వృత్తి! తనకు ప్రీతి పాత్రుడయిన మాష్టరు లాగ తాను పిల్లలకు పాఠం చెప్పడం. ఆ ఆలోచన స్వారస్యంగా వుండినది. అటు తర్వాత తండ్రి వ్యక్తపరచిన భయం తాను పనిదొంగ కావడం, లేదా ఆకతాయి సావాసానికి దిగి చెడిపోవడం.... తాను – పని దొంగతనం– ఆకతాయి సహవాసం.... తండ్రి అలా అనడం అప్పుకు చెడ్డ అనిపించింది. అయితే తాను ఆకతాయి కావటం వూహించుకొని నవ్వు వచ్చింది. మించి పోయిన దానికి చింతించి ఫలంలేదు అన్నట్టు తండ్రి మాట్లాడాడు. అర్థం లేని మాట. ఏమీ మించిపోలేదు. ప్రతి ఒకటి ఇప్పుడిప్పుడే ఆరంభమయింది— ఇదో ఇప్పుడే.

తన మనసులో వున్నదంతా, తన ఆలోచన లన్నింటినీ తండ్రికి చెబుదామని అప్పుకు ఆశ కలిగింది. అయితే, ఆ ఆశతోపాటు అతడు తనకు అడ్డు రావచ్చుననే భయమూ పుట్టింది.

అప్పు నిదానంగా ఆలోచించాడు:

తన పాలికి బడి చదువు ఇక లేకపోయినప్పటికీ తాను చదవాలి; చాలా చదవాలి. తను కష్టపడి పనిచేయాలి; చాలా కష్టపడి పనిచేయాలి; తన ఇంటికోసం మాత్రమే కాదు, జనం కోసం – జాతికోసం–పనిచేయాలి. సాహసమైన పనులుచేసి తాను మంచివాడుగా ప్రసిద్ధికి రావాలి – మాష్టరు లాగ, పండితులాగ, వారు చెప్పిన ఎందరో వీరులలాగ. ఆకతాయి? ఆకతాయి కాదు – విప్లవ కారుడు తాను.... !

....చల్లనిగాలి....పచ్చని బయలు....నిండి పారేనది....బాణంలాగ దానిని చీల్చుకొని దాటుతున్న చిన్న పడవ.... దానిలో సాహసి అయిన తాను....తానొక్కడే....అప్పు ఒక్కడే.

తెలివి కల్పనా భ్రమలతో పెరిగి కరిగి మాయమయింది. జ్ఞానం తూగాడే సేతువులో జోలలు కొడుతూ మరపుతో చేరుకున్నది.

అప్పుకు నిద్ర వచ్చింది.

# 5

అప్పు నిద్రపోయిన పొద్దుకు చిరుకండడు ఇంకా మేల్కొనే వున్నాడు. దీపం లేదు. పడుకోనేమో పడుకున్నారు – నిజం. అయితే చిరుకండని తల్లి, తండ్రి తగ్గు స్వరంతో మాటలు కథలు సాగిస్తూనే వున్నారు. చిరుకండడు దానిని వింటూనే వున్నాడు.

....చిరుకండడు తన గుడిసె చేరినప్పుడు అక్కడ వెలుతురే లేదు. అతని ఎద దడదడ మంది. వెనుకటి రాత్రికే అయిపోయింది కిరసనాయిలు. భోజనంచేస్తున్నప్పుడే దీపం కొండ ఎక్కింది. పగటిపూట చిరుకండడే కిరసనాయిలు తేవలిసింది. అయితే అతడు ఈ పగలంతా ఇంట్లోనే లేడు....ఇలా జరిగి గుడిసెలో దీపం లేకపోయింది.

తల్లిని ఎలా ఎదుర్కోవడమో తెలియక చిరుకండడు భయపడ్డాడు. జంకుతూ భయపడుతూ అతడు ఇంటి దగ్గరికి వెళ్ళాడు.

పొయ్యి నిప్పు వెలుగుముందు కూర్చున్న తల్లి, దొంగ అడుగుల చప్పుడుతోనే కొడుకు వచ్చాడని తెలుసుకొని లేచి నిలబడింది.

చీకటిని, కొడుకును కలిపి పొడిచే ధ్వని వినిపించింది.

"వచ్చావా పాపీ!"

చిరుకండడు రెండు తప్పులు చేశాడు. ఒకటి ఆలస్యంగా రావడం, మరొకటి కిరసనాయిలు తెచ్చి ఇవ్వక ఇల్లు చీకటిలో వుండేట్టు చేయడం. రెంటికీ పొందవలసిన ఘోరశిక్ష అంటే బెత్తందెబ్బలు. తల్లి కొట్టడానికి వస్తే చీకట్లో వున్నా చిరుకండడు తప్పించుకొనేవాడు కాదు. ఒక సంవత్సరమయింది అతడు బెత్తం దెబ్బల రుని చూచి. అయితే ఈరోజు, తన పాలిటికి స్మరణీయమయిన ఈరోజు అలాటి దెబ్బలు తినే సందర్భం వచ్చింది గదా అని అవమానం అనిపించి దుఃఖం ఆగలేదు.



ఈ సారి తల్లి తనను పట్టుకోడానికి రాక ముందడుగు వేయక నిలుచున్న చోటే నిలుచోడం చూచి, చిరుకండడు ఆశ్చర్యపడ్డాడు.

తిట్లనా్న రావచ్చునని అతడు నిరీక్షించాడు. ఆ నిరీక్షణ కూడా సఫలం కానప్పుడు చిరుకండనికి మనస్సు కుదుట బడలేదు. దానికి మారు 'ఏమిటో అనాహూతమయి వుంటుంది' అని గాబరాపడ్డాడు.

ఆ సంగతి సూటిగా అడగలేక అతడు అన్నాడు:

"త్వరగా వెళ్ళి కిరసనాయిలు తీసుకురానా అమ్మా?"

ప్రతిసారీ తెచ్చేది ఆరు దమ్మిడీల కిరసనాయిలు ఒక సిగరెటు డబ్బాలో. పదిరోజులకు అది చాలేది.

"త్వరగా వెళ్ళి కిరసనాయిలు తెస్తాడంట. కిరసనాయిలు...." అని తల్లి వెక్కిరింపుగా చిడచిడలాడుతూ అన్నది. వెక్కిరింపు అయిన మీదట ప్రశ్నకు సమాధానమిచ్చింది:

"వద్దు! ఈ ఒక్క రాత్రి ఇలాగే గడిచిపోనీ."

"కిరసనాయిలు ముగిసింది జ్ఞాపకమే లేదు." అని నిజమైన విషయమే చిరుకండడు చెప్పాడు.

"ఎక్కడికి పోయావు బిచ్చం అడుక్కుంటూ?"

ఉన్నది ఉన్నట్టు చెప్పి పెద్దల మనస్సును ఎప్పుడైనా నమ్మించడం, ఒప్పించడం సాధ్యమా? అని, చిరుకండని మనస్సు చింత పడింది.... ప్రశ్నకు సమాధానంగా అప్పుతో కూడబలుక్కున్న దాన్నే చెప్పాడు. మాస్టరు పేరుమరుగున పొందిన రక్షణ పరిణామకారి అయింది. మాస్టరు పేరు విన్న మీదట సద్య పెద్దవారి సావాసంతో కొడుకు వుండలేదు – అని ఊరట కలిగింది కన్నకడుపుకు.

అయినా దానిని చూపక తల్లి అన్నది:

"మరొకసారి ఇలా వెట్టిచాకిరి చేయడానికి పో. నీ వీపు చర్మం ఒలుస్తాను."

అది తల్లి చేసిన హెచ్చరిక. అయితే అలాటి సందర్భాలలో ఉండవలసినంత భయంకరంగా లేదు ఆమె ధ్వని. ఆ మాటలో తీవ్రత లేదు. దానిని చూచి 'ఇంట్లో ఏమో జరిగింది' అనే చిరుకండని సందేహం బలపడింది.

తండ్రి ఇంట్లో లేడన్నది అప్పుడే స్పష్టమయినది. ఇప్పుడు కొత్త సంకటం ఏమయినా విరుచుకు పడిందా?-అని అతనికి దిగులు పుట్టింది. చిరుకండడు కాతరతను ఆపుకోలేక తల్లిని అడిగాడు:

"నాన్న రాలేదా?"

ఆమె ఇచ్చింది పొడి జవాబు:

"లేదు!"

ఆ జవాబుతో నేమో సందేహం తొలిగేట్టు లేదు.

"పొలంలోనే ఉన్నాడా ఇంకా?"

"పొలం నుంచే పగలే వచ్చేశారు. వారిని పిలిపించారు."

ఎవరు పిలిపించారన్నది చిరుకండడు ఊహించినా, విషయం స్పష్టం కానిమ్మని అడిగాడు:

"ఎవరు జమీందారుగారా!"

"మరెవరు?"

పొలం సంగతి అయివుంటుంది. ఆ రెండెకరాల భూమి వారిదే; పెద్దల నుంచి వచ్చింది. అయితే చిరుకండని తండ్రి తన పెండ్లి సమయానికి జమీందారుగారినుంచి అప్పు తీసుకొన్నాడు, ఆ భూమి మీద-కడుతున్న డబ్బంతా వడ్డీకే సరిపోయేదికాదు. వారికి ఒక జత గిత్తలుండేవి. ఒకసారి వానకాలంలో ఒక గిత్త నీటిపాలయింది. మిగిలినదానికి జోడుగా మరొక గిత్త కొనడానికి డబ్బులేదు. ఇలా అయి, రెండవ గిత్త జమీందారుగారి పాలయింది. అయినా చిరుకండని తండ్రి గిత్తలను ఎరువు తీసుకొనే భూమి సాగుచేశాడు. జమీందారుగారే తమ గిత్తలను అతని వాడకానికి ఇచ్చారు. అప్పు మాత్రం తీరనేలేదు.

అలాంటి సందర్భాలలో ఏమవుతుందన్నది చిరుకండనికి తెలుసు మాస్టరు అది చెప్పారు. పలువురి భూమి కొలదిమంది చేతికి ఎలా పోతుందన్న దానిని ఆయన వివరించారు. అప్పుడు చిరుకండడే అన్నాడు:

"మా యింటి కథా కొంతమట్టుకు ఇలాగే వుంది సార్."

తాను విని తెలుసుకొన్న విషయాల పరామర్శకు మరొకరి బతుకు వైపు చూడనవసరంలేదు. తన తల్లి, తండ్రి నడుపుతున్న జీవన సంగ్రామమే – దానిలో వారికి కలుగుతున్న ఓటమే – మంచి నిదర్శనాలు.



జమీందారుగారి పెద్ద యింటి చావడి ముందు నడుముకు అంగవస్త్రం చుట్టుకొని, చేతులు కట్టుకుని, ఒక అరచేతిని నోటికి అడ్డంగా పెట్టి దైన్యమూర్తి అయి నిలబడిన తండ్రి చిత్రాన్ని చిరుకండడు ఊహించుకున్నాడు. అ ఊహాఫలంగా అతని నరాలలో, నాడులలో రక్తం వేగంగా సంచరించింది.

నెమ్మదిగా తల్లి వద్దకు జరుగుతూ అతడన్నాడు:

"అమ్మా ! నేను వెళ్ళి నాన్నను చూసి రానా? ఇద్దరూ కలిసే వస్తాము."

కొడుకు మాటలు విని తల్లి కోపమంతా మాయమైపోయింది. మమత తొణికిసలాడింది. ఆమె 'వద్దు' అన్నది. అలా అంటూ కొడుకును తన వద్దకు లాక్కుంది.

మొదట తల్లి తన్ను తిట్టిందని చిరుకండనికి వెస్ట కలిగింది. వీరి ప్రపంచమే వేరు, తన ప్రపంచమే వేరు—అని అతడు భావించాడు. అయితే యిప్పుడు తిట్ల వెనుక వున్న హృదయవేదన, లోతు తెలిసినప్పుడు తనను కన్నవారిని సరిగా తాను అర్థం చేసుకోవడం లేదుగదా అని వ్యథ కలిగింది.

తల్లి, కొడుకు ఇద్దరూ గుడిసె వాకిట్లోకి వచ్చారు. వెలుపల మెట్ల మీద తల్లి కూర్చున్నది. కొడుకు ఆమె ఒడిలో పడుకున్నాడు. చల్లనిగాలి వీస్తున్నది. పెరట్లోని అరటి చెట్ల ఎండిన పొడుగాటి ఆకులు ఆధారం లేకుండా ముడుతలుపడి ముదురుకొని సోగలై గాలికి అటూ ఇటూ ఊగుతున్నవి. పచ్చ ఆకులు చివికి చింపులయిపోయినా భయపడక నవ్వుతూ గాలితో పోరాటం సాగిస్తున్నవి. ముంగిట్లోని రెండు కొబ్బరిచెట్ల మట్టలు పైన టప టప టప అంటూ సద్దుచేస్తున్నవి. వేరే తెలియదన్నట్టు, ఒకే సమంగా, ఆకాశంలో చంద్రుడింకా రాలేదని వెయ్యారు నక్షత్రాలు అరాజకపు రాజ్యం చెలాయిస్తున్నాయి.

తల్లి వడిలో తలపెట్టి చిరుకండడు ఆకసంవైపు ఒకమారు చూచాడు. ఆ విశాలత ఎదుట తానొక చుక్కమాత్రం అని అతనికి తోచింది.

తల్లి కుమారుని తలపెంద్రుకలు సవరించింది. మూడు కాన్పుల తర్వాత ఆ ముగ్గురు పాపలూ నాలుగైదు నెలలు కూడా ఉండక కన్ను మూసిన పిదప, చిరుకండడు పుట్టాడు. దీని లీల ఎన్నాళ్ళో!— అని దంపతులు చింతతోనే వుండేవారు. ఎనిమిది తొమ్మిది నెలల తర్వాత వారికి ధైర్యం కలిగింది. పాత మొక్కుబడులతోపాటు కొత్త మొక్కుబడులు మొక్కుకున్నారు. అలా పెరిగాడు చిరుకండడు. బక్కచిక్కిన శరీరం. అయితే తల్లికి అదే మెప్పు. అతడు చురుకైన విద్యార్థి అని అందరూ అనేవారు. కుమారుణ్ని నీలేశ్వరంలో చదువవేద్దామని తండ్రికి ఆశ వుండేది. కాని, కొడుకును వదలిపెట్టి వుండడానికి తల్లి ఒప్పుకోలేదు. దానికి కారణం తన పుత్రవాత్సల్యమని చెప్పకుండ ఆమె అన్నది:

"ఉన్న అప్పు మరింత ఎక్కువ కావాలని అనుకొన్నారా?"

"అప్పు సంగతి వదలిపెట్టు. మనం తీర్చకపోతే పెద్దవాడయిన తర్వాత వాడే తీరుస్తాడు."

అప్పుడామె కన్నీళ్ళ బాణం వదలి అన్నది:

"ఉండే ఒక్క కొడుకు కళ్ళ యెదుట వున్నాడని మీకు నిద్ర పట్టదు కదూ?"

"దోషంలేదు అనవే." అన్న తండ్రి కొడుకును చదువుకోసం నీలేశ్వరానికి పంపే యోచననే వదలుకొన్నాడు.

ఆ తల్లి కొడుకును అతిగా ప్రేమించేది. ఆ ప్రేమ కారణంగానే అతనిమీద కోపంతో విరుచుకుపడేది.

ఈ విపరీత ప్రవర్తనను భర్త ఆమెను విమర్శిస్తే, అతన్ని కోపగించుకొనేది.

"నా నగలను ఎలా చూసుకోవాలి అనేది నాకు తెలుసు. మీరు ఊరుకోండి." అని అతడు పెదవి గదపకుండా చేసేది.

ఈ దినం, తన మనుగడకే దెబ్బ తగిలేంతటి విపత్తు ముంచుకు వచ్చిందని ఆమె హృదయం బీటలువారింది. తన అసహాయతను మరుగు పరచడానికి ఆమె కోపముద్ర ధరించేది. అలాటినాడే తన ముద్దులపట్టి దగ్గర లేడని ఆమె దుఃఖం ఇనుమడించింది.



ఇప్పుడు ఆమె కొడుకును ఒడిలో పడుకోబెట్టుకొని, ఆ ఒంటి వేళతో మనస్సును తనియచేస్తూ కూర్చున్నది.

కుమారుడు బక్కచిక్కి వున్నాడనే యోచనతో ఒక ప్రశ్న ఉదయించింది:

"బొజ్జలో ఆకలయిందా నాయనా, చిరూ?"

అయితే, ఆ క్షణం అతని చుట్టూ ముసురుకున్న సహస్ర యోచనలతో ఆకలి యోచన మాత్రం లేదు.

"లేదమ్మా!"

"ఆకలయితే వడ్డిస్తాను."

"వద్దు. నాన్న రానీ."

"ఆయన రావడం ఎంత పొద్దుకో."

"పరవాలేదమ్మా. మధ్యాహ్నం గట్టిగా దంచేశాను."

అది పూర్ణ సత్యం కాదు. అయితే, తల్లికి ఆ మాటలతో ఊరట కలుగుతుందని చిరుకండనికి తెలుసు.

తల్లి ఊరకుండిపోయింది. ఒక్క క్షణం గాలి వీచలేదు. తల్లి, కొడుకు తర్వాత ఏమి మాట్లాడుతారో అనే కుతూహలంతో చెవి యొగ్గి నిలుచున్నట్టు, అరటి, కొబ్బరిచెట్లు స్తబ్ధమయ్యాయి. మళ్ళీ గాలి వీచింది. మొదటివే కిచ కిచలు, పట పటలు, టప టపలు.

తల్లి నెమ్మదిగా, విడి విడిగా చెప్పింది.

"మీ నాన్నకు ఇప్పుడు చాల చింత ఏర్పడింది చిరూ?"

"నాకు తెలుసునమ్మా."

ఆ సమాధానం ఎదురు చూడని తల్లికి ఆశ్చర్యం కలిగింది.

"ఏమిటి తెలుసు?"

"మన మిప్పుడు చాల చిక్కులో ఉన్నామని."

"ఏలాటి చిక్కు చెప్పు?"

"మన పొలం మన చేయి వదలిపోయే పరిస్థితిలో వుంది కదూ అమ్మా?"

మాట్లాడుతున్నవాడు నిజంగా తన కొడుకా? అని తల్లి దిగ్భ్రమ పడేట్టు ఉన్నది ఆ సమాధానం.

"నీకు ఎవరు చెప్పారు అలా అని?"

చిరుకండడు తానింక పసికందు కాదు— అన్నట్టు చెప్పాడు:

"నాకు అంత తెలియదా అమ్మా?"

తమకు ఏర్పడిన సంకటం జ్ఞాపకమే అరక్షణం మరచి తల్లి, కొడుకు ముఖాన్ని తన గుండెకు అదుముకొని "నా కందు" అన్నది.

మళ్ళీ ఆమె చక్కగా కూర్చునే వరకు చిరుకండడు ఊపిరికోసం తటపటాయించాడు.

ఆ చీకట్లో అస్పష్టంగా కనిపించే కొడుకు ముఖాన్ని చూస్తూ తల్లి అడిగింది:

"నీ కింకా ఏమేమి తెలుసు చిరూ?"

చిరుకండడు చిన్నగా నవ్వి ఊరుకున్నాడు. 'ఎన్నో విషయాలు తెలుసు. అయితే నీకు చెప్పేట్టు లేదు'—అని మనస్సులోనే అనుకొన్నాడు.

తన మనసులోని భయం వ్యక్తం చేస్తూ తల్లి అన్నది:

"ఈ దినం ఏ మవుతుందో: ఇంత పొద్దు వారిని ఎందుకు అక్కడ కూర్చోబెట్టుకున్నారో?"

చిరుకండనికి జవాబు తెలియదు. అయినా, అతని మనస్సు జమీందారుగారి ఇంటివైపు పారాడింది.

నాల్గు సంవత్సరాలకు ముందు ఒకమారు అదే జమీందారుగారి చావడి ఎదుట తాను చూసిన దృశ్యం, చిరుకండనికి జ్ఞాపకం వచ్చింది.

సాయంకాల సమయం. జనం గుంపు జమీందారుగారి ఇంటి ముందు మూగుతుండడం చూచి, బొమ్మలాటవాళ్ళో, దొమ్మర్లో ఉండవచ్చని, తమాషా చూడడానికి తానూ అక్కడికి వెళ్ళాడు. కాని అక్కడ అలాటి ఆట ఏదీ లేదు. దానికి మారు చావడిలో కుర్చీమీద కూర్చున్నారు, వయస్సులో తనకన్నా చిన్నవారైన జమిందారుగారు. ఆయన ఎదుట వెలుపల ముంగిట్లో ఒక నడివయసు రైతు మట్టిమీద భయంకరంగా మేను చాచి చేతులు జోడించి నమస్కారం చేస్తూ పడి వున్నాడు. చిరుకండడు అక్కడికి పోయి చూచినప్పుడు అంతా నిశ్శబ్దం. తర్వాత జమీందారు



గారు ఏమి చెబుతారో అని ఆత్రంగా చెవులు రిక్కించి చూస్తున్నా అందరు.

జమీందారుగారు ఏమీ చెప్పలేదు. ఆయన ఒకే సమంగా సిగరెట్టు తాగుతూ పొగ వదులుతున్నారు. ఆయన ఎడమవైపు, కుడివైపు చేతులు కట్టుకుని నిల్చున్న బంట్లు.

నిశ్శబ్దాన్ని భంగపరచి జమీందారుగారి ధ్వని గర్జించింది:

"ఏమిటి చెప్పు?"

రైతు నుంచి జవాబు రాలేదు.

"ఆటలాడుతున్నాడు ముండ కొడుకు. బిగించండి ఇంక రెండు!"

పక్కనే చర్నాకోలు పట్టుకొని నిలుచున్న కట్టుబత్తెం మనిషి ఒకడు ముందుకు వచ్చి పడుకొనివున్న రైతు వీపుమీద నాల్గు వాయించాడు

అయినా ఆ రైతు లేవలేదు. భూమి తల్లి ఒడిలో తల పెట్టినవాడు మీదికి తల ఎత్తనే లేదు.

మరికొంత సేపటికి జమీందారుగారు లేచి రైతును తిడుతూ అతని చుట్టూ వున్న నేలను తొక్కుతూ బుసలు కొడుతూ పారాడినారు.

చిరుకండడు ఊపిరి బిగబట్టి, పడుకున్నవాడు ఎవరని చూడడానికి ప్రయత్నించాడు. అయితే అతని ముఖం కనబడలేదు.

చివరకు జమీందారుగారి ఆదేశానుసారం బంట్లు ఆ రైతును పట్టుకొని లేపారు. అతడు ముఖం వేలవేసుకొని నిలబడ్డాడు. ఆ ముఖం నిండా మన్ను, నుదుటి గాయం నుంచి కారిన రక్తమూ, కన్నీళ్ళూ కలసి మన్ను తడిసి గారలాగ ముఖానికి అంటుకొంది.

జమీందారుగారు సిగరెట్టును కింద పారవేసి తొక్కి, అతని దగ్గరికి పోయి మెడపట్టుకొని ఆడించారు:

"రేపు సాయంకాలం లోపల ఇన్నూరు రూపాయలు తెచ్చి అప్పగించకపోతే నిన్ను పోలీసులకు అప్పగిస్తాను."

బంట్లు ఆ రైతును ముందుకు తోశారు. జనం గుంపు రెండు పాయలై వెళ్ళి పోవడానికి అతనికి దారి ఇచ్చారు.

గుంపు చెదరింది. కొందరు ఆ రైతును వెంబడించారు.

ఎందుకలా అయిందని తెలుసుకుందామనే కోరికతో దగ్గరున్న ఒక పిల్లవాడిని చిరుకండడు అడిగాడు:

"ఎందుకు కొట్టారు అతన్ని?"

"ఎందుకో ఎవరికి తెలుసు!" అన్నాడు ఆ పిల్లవాడు. వాడూ ఆ తమాషా చూడడానికి వచ్చి నిలుచున్నాడే కాని, అదేమిటో తెలుసుకోలేదు.

అయితే జనం నోటినుంచి రకరకాల మాటలు వినిపించాయి:

"వాడిదే తప్పు. తోట వదిలిపెట్టి ఎందుకు వెళ్ళాలి."

"పెళ్ళానికి కాయిలా అని వెళ్ళాడటనోయ్!"

"తోటను దోచుకున్నవారు ఎవరూంట?"

"టెంకాయలూ, పనసకాయలు, అరటి గెలలు, కూరగాయలు- ఒక్కటీ వదల్లేదట చూడవయ్యా."

"రాత్రికిరాత్రి అదంతా ఏ వూరికి ఎలా [illegible]ంచేశారో?"

"వాడే దొంగిలించి అమ్మేసి వచ్చాడో ఏమో?"

"లేక దొంగమాలంతా జమీందారుగారి ఇంట్లోనే వుందేమో?"

ఆ చివరి మాటలకు జవాబుగా నిశ్శబ్దం. దానికి భంగం కలిగిస్తూ ఎవరో గట్టిగా నవ్వారు.

"మరి రేపు సాయంకాలం లోపల నష్టపరిహారం యివ్వడానికి వాడికి ఇన్నూర్రు రూపాయలు ఎవడిస్తారట?"

"అప్పు తీసుకోవాలి."

"ఎవరయ్యా మన పల్లెలో అంత అప్పు యిచ్చేవాళ్ళు?"

"ఇంకెవరు? జమీందారుగారే?"

ఆ మాటలు విని ఈసారి ఇద్దరు ముగ్గురు నవ్వారు.

"అయినా, నాలుగేళ్ళు జమీందారుగారి అడవి కొట్టి కష్టపడి పనిచేసి వాడు తోటపెట్టాడు. ఇప్పుడు దొంగతనం అయిందనే నెపం చెప్పి వాడిని తరిమివేస్తారు."

అలా అన్నవాడు మాటలతోపాటే నిట్టూర్చాడు.

అప్పుడు చిరుకండణ్ని ముఖ్యంగా బాధించిన సమస్య ఒక్కటే. డబ్బు అప్పగించకపోతే పోలీసులకు అప్పగిస్తాను- అన్నారు జమీందారుగారు. అయితే, వాళ్ళ పల్లెలో పోలీసులే ఉండలేదు. అయినప్పుడు పోలీసు



లకు అప్పగించడం ఎలా సాధ్యం? పొడుగాటి ఎర్రటోపీ పెట్టుకొన్న పోలీసువాడు దూరాన వున్న పట్టణం నుంచి ఎప్పుడో ఒకసారి రావడం చిరుకండడు చూచాడు. అప్పుడు పిల్లలందరూ మరుగున నిలబడి వాడిని చూచేవారు....ఇప్పుడు రైతును పట్టుకోడానికి పట్నంనుంచి పోలీసులు వస్తారో లేక అక్కడికే వాడిని పిలుచుకు పోతారో? ఈసందేహం పరిహారం కానీ అని దగ్గరున్న ఒక రైతును అడిగాడు:

"మామా, పోలీసులు వచ్చారా?"

అందరూ ఆ ప్రశ్న వేసిన పిల్లవాడి వైపు చూశారు. ఆ రైతు జవాబు చెప్పాడు:

"ఎవరికి తెలుసు?"

అయితే గుంపులోంచి ఎవరో మరొకరన్నారు.

"వచ్చినా వచ్చి వుండవచ్చు. జమీందారుగారి ఆనతి కోసం వారి ఇంట్లోనే కూర్చుని వున్నారో ఏమో!"

చాల విసుగెత్తి చిరుకండడు ఇంటికి వచ్చాడు. జమీందారుగారు చాల చెడ్డవారని అతనికి అభిప్రాయం ఏర్పడింది. ఇంటికి వచ్చినవాడు, అప్పుడే పొలం నుంచి వచ్చిన తండ్రికి తాను చూచినదంతా చెప్పాడు. అయితే తండ్రి ఆ విషయంలో ఏపాటి ఆసక్తి చూపలేదు. అశ్రద్ధతో "హూఁ" అన్నాడంతే. తన తండ్రి జమీందారుగారిని శాపనార్థాలివ్వ వచ్చునని చిరుకండడు భావించాడు. కాని, తండ్రి అలాటిదేమీ చేయలేదు. అప్పుడు కొడుకుకు నిరాశ కలిగింది.

....అది తాను చిన్నవాడుగా వున్నప్పుడు జరిగిన సంఘటన.

ఇప్పుడు ఆకాశం చూస్తూ, ఆ సంఘటనను స్మరిస్తున్న చిరుకండని ఒళ్ళు గగుర్పొడిచింది. తన తండ్రికి జమీందారుగారి ఇంట్లో ఏమీ అయి వుండదు కదా?.... ఆనాడు హింసకు గురైన బీద రైతు ఏమయింది? చిరుకండనికి సరిగా గుర్తులేదు. అయితే మళ్ళీ అతడు ఎక్కడా కనిపించలేదు. ఆ ఏడే ఊరు వదలి పోయినట్లుంది....ఇప్పుడు తన తండ్రి....

"చిరూ, మీ నాన్న వస్తున్నారు, లే!"

తల్లి మాటలు కుమారుని ఆలోచనలకు అడ్డుకట్ట వేశాయి.

ఎందుకలా అయిందని తెలుసుకుందామనే కోరికతో దగ్గరున్న ఒక పిల్లవాడిని చిరుకండడు అడిగాడు:

"ఎందుకు కొట్టారు అతన్ని?"

"ఎందుకో ఎవరికి తెలుసు!" అన్నాడు ఆ పిల్లవాడు. వాడూ ఆ తమాషా చూడడానికి వచ్చి నిలుచున్నాడే కాని, అదేమిటో తెలుసుకోలేదు.

అయితే జనం నోటినుంచి రకరకాల మాటలు వినిపించాయి:

"వాడిదే తప్పు. తోట వదిలిపెట్టి ఎందుకు వెళ్ళాలి."

"పెళ్ళానికి కాయిలా అని వెళ్ళాడటనోయ్!"

"తోటను దోచుకున్నవారు ఎవరూంట?"

"టెంకాయలూ, పనసకాయలు, అరటి గెలలు, కూరగాయలు- ఒక్కటీ వదల్లేదట చూడవయ్యా."

"రాత్రికిరాత్రి అదంతా ఏ వూరికి ఎలా [illegible]ంచేశారో?"

"వాడే దొంగిలించి అమ్మేసి వచ్చాడో ఏమో?"

"లేక దొంగమాలంతా జమీందారుగారి ఇంట్లోనే వుందేమో?"

ఆ చివరి మాటలకు జవాబుగా నిశ్శబ్దం. దానికి భంగం కలిగిస్తూ ఎవరో గట్టిగా నవ్వారు.

"మరి రేపు సాయంకాలం లోపల నష్ట పరిహారం యివ్వడానికి వాడికి ఇన్నూరు రూపాయలు ఎవడిస్తారుట?"

"అప్పు తీసుకోవాలి."

"ఎవరయ్యా మన పల్లెలో అంత అప్పు యిచ్చేవాళ్ళు?"

"ఇంకెవరు? జమీందారుగారే?"

ఆ మాటలు విని ఈసారి ఇద్దరు ముగ్గురు నవ్వారు.

"అయినా, నాలుగేళ్ళ జమీందారుగారి అడవి కొట్టి కష్టపడి పనిచేసి వాడు తోటపెట్టాడు. ఇప్పుడు దొంగతనం అయిందనే నెపం చెప్పి వాడిని తరిమివేస్తారు."

అలా అన్నవాడు మాటలతోపాటే నిట్టూర్చాడు.

అప్పుడు చిరుకండణ్ని ముఖ్యంగా బాధించిన సమస్య ఒక్కటే. డబ్బు అప్పగించకపోతే పోలీసులకు అప్పగిస్తాను- అన్నారు జమీందారుగారు. అయితే, వాళ్ళ పల్లెలో పోలీసులే ఉండలేదు. అయినప్పుడు పోలీసు-



లకు అప్పగించడం ఎలా సాధ్యం? పొడుగాటి ఎర్రటోపీ పెట్టుకొన్న పోలీసువాడు దూరాన వున్న పట్టణం నుంచి ఎప్పుడో ఒకమారు రావడం చిరుకండడు చూశాడు. అప్పుడు పిల్లలందరూ మరుగున నిలబడి వాడిని చూచేవారు....ఇప్పుడు రైతును పట్టుకోడానికి పట్నంనుంచి పోలీసులు వస్తారో లేక అక్కడికే వాడిని పిలుచుకు పోతారో? ఈ సందేహం పరిహారం కాక అని దగ్గరున్న ఒక రైతును అడిగాడు:

"మామా, పోలీసులు వచ్చారా?"

అందరూ ఆ ప్రశ్న వేసిన పిల్లవాడి వైపు చూశారు. ఆ రైతు జవాబు చెప్పాడు:

"ఎవరికి తెలుసు?"

అయితే గుంపులోంచి ఎవరో మరొకరన్నారు.

"వచ్చినా వచ్చి వుండవచ్చు. జమీందారుగారి అనతి కోసం వారి ఇంట్లోనే కూర్చుని వున్నారో ఏమో!"

చాల విసుగెత్తి చిరుకండడు ఇంటికి వచ్చాడు. జమీందారుగారు చాల చెడ్డవారని అతనికి అభిప్రాయం ఏర్పడింది. ఇంటికి వచ్చినవాడు, అప్పుడే పొలం నుంచి వచ్చిన తండ్రికి తాను చూచినదంతా చెప్పాడు. అయితే తండ్రి ఆ విషయంలో ఏలాటి ఆసక్తి చూపలేదు. అశ్రద్ధతో "హూఁ" అన్నాడంతే. తన తండ్రి జమీందారుగారిని శాపనార్థాలివ్వ వచ్చునని చిరుకండడు భావించాడు. కాని, తండ్రి అలాటిదేమీ చేయలేదు. అప్పుడు కొడుకుకు నిరాశ కలిగింది.

....అది తాను చిన్నవాడుగా వున్నప్పుడు జరిగిన సంఘటన.

ఇప్పుడు ఆకాశం చూస్తూ, ఆ సంఘటనను స్మరిస్తున్న చిరుకండని ఒళ్లు గగుర్పొడిచింది. తన తండ్రికి జమీందారుగారి ఇంట్లో ఏమీ అయి వుండదు కదా?.... ఆనాడు హింసకు గురైన బీద రైతుకు ఏమయింది? చిరుకండనికి సరిగా గుర్తులేదు. అయితే మళ్ళీ అతడు ఎక్కడా కనిపించలేదు. ఆ ఏడే ఊరు వదలి పోయినట్లుంది....ఇప్పుడు తన తండ్రి....

"చిరూ, మీ నాన్న వస్తున్నారు, లే!"

తల్లి మాటలు కుమారుని ఆలోచనలకు అడ్డుకట్ట వేశాయి.

చిరుకందడు లేచి కూర్చుని, చీకట్లో దూరంగా చూచాడు. చందమామ నెమ్మదిగా పుట్టుకు వస్తున్నాడు. దానికి ఇవతల సమీపంలో, ఎండిన తాటాకుల కట్ట కాల్చిన వెలుగు. దానిని విసిరి విసిరి దారి చూస్తూ వస్తున్న వ్యక్తి.

తల్లి లోపలికిపోయి, మట్టి ప్రమిదకింత కొబ్బరినూనె వంచి, దానిలోనే వున్న బట్టవత్తి కొనను పైకి జరిపి, పొయ్యి నిప్పుతో దీపం ముట్టించుకొని వచ్చింది.

ముంగిట్లోకి వచ్చిన తండ్రి చేతిలోని తాటాకుల కట్ట వెలుగును ఆర్పాడు. అక్కడే అరటిచెట్ల పాదులో మంటి కడవలో వున్న నీళ్ళతో కాళ్ళు, చేతులు, ముఖం కడుక్కొన్నాడు. లోపలికి వచ్చి నడుముకు చుట్టుకొన్న అంగవస్త్రాన్ని విప్పి తుడుచుకొన్నాడు.

అతడు వెలుగుతున్న ప్రమిదను చూచాడు. "కిరసనాయిలు లేదా ఇంట్లో ?" అని అడిగాడు.

ఈ దినం అతడు నదిలో స్నానం చేయలేదని చిరుకందని తల్లికి తెలుసు. అయితే చేతులు కాళ్లు కడుక్కొని లోపలికి రావడం చూచి, 'ఇప్పుడు నీళ్ల పోసుకుంటారా ?' అని ఆమె అడగలేదు.

జమీందారుగారి ఇంట్లో ఏమయిందని తెలుసుకోడానికి ఆమె కుతూహలంతో ఉన్నది. చిరుకందడు కూడ. అయితే భర్త ముఖంమీదున్న బాధను చూచి తల్లి నేరుగా ఏమీ అడుగలేదు.

"చాల పొద్దు పోయిందికదూ !" అంటూ ఆమె కంచాలు పెట్టింది.

'అంతా ముగియాలంటే ఇంత తడవయింది చూడు' అని జవాబు చెప్పి, తండ్రి భోజనానికి కూర్చున్నాడు. దుఃఖం నిండిన చూపుతో తన ప్రక్కన కూర్చున్న కుమారుణ్ణి ఒకమారు చూచాడు.

"అంతా ముగియాలంటే ఇంత తడవు" అన్నాడు తండ్రి. ఏమిటి అలాఅంటే ? ఏమయింది ?

తల్లి కంచంలో గంజి వంచింది. ఎండిన అరిటాకు ముక్కలమీద ఉప్పు, చిన్న ఊరుగాయముక్క వడ్డించింది.

రెండు ముద్దలు తిన్నమీదట తండ్రి అన్నాడు :

"ఈ రోజు నుంచి మనం జమీందారుగారి పాలేళ్ళం కళ్యాణి."



గొంతుక తడబడింది. కళ్ళల్లో నీళ్ళు నిండాయి.

కళ్యాణి మాట్లాడలేదు. తన కుత్తుకను ఎవరో పిసుకుతున్నట్టయి ఆమె మంకు పట్టినట్టు నిలుచుంది.

చిరుకందడు తండ్రిమాటల అర్థం గ్రహించాడు. తండ్రి తల్లిని పేరుపెట్టి పిలిచే పద్ధతే లేదు. అయితే, ఇప్పుడు బతుకులోని ఒక సూక్ష్మ సందిగ్ధక్షణంలో అతడు తన్ను చేపట్టిన స్త్రీని పేరెత్తి సంబోధించాడు.

మరి రెండు ముద్దలు తిని తండ్రి లేచాడు.

"నాకు చాలు."

చిరుకందనికి గొంతు మూసుకొని వచ్చింది. లేవాలనిపించింది. అయితే అలా లేస్తే తల్లి భోజనమే చేయదని భావించి అక్కడ కూర్చున్నాడు.

తల్లి నిట్టూర్చి కొడుకును అడిగింది.

"నీకు ఇక కొంచెం గంజి పోయమంటావురా ?"

"వద్దు. ఆకలిలేదు."

వయస్సయిన వారి ధ్వనిలాగుంది చిరుకందని ఆ స్వరం. దానిని విని అతనికే ఆశ్చర్యమయింది.

తండ్రి వదలిపెట్టిన కంచం ముందే కూర్చుని తల్లి భోజనం చేయసాగింది. ఆమె కళ్ళనుంచి రెండు కన్నీటిబొట్లు కంచంలో దూకడం చిరుకందడు చూచాడు. దుఃఖానికి ప్రతి పట్టినట్టు పడిసెం ఆమె ముక్కుపుటాల్లో గొరగొరలాడడమూ అతనికి వినిపించింది.

ఎలాగో భోజనం ముగిసింది. పడుకోడానికి ముందు తమలపాకులు వేసుకోటం చిరుకందని తండ్రి అలవాటు. ఈ రాత్రి అతడు ఆ గొడవకు పోలేదు. తల్లి కూడ తెచ్చి ఇవ్వలేదు.

అత్యంత దుఃఖకరమైన ఆ సన్నివేశంలో ఏడుపులు, పెడబొబ్బలు లేక భారమైన హృదయాలను బిగబట్టి తన తల్లి, తండ్రి ప్రవర్తించటం చూచి చిరుకందడు అవాక్కయ్యాడు.

కళ్యాణి ఎప్పటిలాగ వెడల్పయిన రెండు చాపలను పరిచింది. రెండింటిని ఒకదానికి మరొకటి తగిలేట్టు జోడించి, చినిగిన గుడ్డలను దానిమీద పరిచింది. కప్పుకోడానికి నాల్గయిదు చిల్లులున్న కంబళ్ళను

తెచ్చిపెట్టింది. వెలుపలికి వెళ్ళివచ్చి, తలుపు తడక మూసి, భర్తను అడిగింది :

"దీపం ఆర్పనా"

"ఊఁ !"

— ఏదో లోతునుంచి ఒక ధ్వని, కావాలా వద్దా అన్న రీతిగా జవాబు చెప్పినట్టు.

.... అంతకు ముందయితే చిరుకంబడు వాపమీద మేను వాల్చ గానే నిద్రపోయేవాడు. ఈరోజు చీకటిలో కళ్ళు తెరచుకునే పడుకున్నాడు. తల్లి దండ్రుల సంభాషణను వినాలనే కళ్ళు తెరచే పడుకున్నాడు.

వెన్నెల గుడిసె చుట్టూ ప్రసరించింది చూరునుంచి గోడల సందుల నుంచి చంద్రకిరణాలు లోపలికి తొంగిచూచి 'సంతోషంగా వున్నారా' అని అడిగాయి. అయితే లోపల ఎవరూ జవాబు చెప్పే పరిస్థితిలో లేరు. ఎవరికీ వాటివైపు దృష్టే లేదు.

ఒక ప్రాణి జర్జరిత హృదయం నుంచి, ముట్టుకుంటే విరిగిపోయే లేత తీగలుగా మాటలు వెలువడి మరొక ప్రాణివైపు సాగాయి.

"జమీందారు ఇంత క్రూరుడవుతాడని నేను అనుకోనే లేదు కళ్యాణీ !"

"పోనీలెండి. దానిని మనస్సుకు పట్టించుకోకండి."

"పెద్దలనుంచి వచ్చిన ఆస్తిని పోగొట్టుకొన్నాను గదా, నేను ఎలాంటి వాడినీ అంటః?"

"................"

"నిన్న మనం స్వంత ఆస్తి వున్న రైతులం. ఊళ్ళో మనకు మానం, మర్యాద వుండేది. ఈవేళ మనం యజమానుల పాలేళ్ళం, గులాములం —"

కల్యాణి నిట్టూర్చింది.

"నీవు ఎప్పుడయినా లెక్కపెట్టి చూచావా కల్యాణీ మనం చెల్లించిన వడ్డీ అంతా అతడిచ్చిన అప్పుకన్నా ఎక్కువవుతుంది."

"అప్పు అన్నమీదట ఎప్పుడూ అలాగే కదూ?"

"వాడికి సాష్టాంగ నమస్కారంచేసి అడిగాను—వేడుకొన్నాను,



మరికొంతం వ్యవధి అయినా యివ్వండీ అని. వ్యవధి యిచ్చినా వేయి రూపాయిలు ఎక్కడినుండి తెస్తావు – అన్నాడు. అవసరమయితే ఉండే పొలంలో కొంత అమ్మేస్తాను అన్నాను. అది విన్న వెంటనే రేగిపోయి ఎగుర్లాడాడు.

"ఇప్పటి కిప్పుడే చెల్లించాలి. లేకపోతే కోర్టుకు లాగుతాను అన్నాడు. కోర్టుకుపోయి రైతులు ఏనాడయినా గట్టెక్కారా చెప్పు॥ అక్కడ ఎంతో జనం నిలబడ్డారు- జీహుజూర్ అనే పాగ డబంట్లు. పేదవాడు కోర్టుకు లాగరాదు. శాంతితోనే ఇత్యర్థం (పరిష్కారం) చేద్దాము- అంటూ నాటకమాడి – నా పరంగా వాదించారు. ఏమయ్యా ఇలాటి దొరగారు వేరే దొరకరు నీవైనా పొలం పోగొట్టుకుని ఏ వూరికి విచ్చం అనుకొన్నదానికి వెళ్ళతావు. ఇక్కడ దొరగారి పాలేరుగా ఉండిపో. పొలాన్ని వారికే వ్రాసిచ్చి గుత్తకు నీవే వాపసు తీసుకో- అన్నారు— ఏం చేయాలో నాకు తోచలేదు. కల్యాణీ.... పోలీసు- కోర్టు- జైలు ఇదంతా యోచించి, నీవు, చిరుకంబడు గుర్తుకు వచ్చి భయమయింది. పొలం మన పేరుతో లేకపోయినా ఈ పల్లెనే ఈ పొలంలోనే వుండవచ్చు గదా అని, వారి పేరుకు పొలం వ్రాసిచ్చి, అప్పు తీర్చడానికి తీర్మానం చేశాను."

ఏదో వ్యాధితో నలిగిపోతున్నట్టు తల్లి దేహం మెల్లగా పొర్లాడింది. తండ్రి ఒక్క క్షణం ఊరికే వుండి, మళ్ళీ చెప్పసాగినాడు:

"అలా ఒప్పుకొన్న తర్వాత, కొంచెంసేపు పురసతు ఇవ్వండి, ఇంటికి వెళ్ళి వస్తాను అన్నాను. వారికి అదేమి తోచిందో ఏమో! కాదు, ఇప్పుడే కావాలి అన్నారు. గ్రామ మునసబును, కరణాన్ని పిలిపించారు. కాయిత పత్రాలు వ్రాయడం అంతా అయింది. గ్రామ మునసబు చదివి చెప్పి నా బొటనవ్రేలి గుర్తు వేయించుకొన్నారు."

తల్లి నెమ్మదిగా అడిగింది:

"వ్రాసినదంతా సరిగ్గా వుందా?"

"సరో, తప్పో ఎవరికి తెలుసు? నాకు చదువు వ్రాత వచ్చివుంటే ఇలా అయ్యేదా? ఇంతకూ పొలమే వారిది అని వ్రాసిచ్చిన మీదట ఎలా వ్రాస్తే ఏమి చెప్పు...."

కొంచెంసేపు ఇద్దరూ మాట్లాడలేదు.

లోపలి గాయాన్ని కెలికినట్లయి తల్లి అడిగింది:

"జమీందారుగారు మంచివారని పూర్వం చెప్పారు కదా?"

తండ్రి ముఖంనుంచి వేడి నిట్టూర్పు బయలు వెడలింది.

"మహా నీచుడు. వడ్డీ కాక, ఈ వరకు కొబ్బరి బొండాలు, టెంకాయలు, కూరగాయలు, చెరుకు అంతా కప్పం చెల్లించే వాళ్ళం వాడికి. మనం ఎత్తడం.... ఊడ్పులు అయినమీదట, వాడి పొలంలో వెట్టి చాకిరి చేసేవాళ్ళం.... అది ఒక్కటీ వాడికి జ్ఞాపకం లేదు. ఆ దినం వాడి కూతురిపెళ్ళి వేళ మనం పెళ్ళి సుంకం చెల్లించడమే కాక గులాము చాకిరీ కూడ చేశాము...."

"వద్దండి.... అదంతా ఎందుకూంట చెప్పడం?"

"లోపల మంట లేచింది కల్యాణీ. ఏమి చేస్తే అది ఆరిపోతుందో?"

"మన తలవ్రాత. ఏమి చేయగలం? అలా భగవంతుడు వ్రాసి పెట్టాడు."

"దేవుడు అదేమిటి వ్రాశాడో?"

దీర్ఘ నిశ్వాసం. హృదయంలోని నొప్పి, నోరు తెరిచినప్పుడయ్యే నలత, వాటి నడుమ మాటలు.

ఆ దినమంతా ఎంతో అనుభవించి వచ్చాడు చిరుకండడు. ఇక్కడ ఆ అనుభవాన్నంతా వెక్కిరిస్తున్నట్లు పర్వతంవంటి దుఃఖమొకటి నోరు తెరిచింది.

....చిరుకండడు మెలకువతోనే వున్నాడు. దీపంలేదు. పడుకున్నారు నిజమే. కాని, అతని తల్లి దండ్రి నెమ్మదిగా మాటలు, కబుర్లు సాగిస్తూనే వున్నారు. గట్టిగా ఊపిరి వదలక, అటు ఇటు కదలక, అతడా మాటలు వింటూనే వున్నాడు.



# 6

మరునటి దినం చిరుకండడు అప్పును వెంటపెట్టుకొంటూ పొలానికి వచ్చినప్పుడు మధ్యాహ్నమయింది. స్నేహితుడిని ఉదయం నుండే ఎదురుచూస్తున్న అప్పుకు సంతోషమయింది.

అంతలోనే అప్పుతల్లి, భర్త కోసమూ, కొడుకు కోసమూ పయటిబువ్వ తెచ్చింది.

"ఎండలో ఎందుకమ్మా మోసుకువచ్చావు? కుట్టిని పంపితే సరిపోయేది కదా ?" అని అప్పు తల్లితో అన్నాడు.

ఈ విధంగా పయటన్నం తేవడంవల్ల తనకు కలిగే సుఖం ఎలాంటిదని ఈ పోరనికి ఎలా తెలియాలి ?– అని మనసులోనే అనుకొని తల్లి నవ్వింది. ఆమె చిరుకండని వైపు తిరిగి అడిగింది :

"మీ అమ్మ కులాసాయేనా రా ?"

చిరుకండడు "ఊఁ!" అన్నాడు.

"ముప్పూటా ఇంట్లోనే ఉంటుంది కదా .... మా యింటికి ఒకసారి వచ్చి పోరాదూ ?"

తన స్నేహితుని తల్లి విషయంలో తన తల్లి చూపిన ఆదరం చూసి అప్పుకు సంతృప్తి కలిగింది.

"చెబుతాను." అన్నాడు చిరుకండడు.

పిల్లవాని గొంతుక క్షీణించి ఉండడం చూచి తల్లి అడిగింది :

"ఎందుకు నీరసంగున్నావు ?"

"వాడు ఉండడమే అలాగ" అన్నాడు అప్పు మిత్రుని పక్షాన, అతనివైపు చూచి నవ్వుతూ.

ఎడ్లను నీడకు తోలి పేతకట్ట వాటిముందు విదిలించి, తాను గుంటలో దిగి కాళ్ళు చేతులు కడుక్కొని వచ్చాడు అప్పి తండ్రి. పనస చెట్టు కింద నిలుచున్న ముగ్గురిని అతడు ఒకమారు చూశాడు. తల్లి అక్కడే పయటన్నం మూట విప్పుతూ చిరుకండని పిలిచింది.

"రావోయ్! ఒక ముద్ద తిను."

"నాకు వద్దు" అన్నాడు చిరుకండడు తల అడ్డంగా ఊపుతూ.

"చాలులేవోయ్ పెద్దరికం, రా" అన్నాడు అప్పి తండ్రి అధికార ధ్వనితో.

"నాకు వద్దు. ఇంట్లో భోంచేసే వచ్చాను. ఇప్పుడే కదా భోజన మయింది."

"అలా అయితే వదులు" అన్నది తల్లి మళ్ళీ బలవంతం చేయడం ఇష్టంలేక.

అన్నం తింటూ తండ్రి చిరుకండనితో అన్నాడు:

"భోజనం అయిం తర్వాత ఇంకేమిటి? తిరగడానికి బయలు దేరడమే! మీ నాయన చాల చనువిచ్చాడు నీకు. కమా!"

చిరుకండడు ఏమీ అనలేదు. మౌనంగా నవ్వుతూ రాళ్ళతో ఆట్లాడుతూ పొలాలవైపు చూస్తూ కూర్చున్నాడు.

"చనువివ్వకుండా ఇంకేమిటిట? ఒక్కడే కొడుకు" అన్నది అప్పి తల్లి సాగదీస్తూ.

"ఇప్పుడిప్పుడు పోరగాళ్ళు పూరా చెడిపోతున్నారు." అని గొణిగి తండ్రి చిరుకండణ్ని చూస్తూ అడిగాడు:

"బీడీలు, గిడీలు తాగడం ప్రారంభించారేమర్రా?"

అప్పికు ముఖం ఎర్రబడింది.

"మేము బీడీలు గిడీలు తాగేవాళ్ళం కాము." అని అతడు కోపంతో సమాధానమిచ్చాడు. తాము ఎలాంటివారనేది అప్పుడే చెప్పివేయాలన్నంత కోపం వచ్చింది అతనికి.

తల్లి నవ్వింది.

"బీడీలు గిడీలు వాళ్ళెందుకు తాగుతారు? చెడ్డ అలవాటంతా పెద్ద వాళ్ళకే."



తాగే వ్యసనం వున్న తన్ను వ్యాఖ్యానించి భార్య అలా అన్నదని అతడు బిరిగుల్లతో చూచాడు ఆమెను. ఆమె ఎందుకలా అన్నదని తెలుసుకొని పిల్లవాళ్ళు ఒకరొన్నకరు చూచుకొని నవ్వారు.

తండ్రి, కొడుకు భోజనం ముగించి గుంట వద్దకు పోయి చేతులు, నోరు కడుక్కున్నారు. ఆ గుంట నుంచి పారుతున్న ఆ స్వచ్ఛమైన నీటినే తాగారు. తల్లి ఆ నీటిలోనే పయిటన్నం పాత్రను కడిగింది. భర్త భార్య తెచ్చిన తమలపాకులు, వక్కలు తీసుకొని వాటిలో కొంత ఆమెకూ ఇచ్చాడు.

చెట్టు క్రింద నీడ వున్నా బయట మాత్రం ఎండ భగ భగ మండిపోతున్నది.

భర్త భార్యతో అన్నాడు:

"నీవు వెళ్ళిక."

"హుఁ బయలుదేరుతాను."

కొడుకును తేరిపార జూసి అతడన్నాడు:

"అమ్మ జతలో నీవూ పోతావేంరా, అప్పి?"

చిరుకండని జతలో వెళ్ళిపోవడానికి అదొక అవకాశం. వెంటనే ఊఁ అను-అన్నది మనస్సు. అయితే, తండ్రిని ఒకనినే పని చేయడానికి వదలిపెట్టి వెళ్ళిపోవడం సరి కాదనిపించింది, అప్పికు.

"ఎడ్ల ఒళ్ళు కడిగి కొట్టానికి తోలుకొని పోవడం వద్దా?"

"నేను చూస్కుంటాను. వెళ్ళేట్టయితే వెళ్లు. అయితే ఎండలో తిరగడానికి బయల్దేరవద్దు. తెప్పున పడుకో."

అప్పి "హుఁ" అన్నాడు.

"చిరుకండణ్నికూడ పిలుచుకొని పో. పొద్దువాటారేవరకు ఇంట్లోనే వుండండి. వినపడిం దేమర్రా?"

అప్పిమరోమారు "హూఁ" అన్నాడు.

తల్లి కొడుకుతోను. కొడుకు నెచ్చెలితోను కలిసి గుడిసెకు బయలు దేరింది. అప్పి తండ్రి నీడలో నెమరువేస్తూ పడుకొన్న ఎడ్లవైపు దృష్టి సారించి, బుజమే తలగడగా చేసుకొని, విశ్రాంతి సుఖం అనుభవించాడు.

వెనుకటి రోజు తాము ఎక్కడ వెళ్ళినదీ ఇంట్లో చెప్పకుండా విజయవంతంగా అబద్ధం చెప్పిన సంగతిని చిరుకండనికి చెబుదామనే ఆత్రం అప్పుకు. అలాగే పిల్లవాడు అల్లరిచిల్లరవాడయి పోవచ్చునని తండ్రి అన్న మాటలను చిరుకండనికి చెప్పి ఇద్దరు ఒక్కుమ్మడిగా నవ్వాలనీ ఆశ. అయితే తల్లి వెంట వున్నందున అది సాధ్యం కాలేదు.

చిరుకండనిలో రోదిస్తున్న హృదయ మొకటుంది. దానిని తెరిచి ఆ బాధను అప్పుకు చూపితే అతనికి వూరట. అమ్మజతలో వెళ్ళమని తండ్రి అప్పుకు సూచించినపుడు చిరుకండనికి సంతోషమయింది, అయితే తమ యిష్టం వచ్చినట్లు మాట్లాడటానికి ఇపుడే అవకాశం లేదు.

మిత్రులు మౌనంగానే నడిచారు. ఆ మౌనం చూచి ఇద్దరికీ ఆశ్చర్యమయింది. ఒక సంవత్సరం ముందు — ఎందుకు, కొన్ని నెలల ముందుకూడ — ఇలా జరిగేది కాదు. ఒక దానినుంచి మరొకదానికి కుప్పిస్తూ, ఒకదాని కొకటి సంబంధంలేని నూరారు విషయాలపై రోజుల తరబడి మాట్లాడడంలో వారు సమర్థులయి వుండేవారు. అయితే, ఇప్పుడు అలాటి మాటలూ, కథలూ కష్టం. ఏ విషయం తీసుకొన్నా మాటలు మాస్టరుకు చేరి గంభీరాలోచనగా మారిపోయేవి. అయితే ఆ విషయమై ఎక్కువ మాటలాడాలనేది వారికి తెలియదు. అంతటి తెలివితేటలు వారికి లేవు.

ఒకొరొక్కరే వెళ్ళదగిన కాలిబాటలో తన వెంట వస్తున్న పిల్లవాళ్ళవైపు అప్పుతల్లి ఒక్కమారు చూచి అడిగింది :

"ఎందుకు వూరికే వున్నారు? ఎండ తట్టుకోడానికి కావడం లేదేమిటి?"

"లేదమ్మా. మాకు ఇలాటి ఎండ ఏమి లెక్క! కాదట్రా, చిరుకండా?" అని అప్పు స్నేహితుని చూచి కన్నుగీటి అన్నాడు.

చివరకు వస్తున్న చిరుకండడు అన్నాడు:

"ఈ ఎండలో వుండడం నాల్గు నిమిషాలు. చూడండి కావలిస్తే, ఇక కొంచెంసేపట్లోనే చల్లని గాలి వీస్తుంది."



ఆమె తామిద్దరి మాటను కాదనలేదని పిల్లవాళ్ళకు సంతోషమయింది. ఇల్లు చేరిన కొంచెం సేపటికి అక్కడి నుంచి బయటపడడం కష్టం కాదని వారికి స్పష్టమయింది.

ఎదుటి నుంచి ఎవరో వచ్చారని ముగ్గురూ పక్కకు జరిగి, వచ్చినవారు దాటిపోవడానికి దారి ఇచ్చారు. అలా దాటి వెళ్ళినవారు రైతులే. అయితే ముఖాలు అపరిచితాలు.

"ఎవరు చిరుకండా వెళ్ళినవారు?" అని అడిగాడు అప్పు.

"తెలీలేదోయ్. మన పల్లెవారేమో కాదు. పక్కపల్లె వారో ఏమో!"

"చర్పుత్తూరు రైలు స్టేషనుకు వెళుతుండవచ్చు కదూ?"

"వారి చేతుల్లోని మూట చూస్తే అలాగే అనిపిస్తుంది. ఊరికి బయలుదేరిన వారిలా ఉన్నారు."

పిల్లవాళ్ళు ఈ విధంగా సహేతుకంగా, తర్కబద్ధంగా ఊహాపోహలు జరుపడం చూచి తల్లికి స్వారస్య మనిపించింది.

అప్పు తల్లిని అడిగాడు :

"చీకట్లో ఇలాటి దారిని నడవడం కష్టం కదూ అమ్మా? జారి పడిపోవడమే! పాములు వేరే."

తల్లి ఆ మాటలు ఉపయోగించుకొని అన్నది :

"అందుకే అనడం, పిల్లవాళ్ళు చీకటయిన మీదట వెలుపలికి పోరాదు అని."

"పిల్లవాళ్ళు, పెద్దవాళ్ళు అంతా ఒకటే అమ్మా. చీకట్లో ఎవరైనా అంతే. నన్నడిగితే ఒక్కొక్క ఇంటికీ ఒక్కొక్క చిన్న చేతి బ్యాటరీ ఉండాలి. కాదూ చిరుకండా?"

రాత్రి జరిగే సాహస సంచారాల కోసం అప్పు బ్యాటరీ కావాలంటున్నాడని గ్రహించి చిరుకండడన్నాడు :

"హూం. బ్యాటరీ వుంటే చాలా ప్రయోజనం."

"అలాగే ఒక్కొక్కరి చేతులో ఒక్కొక్క మంచి బెత్తమూ వుండాలి కదూ."

"హూం!"

ఇప్పుడు అప్పు మాటల ధోరణిని తల్లివైపు తిప్పాడు.

"ఈసారి నీలేశ్వరం జాతరలో తప్పక నాకొక బ్యాటరీ కొనివ్వాలి."

తల్లి నవ్వింది.

"అదేమయినా ఒక అణాకు వస్తుందేమిట్రా ?"

అప్పుకు కోపం వచ్చింది. వాడన్నాడు :

"ఒకణాకు వచ్చేది కొవ్వొత్తి."

"మంచిదానికి ఒక రూపాయన్నా అవుతుంది. మాస్టరువద్ద ఉందే-దానికి అంతే ఇచ్చారట...."

—చిరుకండడు ఈ సమాచారం అందించాడు. ఒక్కసారి కొన్న తర్వాత బ్యాటరీ సెల్సు కోసం వెచ్చించవలసి వుంటుందని అనబోయాడు. కాని, అలా అంటే అంత వెచ్చంతో వున్నదాన్ని అప్పు తల్లి ఇప్పించజాలదని ఆ సంగతి చెప్పలేదు.

తల్లి అన్నది :

"నా దగ్గిర డబ్బెక్కడిది ? మీ నాన్న నడుగు."

అప్పు నెమ్మదిగా తల్లి ముఖస్తుతి ప్రారంభించాడు :

"బాగా చెప్పావు. ఆయన నాకు ఎప్పుడయినా, ఏదయినా కొని పెట్టాడా ? నువ్వే చెప్పు."

"మీ అవ్వనడుగు అలా అయితే."

"సరి. సరి. ఆమెను అడిగితే, ఆ వస్తువు దొరికినట్లే!"

"ఇదెక్కడి గోడు పోసుకుంటున్నావు కదరా. నా దగ్గర డబ్బు లేదు."

"అలా అయితే నేను కాసరగోడ్‌కో, మంగళూరుకో బయల్దేరి పోయి ఏదైనా కూలి నాలి చేసి సంపాదించి, బ్యాటరీ కొనుక్కొని ఇంటికి వస్తాను."

చిరుకండడు నవ్వుతూ అన్నాడు :

"ఒకటే తెస్తావా ? నాకూ ఒకటి తెస్తే ఏమవుతుందట ?

"చాలు చాలు కబుర్లు !" అన్నది తల్లి గొంతు పెంచి.

అప్పు అలా వదలిపెట్టేవాడు కాదు.

"అలా అయితే ఇప్పిస్తాను అను."

"జాతర రానీ చూద్దాము."



"చూడడ మేమిటట ?"

"కానీవయ్యా. డబ్బుంటే కొనిస్తాను."

"ఓహో హో ! డబ్బు వుండనే వుంటుంది. నాకు తెలీదా ? జాతర ఖర్చుకని నాన్న నీ చేతికి డబ్బు యివ్వకుండా వుంటారా ?"

తల్లి మళ్ళీ మాట్లాడకపోయినా, ఒక బ్యాటరీ రావడం ఖండితమని అప్పుకు సంతోషమయింది.

వాళ్ళు నడిచి వెళ్ళుతుండగా, ఒకమారు చల్లనిగాలి వీచింది.

"చూచారా ? అప్పుడే చెప్పలేదూ నేను."

—ముందుగానే నిజం చెప్పిన సంతృప్తిని చిరుకండడు వ్యక్తం చేశాడు.

"ఇప్పుడు నదిలో స్నానం చేయాలి కదూ చిరుకండా ?"

ఇది అప్పు నడిపిన మరొక దాడి. తల్లి మరొకమారు ఓడిపోయేట్టు చేసే ప్రయత్నం.

అయితే ఈసారి ఆమె తగ్గేట్టులేదు. గద్దించి అన్నది :

"నీవేమైనా నదివైపు వెళ్ళావా ఈరోజు, మీ నాన్నకు చెప్పి మీ ఇద్దరికీ శాస్తి చేయిస్తాను."

అప్పుకు నవ్వు వచ్చింది.

"వాణ్ణెందుకు నాతో కలుపుతావే ? వాడు నదిలో స్నానం చేయడమే లేదు. చేపలు కరుస్తాయని వాడికి భయం....కాదేమిరా ?"

చిరుకండకు ముందు నడుస్తున్న అప్పు వీపును తన వ్రేలితో పొడిచాడే కాని మాట్లాడలేదు.

తల్లే విసుగుతో అన్నది :

"అదెంత మాట్లాడుతావో,అదేమి మాట్లాడుతావో....ఆ పరమాత్మునికే ఎరుక!"

కొన్ని అడుగులలో వారి గుడిసె దగ్గర పడింది. ముంగిట్లో నిలుచున్న చిన్నవాడు - కుట్టి - లోపలున్న అవ్వకు వినపడనీ అని గట్టిగా అరిచాడు:

"అమ్మ వచ్చింది. అప్పు వచ్చాడు."

"వీళ్ళంతా త్రికరపురం నుంచి నిన్ననే వచ్చేశారు."

"అవ్వ ఎప్పుడు వచ్చారు?" అని చిరుకండని నుంచి ప్రశ్న రావడానికి ముందే అప్పు అలా అన్నాడు.

త్రికరపురంలో ఉన్నప్పటి సంగతులు వినే ఆత్రం అప్పుకు ఉందని అవ్వకు తెలుసు. కబుర్లాడడానికి ఆమెకు మరొక ప్రాణి అవసరం ఉంది. అతడు త్వరగా ఇంటికి రావడం ఆమెకు సంతోషం కలిగించింది. అయితే, అప్పుకు అలా కాదు. నిన్నరాత్రి ఆ విధంగా అవ్వతో కబుర్లాడుదామని అనిపించినా, ఇప్పుడు తీరికలేదు. ఎప్పుడు చిరుకండనితోపాటు ఇల్లు వదలిపోయేను, ఎప్పుడు అతనితో తమదే అయిన ముఖ్య విషయానికి సంబంధించి మాట్లాడేను – అని అతడు తటపట లాడుతున్నాడు.

చిరుకండడు, అప్పు, అవ్వనూ చూచాడు, కుట్టినీ చూచాడు. మొదటిసారి చూస్తున్నాను అన్నట్టుగా ఆ యింటినీ చూచాడు. తామూ రైతులు, అప్పువాళ్ళూ రైతులు. కాని, తమ ఎడ్లు చేయి వదలి పోయాయి. వీళ్ళకొక జత ఎడ్లున్నాయి. తమ భూమి జమీందారుగారికి భుక్తమయింది. వీళ్ళకు తమకున్నంతో, లేక అంతకన్నా కొంచెం పెద్దదో స్వంత పొలముంది - ఇంకా స్వంతంగానే మిగిలిన పొలం. ఈ యిల్లూ అంతే. తమ యింటికన్నా కొంచెం మేలు. అలాచూస్తే, కడుబీదలైన మరి కొందరు రైతుల గుడిసెల కన్నా ఈ గుడిసెలే మెరుగు. వీటికన్నా కొంచెం పైమట్టం ఇళ్లు వేరే ఉన్నవి. చాలా పైమట్టం ఇండ్లంటే ఆ పల్లెలో వున్న ఇద్దరు బలాఢ్యులు, ధనాఢ్యులు అయిన జమీందార్ల ఇళ్ళు.

అప్పు అవ్వ అడిగింది:

"అదేమిటి? యోచిస్తూ నిలుచున్నావు చిరుకండడూ ?"

చిరుకండడు కష్టంతో చిరునవ్వు నవ్వాడు.

"ఏమీ లేదవ్వా!"

ఇంట్లో ఏమైనా తినడానికి ఉందేమో అని అప్పు వెళ్ళిచూచి, లేదనడం ధ్రువపరచుకొని, మళ్ళీ వెలుపలికి వస్తూ అన్నాడు:

"ఇదిగో: చిరుకండా, మన చందూ బీడీ అంగడి పెట్టాడటోయ్!"

"ఏ చందూ?"

"త్రిపురకరం చందు. ఆ రోజు చెప్పలేదూ నీకు?"



"ఓహో! వాడా:"

"హూఁ. మనమిద్దరం ఒకసారి అక్కడికి వెళ్ళివద్దామా?"

పిల్లల సంభాషణను పూర్తిగా వినని అవ్వ అడిగింది వెంటనే:

"ఎక్కడికిరా వెళ్ళడం?"

అవ్వ కోప్పడుతుందని తెలుసుకున్న అప్పు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు:

"త్రికరపురానికి."

"ఓరి వెధవల్లారా? అంత ధైర్యం వచ్చిందేమ్రా మీకు? ఈ పల్లె విడిచి వెలుపల అడుగుపెట్టండి, మిమ్మల్ని బలివేస్తాను?"

"వెళ్ళినప్పుడు నిన్నూ పిలుచుకొని పోతానులే అవ్వా."

"ముసలమ్మను గేలి చేస్తాడు. థూ నీ...."

ఈ సంభాషణంతా విని సంతోష పడేట్టున్నా చిరుకండనికి తన యింటి జ్ఞాపకం వచ్చి మొగం వాడిపోయింది.

"నాకు పోద్దుపోయింది అప్పూ! ఇంటికి వెళ్లాలి. కిరసనాయిలు అయిపోయింది. నిన్న తేవడానికి కాలేదు రాత్రి చీకట్లోనే వున్నాము."

స్నేహితుడు వెళ్ళిపోయే మాట ఎత్తాడని అప్పుకు వేసట కలిగింది. అయితే నిమిషమున్నా విరామంలేక గడిపిన నిన్నటి ప్రస్తావన వచ్చిందని సంతోష మయింది. ఇంటినుంచి తప్పించుకోడానికి యిదే సందని తల్లితో అన్నాడు:

"అమ్మా! చిరుకండని జతతో కొంచం దూరం వెళ్ళి వస్తాను."

కొడుకును ఆపి వుంచటం దుస్సాధ్యమని తెలిసిన తల్లి తన కర్తవ్యం తాను నిర్వహించాలని అన్నది:

"నాన్న ఏమన్నారు నీతో ? ఎండలో ఎక్కడికీ వెళ్ళకండి, ఇంట్లోనే పడుకోండి— అని కదా అన్నారు."

"పోమ్మా.... పగటి పొద్దు ఎవరు పడుకొంటారు? రాత్రి నిద్ర రావాలా? వద్దా?"

"ఇష్టంవచ్చింది చేసుకో. ఆయననుంచి తిట్లు తినేది, కొట్లు తినేదీ నీవేగా?"

"తిరగడానికి వెళ్ళానని నాన్నకు చెప్పనేవద్దు. ఇప్పుడే తిరిగి వచ్చేస్తా."

"హూ. వెళ్ళవయ్యా."

తల్లి అలా అంటుండగానే వెలుపలినుంచి అవ్వ అడిగింది.

"అదేమిటి నేర్పిస్తున్నావురా తల్లికి?"

అప్పు నవ్వుతూ వెలుపలికి వచ్చి అన్నాడు:

"త్వరగా వస్తానవ్వా.... త్రికరపురం సంగతులన్నీ నీవు చెప్పాలి."

అవ్వ నిస్సహాయురాలై పొద్దుపోవడానికి ఇంటోవున్న కుట్టి ఒక్కడే గతి అని, వాడిని తనవైపు లాక్కొంది.

........వీధిలోకి వచ్చిన తరువాత అప్పు అన్నాడు:

"నదివైపుకు వెళ్ళుదామటరా?"

తల్లి, తండ్రి వెళ్ళరాదు అన్నప్పటికీ, అతని మనస్సు ఆ వైపే పారుతూ ఉండినది. అయితే చిరుకండడు ఏలాటి ఉత్సాహమూ చూపక అన్నాడు:

"వద్దురా అప్పు! నాకు చాల బేజారుగా వుంది. ఇక్కడే కొంత సేపు కూర్చుని మాట్లాడుకుందాము."

తన స్నేహితునికి ఏమిటో అయిందని అప్పు శంకించాడు. కాని. ఇలాటిదేనని ఊహించలేకపోయాడు. మనస్సు కొత్త ఆలోచనలతో నిండినప్పుడు ఉత్సాహంతో వుండాలేగాని, చప్పబడి పోవటం సరికాదని అన్నది అతని అంతరాత్మ. చిరుకండని బాధించేది ఏమైవుంటుందని అతనికి చింత ఏర్పడింది.

ఇద్దరూ దగ్గరలో వున్న గుట్టవైపు నడిచారు. ఆ గుట్ట అడివారంలో అక్కడొకటి ఇక్కడొకటి ముంత మామిడి చెట్లున్నాయి. ఆ చెట్లన్నీ పండి కళకళ లాడుతూ నిలబడ్డాయి.

అలాటి ఒక చెట్టుకింద వాళ్ళు కూర్చున్నారు. రాలిన ఆకులతో నేల నిండింది. మనుష్యులు వచ్చారని అదిరిపోయిన తొండ ఒకటి ఆకుల మధ్యనుంచి సద్దుచేస్తూ దూరంగా వెళ్లి అక్కడేవున్న ఒక అడవి చెట్ల పొదలో దూరింది. అప్పు చెట్టు సమీపంలోనే కూర్చుని కాండంఒక పక్క



నుంచి జారి గట్టిపడిన బంకను చూశాడు. దానిని తాకుతూ తీద్దామని మనస్సయినా, చిరుకండని చూచి ఊరికే వుండిపోయాడు. మరొక రోజయితే ఆ బంకను తీయడం అతని పద్ధతి. అలా తీసిపెట్టి పాఠశాల వాడకం కోసమని మాస్టరుకు నెలకొకసారి అందజేసేవాడు.

చిరుకండనికి ఈ దినం చుట్టుపట్ల దేనిపైన ఆసక్తి లేదు. అతడు ఒక పెద్ద రాలిన ఆకుమీద వ్రేలితో గీతలు పెడుతూ కూర్చున్నాడు.

అప్పు మాటలు సాగించాడు:

"నిన్న ఆలస్యమయిందని ఇట్లోం ఏమైనాఅన్నారాచిరుకండా?"

"లేదు"

చిరుకండడు అంత మాత్రమే అన్నాడే గాని ముందుకు సాగలేదు.

"మరేమయింది?"

ఈ ప్రశ్నకు సమాధానం తోసుకొని వచ్చింది:

"మా పొలం పోయింది అప్పు...."

అప్పుకు ఆ మాట నమ్మడమే కష్టమని తోచింది. వాడు నోరు తెరచి, రెప్ప వేయకుండా మిత్రుణ్ని చూచాడు.

"నిజమా! "

"హూం! మానాన్న ఒక వేయిరూపాయిల అప్పు చేశారని చెప్పానుగదా!"

"ఔను! ఔను!"

"దానికి బదులుగా జమీందారుగారు పొలం లాక్కున్నారు. ఇప్పుడు ఆయన దొర, మేము పాలేళ్ళం."

అప్పు అనుకొన్నాడు. "ఎంత అన్యాయం?"

వాడి నాడులలో రక్తం వేగంగా పారింది. అతడు చెట్టు మొదలుకు ఒరిగి చిరాకుతో అటూ యిటూ కదులుతూ అన్నాడు:

"ఈ పల్లెలోని యిద్దరు జమీందార్లు పాలించే పాళెగార్లయిపోయారు. వాళ్ళు రాజులు....మనం ప్రజలం. హుం!"

చిరుకండడు నిదానంగా అన్నాడు:

"ఇకమీద ఎప్పుడు బడితే అప్పుడు గుత్త సరిగా కట్టలేదనో, మరొక నెపమో చెప్పి జమీందారుగారు మమ్మల్ని వెలుపలికి గెంటి

వేయవచ్చు. ఆ మీదట మాది అనేదేమీ మిగలదు. ఉండడానికి జాగా లేక మేము ఊరు విడువాలి."

నిజమైన సంగతిని చిరుకండడు చెప్పినా, అప్పుకు అది ఒప్పితం కాలేదు.

"నీవు ఊరికే ఉండు. ఎవళ్ళూ ఊరు వదలరు!"

"నీకు తెలియదు అప్పూ! మాస్టరు చెప్పలేదా? అలాగే గదూ నడుస్తున్నది? రైతు పొలం పోగొట్టుకొని బీదవాడై పోతాడు. బికారి అవుతాడు. ఆ మీదట శరీర శ్రమ తప్పిస్తే అతనిలో ఏమీ మిగులదు. పట్టణానికో, మరొక చోటుకో కూలిగా పోయి ఆ శ్రమనే అతడు అమ్ముకుంటాడు."

"అది సరే అనుకో. అయితే ఎప్పుడూ అలాగే ఉంటుందా? పూర్వం ఒకనాడు అన్యాయం జరిగిన వారికంతా న్యాయం కలుగుతుందనీ మాస్టరు చెప్పలేదా?"

చిరుకండడు ఊరికే ఉండిపోయాడు. అలా మాస్టరు చెప్పారు. నిజమే! అయితే మరొక మాట కూడా ఆయన అన్నారు: జనం ఒక్కటయితేనే అది సాధ్యం; దానికోసం పోరాటం కావాలి; ఆ పోరాటంతో రైతులు కష్టం, నష్టం అనుభవించాలి; దేశాన్ని తొక్కి నిలబడిన పరకీయ శక్తి వెన్నుముకను విరవాలి; అటు తర్వాత ఆ శక్తి ఆధార స్తంభాలను పీకి పారవేయాలి....

ఆ మాటలన్నీ చిరుకండని జ్ఞాపకానికి వచ్చాయి. అప్పుకూ అది తెలుసు. అయినా అతడు ఉద్వేగంతో మాట్లాడాడు.

మిత్రుని మౌనానికి అప్పు మనస్సు తటపటలాడింది. తాను ఏమి చెబితే, ఏమి చేస్తే చిరుకండనికి మనస్సమాధాన మవుతుందో యోచన చేశాడు. ఆ యోచన స్వాభావికంగానే మాస్టరును జ్ఞాపక పరిచింది. అతడు అడిగాడు:

"మాస్టరు వచ్చారా ఊరికి?"

"హాఁ."

"కలుసుకున్నావా?"

"హాఁ. ఉదయం వెళ్ళాను."



వెంటనే మరొక విషయం జ్ఞాపకం వచ్చి అప్పు అడిగాడు :

"నిన్న ఆయనతోపాటు చర్వత్తూరుకు పోయామని చెప్పిందీ తెలియ జేశావా?"

"హాఁ"

ఆ జవాబుతో మనస్సు కుదుటబడిన మీదట ప్రస్తుత సమస్య అప్పును బాధపెట్టింది.

"పొలం పోయిన సంగతీ చెప్పావంట?"

"హాఁ. సంగ్రహంగా చెప్పాను. బడివేళయింది."

"ఏమన్నారు?"

"ఇంతవరకు ఇతరులకు జరుగుతున్న దానిని మీరు చూచేవాళ్ళు. ఇప్పుడు మీకే అయింది; కష్టపడకండి-అన్నారు."

"అంతేనా!"

"మరేమిటోయ్ వారు చెప్పాలి? రాత్రి ఇంటికి వస్తాను అన్నారు."

మాస్టరు చిరుకండని ఇంటికి వచ్చినప్పుడు తానూ అక్కడే వుండాలని అప్పుకు తోచింది.

"నేనూ రానా?"

"రా, అయితే మాస్టరు రావడం ఆలస్యం కావచ్చు. జమీందారు గారి మనుష్యుల కనులు కప్పి రావద్దూ ఆయన?"

"అది నిజమే మరి. ఆలస్యమయితే ఈ రోజు మా నాన్న ఊరికే వుండరు."

అప్పు చెట్టు కాండానికి ఆనుకొని నీలాకాశంలో తలకిందుగా వ్రేలాడుతున్న తెల్ల మేఘం చూచాడు. మళ్ళీ అతని దృష్టి మౌనంగా నేలను చూస్తూ కూచున్న చిరుకండనివైపు తిరిగింది. పెద్ద నల్లచీమ ఒకటి చొక్కా ఎడమ భుజం మీదనుంచి చిరుకండని మెడవైపు పాకుతున్నది. అప్పు నిటారుగా కూర్చుని, ఆ చీమవైపు చేయి చాచి, దాన్ని యెత్తాడు. చంపటానికి మనసురాక దూరంగా విసిరేశాడు.

దానిని చూచీ చూడనట్టున్న చిరుకండడు సరిగా కూచుని ఒళ్ళు విరుచుకొని, దీర్ఘంగా నిట్టూర్చాడు.

అప్పుకు యింత చెప్పుకున్న తర్వాత చిరుకండనికి ఒక రీతిగా

మనస్సు కుదుటపడింది....తను దుకాణానికి వెళ్ళి కిరసనాయిలు తెస్తానని తల్లి ఎదురు చూస్తుందన్న విషయం మళ్ళీ జ్ఞాపకానికి వచ్చి చిరుకందడు లేచి నిలుచున్నాడు.

"నేనింక వెళతానోయ్!"

అప్పు కూడా లేచి నిలబడి తన వీపునకు అంటుకున్న ఎండుటాకులను చేత్తో తీసేసుకొన్నాడు.

"హూఁ. నేనూ ఇంటికి పోతాను."

వారిద్దరూ మౌనంగా కొంతదూరం నడిచిన తర్వాత కాలిబాటలు రెండుగా చీలాయి, అక్కడ విడిపోవడానికి ముందు అప్పు అడిగాడు:

"రేపు ఎక్కడ కనబడతావు ?"

"నేటిలాగ పొలానికి వస్తాను."

"హూఁ. రా."

అటు తర్వాత ఇద్దరూ వేరయిపోయి ముందుకు నడిచారు.

ఆ రోజంతా అంతవరకు ఉత్సాహంతోనే వున్నాడు అప్పు. అయితే చిరుకందనితో మాట్లాడి అతనిని వదలిన తర్వాత, ఎక్కడలేని వేసట ఆవరించింది, శుభ్రమయిన ఒక సాయంకాలాన్ని కారు మేఘాలు ఒక్కుమ్మడిగా కమ్ముకొని వచ్చినట్టు. నడుస్తున్నప్పుడు దారికి అడ్డంగా వున్న పొదల గుబుర్ల వైపు చేతులు చాచుతూ, చేతికి చిక్కిన తీగలను, ఆకులను జొంపాలను లాగిపారేస్తూ అతడు ముందుకు వెళ్ళాడు.

చీకటి పడడానికి మరికొంత సేపు వుంది. అప్పుడే గుడిసెకు పోయి అతడు చేయవలసిందేమీ లేదు. అక్కడ అవ్వతో గప్పాలు కొడుతూ కూర్చోడానికి ఇప్పుడు అతనికి మనసు కాలేదు. మళ్ళీ పొలానికి పోదామా ? ఎడ్లను ఏటికి తోలుదామా ? – అనుకొన్నా, కాళ్ళు మాత్రం గుర్తు, గురిలేక నడిచాయి.

అతడు చర్వత్తూరికి పోయే దారిలో పెక్కు పొలాలను చుట్టి వచ్చి, నదిఒడ్డు చేరి, దాని పొడవునా పూర్వాభిముఖంగా నడిచాడు. ఎదురుగా ఎవరో రావడం కనిపించింది. వారిని కలుసుకొనే ఇష్టంలేక అప్పు నది గట్టు వదలి మళ్ళీ పొలాల గట్టెక్కాడు.

పాదాల కదలికకు అనుగుణంగానే ఆలోచనలూ గుర్తు, గురిలేక



సాగాయి. త్రిపురకరం చందు, చిరుకందని కుటుంబానికి పట్టిన దురవస్థ, చిన్ననాటి ఒక చేదు తలపు, ఎన్నో విషయాలు తెలిసిన మాస్టరు. ఆయనకన్నా ఎక్కువ తెలివైన పండితులు – పండితుల గంభీర ధ్వని? 'ఈ మన్ను ఎవరిది? మనది. ఇది మన తల్లి నేల. ఈ దేశం ఎవరిది? మనది. ఇది మన రాజ్యం. పొలం ఎవరిది? దున్నేవాడిది. దున్నేవాడే భూమికి యజమాని—ఔనా, కాదా ?"

ఔను, సందేహం లేదు. అప్పుకు అదంతా తెలుసు.

అయితే చిరుకందని తండ్రి పొలం పోగొట్టుకున్నాడు. రేపు ఆ కుటుంబాన్ని జమీందారుగారు పొలం విడిపించి తరిమివేయవచ్చు. చిరుకందని తల్లి తండ్రీ కుమారునితోపాటు బికారులై ఊరు వదలిపెట్టవలసి రావచ్చు. విప్లవంలో ఇప్పుడే చేరిన చిరుకందనికి ఇలా కావడం అంటే ? ఇది సరేనా ? ఇది న్యాయమేనా ?

ఇది సరికాదు—న్యాయం కాదు. అని మనస్సు రోదిస్తూ సమాధానమిస్తున్నది. అయితే ఆ సమాధానం వెనుక నిస్సహాయత ముఖం వేలవేసుకొని కూర్చుంది.

....సూర్యుడు అస్తమించి చీకటి అయినప్పుడు అప్పు ఇల్లు చేరాడు.

అతని తండ్రి ఇంకా రాలేదు. చిమ్నీ దీపం ఎదుట అప్పు తమ్ముడు మోకాళ్ళు భూమికి ఆనించి నేలమీదికి ఒరిగి బడి పాఠాలు చదువుతున్నాడు. అతన్ని ఇబ్బంది పెడుతున్నాడు చిన్నవాడు కుట్టి.

తమ్మునితో అప్పు అన్నాడు :

"మాస్టరు ఏమయినా అడిగారా, రా ?"

తమ్ముడు మొగమెత్తి అన్నను ఒకమారు చూసి. మళ్ళీ పుస్తకంలోనే చూపు నాటి చెప్పాడు :

"ఎప్పుడు వచ్చానని అడిగారు."

మరేది మాస్టరు అడిగేట్లు లేదు; తమ్ముడికి ఆయన ఏమీ చెప్పేట్టు లేదు.

అప్పు తల్లి వెలుపల ముంగిట్లో ఉన్న నీళ్ళుకాచే పొయ్యిమీది మట్టిబానకు నీళ్ళు పోసి, నిప్పు చేసింది. అది పొలం నుంచి వచ్చే భర్త స్నానం కోసం సంసిద్ధత.

అప్పు ముంగిట్లో చొక్కా తీసి గాలికి కూర్చున్నాడు. పొయ్యిలో కాలుతున్న ఎండుటాకుల మంటల కాంతి అతని ముఖంమీద, రొమ్ము మీద నాట్యం చేసింది.

అవ్వ మనమణ్ని చూచి అడిగింది :

"అదేమిట్రా అలా కూర్చున్నావు ముసలయ్యలాగ? నీకు ఏమిటిరా చింత ?"

అప్పు మాట్లాడలేదు.

తల్లి కొడుకు వైపు చూచి తగ్గు గొంతుకతో అడిగింది :

"ఒంట్లో బాగులేదా అప్పూ ?"

అప్పు ముఖం ఎత్తి కాతరత కనిపించే కళ్ళతో చూస్తున్న తల్లిని చూచి అన్నాడు :

"బాగానే ఉన్నానమ్మా."

........ఎడ్ల మెడలోని గంటల చప్పుడు వినబడింది. దాని వెంటనే కాడి మెడమీద మోసుకొని అప్పు తండ్రి వచ్చాడు. తల్లి ఎడ్లను గుడిసె వెనుక వున్న కొట్టంలో కట్టివేసింది. తండ్రి కాడిని తగిలించి "ఉస్" అని నిట్టూర్చి నేలమీద కూర్చున్నాడు.

ఆలస్యంగా వచ్చిన తండ్రి తాగుడు కోసం మళ్ళీ వెళ్ళిపోయే లక్షణం కనిపించలేదు. తండ్రినే చూస్తూ అప్పు చిరుకండని ఇంటి వాళ్ళకయిన అన్యాయాన్ని అతనికి చెప్పాలి – అనుకున్నాడు. అలా తోచిందే కాని మాట పెగల్లేదు.

చిన్న వాళ్ళిద్దరూ ఎప్పటిలాగే త్వరగా భోజనం చేసి, నిద్ర పోయారు. అప్పు తండ్రితోపాటు స్నానం చేశాడు. తర్వాత వాళ్ళందరూ గంజి తాగడానికి కూర్చున్నారు.

అప్పుడు తండ్రి ఒక ప్రశ్న వేశాడు :

"చిరుకండడు చీకటి పడేవరకు ఇక్కడే ఉన్నాడేమిరా ?"

సహజంగా కనిపించిన ఆ ప్రశ్నకు అప్పు సమాధానమిచ్చాడు :

"కొంచెంసేపు ఉండి ఇంటికి పోయాడు."

తల్లి మరొకమారు గంజి వడ్డించడానికి వచ్చినప్పుడు వద్దు అంటూ తండ్రి చేయి అడ్డంగా పెడుతూ అన్నాడు :



"చిరుకండని తండ్రి పొలం పోగొట్టుకున్నాడు."

అప్పు తల వంచి గంజినే చూస్తూ పెద్దల మాటలు వింటున్నాడు.

"ఔనా, పాపం !"

అది తల్లి ఉద్గారం (ఆవేదన). దానితోపాటే అవ్వ గొంతుక :

"ఎవరు ? జమీందారుగారే పట్టుకొన్నారా ?"

"హూఁ. అప్పు ఉంది కదూ."

ఇంతమాత్రం చెప్పి తండ్రి మౌనంగా వున్న కొడుకు వైపు చూశాడు.

అతని ఆ పమిత్రుని యింటికి సంబంధించి మాటలాడుతున్నా కదలకుండా కూర్చోవడం చూచి తండ్రికి ఆశ్చర్య మయింది. అతడు అడిగాడు :

"ఏమిటని తెలిసిందా రా ?"

తగ్గు స్వరంతో అప్పు జవాబిచ్చాడు :

"హూఁ. అప్పుడే తెలిసింది."

"అప్పుడే ఎవరు చెప్పారు ?"

"చిరుకండడు మధ్యాహ్నమే చెప్పాడు."

"చిరుకండడా...."

తండ్రి అంతకే ఆపాడు. పిల్లవాళ్ళు ఇలాటి విషయాలన్నిటినీ చర్చించారన్న సంగతి అతనికి ఆశ్చర్యం కలిగించింది.

తల్లి అడిగింది :

"మరి చెప్పనే లేదు కదరా ?"

అప్పు చెప్పలేదు. అయితే, వేడెసీళ్ళ పొయ్యి మంటల వెలుగు ముందు దిగాలుపడి దుఃఖంతో కూర్చున్న కొడుకు దృశ్యం తల్లి మనస్సు ముందు కదిలింది.

మాటలాడలేదు అప్పు....ఇంట్లో చెప్పని సంగతులు ఎన్నిలేవు అని అతని మనస్సు లోపలి నుంచే గొణిగింది.

తండ్రి ఆలోచించి, జవాబు లేక ఓడిపోయినట్లు తల ఊపి భోజనం ముగించాడు.

# 7

కాలం గడిచింది. వేసవి ముగిసి వర్షాకాలం వచ్చింది. మామిడిపళ్ళు మాయమై వట్టి ముట్టెలు మాత్రం మిగిలాయి. అవి తడిసి పచ్చి మంటితో చెర్లాటలాడి మొలిచాయి. వర్షాకాలపు తేజస్విని నిండు చూలాలులాగ సంతోషంతో ప్రవహించింది. చిన్న చిన్న పడవలన్నీ భయంతో గట్టు మీదికి ఎక్కాయి. సాహసవంతులు నదీ ప్రవాహంతో కొట్టుకొని వచ్చే చెట్ల కొమ్మలను పట్టుకొని పోగు చేస్తున్నారు.

అప్పు ఈరీతి సంపాదనలో పది టెంకాయలను ప్రవాహం నుంచి గట్టుకు చేర్చి ఇంటికి తెచ్చాడు.

"ప్రాణభయం లేదేమిరా నీకు? నీ యిల్లు పాడుగాను! ఈ టెంకాయలూ వద్దు, ఏమీ వద్దు. నీ తండ్రికి చెప్పి పూజ చేయిస్తా ఈ పొద్దు" అని అతని తల్లి గోడు పోసుకుంటూ గద్దించినది మాత్రమే మిగిలింది. అప్పు నవ్వాడు. వాడూ అంతే; వాని సమ వయస్కులూ అంతే.

ఆ సమయంలోనే మాస్టరు సాయంకాలపు పాఠశాలలో పత్రిక చదివి చెప్పే పరిపాటిని ఆరంభించారు. అది ఆయన చర్వత్తూరు రైలు స్టేషను నుంచి దినమూ తెప్పిస్తున్న పత్రిక. మొదట మొదట ఎవరికీ ఆసక్తి వుండలేదు. అయితే నడుమ ఏవో కథలు, ఏవో గప్పాలూ సాగుతూ, పత్రికాపఠనం కాలక్షేపానికొక సాధన మయింది. పని లేనప్పుడు రైతులు బీడీ తాగుతూనూ, తాంబూలం నములుతూనూ బడి అరుగుమీద కూర్చొని మాస్టరు మాటలకు చెవి ఒగ్గారు.

ఆ వూరు పెద్ద జమీందారులు ఇద్దరు. ఒకరు మహా బ్రాహ్మణుడయిన నంబూదిరి. ఆయన ఇంటి ఆడవాళ్ళు వీధి వాకిలినుంచి వెలుపలికి ముఖం చూసేవారు కాదు. మరొకరు నంబియారు. మాలవారనయినా సరే ఒళ్ళు తాకిగాని, వెన్ను తట్టికాని, దవడ వాయించికాని మాట్లాడించే సమర్థుడు. వయస్సులో నంబూదిరికన్నా చిన్నవాడు. మాస్టరు అక్కడికి రావడానికి ముందు ఆ వూరికి పత్రిక రావడం ఆయన ఒక్కడి ఇంటికే. పత్రిక తెప్పిస్తున్న తాను ఆధునికుడనని ఆయన కచ్చితమైన అభిప్రాయం.

మాస్టరు పత్రిక తెప్పిస్తున్నారని తెలిసినప్పుడు నంబియారు భుజాలు ఎగురవేశాడు. 'పోనీలే. చదువు చిన్నవాడు. చదివే వ్యసన మన్నా మరచిపోరాదు గదా! లేకపోతే పిల్లలకు పాఠాలేమి నేర్పుతాడు' అని ఊరుకున్నాడు.

అయితే, బడి అరుగుమీద ప్రతి సాయంకాలం రైతులూ వచ్చి మహోత్సవం ఆరంభించారని తెలిసినప్పుడు నంబియారుకు కన్నెర్రగయింది. బడి ధర్మకర్తల సమితి ముఖ్యుడైన ఆయన మాస్టరును పిలిపించాడు. మాస్టరు జమీందారుగారి ఎదుట సహజమైన చిరునవ్వుతో నిలబడ్డాడు.

చెక్కడపు కుర్చీలో మెత్తని దిండుపైన ఒదిగి కూర్చున్న నంబియారు తమ ఎదుట దూరంగా వున్న బెంచి చూపుతూ, సిగరెట్టుకు నిప్పువుల్ల ముట్టిస్తూ అన్నారు:

"కూర్చోండి."

మాస్టరు వినయంతో కూర్చున్నారు. ఆయన చేతిలో ఆ దినం మాతృభూమి పత్రిక చుట్ట ఉంది.... నంబియారు దానినొకమారు కడగంటితో తీవ్రంగా చూసి, కనుబొమ్మలుపైకి లేపి, కిందికి దింపి, సిగరెట్టు పొగవదలి, ఒక్క క్షణంపాటు మౌనంగా ఉండి అడిగారు :

"బడి పనులన్నీ సరిగా నడుస్తూ వున్నాయా?"

"ఆహా"

"మీరు సొగసుగా పాఠం చెబుతారట. మా పిల్లవాడు దినమూ మీ విషయం చెబుతూనే వుంటాడు."

ఈ సొగసు మాటల వెనుక మరేదో ముఖం మరుగు చేసుకొని వుంది—అని మాస్టరు తెలుసుకోలేక పోలేదు. ఆయన నవ్వి అన్నారు:

"అదేమి చెబుతానో....ఏమైనా, పిల్లవాళ్ళు రాకుండా తప్పించుకొని పోవడం చాల తక్కువ."

ఇంత మృదువుగా ఇతనితో మాటాడవలసిన అగత్యమయినా ఏమిటి అని జమిందారుగారు తమ ప్రవర్తన తనకే నచ్చక గొంతు హెచ్చించారు. మనస్సులో వున్న దానిని నేరుగా చెబుదామనిపించింది. అయితే కటువైన మాటలు తమ ఉద్దేశసాధనకు ప్రతికూలం కావచ్చునని, కోపం మింగుకొని మౌనంగా వుండి సిగరెట్టు పీల్చారు.

తమను పిలిపించిన కారణాన్ని మాస్టరు అప్పుడే ఊహించారు. పరిస్థితి విషమించకుండ హెచ్చరికతో వుండడానికి తీర్మానించుకొనే ఆయన వచ్చారు చెప్పవలసిన మాటలను మొదట్లోనే ఆచితూచి సంవాదం పెంచడానికి సిద్ధమవుతూ ఆయన అన్నారు:

"అదేమిటో మాట్లాడాలని అన్నారట."

ఆ మాటల ధ్వనితో మాస్టరును కొలవడానికి ప్రయత్నిస్తూ నంబియారు అన్నారు:

"తొందరేమీ లేదు కదా!"

"ఛ! ఛ! ఎలాటి తొందర!"

"పిల్లవాళ్ళంతా ఇండ్లకు పోయి వుంటారు."

"ఔను. ఔను. ఆటలు ఆడించి పంపించి వేశాను."

"అన్నమీదట కావలసినంత తీరిక అన్న మాట."

రైతులకు పత్రిక చదివి చెప్పేపని వుందని మాస్టరు నోటినుంచే వెళ్ళగక్కిద్దామని నంబియారు ప్రయత్నించారు. అయితే, ఆ మాస్టరు అంత సులభంగా వలలో పడే చేపకాదు. ఆయన అన్నారు:

"మీరు సరిగా అన్నారు. పొద్దుపోవడం కష్టమని పత్రిక తెప్పించుకొని చదువుతూ వుంటాను."

'ఒరే' అనుకున్నారు నంబియారు మనసులోనే 'నాకే పెట్టాడు కదా!'

బహిరంగంగా ముఖం గంభీరంగా పెట్టి ఆయన అన్నారు:

"ఆ విషయమయ్యే మాట్లాడుదామని మిమ్మల్ని పిలిపించాను. రైతులంతా సాయంకాలాల్లో బడి అరుగు చేరుతారట. వాళ్ళకేమీ బుద్ధి లేదు. మురికి మనుష్యులు. మీరు పాపం ఏమీ తెలియక వారి జతలో



మాట్లాడుతుంటారు. వాళ్ళు ఎలాటి వాళ్ళనేది మీకు తెలీదు. వేలు చూపితే చేతిని మింగే జాతి."

ముఖం ఎరుపెక్కుతున్నా మాస్టరు ఓర్పుతో వుండి చప్పుడు కాకుండా జమిందారుగారి కన్నుకప్పి ఒక గుటక వేశారు.

"అలా ఏమీ లేదు." అని ఆయన నాలుక నెమ్మదిగా అన్నది

"మీకు తెలియదు మాస్టరుగారూ! ఈ జనం ఎలాంటి వారనేది నాకు తెలుసు! మీరు వారిని దూరంగా పెడితే మాత్రమే వాళ్ళు మిమ్మల్ని గౌరవిస్తారు. చదువులేని వారు సంస్కృతంలో ఏదో సామెత వుందే, అలాగ వట్టి మృగాలు. వాళ్ళను మృగాలుగానే చూడాలి. వాటికి అర్థమయ్యేది ఒకే భాష, చర్నాకోలు భాష. ఏమంటారు?"

మాస్టారు ఏమీ అనలేదు. ఆయన ముఖం మరింత ఎర్రబడింది. పెదవులు కొంచెం కంపించాయి. పత్రికను పట్టుకున్న పిడికిలి మరింత బిగుసుకుంది. ద్వేషంతో, తిరస్కారంతో కటువుగా సమాధానం ఇవ్వమని ప్రేరేపిస్తూ గుండె బలంగా కొట్టుకుంది. అయినా, మాస్టరు మనసులోనే శాంతి మంత్రం జపించారు. 'మేను మరచి మూర్ఖుడు కావద్దు' అని తమకు తామే వివేకం చెప్పుకొన్నారు.

ఊరికే కూర్చున్న మాస్టరును నంబియారు చూపు పరీక్షించి చూచింది. తమ మాటల ప్రభావానికి లోబడి బెదిరిన పిల్లవాడిలాగ మాస్టరు ఆయనకు కనిపించారేగాని, వేరే ఏ సందేహమూ కలుగలేదు. తాము అన్న మాటలకు తామే సంతోషపడుతూ నంబియార్ చివరిసారి సిగరెట్టు దమ్ము పీల్చి పొగ వెలుపలికి వదిలారు. తర్వాత చిరునవ్వు నవ్వుతూ అన్నారు:

"మీకొక రహస్యం చెబుతాను. మా మామ వున్నంతకాలమూ ఇక్కడ బడి పెట్టడాన్ని ప్రతిఘటించారు. ఆడుకొనే వాళ్ళ పిల్లలు ఆడుకోవాలి. వేడుకునే వాళ్ళ పిల్లలు వేడుకోవాలి—అనేది ఆయన స్పష్టమయిన అభిప్రాయం. అయితే, ఆయన సంప్రదాయమే వేరే; నా సంప్రదాయమే వేరే. నేను ఆయన పద్ధతిని ఒప్పను."

మాస్టరు ఆ మాటలను మెచ్చుకున్నట్టు సూచించి, ఊపిరాడడానికి ఒక అవకాశం దొరికింది కదా అని ఇలా అన్నారు:





"మీ ఆలోచన సరైందని ఎవరైనా చెబుతారు."

నంబియారుకు ఆ ప్రశంస విని సంతోషమయింది. ఆ సంతోష భారంతో గోప్యంగా మాట్లాడేటట్లు గొంతు తగ్గించి అన్నారు:

"ఆ నంబూదిరికీ బడి పెట్టడం ఇష్టం లేదు. నేమా, అతడూ మిత్రులమయినా. మీకు చెప్పడానికి ఏమిటిట? వాడు మహాదుష్టుడు. శూద్రు లెవరికీ చదువు అవసరంలేదని వాడి అభిప్రాయం. నాకు తెలియదా అదంతా? పట్టుబట్టి బడి పెట్టేటట్టు చేశాను. వెలుపలి నుంచి అధికారులు, పెద్దవారు ఎవరైనా వచ్చినప్పుడు బడిని చూచి కొనియాడడం ఎవరినో చెప్పండి?"

మాస్టరు పెదవి గడపకపోయినా, నంబియారు మాటలను వింటున్నాననడానికి సూచనగా తల ఆడించారు. ఒళ్ళంతా చెమటలు పోసి ఉడికి పోతున్నట్టు కనిపించినా, ధైర్యంతో కూర్చున్నారు.

అయితే మాస్టరు మనుగడనే వెక్కిరించేటట్టు మరొక సంగతి వచ్చింది:

"ఈ విధంగా పాఠశాల స్థాపనకు నేనే మూలకారణమైనా, రైతుల పిల్లలందరికీ చదువు నేర్పే విషయంలో నా సొంత అభిప్రాయం వుంది. ఈ జనం ఎవరూ కాలేజీకి పోవలసిన అవసరం లేదు. హైస్కూలు వీరికి అవసరం లేదు. రైతుల పిల్లలు చేవ్రాలు చేయడానికి నేర్చుకుంటే చాలు. ఇంత చదువయినా యెందుకు తెలుసా! పట్టి బొటనవ్రేలి గుర్తు రుజూపే వుంటే ఏమీ తెలియనివారిని మోసం చేస్తున్నారని పీక్కు కొట్టుకోవచ్చు. ఇకముందు అలా కాదు. కరారు పత్రం ఏదున్నా, దానిలో వ్రాసింది పూర్తిగా అర్థమయిందని వాళ్ళు స్వంత దస్తూరితోనే సంతకం చేయవచ్చు. ఏమంటారు?"

ఈసారి కూడా ఏమి చెప్పడానికీ మాస్టరుకు సాధ్యం కాలేదు. అతడు అవాక్కయిపోయాడు. కలవాళ్ళ విషయం ఆయన కెంతో తెలిసినా ఈ ఆలోచనా సరణి విశిష్టతను చూచి వెరగుపడ్డారు. ఆయన హృదయంలో సంకటం పుట్టింది. ఆత్మాభిమానం గల మనిషి. ఇలాంటి మాటలు వినడానికి ఇష్టం లేకపోతే లేచిపోవచ్చు. 'వస్తాను పనివుంది' అని చెప్పి వెళ్ళిపోనే పోవాలి అనిపించింది. అయితే అలా వైరస్యానికి అవకాశమిస్తే



కలిగే పరిణామం ఏమిటని ఊహించడం కష్టం కాదు. బహిరంగంగా నంబియారును కవ్వించడమంటే, తన ఉద్యోగానికి తానే నిప్పు తెచ్చుకొన్నట్టే. ఉపాధ్యాయ వృత్తి నుంచి వెలుపడిన తర్వాత రైతుల మధ్య తన సేవా ముగిసినట్టే. ఇది స్పష్టంగా తెలిసిన మాస్టరు తమ భావాలను అదుపులో పెట్టుకొని చల్లబడి వుండడానికి ప్రయత్నించారు. నిటారుగా కూర్చోలేక కొంచెం వంగి, ఎండిపోయిన పెదవులను నాలుకతో తడుపుకొన్నారు.

మాస్టరు మౌనాన్ని చూచిన జమీందారుగారికి తమ మాటలు ప్రభావం కలిగించాయనే అభిప్రాయం ఎక్కువ దృఢపడింది. ఆయన ఊడిగవాడిని (వెట్టిచాకిరీ బంటును) పిలిచి చా తీసుకురమ్మన్నారు. మాస్టరు సుఖదుఃఖాలు కనుక్కుంటూ ఆయన అన్నారు:

"బడిలో మీరు వుండటానికి అంతా అనుకూలంగా వుందా?"

"వుంది" అని మాస్టరు జవాబిచ్చారు. కంఠధ్వని క్షీణించి వుంది.

"కావలిస్తే ఆ పెరట్లోనే ఇంత కూరగాయలు వేసుకోవచ్చు. మా రైతులకు చెబుతాను, వచ్చి పని చేస్తారు."

"అయ్యో! వద్దు. ఒక్కనికి ఎంత కావాలి? ఈ ఊళ్ళో కూరగాయలకు ఏమి తక్కువ? ధారాళంగా దొరుకుతాయి."

సాధారణంగా, మాస్టరుకు కావలసిన కూరగాయలన్నీ విద్యార్థులే తెచ్చి యిచ్చేవారు. మాస్టరు వద్దన్నా తెచ్చి యిచ్చేవారు. డబ్బు ఇచ్చినా పుచ్చుకొనేవారు కాదు.

కూరగాయల తర్వాత, బియ్యం సంగతి జమీందారుగారు ప్రస్తావించారు.

"మీకు బియ్యం యిబ్బంది ఏమైనా వుంటే చెప్పండి. పంపిస్తాను. సంకోచపడకండి."

"ఛ! ఛ! సంకోచం ఎలాంటిది? బియ్యమూ పుష్కలంగా ఉన్నాయి. అవసరమయితే తప్పక వచ్చి అడుగుతాను."

అంతలో యింటి తలవాకిట జమీందారుగారి కుమారుడు కనిపించి, మాస్టరును చూసి మందహాసం చేశాడు. వాని తల్లో మారు తల్లో, పెద్దక్కయ్యో—మొత్తం మీద కొందరు స్త్రీలు పిల్లవాని వెనుక తలుపు

మరుగున నిలబడి మాస్టరును చూచారు. ఆ దృష్టి వేడి తగిలినట్టు మాస్టరు అటుఇటు కదిలారు.

ఆ చూపుల సంచారం గ్రహించిన జమీందారుగారు పిలిచారు:

"కరుణాకర! ఇక్కడ రా నాన్నా!"

పిల్లవాడు చొక్కా కొసను పళ్ళతో కొరకుతూ, ముద్దయిన పెద్ద కళ్ళను అటు ఇటు తిప్పుతూ, నడిచి వచ్చి తండ్రి ప్రక్కన నిలుచున్నాడు.

"మాస్టరుకు నమస్కారం చేశావా?" అని నంబియారు అడిగారు.

పిల్లవాడు "నమస్కారం సార్" అన్నాడు.

"నమస్కారం నాయనా" అన్నారు మాస్టరు చిరునవ్వు నవ్వుతూ.

నంబియారు అర్థంకానిదేదో గొణిగి కొడుకు చొక్కాపై చేయివేసి, నోట్లో కరచుకొన్న కొసను తప్పించి, చొక్కాను విడిపించారు. మాస్టరు వైపు చూచి అన్నారు

"చాలా రోజులుగా మిమ్మల్ని అడుగుదా మనుకున్నాను. మన కరుణాకరానికి దినం కొంచెంసేపు మీరు ఎక్కువ పాఠం ఎందుకు చెప్పరాదు?"

ఇరుకులో చిక్కుకున్నట్టయింది మాస్టరుకు. ఈ కొత్తభారం మోసుకోవడం ఆయనకు ఎంతమాత్రమూ ఇష్టం లేదు. ఆయన వెంటనే జవాబు చెప్పలేకపోయారు. అయితే సమాధానం చెప్పక ఊరికే ఉండడమూ సాధ్యంకాదు. పోగొట్టుకున్న గొంతుకను మరల వెదుక్కుంటూ ఆయన అన్నారు:

"కానీండి. దానికేమిటట?"

"అలా అయితే సాయంకాలం పొద్దు ఎప్పుడూ ఇక్కడికి వస్తూ వుండండి. సాధ్యంకాదా?"

సాయంకాలాలన్నిటినీ తమ నుంచి లాక్కునే ఈ యత్నం చాలా క్రూరంగా తోచింది. మాస్టరుకు ఒప్పుదల సూచించక ఊరికే వున్న మాస్టరును జమీందారుగారు అరక్షణం బొమముడితో చూచి, త్వరగా మాటలు సాగించారు:

"నాకు బ్యాడ్మింటన్ అంటే ఇష్టం. నేను హైస్కూలులో చదువు తున్నప్పుడు చాల ప్రసిద్ధుణ్ణి. ఇక్కడ ఎవరూ తోడులేక బేజారయింది.



ఇక్కడే ఎదుట కోర్టు వేయిస్తాను. నాకు తీరిక కలిగినప్పుడల్లా సాయం కాలం ఒక్కొక్క ఆటా ఆడవచ్చు."

తమ నిస్సహాయతను ఒప్పుకోలేనట్లు మాస్టరుసమాధానమిచ్చారు:

"నాకు బ్యాడ్మింటన్ రాదు."

"ఆశ్చర్యం! ఈ కాలపు మీరే ఇలా వుండడం మహాశ్చర్యం!"

"చెప్పడానికి సిగ్గవుతున్నది. సందేల ఆటలంటే నాకు అంతంతే."

జమీందారుగారు నవ్వారు.

"అట్లయితే, జోడు గుళ్ళ బందూకు ఎత్తి మీరు వేటాడటమూ అంతలోనే వుంది!"

మాస్టరు జవాబుగా నవ్వారు.

"పోనీ చీట్లపేకన్నా ఆడుతారా?"

"అదీ లేదు."

"అలా అయితే మీరు పుస్తకప్పురుగు అని తోస్తుంది."

ఆ మాటను మాస్టరు తనకు అనుకూలంగా తిప్పుకొని అన్నారు:

"నిజం చెప్పారు. నేను మొదటి నుంచీ అంతే. పుస్తకాల పిచ్చి వాడిని. ఇప్పుడు సైతం క్షణం తీరిక దొరికితే చాలు. పుస్తకాలు వెదుక్కుంటూ నీలేశ్వరానికో, హోస దుర్గానికో పరుగెత్తుతూ వుంటాను."

ఈ పరుగులాట గూడార్థం తెలియని జమీందారుగారు నవ్వి తల వూపి అన్నారు:

"ఈ పుస్తకాల సంగతి నాకు నూనె-సీకాయ ఉన్నట్టు."

నౌకరు టీ తెచ్చాడు. చీనా పింగాణీకప్పు, సాసరు. పల్లెటూరి బడుగు హోటలు గాజు గ్లాసు కాదు.

"లోపలికి పరుగెత్తు." అని నంబియారు కొడుకుకు ఆజ్ఞ యిచ్చారు. మాస్టరు దృష్టి పరుగెత్తుతున్న పిల్లవానిని వెన్నాడింది. తలుపువద్ద యిప్పుడు స్త్రీలు లేరు.

ఒక సిగరెట్టు ముట్టించి జమీందారు గారు టీ కప్పును ఎత్తుకుని, "తీసోకండి" అని మాస్టరుకు చెప్పారు.

కప్పులాగే సొగసుగా వుండి పానీయం కూడా. శ్రీమంతుల చాపు త్తెక్కించేంత రుచికరం.

ఒక్క గుక్క పీల్చిన పిదప జమీందారు గారన్నారు :

"కరుణాకరుని ముందు కాలేజీలో చదివించాలని నిశ్చయించాను. మావు వైపునుంచి వాడికి ఆస్తి సమితం వస్తుంది. వాడు వకీలయి రాజకీయాలను దిగాలని నా అపేక్ష."

చా తాగుతూ, మాస్టరు తన బీద విద్యార్థులను స్మరించుకొన్నారు. జమీందారు కుమారునంత అంతస్తున్న వేరె ఇద్దరు పిల్లవాళ్ళంటే నంబూదిరి పిల్లలు. తాము మడిబ్రాహ్మణులమని ఎప్పుడూ విడిగా కూర్చుని, ఇంటికి వెళ్ళగానే స్నానంచేసి మెల పోగొట్టుకుంటున్న చిన్నవారు. నంబియారు వలెనే పిల్లలకు కాలేజీ చదువు చెప్పించే మాటలాడే శక్తి సామర్థ్యాలు ఆ పల్లెలో మరొక వ్యక్తికి ఉన్నాయంటే అది నంబూదిరికి మాత్రం. మరెవరూ అలాటి స్వప్నం చూసే స్థితిలో కూడ లేరు.

మాస్టరు చా తాగి ముగించగానే జమీందారుగారు రాజకీయాల సంగతి ఎత్తారు :

"గ్రామాలలో ఇప్పుడు కొన్ని చోట్ల పంచాయతీ అని చేస్తున్నారు గదా, దాని విషయంలో మీ అభిప్రాయ మేమిటి ?"

మాస్టరు తీగమీద నడిచే కసరత్తు ప్రారంభించారు :

"గ్రామ పంచాయతీ నుంచి మంచీ కావచ్చు; చెడూ కావచ్చు. చెడ్డవాళ్ళ చేతికి అధికారం చిక్కితే...."

తొడ తట్టుకుంటూ మాస్టరు మాటకు అడ్డు తగిలి, "అదే నేనూ అనడం !" అని నంబియారు ఆవేదన వెలిబుచ్చారు.

మాస్టరుకు ఒక్క క్షణం ఏమీ అర్థం కాలేదు. సగం తెరిచిన నోటిని ఆయన మూసుకోలేక పోయాడు. మాట్లాడలేని ఆయన సహాయానికి నంబియారే వచ్చి అన్నారు :

"ఈ చిన్న, పెద్ద రైతులలో కొందరు తలతిక్కవా ళున్నారు. ఎక్కడైనా వారు గ్రామ పంచాయితీకి ఎన్నికయి వచ్చారనుకోండి.



అదేదో సామెత వుందే అలాగ — అర్ధరాత్రి గొడుగు పట్టుకొని వూరేగినా వూరేగేవారే ! ఇక పల్లె స్థితిగతులో — రామరామ !"

మాస్టరు గొంతులో మళ్ళీ ఎంగిలి చిక్కుకుంది. మింగుడు పడ లేదు. మాటలు సహింపరాని వేదనతో పొట్టలోనే పొర్లాడాయి.

తాము చిత్రించిన భయమంతా వట్టి భ్రమ అన్నట్టు జమీందారు గారు మాటలు కొనసాగించారు :

"త్రికరపురంలో అలా కాలేదనుకోండి. అయినా యీ గ్రామ పంచాయతీలు అవసరమా ! – అని నా ప్రశ్న. ఇపుడు మన పల్లెనే తీసుకోండి. ఇపుడు దీనికి ఏమయింది ?"

మాస్టరు గట్టిగా నవ్వారు. ఆ నవ్వు అర్థం కాక మాస్టరును కొర కొర చూచారు నంబియారు. తమ మాటలను మెచ్చి ఆయన నవ్వి వుంటారని ఊహించుకొని తామూ పళ్ళికిలించారు. గ్రామ పంచాయితీ వ్యర్థమనేదే ఆయన అభిప్రాయమయినా పాతకాలం వాడు కావడం ఇష్టం లేక అన్నారు :

"అయినా, నాగరికత ముదిరిన ఈ కాలంలో గ్రామ పంచాయతీలు ఉండడం అలంకారమనంటే నాకు అభ్యంతరం లేదు. ముందు తప్పక ఏర్పాటు చేద్దాము. ఇది నూటితో పాటు నూటఒకటో పని ఉన్నట్లు. అయితే దాన్ని మన అదుపులో పెట్టుకొని నడిపించాలి, అంతే."

మాస్టరు మరొకమారు ఏ అర్థమూ లేకుండా నవ్వారు.

అంతలోనే నౌకరొకడు వచ్చి వినయంగా వంగి చెప్పాడు :

"దిగువమూల రైతులిద్దరు వచ్చారు దొరా."

నంబియారు కనుబొమలు చిట్లించారు.

"ఎవర్రా ?"

"దిగువమూల వాళ్ళు. రమ్మన్నారు మీరు. నీళ్ళ వదిలే విషయంలో—"

"ఓ ? వాళ్ళా !"

నంబియారు ఒక్క నిమిషం ఊరికే వుండి - ఆజ్ఞాపించారు :

"ఈ పొద్దు తీరిక లేదు. రేపు రావాలని చెప్పు."

"చిత్తం. దొరా, ఎంత పొద్దుకు రమ్మని చెప్పను ?"

జమీందారుగారు గొంతు పెద్దది చేశారు :

"కుక్క కొడుకా ! అదేమిట్రా అలా అంటే! ఎంత పొద్దుకు—అంట ! భేటీకి సమయం ఏర్పాటు చేసుకోడానికి వాళ్ళు మహా రాజులేమిరా ? పో........ తెల్లవారే వచ్చి యిక్కడ కాచుకుని వుండాలి అని చెప్పు."

నౌకరు వంగి వంగి వెళ్ళిపోయాడు. నంబియారు తీవిగా మాస్టరు వైపు తిరిగి గొంతు మార్చి అన్నారు :

"లంజ కొడుకులు పోట్లాడుతారు. ఆమీదట రాజీ చేయించండి అని ఇక్కడికి వస్తారు."

నౌకర్లతో మాట్లాడిన ధ్వనికన్నా ఆత్మప్రశంస చేసుకొన్న ఈ ధ్వని వేరు. 'ఒక్కొక్కరి కోసం ఒక్కొక్క రీతి గొంతు' అనుకున్నారు మాస్టరు. నంబియారు రాగాలు తీస్తూ ఇంకా అన్నారు :

"జమీందారు రైతు లందరికీ తండ్రి ఉన్నట్టు. పోట్లాడుకొని ఇక్కడికి కాక మరెక్కడికి రావాలి చెప్పండి !"........

........ఈ సమావేశాన్ని ఇంకా పొడిగించడంలో అర్థం లేదని మాస్టరు బయలుదేరడానికి సన్నద్ధులయి అటు ఇటు చూచారు. మాస్టరు ఇంగితాన్ని నంబియారు ఊహించకుండా వుండలేదు. ఆయన నౌకరును పిలిచారు.

"ఏయ్ ఎవడ్రా ! రా ఇక్కడ !"

నౌకరు రాగానే ఆయన ఆదేశించారు :

"రెండు పెద్ద పప్పాయి పండ్లు తీసుకొని మాస్టరు జతలో వెళ్ళు."

అయితే మాస్టరుకు మాటలతోనే కడుపు నిండింది. పప్పాయి పళ్ళు అవసరమనిపించలేదు. ఈ ఉడుగర (కానుక) లేకనే, వచ్చిన రీతిగానే వెనుదిరిగి వెళ్ళడానికి ప్రయత్నించారు :

"వద్దు. ఎందుకు ఊరికే ? దయచేసి వద్దు."

నంబియారు లేచి నిలబడి "ఊరకే ఉండండి" అనేట్లు ఆత్మీయతతో చేయి విసిరి "తీస్కొని రారా. బాగుండేవి చూచి ఏరి తీసుకురా." అన్నారు.



వెలుపలికి బయలుదేరిన మాస్టరు లోపలి తలుపు వైపు ఒక్కసారి దృష్టి సారించారు. అక్కడ స్త్రీలు లేరు. కరుణాకరుడు నిలుచున్నాడు. ఆ పిల్లవానికి పాఠం చెప్పడానికి ఒప్పుకోడం జ్ఞాపకమై, మాస్టరు హృదయం బరువెక్కింది.

జమీందారుగారు కొడుకును చూడకపోయినా మాస్టరుతో పాటు వెలుపలికి వస్తూ అన్నారు :

"అన్నట్టు – కరుణాకరునికి పాఠం చెప్పే విషయం, రేపు సాయంకాలం నుంచే వస్తారేమిటి ?"

మాస్టరు మెదడు ఒక్క నిమిషం తీవ్రంగా చలించింది :

"బడి పాఠాలన్ని అయిన తర్వాత పిల్లలకు సాధారణంగా అలసటవుతుంది. అంతేకాక అది ఆటలాడే పొద్దు. ఉదయం పాఠం చెప్పడం మేలు. దాని నుంచి ప్రయోజనం ఎక్కువ."

నంబియారు "అలాగే కానీ" అన్నారు. అయితే తక్షణమే, సందె వేళలలో రైతులకు పత్రిక చదివి చెప్పడానికి ఇబ్బంది కాకూడదని ఈ పంతులు ఈ విధంగా చెప్పాడేమో అనే సందేహం పొడ సూపింది. అలాటి పత్రికా పఠనానికి ఆస్పదం ఉండరాదని గట్టిగా అన్నారు :

"అయితే రైతులను మాత్రం సాయంకాలాల్లో బడి అడుగుకు చేర్చకండి. మీకు ఒకరే ఉన్నామని విసుగయితే ఇక్కడికి రండి. ఆట లేకపోతే గప్పాలయినా కొడదాము. కావలిస్తే మా యింటి పేపరే మీరు ఉపయోగించవచ్చు. ప్రత్యేకంగా తెప్పించుకోవాలనే దేమీ లేదు."

జవాబుగా కొన్ని పొరల లోతు నుంచి "హూ" అనే ధ్వని వచ్చింది.

"వస్తాను. నమస్కారం" అని మాస్టరు నడిచారు. జమీందారుగారు జవాబుగా తల ఊపి మౌన నమస్కారం చేశారు. ఆయన నౌకరు రెండు పెద్ద పప్పాయి పండ్లను అరటి నారతో కట్టి తలమీద పెట్టుకుని మాస్టరును అనుసరించాడు.

మాస్టరుకు వేసట కలిగింది. ముడుచుకుపోయిన పత్రికను చంకలో ఇరికించి, కట్టుకొన్న గూడకట్టు పంచను సగం పైకెత్తి కట్టి మాట్లాడకుండా నడిచారు.

చీకటి పడడానికి ఇంకా కొంచెం పొద్దుంది. రైతులు కాచుకొని వుండి నిరాశులై వెళ్ళిపోయినా పోయివుండవచ్చని అనుకున్నారు మాస్టరు. సమాజంలోని వర్గశక్తి అయిన నంబియారు ఎదుట తాను బడుగు మానవ ప్రాణిగా వుండవలసి వచ్చిందిగదా, ఏ మాటా నేరుగా చెప్పడం తనవల్ల కాలేదుకదా—అని ఆయనకు ఇదంతా చెడ్డ అనిపించింది.

ఆయన ఊహించినట్లే బడి అరుగుపై రైతు లెవరూ ఉండలేదు. అయితే ప్రతీ సాయంకాలం వచ్చే అప్పు, చిరుకండడు అరుగు ఆవరణం అడ్డుగోడమీద కూర్చున్నారు. మాస్టరును చూడగానే వాళ్ళు లేచి నిలబడ్డారు. మాస్టరు పాలిటి ఆ శిష్యుల దర్శనం హితకర మయింది. అయితే పప్పాయి పళ్ళను మోసుకువస్తున్న జమీందారుగారి బంటును చూచి పిల్లవాళ్ళు ఊరకుండిపోయారు. వాడిని త్వరగా పంపించేయాలని మాస్టరన్నారు.

"అరుగుమీద పెట్టు."

అతడు పళ్ళను కిందికి దింపి "వెళ్తాను," అని చేతులు జోడించాడు; మాస్టరు "హూ" అన్న వెంటనే వెళ్ళిపోయాడు.

బడి తలుపులకు వేసిన చిన్న తాళం తీయగానే అప్పు విరిగిన మాస్టరు కుర్చీని తెచ్చి వెలుపల వాల్చాడు. మాష్టరు దినపత్రికను చిరుకండనికి ఇచ్చి కుర్చీలో కూర్చున్నారు.

పత్రికలోని వార్తలకన్న విశేష వార్తలు వేరే ఉన్నాయని వూహించిన చిరుకండడు మాష్టరువైపు చూచి అడిగాడు:

"జమీందారుగారి ఇంటికి వెళ్ళారా సార్ ?"

"అవునోయ్."

"ఏమిటిసార్ విశేషాలు !"

"ఇవాల్టినుంచి ఇక్కడ పత్రిక చదివి చెప్పడం బంద్ !"

"ఆఁ !" అని కళ్ళు పెద్దవి చేసుకొని అప్పు ఆశ్చర్యం ప్రకటించి పప్పాయి పళ్ళ పక్కనపోయి కూర్చున్నాడు.

చిరుకండడు గొంతు తగ్గించి అన్నాడు :

"వారికి మీ మీద సందేహంవచ్చి వుంటుందా సార్ ?"



"వచ్చి వుండదు." అని మాస్టరు బీడీ ముట్టించి తాగుతూ, సావధానంగా - అయితే సంక్షిప్తంగా - జమీందారుగారి ఇంట్లో జరిగిన సంభాషణలోని ముఖ్య విషయాలు చెప్పారు

"ఇక ఆ రాజకుమారునికి ఎక్కువ పాఠం వేరే చెప్పాలా ? సరి ! సరి !" అన్నాడు చిరుకండడు.

అయితే మాస్టరు ఏమీ అనలేదు. శాంతంగా అన్నారు :

"కాదు అని చెప్పడానికి అవుతుందా, అప్పు ! ధర్మకర్తల సమితి అనేదంతా పేరుకు. నంబియారుకు వద్దు అనిపిస్తే నన్ను పనినుంచి తీసివేయనూ వచ్చు."

పిల్లవాళ్ళు మాట్లాడలేదు.

చిరుకండడు వరమడిగేట్లు అన్నాడు :

"మీరు దినమూ అక్కడికి వెళ్ళకండి సార్ ! తెల్లవారి త్వరగా ఇక్కడికి రమ్మనండి."

మాస్టరు చిరునవ్వు నవ్వారు. కొన్నాళ్ళు వెళ్తూ వుండి క్రమేణ ఆ పిల్లవాడిని బడికి ఉదయమే పిలిపించాలనేది ఆయన ఆలోచన.

జమీందారుగారి ఇంట్లో జరిగిన మాటలలో అత్యంత స్వారస్యమైన అంశం గ్రామ పంచాయతీకి సంబంధించినది. దాని వివరాలు చెప్పి మాస్టరూ నవ్వారు.

అప్పు ఉత్సాహంతో అన్నాడు :

"కయ్యూరుకు వేగంగా గ్రామ పంచాయతీ వచ్చేట్టు చేయాలి సార్."

"దానికింకా రైతులు సిద్ధం కావాలి."

"ఆ మీదట బడిని పంచాయతీవారే నడపవచ్చుకదూ ?"

"అవును. కాని, వారంతా అంత సులభంగా - పెద్దవారికి అధికారం అప్పచెప్పుతారా ?"

నంబియారు చేతినుంచి రైతులు అధికారం పొందడం సులభం కాదని అప్పుకు బాగా తెలుసు. ఆ తెలివి జ్ఞాపకం వచ్చి అతడన్నాడు:

"హుఁ, గ్రామ పంచాయతీ వల్లనేమి ప్రయోజనంలేదు. పోరాట మొకటే దారి."

అప్పు మాటల ధోరణిని దిద్దేవాడులాగ చిరుకండడు అన్నాడు:

"చివరిదాకా పోరాటం జరుగనే జరుగుతుంది. అయితే గ్రామ పంచాయితీ జనంలో జాగృతి కలిగించడానికి సహాయకం కదండీ సార్ ?"

మాస్టరు "ఔను" అని తల ఊపారు. అది ఎలా. అని అప్పుకు స్పష్టం కాలేదు. మాస్టరు వివరించారు :

"గ్రామ పంచాయతీ ఏర్పడిన పిదప జమీందారు గారిదే అధికారమయినప్పుడు, ఈ పంచాయితీవల్ల ఎలాంటి ప్రయోజనమూ లేదని జనానికి తెలుస్తుంది చూడు. అనుభవంతోనే విషయాలు మనస్సుకు వస్తాయి."

ఇప్పుడు అప్పుకు అర్థమయింది.

అప్పు పస్పాయి పళ్ళమీద చేయి ఆడిస్తూండడం చూచి చిరుకండడు చెప్పాడు :

"బాగున్నపండే ఇచ్చారు."

"ఏమిటి ? బాగుందా ?" అని అప్పు వాటిని కొంచెం దగ్గరకి జరిపాడు.

"తిందామా ?" అని మాస్టరు పిల్లవాళ్ళను చూస్తూ అన్నారు. పిల్లవాళ్ళ మనసులో వుండదగిన అక్షేపణను ఊహిస్తూ ఆయన అన్నారు;

"జమీందారుగారి ఇంటిదీ అని ఆలోచించకండి. ఎవరో రైతు పంపించింది. మనమే న్యాయమైన హక్కుదారులం కదోయ్ అప్పు ? లోపలినుంచి చాకు తెచ్చి ఒకదానినన్నా తరుగు."

అప్పు నవ్వుతూ ఒప్పుకున్నాడు. పాత పత్రికను ఒకదానిని తెచ్చి పరిచి ఒక పండును దానిమీద పెట్టి తరిగాడు.

పిల్లవాళ్ళతోపాటు పండు ముక్కలు తింటూ, నంబియారుతో జరిపిన కబుర్లలోని ఒక అంశం జ్ఞాపకం వచ్చి దానిని వివరిస్తూ అన్నారు మాస్టరు :

"నంబియారు అన్నారు – జమీందారు తండ్రి ఉన్నట్టు రైతులు పిల్లలున్నట్టు – అట । అర్థమయిందేమర్రా ?"

"ఓహో !" అని అప్పు రాగాలు తీశాడు.



కొంతకాలంకిందే తమ భూమిని ఆ తండ్రికి కానుకగా ఇచ్చిన చిరుకండడు బాధతో నవ్వు నవ్వాడు.

పండు తిన్న తర్వాత ముగ్గురూ బడి ముంగిట్లోకి దిగి నిలుచున్నారు. వెనుకగా ఎడమవైపు, కుడివైపు నాటిన మామిడి మొక్కలు చిగిర్చి పైకివస్తున్నవి. మాస్టరు ప్రీతితో వాటి ఆకులను తాకి చూశారు.

పత్రికవైపు దృష్టి సారిస్తున్న చిరుకండడు అడిగాడు :

"అలా అయితే ఇక పత్రిక చదివి చెప్పడానికి ఏమి చేయాలి సార్ !"

మాస్టరు సమాధానం చెప్పారు :

"ఓపికపట్టు. ఏమైనా చేద్దాము."

మామిడి మొక్కమీద ఆసక్తి చూపుతున్న మాస్టరును చూచి అప్పు అన్నాడు :

"అదేమి చూస్తున్నారు సార్ ?"

"విత్తు మొలచి చిన్న మొక్కయింది. ఈ మొక్క మానయి పండ్లు ఇవ్వడానికి ఎంత కాలమవుతుందని ఆలోచిస్తున్నాను."

అప్పు మాస్టరు ముఖం చూచాడు. ఆయన ముందుకు సాగించారు:

"ఈ మొక్క పెరిగి ఫలం చిక్కడానికి చాలా రోజులు కావాలి కదా ?"

అప్పు "అవును" అని తల ఊపాడు. మాస్టరు తమ మాటలు పూర్తి చేశారు :

"ప్రతిదీ అలాగే. విత్తు మొలిచి చెట్టయి, మానయి పండ్లు పండడానికి సమయం కావాలి. తాలిమితో మనం కాచుకొని పని చేయాలి. ప్రతిదీ అలాగే."

ఆ మాటలు అర్థమయి చిరుకండడు తెలిపి తేటల నవ్వు నవ్వాడు. కొంచెం సేపటికి అప్పుకు కూడా అది అర్థమయింది. అతడూ నవ్వాడు.

# 8

బడి అరుగుమీదకాక ఏ రైతు ఇంట్లోనో ఇక మీదట పత్రిక చదవడం మేలని మాస్టరు చేసిన సూచన ఉచితమయిందే. అయితే, 'నా యింటికి రండి, నా యింటికి రండి' అని పిలవడానికి మాత్రం ఏ రైతూ సిద్ధంగా లేడు. ప్రతిదినపు పనికన్నా భిన్నమయిన ఆ చదువు అత్యవసరమని రైతులకు తోచలేదు. జమీందారుగారి ఇంట్లో పత్రిక చదివే ప్రస్తావన వచ్చిందని రైతులకు తెలిసివుంటే, ఆ చదువుపట్ల ఆసక్తి చూపే వారి సంఖ్య మరింత తక్కువ అయ్యేది. "నాకిక తీరిక లేదు. నా బదులు చిరుకండడు పత్రిక చదివి చెబుతాడు" అని మాస్టరు చెప్పడమయితే చివరి పుడిసీ సరికి నట్టయింది. శిల్పపుబొమ్మ చేయడానికి ఎంతో ప్రయాసతో సేకరించిన ఆవపు మట్టి ఎండి పోతున్నది కదా అని దుఃఖమయింది కళావేత్త అయిన మాస్టరుకు.

అయినా, ఆయన నిరాశపడలేదు. నిరాశపడడం ఎలా అన్నది ఆయనకు తెలియనే తెలియదు. కొంతకాలం తర్వాత ఆయన మరొకసారి ప్రయత్నించి చూచాడు. అప్పుడూ స్థలం దొరకలేదు. రైతులు ఆసక్తి చూపలేదు.

"ఎవరూ చిరుకండడే కద చదవడం?" అని ఒక రైతు తాత్సారంతో అన్నాడు. తమవాడయిన జితెడు పిల్లవాడొకడు తమకు పత్రికను చదివి చెప్పడం రసాభాసమని వారికి తోచింది.

మాస్టరు విద్యావంతుడనే ఏకైక కారణంగా మొదట మాస్టరు విషయంలో అభిమానం ఉంచిన ఒక రైతు ఉండేవాడు. అతని పేరు కోరడు. అతని తండ్రి కాలంలోనే పొలం చేయి వదిలింది. సదా సర్వ



కాలమూ జబ్బుతో నలుగుతున్న భార్య మరణించింది. గొడ్రాలుగానే మరణించింది. పుణ్యాత్మురాలు! అతడొక రీతిగా వ్యవసాయ కూలి. విత్తేకాలంలోను, కోతల కాలంలోను ఇతరుల పొలాలలో అతడు దినకూలిగా పనిచేసేవాడు. అప్పుడొకమారు, ఇప్పుడొకమారు, చవ్వత్తూరు రైల్వేస్టేషనుకు ఏదయినా సామాను మోసుకొనిపోయే పనివుంటే' దానినీ చేసేవాడు. పనిపాటు లేనప్పుడు హోటలులో కూర్చుని కాలక్షేపం. బీడి ముక్కలకో, "ఆపు" చాకో చేయి ఒడ్డడం; కాని అర్థణా అప్పు అడగడం, ఎన్నో సాయంకాలాలు ఎవరి జతలోనో ఒకింత తాగి గుడిసెకువచ్చి పడుకోడం.... ఒకసారి అతడు కాయిలా పడ్డాడు. బడుగుదేహాన్ని వణికిస్తూ వచ్చిన కొండజ్వరం – మలేరియా జ్వరం. ఆ సమయాన నీలేశ్వరానికి బయలుదేరిన మాస్టరు ఆ కంగాళి పరిస్థితిలో అతనిని చూచాడు. నీలేశ్వరంనుంచి తిరిగి వచ్చేటప్పుడు మందు తెచ్చారు. కోరడు జబ్బు నెమ్మదై తిరుగులాడడం మొదలు పెట్టాడు. ఇప్పుడు విద్యకు అతడు ఇస్తున్న గౌరవానికి వ్యక్తి విషయంలో ప్రీతి కూడ తోడయింది. దీని ఫలంగా తాగని తీరిక సమయాలలో అతడు మాస్టరును అనుసరించాడు. ఒక ప్రశ్నను అడిగేవాడు కాదు. అయితే మాస్టరు మాటలన్నింటినీ – అవి అర్థం కాకపోయినా చెవియొగ్గి వినేవాడు. పొట్టిగడ్డం నిండిన అతని ముఖంనుంచి రెండు కళ్లు విప్పారి మాస్టరును చూసేవి.

"పత్రిక చదవడానికి, నలుగురు చేరడానికి ఒక స్థలం కూడ లేకపోయింది కదా!" అని మాస్టరు ఒకరోజు పడిన బాధను విని— కోరనికి కష్టమనిపించింది. అతడు చాలసేపు తలగోక్కుంటూ నిలుచుని, చివరకు అన్నాడు :

"నేనొక విషయం చెప్పనా?"

ఎప్పుడూ ఇలా అడిగినవాడు కాదు కోరడు. మాస్టరుకు ఆశ్చర్యం కలిగింది. ఆయన అన్నారు :

"చెప్పు ఏమిటి సమాచారం?"

"ఎక్కడా స్థలం లేదని అన్నారు."

కోరని మనస్సులో ఉన్నదేమిటని మాస్టరుకు తోచి, సంతోషమయి ఆయన కళ్లు మెరిశాయి. అయినా, అతని నోటినుంచే ఆ మాటను వినాలని ఆయన ఊగొట్టారు.

"ఔను."

"మీకు ఇష్టమయితే నా గుడిసెలో........"

మాస్టరు నవ్వారు. తాను చెప్పడం అనుచితమయిందేమో నని కోరడు ఉలికి పడ్డాడు. మాస్టరు ఎడమ అరచేతిలో కుడి పిడికిలి గుద్ది అన్నారు:

"ఇంతవరకు నాకు చెప్పనే లేదేమి కోరా?"

మాస్టరుకు సమ్మతమైనదని కోరడు సంతోషించి, అంతవరకు నిలుచున్నవాడు నేలమీద కూర్చున్నాడు.

కోరని పిలుపు సంగతి తెలిసి అప్పుకు చిరుకండనికీ—యిద్దరికీ ఒక సమస్య వగదెగిందని మనసు ఊరడించింది. అయితే జనాన్ని చేర్చే మరొక సమస్య అలాగే మిగిలిపోయింది.

"నేనొక డున్నాను. చిరుకండడు నాకు చదివి చెప్పనీ" అన్నాడు కోరడు. అతడలా చెప్పడం పత్రిక మీద ప్రీతితో కాదు; మాస్టరుమీద ప్రీతితో. మాస్టరు తమ అవస్థ చూచుకొని తామే నవ్వుకున్నారు.

ఏమైనా, క్రమంగా ఒక్కొక్కరిని ఎంతో కష్టంతో జమచేసి, చీకటయిన పిదప కొంచెం సేపు జరిగే శిక్షణ కూటం ఆరంభమయింది. తాగి వచ్చిన నాడు కోరడు ఒక మూలకు కూచుని నిద్రపోయేవాడు. కొడుకు కార్యకలాపం చూచి చిరుకండని తండ్రికి సంతోష మయింది. "ఆ మాష్టరు మన పిల్లవాడిని మంచి దారిలో నడుపుతున్నారు, కల్యాణి" అని భార్యతో అన్నాడు. అప్పు తండ్రి ఒకనాడు కోరని ఇంట్లోకి తొంగి చూచి ఆశ్చర్యపడినా, దానిని చూపకుండా అలాగే వెళ్ళిపోయాడు. ఇల్లు చేరిన తర్వాత "ఆ పిల్లలు మూడు మామిడికాయలంత ఎత్తులేరు పత్రిక చదువుతారట హూం" అన్నాడు. అప్పుడు నోటితో అలా అన్నా, కొడుకును ఏమీ అనలేదు. అతనికి ఒక రీతిగా అది మెప్పే అయింది. ఒకనాడు అతడు కొడుకును అడిగాడు:



"నీకు చదువడానికి రాదేమిటిరా ?"

"వచ్చు" అన్నాడు అప్పు.

"మరి చిరుకండడు ఒక్కడే చదువుతాడు–"

"ఎవరు చదివితే ఏమి ?" అని చెప్పి, అప్పు "నాకన్నా వాడే బాగా చదువుతాడు" అని మాటలు కలిపాడు.

"తండ్రి దానికి "హూం" అన్నాడు అంతే. 'నీవూ రా నాన్న' అని తండ్రిని కూడ పిలుద్దామని అప్పుకు మనసున్నా మాటలు పెగలలేదు.

అంతేకాక, అలాటి ఆహ్వానానికి అర్థమూ లేదన్నట్టు శిక్షణ కూటానికి వస్తున్నవారి సంఖ్య తగ్గుతూ తగ్గుతూ చివరకు నిలిచేపోయింది. అప్పుడు "మనవాళ్ళు ఎప్పుడూ ఇంతే" అన్నాడు చిరుకండని తండ్రి, బాధతో. అప్పు తండ్రి "తమాషా ముగిసి పోయింది" అని, ఆ మాటల వెనుక ఎలాటి భావం ఉందో తెలియనట్టు రాగాలు తీశాడు.

అందరికన్నా ఎక్కువ దుఃఖం తనదని చూపినవాడు కోరడు. అతడు మాస్టరుతో అన్నాడు :

"పిల్లవాళ్ళను ఎవరు గౌరవిస్తారు చెప్పండి. మీరయినా పుంచే నలుగురు వచ్చేవారు "

"పోనీలే కొన్నాళ్ళు ఇలాగే వుండనీ" అన్నారు మాస్టరు తమను తామే ఓదార్చుకొన్నట్టు.

ఆ నాళ్ళలో మాస్టరు జమీందారుగారి కుమారుడు కరుణాకరునికి పాఠం చెప్పారు. కొన్నాళ్ళు ఇంట్లో పాఠం జరిగింది. అయితే, సాధారణంగా మాస్టరు వెళ్ళినపుడు పిల్లవాడు సిద్ధంగా వుండేవాడు కాదు. స్నానాల గదిలో వుండేవాడు, లేకపోతే వంట ఇంట్లో. అయినా మాస్టరు ఆక్షేపించలేరు. ఇది ఆయనకు ఒక రీతిగా అనుకూలమే అయింది. ఒక దినం సమయం సందర్భం చూచుకొని మాస్టరు నంబియారుతో అన్నారు:

"కరుణాకరుడు బడికి ముందుగా వస్తే అక్కడే పాఠాలు చెప్ప వచ్చు. అదే మంచిది కదా ?"

నంబియారు కనుబొమలు ముడి వేశారు :

"ఎందుకు? మీకు సులభమవుతుందనా ?"

"అలా కాదు. ఎక్కువసేపు పాఠం చెప్పవచ్చు. బడి ఆరంభమయ్యే వరకు సమయం వుంటుంది."

నంబియారు బొమముడి సడలింది. మాస్టరు చెప్పిన ఆ కారణం సరయినదని నమ్మకం కలిగింది.

"కానీ. అలాగే కానీ! రేపటి నుంచి అక్కడే పాఠాలు చెప్పండి."

....తర్వాత ఈ రీతి ఏర్పాటువల్ల మరొక సమస్య పుట్టడం చూచి మాస్టరుకు తమాషా అనిపించింది. నంబియారు కొడుకుకు విశేషమైన పాఠమంటే, నంబూదిరి పిల్లలు చేసిన తప్పేమిటి? నంబియారంత ప్రముఖులైన ఆ జమీందారుగారు తమ అధికారం చెలాయించారు. ముగ్గురు పిల్లవాళ్ళకు మాస్టరు విశేష పాఠం చెప్పవలసి వచ్చింది.

బడిగోడకు ఆనుకుని, దాని వెనుకవున్న గడ్డికప్పు గదిలో మాస్టరు జమీందారుల పిల్లలకు పాఠం చెబుతూ వుండేవారు. అప్పుడు బడివెలుపల, పెరట్లోను చెవులు చిల్లులు పడేటట్టు ఇరవయ్యయిదు, ముప్పై మంది పిల్లల గోల. జమీందార్ల పిల్లవాళ్ళకున్న ప్రత్యేక సౌకర్యం తమ కెందుకు లేదు?—అని వాళ్ళు ఆందోళన చేయకపోయినా, ఆ శ్రీమంతుల కుమారుల పాఠం జరుగుతున్నప్పుడు తాము సద్దు చేయరాదనే సిద్ధాంతాన్ని ఒప్పుకోలేదు. 'ఊరికే వుండండి' అని మాస్టరు వారికి చెప్పనూ లేదు.

....ఆ సందర్భంలో ఒక రాత్రి పండితులు కయ్యూరికి వచ్చారు. అప్పు, చిరుకండడు పండితులని చూడక అప్పుడే, సంవత్సర మయింది. మళ్ళీ ఆయనను, అదీన్నీ తమ వూరిలో చూడటం తటస్థించినందుకు ఆ పిల్లవాళ్ళకు కలిగిన సంతోషం అంతా ఇంతా కాదు. పండితులూ పిల్లవాళ్ళ భుజంతాకి వీపు తట్టి మంచీ చెడ్డా కనుక్కున్నారు.

ఆయన వెంట దుబ్బోడున్నాడు. వెనుక కావలికి వచ్చిన భటుడు. అతడు మొదట పిల్లలను పలకరించనేలేదు. గంభీరంగా వున్నాడు. అతడు తమను గుర్తుపట్టలేదని అప్పు నిరాశపడి తర్వాత అడిగాడు :

"ఏమండీ, మరిచిపోయారా? మమ్మల్ని చూచిన జ్ఞాపకం లేదా?"

దుబ్బోడు ఆలోచిస్తున్నట్టు నటించి అన్నాడు :



"హూఁ హూ! జ్ఞాపకం వుంది. ద్వాపర యుగంలోనో, త్రేతా యుగంలోనో ఎప్పుడో ఒకప్పుడు చూచి వుండాలి."

అప్పు నవ్వి మరో ప్రశ్న వేశాడు :

"ఇప్పుడు ఎక్కడినుంచి వచ్చారు?"

"పాతాళం నుంచి వచ్చామో, స్వర్గం నుంచి వచ్చామో - ఎక్కడి నుంచో? మరచి పోయిందయ్యా, మతిపోయింది."

అలాటి ప్రశ్నలు వేయవద్దని "శ్" అంటూ చిరుకండడు అప్పు చేయి తాకి సైగ చేశాడు. అప్పుకు బాగనిపించలేదు. అయినా సంవత్సరం క్రితం తాము చూచిన ఇతరులు జ్ఞాపకం వచ్చి నెమ్మదిగా అడిగాడు అప్పు :

"రాముణ్ణి, ప్రభు అందరు బాగున్నారా?"

"ఓహో! రాముణ్ణి అయితే మీ విషయం కనుక్కుంటూనే వుంటాడోయ్. అప్పు పెట్టి వచ్చారుగా ఆ దినం!"

"ఓహ్!" అన్నాడు అప్పు. దుబ్బోడు తమాషాకు అలా అన్నాడనడంలో సందేహం లేదు. అయినా రాముణ్ణిని ఆ మీదట చూడలేదని అప్పుకు వేసట కలిగింది.

"ఔనండీ! ఇంత దగ్గర్లో వున్నా వెళ్ళడానికి కాలేదు."

"ముఖ్యంగా, ఆ వైపు వెళ్ళే పనేలేదు." అని చిరుకండడు వివరించాడు.

"నీలేశ్వరం జాతరకు వెళ్ళేటప్పుడు వద్దామని వుండేది. కాని ఈసారి జాతరకు వెళ్ళడం పడలేదు" అని నిరుత్సాహ ధ్వనితో అన్నాడు అప్పు.

దుబ్బోడు పిల్లలిద్దరినీ దగ్గరకు లాక్కున్నాడు :

"కాదోయ్! ఈ వూరే ప్రపంచమని కప్పలలాగ వున్నారు కదర్రా. ఒకింత అటూఇటూ పల్లెలకు వెళ్ళిరారాదూ మీరు?"

"పోయి చేసే దేమిటి?" అన్నాడు చిరుకండడు, గహనమైన ఏదో విషయాన్ని దుబ్బోడు ప్రస్తావిస్తున్నా డనుకొని.

"పనసపండ్లో, మామిడిపండ్లో మోసుకు వచ్చేది!"

అలా అంటూ అతడూ నవ్వాడు. ఆ మాటలు విని పిల్లవాళ్ళూ నవ్వారు.

"కాదు, గురువు వస్తే ఊరికే వున్నారు కదా! ఎక్కడి నుంచైనా నాలుగు అరటిపళ్ళు తీసుకురావద్దూ!"

"ఎవరు గురువు?" అన్నాడు చిరుకండడు దుబ్బోడివైపు చూచి.

"నేనే గుర్ర్ !"

వీరంతా గట్టిగా నవ్వుతుండడం చూచి, మాస్టరుతో గుసగుస లాడుతున్న సంభాషణలో నిమగ్నులైన పండితులు అన్నారు :

"అదేమిటయ్యా అంతగా నవ్వుతున్నారు? స్వార్థపరులు, మాకూ చెప్పరాదూ ఒకింత :"

ఆ మాటలకు మౌనమే జవాబయింది.

చీకట్లో వాళ్ళు పొలాల గట్లమీద నడుస్తూ కోరని ఇంటికి వెళ్ళారు. కొంచెం సేపటికి చిరుకండని తండ్రి అక్కడికి వచ్చాడు.

"మాస్టరు రమ్మని వుంటారు" అన్నాడు చిరుకండడు, తనలో అణచుకోలేని విశ్వాసంతో.

చిరుకండని తండ్రిని అక్కడ చూచి అప్పుకు ఆశ్చర్యమయింది. అక్కడికి వచ్చే అర్హత తన తండ్రికి లేదు గదా అని వ్యధా కలిగింది.

ఇది ఎక్కువ మంది సభ ఏమీకాదు. పెద్ద ప్రసంగాలేవీ లేవు. పిల్లవాళ్ళు మునుపు విన్న మాటలే ఇప్పుడూ వినిపించాయి. అయితే ఆ మాటలను వినడం మొదటిసారే అన్నంత వేడి వాటిలో వుంది. కొత్త విషయాలూ వున్నవి. దేశంలో జరుగుతున్న స్వాతంత్ర్య సమరం. దేశ నాయకుల నిర్బంధం....ఓటమి...."ఒక్క విషయం మనం బాగా తెలుసుకోవాలి. వట్టి మధ్యమవర్గంవారు మాత్రమే ఎన్నటికీ స్వాతంత్ర్యం తేలేరు. దేశంలోని రైతులు, కార్మికులు సంఘటితులయి బలిష్ఠులయితే తప్ప స్వాతంత్ర్య సమరం విజయవంతం కాదు. బ్రిటిషు వారు వెళ్ళిపోరు. ఇక్కడ వారికి ఆధారమయిన శక్తులూ నాశనం కావు....సుఖ సాధనకు సులభమయిన మార్గమనేదే లేదు. కష్టపడి దీర్ఘకాలం, రాళ్ళు, ముళ్ళు, గుట్టలు, మిట్టలు దాటి నడిస్తే లక్ష్యం చేరుతాము...."



తర్వాత ఆ వూరు పరిస్థితి విషయమై మాటలూ, కథలూ చిరుకండని తండ్రి పొలం పోగొట్టుకొన్న సంగతి, కోరని కథ కూడా.

మాటలు ముగుస్తూనే మాస్టరు అడిగారు :

"భోజనానికి ఏమి చేద్దామిప్పుడు?"

"నేనూ అదే ప్రశ్న అడుగుదా మనుకున్నాను" అన్నాడు దుబ్బోడు పళ్ళిగిలిస్తూ.

చిరుకండని తండ్రి "మా యింటికి వచ్చి వేయండి." అని అత్యంత వినయంతో అన్నాడు.

అయితే పండితుల కచ్చితమయిన ధ్వని నుంచి వేరే మాటలు వినిపించాయి :

"ఇప్పుడేమీ వద్దండి. ఇక్కడే కొంచెం సేపుండి. ఈ మార్గంగానే బయలుదేరుతాము."

ఆ మాటలను నమ్మలేక చిరుకండని తండ్రి అన్నాడు :

"ఇప్పుడే బయలుదేరాలా? రాత్రి విశ్రాంతి తీసుకోరా?"

"లేదు. వెలుగు రాకముందే త్రికరపురం దాటాలి."

ఈ సంగతులన్నింటి ఆంతర్యం తన తండ్రికి తెలియదని చిరుకండనికి విసుగనిపించింది.

అంతలోగా కోరడు లేచి నిలుచున్నాడు.

"ఎక్కడికి బయలుదేరావు?" అన్నారు మాస్టరు.

"ఆ హోటలు వాడిని లేపి అటుకులు అరటిపండ్లయినా తెస్తాను."

"ఎవరికి అని చెబుతావు?"

"అంత మాత్రం నాకు తెలీదా? నేను మంకు బుద్ధి వాణ్ణయినా, ఇంతకాలంగా మీతో వున్నందుకు...."

"కానీవయ్యా వెళ్ళు...." అన్నాడు మాస్టరు, నొప్పి పడ్డట్టు వస్తున్న కోరని మాటలు ఆపి.

కోరడు వెళ్ళగానే దుబ్బోడన్నాడు :

"సద్య, బదికాను! ఎక్కడ ఈ రాత్రంతా చన్నీళ్ళే గతి అని తీర్మానమవుతుందో అని భయమయింది."

పండితులు ఆ మాట విని ముబ్బోడి వైపు చూచి ఆత్మీయతతో చిరునవ్వు నవ్వారు...

....అదొక స్మరణీయమైన రాత్రి. ఒకరోజు ఒక సంవత్సరమంత అమూల్యమైనదనే భావం. దాని ఫలితంగా తాము త్వరత్వరగా పెరుగుతున్నామనే అనుభవం.

కయ్యూరికి పండితులు వచ్చినదాని ఫలశ్రుతే ప్రయోజన రాత్రి పాఠశాల. కొందరు రైతులు మాస్టరు వద్దకు వచ్చి తమకు చదువు, వ్రాత నేర్పండని కోరినట్టు వార్త వ్యాపించింది. కావలసిన చోటికి ఈ వార్త వ్యాపించనీ అని జమీందార్ల పిల్లలతో కూడా మాస్టరు ఆ విషయం ప్రస్తావించారు. తమకు పిలుపు రావచ్చు; కాని ఈసారి పట్టు వదలిపెటరాదు – అని నిర్ధారణ చేసుకున్నారు మాస్టరు.

తర్వాత జరిగినది ముందు నిరీక్షించిన దాని కన్నా కొంచెం భిన్నమైనది. మరునటి రోజు ఉదయమే ఊరి జమీందారిద్దరూ తమ తమ బంట్లతో పాటు బడికి దర్శన మిచ్చారు. అక్కడ వున్నది విరిగిన కుర్చీ ఒక్కటే.

"మీరు కూర్చోండి" అన్నారు నంబియారు నంబూదిరిని చూచి.

"మీరు కూర్చోండి" అన్నారు ఆయన ఇతనితో.

ఎవరూ కుర్చీలో కూర్చోలేదు.

"బడి అన్నమీదట ఒకటి, రెండు బెంచీలయినా ఉండాలయ్యా." అన్నారు నంబూదిరి. అది ధర్మకర్తల సమితి అధ్యక్షుల మీద ఆయన విసిరిన బాణం.

ఆ బాణాన్ని చేతితో లాగి పక్కకు విసిరేట్టు నంబియారు అన్నారు:

"బెంచీలు తెచ్చివేస్తే మన ఇంటి మనుషుల్ని ఇక్కడ కావలి కూడ పెట్టవలసి వస్తుంది."

వారిద్దరూ బడి ముంగిట్లోకి దిగారు. అప్పుడే వస్తున్నారు పిల్లవాళ్ళు. నంబియారు కుమారుడూ, నంబూదిరి కుమారులు తండ్రిని చూస్తూ ఈ దినం స్వాభిమానంతోనే లోపలికి వచ్చారు. తక్కిన వారు ధైర్యం చాలక కాలిబాటలోనే నిలబడిపోయారు.



నంబియారు మాస్టరుతో అన్నారు:

"మేమొక వార్త విన్నాము...."

మాస్టరు ఆయన మాటలు కొనసాగడానికి ఆస్పదం ఇవ్వలేదు.

"ఔను. నేనే వచ్చి తమకు తెలపాలనుకున్నాను. అంతలోగా తామే ఇక్కడికి దయచేశారు."

మాస్టరు అలా చెప్పగానే నంబూదిరి అన్నారు:

"చూడండయ్యా. నేను మొదటే స్పష్టంగా చెబుతున్నాను. పూర్వం ఈ బడి కట్టించడమే నాకు ఇష్టంలేదు. ఈ మహారాజు గెలిచారు. ఏమయినా అందరికీ విద్య లభించాలనే సూత్రాన్ని అప్పుడు ఒప్పుకున్నట్లయింది. అన్న తర్వాత, ఇప్పుడు రైతులు తమకూ చదువు కావాలని అడిగితే, ప్రతిఘటించడం సరికాదు. అయితే ఈ మహారాజుకు ఆ అభిప్రాయం సమ్మతం కాదు. ఏం చేద్దాం?"

ఇద్దరు ప్రముఖులు తమ వైయక్తిక ప్రతిష్ఠకోసం తమలో తాము నాజూకుగా వాదించుకొనే రీతినిచూచి మాస్టరు మోజు పడ్డారు.

ఇప్పుడు నంబియారు ఏమి చెబుతారో అని ఆయన కుతూహల పడ్డారు. ఏ అస్త్రాన్ని ఏ విధంగా ప్రయోగించాలని నంబియారు తటపటాయించినట్టు తోచింది.

"దీనికంతా అర్థంలేదు. ఇక్కడ సూత్రాల ప్రశ్నలేదు. వీళ్ళందరూ చదువు నేర్చే ప్రపంచోద్ధారం కావాలా ఏమిటి? చిన్న పిల్లలు చాలినంతమంది చదువు నేర్చుకోడం సరే అయితే పెద్దవాళ్ళు కూడా నేర్చుకోడమనే దేమిటి?"

నంబూదిరికి మాస్టరు తమవైపు వున్నారనే ఆత్మ విశ్వాసం ఎక్కువ బలాన్ని యిచ్చింది. ఆయన నంబియారు వైపు తిరిగి 'నేనే గెలిచాను' అనే ధోరణిలో అన్నారు:

"తెల్లవారినప్పటి నుంచి చర్చ చేస్తూ వచ్చాము. ఏమయ్యా ఆ దినం ఏమి చెప్పారు? కాలానుగుణంగా మనం నడుచుకోవాలి అని. ఈ దినం నేను అనేదీ అదే మాట."

నంబియారు గొంతు హెచ్చింది:

"పొలాల్లో వాళ్ళు పాటుపడడం తక్కువయితే?"

"పస్తుపడి చస్తారు. అంతే; దానికి మీరెందుకు విచారిస్తారు?"

"ఆ విధంగా పరిస్థితి చేయిజారి పోకుండా చూసుకోవాలి." అని మాస్టరు అన్నారు. అలాగే "నా ఈ మాటలకు అర్థమేమిటో!" అని తననే ప్రశ్నించుకున్నారు. అయితే వారిద్దరూ మాస్టరు మాటలను లక్ష్యపెట్టలేదు.

నంబియారు రెచ్చిపోయి అన్నారు:

"పాడయిపోనీ! నాకేమిటి?"

"అబ్బ! ఏమైనా ఈసారి నేను గెలిచాను."

నంబియారు కన్నా వయస్సులో పెద్దవారయిన ఈ నంబూదిరి మాటలలో పసి పిల్లల మంకుతనం ఉండేది.

ముఖం చిట్లించుకొని నంబియారు అన్నారు:

"కానీ? అయితే ఆ విద్యాభ్యాసం ఈ బడిలో జరుగకూడదు. ఇది పిల్లల బడి. ముసలివాళ్ళ బడి కాదు. ఈ విషయాలలో అంత ఆసక్తి వున్నవారు వేరే బడి కట్టించనీ."

చివరి మాట నంబూదిరి పైన విసిరిన మరొక బాణం. నంబూదిరి వూరుకుండడం చూచి నంబియారు మాస్టరు వైపు తిరిగి చెప్పారు:

"ఏమంటారు మాస్టరుగారూ?"

తమకు అనుకూలమయినట్లు జరిగిన ఈ సందర్భంతో ఉత్తేజితులయిన మాస్టరు సమాధానం చెప్పారు:

"ఈ బడిలోనే వయోజనులకూ పాఠం చెప్పరాదు. వాళ్ళే ఎక్కడన్నా చోటు ఏర్పాటు చేసుకోనీ."

ఇప్పుడు నంబూదిరి మాస్టరును అడిగారు:

"ఇదంతా చూస్తే నాలుగు డబ్బులు ఎక్కువ సంపాదన కోసం మీరే ఏర్పాటు చేసుకొన్నట్టు కనిపిస్తుంది!"

మాస్టరు ముఖం అవమానంతో ఎర్రబడింది. అయినా ఆయన నవ్వి, అలాటి ఆరోపణా మంచిదేనని భావించి సమాధాన మిచ్చారు:



"అలా ఏమీలేదు. ఇచ్చినా, మహా వాళ్ళేమి ఇవ్వగలరు?"

"ఇస్తారు మన్ను!" అని నంబియారు కినుకతో అని, సిగరెట్టుపై చేయి వేశారు.

నంబూదిరి నవ్వుతూ అన్నారు:

"మీకు ఒక్క సంగతి చెపుతాను మాస్టరుగారూ. వారిని నమ్ముకుని మీరుండకండి. మీ రాత్రి పాఠశాల నాలుగు దినాలు గడిస్తే గొప్ప. విద్యా సరస్వతి ఎక్కడ? రైతులెక్కడ?? గంతులేసే కోతిని చూడడానికి వీళ్ళంతా వస్తారుగాని?"

రైతుల చదువుకు సంబంధించి ఇద్దరు జమీందార్లకు భిన్నాభిప్రాయాలు లేవు. వారిలోని వైయక్తిక అసూయవల్ల రైతులకు ఈ విషయంలో హితం జరిగింది. అంతే, అది మాస్టరుకు స్పష్టమయింది.

కరుణాకరుణ్ని, నంబూదిరి పిల్లలను మాస్టరు పిలిచి అన్నారు:

"నా గదికి వెళ్ళి కూర్చోండి. వచ్చేస్తాను."

అది తమ పిల్లలకోసం ప్రత్యేకపాఠం. దానినుంచి జమీందారు లిద్దరికీ సంతృప్తి కలిగింది.

"ఇక పోదా మేమయ్యా?" అన్నారు నంబూదిరి నంబియారుతో.

నంబియారు "హూ." అన్నారు. కాలిబాటకు దిగుతూ వారు వెనక్కు తిరిగి, తామిద్దరికీ చేతులు జోడించి నమస్కరిస్తున్న మాస్టరును చూచి అన్నారు:

"ఈ గలాటాలో బడి పిల్లలకు సరిగా పాఠాలు చెప్పడం మరువకండి!"

"ఎక్కడైనా కద్దా? ఛ! ఛ!" అన్నారు మాస్టరు అన్ని పళ్ళూ ఇగిలించి నవ్వుతూ.

వెళ్ళిపోయిన జమీందార్లను వారి బంట్లు అనుసరించారు. కాలిబాటలో నిలుచున్న పిల్లలు ఇప్పుడు గోల చేసి ధూళి లేపుతూ లోపలికి వచ్చారు.

....రాత్రి పాఠశాల విషయంలో అతి సులభంగా లభించిన ఈ విజయం చూడాలి. అప్పు, చిరుకండడు పొంగిపోయినంత పని అయింది. కోరని కొట్టమే కమ్యూరు రాత్రి పాఠశాల. దానిని ఏర్పాటు చేయడం సులభం. అయితే, కష్టమయినదంతా జనాన్ని అక్కడికి పిలిపించే పని. మొదట ఒకటి. రెండు వారాలపాటు వచ్చినవాళ్ళు ముగ్గురో, నలుగురో ఆ మీదట సంఖ్య పన్నెండుకు హెచ్చింది. మళ్ళీ ఆరుకు దిగింది. మాస్టరు కూడా దాని నుంచి కుంగిపోలేదు. అక్షరజ్ఞానాన్ని, లోక జ్ఞానాన్ని బోధించే వారి నవీన పద్ధతికి ఆ రాత్రిబడి ప్రయోగ క్షేత్ర మయింది.

ఒక యువ కర్షకుని పరిచయం మాస్టరుకు కావడం ఆ సందర్భంలోనే. అతని పేరు కణ్ణడు. అతడు ఆ పల్లె పడుచుల కంటిగ్రుడ్డు. సొగసైన మేనుకట్టు. నూనూగు మీసాలు, తేజఃపూర్ణమైన కన్నులు. ఆ ఆకర్షణీయమైన వ్యక్తిత్వం తమకు లేదని మిడుకుతున్న వారెందరో! ఇవి చాలనందుకు అతనికి అమోఘమైన కంఠం వుంది. ఏదైనా పాటను అతడు నిండైన కంఠంతో పాడితే, జనమే కాదు మృగాలూ, మానులూ తల వూపి తమ భావాన్ని వ్యక్తం చేస్తున్న వేమో నన్నట్టు ఉండేది.

అతనిని మాస్టరు రాత్రి పాఠశాలకు పిలుచుకొని వచ్చారు. వానికి చదువు అవసరం లేదు. పాట పాడూ అన్నప్పుడు మాత్రం ముఖం విప్పారేది. తరగతి ఆరంభం కావడానికి ముందే ప్రతీ రాత్రి అతడు పాడాడు. అప్పుడు చీకట్లో ఆ ప్రాంతమంతా నాదమయమై మేను మరచి పోయేది. అతనికి మాస్టరు కేరళ జాతీయ కవి కుమారన్ ఆశాన్ కవితల పరిచయం చేశారు. వల్లత్తోళ్ కవితలను తెలియచెప్పారు. ఈ విధంగా ఆ మధుర కంఠం నూతన చైతన్యంతో నిండారింది. కణ్ణడు అందరి గౌరవానికి పాత్ర మయ్యాడు.

తనను ఆ స్థితికి తెచ్చిన మాస్టరుతో చదువు రాని కణ్ణడు ఒకనాడు అడిగాడు :

"ఇంకా వేరే పాటలు లేవా మాస్టరుగారూ ?"

"కావలసినన్ని ఉన్నాయి. మానవునికి మాటలు వచ్చిన నాటి నుంచి పాడలేదా ! పాటలు కట్టలేదా !"



"అలా కాదు మాస్టరుగారూ...."

ఆతడు మాట్లాడదలచుకొన్న దేమిటో ఆయనకు స్పష్టమయింది. మనస్సులోనే నవ్వుకొని ఆయన అన్నారు :

"చూడవోయ్ కణ్ణా ! నా వద్ద పది పాటల పుస్తకా లున్నాయి. అన్నీ నీకే ఇస్తాను. నీవే దగ్గిర ఉంచుకో !"

కణ్ణని ముఖం కాంతి తగ్గి చప్పబడింది. మాస్టరు చిన్నగా నవ్వారు :

"ఏమిటి ! పుస్తకాలు వద్దా ?"

ఉత్తరం చెప్పక కణ్ణడు వెళ్ళిపోయాడు. "వాడికి అవమానమయిందని తోస్తుంది" అన్నాడు దగ్గరలోనే వున్న చిరుకండడు. "పోనీ లే" అన్నారు మాస్టరు.

మరుసటి రాత్రి కణ్ణడు కోరని కొట్టానికి వచ్చినప్పుడు అతని ముఖం నవ్వులు విరజిమ్మలేదు. పాడినప్పుడు కంఠమూ హృదయాఘాతం ఫలితంగా కంపించింది. పాట ముగిసిన వెంటనే అతడు మాస్టరు వద్దకు వచ్చి తాను సంపాదించుకొని వచ్చిన పలకను ఆయన ముందు పెట్టి "అక్షరాలు వరవడి పెట్టి ఇవ్వండి" అన్నాడు.

మాస్టరు నవ్వలేదు. స్లేటును పరీక్షించి చూచి "ఇది బాగుంది ? ఎక్కడ నుంచి తెచ్చావు !" అన్నారు.

"నీలేశ్వరం నుంచి."

"అది ఈరోజు వెళ్ళి తెచ్చావా ?"

"ఔను. అక్షరాలు వ్రాసివ్వండి."

కంపిస్తున్న ఆ ధ్వనిలో అసహనమూ కలిసివుంది. మాస్టరు హృదయం పొంగి వచ్చినా, దాన్ని చూపక, ఆ స్లేటు మీద మొదటి అక్షరాలు వ్రాసి యిచ్చారు. స్లేటును వెనక్కు అందించి కణ్ణని భుజాన్ని మృదువుగా నొక్కారు. అతడు తలయెత్తి చూచాడు. అతని రెండు కన్నులలోను నీళ్ళు నిండాయి.

....ఆ రాత్రి పాఠశాలకు ఎప్పుడయినా ఒకమారు వేరే పల్లె అపరిచితు లొకరు రావడమూ కద్దు. వారి కందరికీ ఆయనను ఉపా

ధ్యాయులు అని మాస్టరు పరిచయం చేసేవారు. అలా వచ్చేవారు, ఎన్నో సార్లు అక్కడ గుమిగూడిన వారికి ప్రపంచ జ్ఞానం గురించి ప్రసంగించడమూ కద్దు.

ఈ విధంగా వస్తున్నవారి మూలంగా పెన్సిలుతో వ్రాసిన కాయితాలు కయ్యూరు చేరేవి, మాస్టరు వాటిని అప్పు, చిరుకండలకు ఇచ్చి, చదివించేవారు; చదివి వారితో చర్చలు జరిపేవారు.

అది పోరాటపు 'విశిష్ట సాహిత్యం'.

అలాటి ఒక వ్యాసం శీర్షిక యిలా వుంది: "రైతు - కార్మిక విప్లవం మూలంగానే స్వాతంత్ర్యం సాధ్యం!" మసక మసక అక్షరాలు. అయినా అప్పు, చిరుకండడు కలిసి దానిని చదివారు. వ్యాసం మొదట్లోనే ఒక సంబోధన ఉంది: "కామ్రేడ్స్!" ఆ పదం నుంచి బయలువెడలినది ఆత్మీయతా ధ్వని. చివర "ప్రపంచ కార్మికులారా ఏకం కండి!" అనే నినాద ముంది. ఆ వరుసలోనే రణ గర్జన: "సామ్రాజ్యవాదం నశించాలి!" "విప్లవం జయించాలి!"

ఈ పదాల గుంజారవంలోనే కొంతసేపు తన్మయుడై కూర్చున్న అప్పు మేల్కొని అన్నాడు:

"మనదంతా మాటల్లోనే ముగిసిందోయ్! త్రికరపురానికి వెళ్ళి చందు నయినా చూడవలసింది. దుబ్బోడు ఆ రోజు అన్నట్టు మనం బావిలో వుండే వట్టి కప్పలం...."

పదాలను తూచి చెపుతూ చిరుకండ డన్నాడు:

"మనం చెట్లు కావాలని కదా నీవు చెప్పడం? కానీ! త్రికరపురం ఒక్కటేమిటి? మడికైకు వెళ్ళుదాము, పుదులైకి వెళ్ళుదాము, నీలేశ్వరానికి, హొసదుర్గానికి, కళ్ళికోటకు, ఢిల్లీకి.... చాలునేమయ్యా?"

అప్పు, చిరుకండని మెడను తన కుడిచేయి చుట్టి తన వైపునకు లాక్కున్నాడు.



# 9

ఒక అమావాస్య రాత్రి తరగతి ముగియగానే చివరకు వెలుపలికి వచ్చినవారు - మాస్టరు, కణ్ణడు, అప్పు. మాస్టరు తమ బడి వైపు తిరిగిన మీదట కణ్ణడు, అప్పు ఇద్దరే దారిన నడుస్తున్నారు.

"మా ఇంటి వరకు రా రా, అప్పు. అమ్మ ఈరోజు తియ్య కుడుములు చేసిపెట్టింది. తినిపోదువుగాని." అని కణ్ణడు అప్పును ఆహ్వానించాడు.

"వద్దు కణ్ణా, ఆలస్య మవుతుంది. ఇంకొకసారి ఎప్పుడయినా వస్తాను." అని చెప్పి అప్పు తప్పించుకొనడానికి ప్రయత్నించాడు.

"నీవు ఇలా చెప్పడం మూడోసారి. ఊహూఁ! ఈ రోజు నీవు వచ్చే తీరాలి. కుడుములు తిన్నమీదట మీ యింటి వరకు వదిలిపెట్టి వస్తాను."

ఆ పట్టుదల పిలుపును నిరాకరించలేక, అప్పు కణ్ణని వెంట వెళ్ళాడు. అతని గుడిసె ఉన్నది ఏటి ఒడ్డున. పడవ నడిపే తండ్రి నీటి పాలయినప్పుడు కణ్ణడు పసికందు. తండ్రిలేని ఆ శిశువును బీదతల్లి పెంచి పెద్దవానిని చేసింది. ఉన్న యింత స్థలంలోను కూరగాయలు పండించి, నీలేశ్వరం బజారుకు తీసుకువెళ్ళి అమ్మి, పిల్లవాని పాలన, పోషణలు చేసేది. కొడుకు పెద్దవాడయిన తర్వాత కూడా — కూరగాయల పని ఒక్కడే చేయగల సమర్థుడైన పిదప గూడ — ఆ తల్లి పాటుపడడం మానలేదు. నెరిసిన వెంట్రుకలతో, ముడుతలు పడ్డ ముఖంతో ఉన్న ఆ ప్రాణి కణ్ణనిని ఇప్పటికీ పసిపాపడుగానే చూచేది.

— ఆ పొలం ఈ కొనలో దారి చీలేది. ఎడమవైపు తిరిగి నడిస్తే కణ్ణని గుడిసె. అయితే కణ్ణడు తిరుగకుండా ఆగి కుడివైపు

చూచాడు. అక్కడే కూతవేటు దూరంలో ఒక మగవాని, ఒక ఆడదాని గొంతుకలు గట్టిగా వినిపిస్తున్నవి. కణ్ణడు ఆలకించాడు. అప్ప కూడ చెవులు రిక్కించినాడు. ఉద్వేగపూరితమయిన పోట్లాట మాటలు, నిస్సహాయతతో కంపిస్తున్న స్త్రీ ధ్వని, బెదిరిస్తున్న మగవాని గడుసు గొంతుక.

కణ్ణడు చీకాకుతో అడిగాడు :

"అప్ప, వినబడిందా ?"

"హూఁ, అది ఎవరిల్లు ?"

"దేవకిది."

"దేవకి ?"

"హూఁ ! రా...."

కణ్ణడు విసురుగా కుడివైపు తిరిగి నడిచాడు. అప్ప కూడ అంత విసురుగానే, అతనిని వెంబడించాడు. ఎదతోపాటు మెదడూ కొట్టుకుంటూ యోచించింది. దేవకి – ఎవరు దేవకి ? నిరుడు విషజ్వరంతో మరణించిన బీదరైతు పెళ్ళాం – చిన్నపిల్ల తల్లి. "మా అమ్మతో పాటు దేవకి అని ఒకతె కూరగాయలు అమ్మడానికి వెళుతుంది. పాపం ! చిన్న బిడ్డను వీపుకు కట్టుకొని పోతుంది" అని కొన్నాళ్ళ క్రిందట కణ్ణడే అప్పకు చెప్పాడు. అలా అయితే, ఆ దేవకిని బెదిరిస్తున్న మగవాడు ఎవడయి వుంటాడు ?.... వెంటనే పరిస్థితి ఏమయి వుంటుందని అర్థమయి అప్ప రక్తం చల్లబడింది. అయితే, మరుక్షణమే రక్తం ముందుకన్నా హెచ్చు వేగంతో దూకుతూ పారింది.

కణ్ణడు ఆ చీకటిలోను దారి గుర్తించి నెమ్మదిగా పరుగెత్తాడు. అప్ప అతని వెంటే పరుగెత్తాడు.

ఆ గుడిసె మరింత దగ్గర కాగానే, వాళ్ళు కొంచెం ఆగారు. అక్కడికి మాటలు స్పష్టంగా వినిపించాయి.

కణ్ణడు నెమ్మదిగా అన్నాడు :

"వాడు నంబియారు బంటు. గొంతు గుర్తు పట్టావా ?"



"హుఁ !"

"తాగి వున్నాడు."

"హూఁ !"

తాగిన ఆ మనిషి బీద గుడిసె వెదురు తడికల తలుపును తంతున్నాడు.

"ఇది విరగ్గొట్టడమేమీ పెద్ద సంగతి కాదు. నీవయి పిలుచుకుంటే మంచిది. దొర అప్పుడే లేచారు. వారి సేవ చేయడానికి ముందే.... హిక్...."

లోపల తల్లి రొమ్ములకు అంటుకొనిపోయిన పసిపాప ఏడుస్తున్నది. దేవకి గట్టిగా చెబుతున్నది :

"దేవుడు నీకు శిక్ష ఇవ్వకుండా వుండడు. పాపిష్ఠివాడా !"

"ఇన్నాళ్ళూ.... నీవయి దారికి వస్తావని ఆగాను.... హిక్.... అయితే.... ఎంత పొగరు నీకు.... హిక్.... అదెలా – ఎవరూ లేకుండా ఒంటిగా వుంటావు ?"

"ఇలాటి మాటలు మాట్లాడి నీవు నరకానికి పోతావు సుమా !"

"హిక్.... ఒకసారి చేర్చుకో. అప్పుడు తెలుస్తుంది స్వర్గమో, నరకమో అని."

"దుర్మార్గుడా ?"

"ఎంతసేపే ? తీ తలుపు !"

"నేను తీయను."

మాట్లాడుతున్న మనిషి గట్టిగా, గుడిసె కూలి పడిపోయేటట్టు, తలుపు కొట్ట సాగినాడు. స్త్రీ లోపలినుంచి 'అయ్యో దేవుడా! అయ్యో!' అని అరచింది.

ముందుకు నడిచాడు కణ్ణడు. మాట్లాడకుండ వెనక కంచెలో వున్న ఒక్క వెదురు బొంగును లాగి అప్ప చేతికిచ్చాడు. అర్ధక్షణంలోనే జమీందారుగారి బంటు వీపు మీద దెబ్బలు పడ్డాయి. నడుము విరిగేట్టు పడ్డాయి. వాడు వెనక్కు తిరిగి చూచినప్పుడు గ్రుక్క తిప్పుకోడానికి

కూడ అవకాశం లేకుండా మోరమీద గుద్దులు పడ్డాయి. "చచ్చాన్రోయ్, చచ్చాను" అంటూ వాడు దొర్లి పడ్డాడు. అప్పు చేతి వెదురుగడ వాడు దొర్లింది ఎక్కడ అని వెదికి చూచింది.

అంతలోపలనే దేవకి తలుపు తీసింది. ఆ చీకటిలోను తన రక్షణకు వచ్చినవాడు ఎవడని గుర్తించడం ఆమెకు కష్టం కాలేదు. ఆమె ఏడుస్తూ కృతజ్ఞత నిండిన ధ్వనితో అన్నది :

"నా నుంచి ఎంత ఇబ్బంది మీకంతా !"

అప్పు వెదురుగడ పడిపోయిన వాడి వెన్నును మరొకమారు పరామర్శించింది. అప్పుడు దేవకి అన్నది :

"అతణ్ని చంపకండయ్యా, రేపు మన కందరికీ ఉరిశిక్ష అయ్యాని!"

"థూ !" అని ఉమిసి కణ్ణడు అన్నాడు : "వాడిని ఎవరు చంపుతారు ? అదొక పురుగు."

అయితే ఆ పురుగు కదిలే ఛాయ కనిపించలేదు. కణ్ణడు వంగి చూచాడు.

"కుక్కకు తెలివి తప్పింది. మంచిదే అయింది అప్పు. వీడిని మోస్కానిపోయి కొంత దూరాన వదలి పెడదాము."

"హూఁ" అన్నాడు అప్పు.

"దేవకి నీవు తలుపు బిగించి మా గుడిసెకు పోతావా ? ఇప్పుడే వస్తున్నామని అమ్మకు చెప్పు."

ఆమె ఏమీ నిశ్చయించుకోలేక తటపటాయించినట్లు తోచింది.

"ఊరికే ఆలోచించవద్దు. ఈ లఫంగుల బాధ ఉండేదే. బిడ్డను ఎత్తుకొని ఒంటిగా పోవడానికి అవుతుందా ? లేకపోతే మేము వచ్చేవరకూ కాచుకుని వుంటావా ?"

గుడిసె లోపల కదలాడే కిరసనాయిలు బుడ్డి దీపం మసక వెలుతురులో ఆమె సహన సంకటాల ప్రతిరూపంగా అప్పుకు కనిపించింది. అతని కంఠం నుంచి ధ్వని వెలువడి అన్నది :

"అక్కా ! ఇక్కడ వుండకండి. మీరు కణ్ణని ఇంటికి వెళ్ళండి."



కంఠధ్వని అపరిచితమయినా తనను "అక్కా" అని పిలిచిన పిల్లవాణ్ణి దేవకి ఆత్మీయతతో చూచింది.

కణ్ణడు, అప్పు ముడుచుకొని పడిన ఆ మనిషిని ఎత్తుకొని నడిచారు. దేవకి ఏడుపు ఆపిన పసిబిడ్డను ఎత్తుకొని కణ్ణని ఇంటివైపు నడిచింది.

కొంత దూరంలోనే జమీందారుగారి కొబ్బరితోట ఆరంభమయ్యింది. కణ్ణడు, అప్పు ఆ మనిషిని అక్కడొక కొబ్బరి చెట్టు పక్కన దింపారు. వాడి కట్టుకున్న పంచను విప్పి శరీరాన్ని ఆ పంచతో కొబ్బరిచెట్టు మొదలుకు కట్టి బిగించారు. అతడు చావలేదని మరొకసారి నిశ్చయించుకొని, తమ దారి పట్టారు.

కణ్ణని ఇంట్లో అప్పు కుడుములు తినలేదు. అక్కడ అతడు నిలువనే లేదు. దీపం వెలుతురులో దేవకినీ, పసిపాపనూ మరోసారి చూచినపుడు ఏదో భావావేశంతో అప్పు కన్నుల్లో నీళ్ళు నిండాయి. "రేపు కలుస్తాను కణ్ణా !" అని చెప్పి అతడు చీకట్లో ఒక్కడే తన ఇంటికి బయలుదేరాడు.

ఇంట్లో భోజనం ముగించి పడుకోబోతున్న తండ్రి ప్రశ్నించాడు :

"ఎందుకురా, ఇంత ఆలస్యం ?"

అపూర్వమైన ఒకానొక అనుభవ తరంగాలమీద ఇంకా తేలుతున్న అప్పు సమాధాన మీయలేదు.

"వెలుగయినా పట్టుకొని రాగూడదేమిరా ? రాత్రిళ్ళు దయ్యంలాగ ఒక్కడే ఒంటిగా నడుస్తావు గదా !"

ఇప్పుడూ కొడుకు మౌనంగా వుండడం చూచి, వడ్డిస్తున్న తల్లి అన్నది :

"పిల్లవాడు ఒక బ్యాటరీ కొనిమ్మని నిరుడే అడిగాడు."

"వీడొక బ్యాటరీ పట్టుకొని వేటకుబోయే పెద్ద మనిషి ! కొనివ్వక పోయావా ?"

తండ్రి అలా మాటాడుతున్నా ఆ హృదయం మృదువయినదని అప్పుకు బాగా తెలుసు.

"డబ్బు లేకపోయింది" అన్నది తల్లి నవ్వి.

"హూఁ" అని తండ్రి మాటలు ఆపాడు.

....పడుకొని చాలాసేపయినా అప్పుకు నిద్రరాలేదు. ఆ ప్రాణి ఎక్కడైనా చచ్చిపోతే రేపు గోలకావటం నిశ్చయం. అయినా వాడు చచ్చినట్టు కనిపించలేదు. ఊపిరి కొంచెం ఆడుతూ వుండినది....ఏమైనా తెల్లవారగనే పరిగెత్తిపోయి చిరుకండనికి ఈ సంగతి చెప్పాలి. ఇద్దరూ వెళ్ళి మాస్టరుకూ తెలపాలి. ఆ కణ్ణడు ఎంత మంచివాడు ? దేవకితో పాటు ఆ చిన్న పాపా....

ఆ రీతి ఆలోచనలతోనే అప్పు నిద్రపోయాడు.

....రాత్రి గడిచింది. అప్పు తెల్లవారుజామునే లేచి, జమీందారు బంటును తాము కట్టివేసిన వైపునకు వెళ్ళి, దూరంగా నిలబడి ఆ చెట్టు వైపు దృష్టి సారించాడు. చెట్టు మొదట్లో ఏమీ వుండలేదు. ఆ మనిషి లేచి వెళ్ళిపోయాడనడం స్పష్టమయింది. అప్పుకు గుండె చులకనయినట్టనిపించింది. పక్షి వేగంతో చిరుకండని యింటికివెళ్ళి అతనిని లేపాడు.

ఉద్వేగం తొణికిసలాడే ధ్వనితో అప్పు అప్పగించిన వివరాలు విని చిరుకండని ముఖం గంభీరమయింది. ఎటువైపు వెళ్ళుదామని వారు అనుకోకపోయినా, ఇద్దరికాళ్ళూ మాస్టరు వద్దకు నడిచాయి. మిత్రుని మౌనం చూచి ఒక విధమయిన దిగులుతో అప్పు దారిలో అడిగాడు:

"మేము అలా చేయడం తప్పయిందా ?"

చిరుకండడు యోచిస్తున్నదీ ఆ విషయం గురించే.

"తప్పేమీలేదు. అయినా హెచ్చుతచ్చులయి వుంటే ఈ చిన్న కారణంగా మనకందరికీ వద్దన జరిగేది."

విప్లవకారుడు అని తాను భావించిన ఈ చిరుకండడు పిరికివాడా ? అనే అనుమానం మనస్సులో దూరి, కళ్ళవేడి అరి కళ్ళు చల్లబడ్డాయి. అతడు అన్నాడు :

"అంటే ?"



"రాత్రి బడినడపడం నంబియారుకు ఎంత మాత్రమూ ఇష్టం లేదు. ఏదైనా నెపం దొరగ్గానే ఆయన దీనిని నిలిపివేయ వచ్చునని మాస్టరు అన్నారు. రాత్రి కణ్ణడూ, నీవూ చిక్కుకొని వుంటే నంబియారుకు ఎంత సంతోష మయ్యేదో ! ఇలా ఈ చిన్న విషయానికే పెద్ద దెబ్బపడితే, వేరే పనులన్నిటికీ ఆటంకం కలిగేది. ఔనా !"

అప్పు కళ్ళు మళ్ళీ చలించాయి. చిరుకండడు పిరికివాడు కావడం ఎన్నటికీ సాధ్యం కాదు. అతడు ఆలోచనాపరుడు. దూరాలోచనా పరుడు. ఆ విషయం తనకు తెలియక పోలేదు....

అప్పు అన్నాడు :

"నీవు చెప్పేది నిజం. అయితే, వాడు ఒదిగి వున్నాడు. ఇప్పుడేమీ జరుగదు కదా ? అంతేకాక మేము ఎవరు అనేది వాడికి తెలియదు."

"హూఁ ఇప్పుడు అపాయం తక్కువ. అయినా, నంబియారుకు కణ్ణనిమీద సందేహం రానే వస్తుంది. వాళ్ళు వేటాడడానికి గురిపెట్టుకున్న మృగం దేవకి. ఇప్పుడు ఆమె చేతికి దొరకదు అన్నమీదట ఊరికే ఉంటారా ?"

చిరుకండని ఆ ఊహ అప్పుకు నిజమని తోచింది. శాంతి కలిగించే జవాబు తోచక అతని మనస్సు కుతకుతలాడింది.

....బడి చేరి, దాని వెనుకవున్న మాస్టర్ గదివైపు ఇద్దరూ నడిచారు. అయితే కణ్ణడు అప్పుడే అక్కడికి వచ్చాడు. మాస్టరు ఇంకా పక్కను చుట్టనైనా చుట్టలేదు. దానిమీదే కూర్చుని బీడీ తాగుతూ కణ్ణని మాటలను వింటున్నట్టు కనిపించింది. పిల్లవాళ్లు లోపలికి వచ్చినప్పుడు మాస్టరు వారివైపు చూచి, అప్పును మరింత తేరిపారజూచి, చిరునవ్వు నవ్వారు. గాబరా తాండవించకుండా మాస్టరు పెదవులపై నవ్వు నాట్యం చేయడం చూచి అప్పుకు మనస్సు కుదుటబడింది. వారిద్దరూ పక్కవద్ద నేలమీద కూర్చున్నారు. కొంచెం సేపు ఎవరూ మాట్లాడలేదు.

మాస్టరు యోచన ముగించి మౌనాన్ని భంగం చేస్తూ అన్నారు :

"కణ్ణా, నీవేమీ చింతపడనద్దు. వాళ్ళకు సందేహం రానేరావచ్చు. అయితే నీవు ఏమీ జరగనట్టే ఉండు !"

ఈ ఒక్క సంగతి బహూశ వీళ్ళకు తెలిసి వుండదని అప్పు అన్నాడు :

"వాడు అక్కడ లేడు. లేచి వెళ్ళిపోయాడు."

"హూఁ! తెల్లవారుజామునే వెళ్ళిపోయాడు. కుంటుతూ జమీందారుగారి ఇంటివైపు వెళ్ళడం నేనే చూచాను." అన్నాడు కణ్ణడు.

మాస్టరు కణ్ణని ముఖమే చూస్తూ మరొక ప్రశ్న వేశారు :

"దేవకి కొన్ని రోజులపాటు మీ యింట్లోనే ఉండనీ, కాదంటావా ?"

కణ్ణని ముఖం రంగు మారింది. అతడు చూపు దించి నేలను చూచాడు.

"అలాగే. అమ్మకు చెబుతాను."

"అలాగే చెయ్యి. కాకపోతే ఆమెను ఈ జనం మర్యాదతో బతకనివ్వరు. ఇది ఖండితం."

కణ్ణడు తలెత్తి మాస్టరునే చూచాడు. పెదవులు బిగుసుకుపోయి, వాడి ముఖం వాడింది. అతడు లేచి నిలబడి వీధిలోకి దిగాడు. నడకలో తొట్రుపాటులేదు. అడుగులు దిట్టంగా వున్నాయి.

మాస్టరులేచి పడక చుట్టచుట్టారు. పిల్లవాళ్ళవైపు చూచి నవ్వారు. వంగి అప్పు వెన్నుమీద నెమ్మదిగా గుద్ది అన్నారు :

"ఏమో అనుకున్నాను. అయినా ఫరవాలేదు నీవు !"

అప్పు గుండెలోని బాధంతా మాయమై ఉల్లాసం పొందాడు. చిరుకండని ముఖంలోను కళ కలిగింది. రాత్రి సంఘటనను మాస్టరుకు వివరించి చెబుదామనే ఆశతో అప్పు అడిగాడు :

"కణ్ణడు అంతా చెప్పాడా సార్ ?"

"ఔనోయ్. అయితే ఏమిటి - నీవు ఒకసారి చెబుదువు గానీ. నేను మొగం కడుక్కొనే వరకు కాచుకొని వుండాలి—అంతే."

శిష్యునికి తన సాహసాలను వర్ణించి చెప్పాలనే చాపల్యం ఏరాశంగా ఉందని మాస్టరుకు బాగా తెలుసు.



బహూశ, చిరుకండడు ఊహించినంత తీవ్రంగా వుండదు పరిస్థితి అని అప్పు భావించాడు. అయితే, ఆ భావం బలపడడానికి ముందే మాస్టరు అన్నారు :

"ఇలాంటి దంతా మనం నిరీక్షించడానికి ముందే వస్తుంది. ఏమీ చేయకుండా వుండేది పేడితనం. చేసినదేమైనా అతి అయితే, ఇంతవరకు చేసిన పనికంతా దెబ్బ. ఇది మంచి సంధిగ్ధావస్థ."

మళ్ళీ గుండె వేగంగా కొట్టుకోసాగి, అప్పు అన్నాడు :

"ముందేమౌతుంది సార్ ?"

"ఇప్పుడే ఎలా చెప్పగలం ? అయినా కణ్ణడిని వాళ్ళు ఊరికే వదలరు. దేవకికి ఆశ్రయమిచ్చినందుకు అతనికి కష్టం రానేవస్తుంది."

మాస్టరు వెలుపలికిపోయి ఒక మామిడాకు తెచ్చి దానిని రెండుగా నిలువునా చీల్చి చుట్టచుట్టి పళ్ళు తోముకున్నారు. ఆయన చెప్పినదీ, చిరుకండడు ఊహించినదీ చాలవరకు ఒక్కటే.

మాస్టరు ముఖం కడుక్కొని వచ్చినపుడు సంఘటన నివేదిక తెలిపే వుత్సాహమే అప్పుకు లేకపోయింది. అతని ముఖం వాడింది.

కొంచెంసేపు మాస్టరు ఊరుకుండి అన్నారు :

"అన్యాయాన్ని ప్రతిఘటించే వారు ఈ పల్లెలో వున్నారని జనానికి తెలుస్తుంది. నిన్న జరిగిన సంగతి బహిరంగంగా ఎవరూ మాట్లాడకుండా వుండవచ్చు. అయితే అది గుట్టుగా ఒక చెవి నుంచి మరొక చెవికి సంచారం చేయనే చేస్తుంది. జనం లేచి నిలబడేదే ఈ విధంగా. నిన్నటి వైయక్తిక ప్రశ్న అయితే ముందు సామూహిక ప్రశ్న వచ్చినప్పుడు మన జనం ఇలాంటి ధైర్యం, సాహసం చూపించాలి."

ఆయన మాటలు వెనుకటి రాత్రి జరిగినదాని విషయమై "ఇది ఇలాగు, ఇది అలాగు" అని తీర్పిచ్చి, రేపు జరుగబోయే దానికి ముందు సూచన చేసినట్టుంది.

మరొక బీడీ తాగుతూ మాస్టరు అన్నారు :

"ఇక వెళ్ళండి. జమీందారు వైపువారు ఎవరైనా వచ్చినా రావచ్చు. మీరిక్కడ పాలిపోయిన మొరలతో నిలబడి వుండడం సరికాదు. ఏమీ

జరుగనట్టు, ఏమీ తెలియని వారిలాగ ఉండండి. కొంచెం పొద్దు పోయిన తర్వాత చిరుకండ, హోటలు వద్దకు ఊరికే వెళ్ళు. జనం ఏమేమి మాట్లాడుతారో తెలుస్తుంది."

పిల్లవాళ్లు వెళ్ళిపోయారు. సూర్యుడు తలకెక్కాడు. అప్పు తేజస్విని చల్లటి నీళ్ళలో స్నానం చేయడానికి వెళ్ళిన మీదట చిరుకండదు జనం అనుకొనే మాటల కోసం చెవులు రిక్కించి అటూ ఇటూ తిరుగు లాడాడు.

ఆ నంబియారు అను నౌకరు చెడునడతవాడని చెడ్డపేరు గలవాడే. వెనుకటి రాత్రి ఎవరి ఇంటికో వెళ్ళి మంగళ హారతి చేయించుకొన్నాడనే వార్త వ్యాపించింది. దానిని వింటూ జనం నవ్వారు. ఆ మాటలలో నంబియారు ప్రస్తావనే లేదు....

....మరునటి రోజు అక్కడక్కడ దేవకి పేరు వినబడింది. నవ్వు మాటలు, ప్రశ్నార్థక చిహ్నంగా ముడివడిన కనుబొమలు, సహానుభూతి గొంతుకలు. తర్వాత, వారి సంభాషణలో ప్రసక్తుడైన కణ్ణడు, అర్థంతో కనిపించే చూపులు.

వీచిన పెనుగాలి అణగారలేదు. శాంతి నెలకొన్నట్టు కనిపించినా, ఒక్కమారుగా గాలి దేగలాగ దిగివచ్చి రాలిన ఆకులను ఎత్తుకుని పైకి లేచేట్టు తోచింది. అలాగే అక్కడా ఇక్కడా మాటలు వినిపించాయి.

జమీందారుగారి నుండి మాస్టరుకు పిలుపు వచ్చింది. దేవకి పేరే ఎత్తకుండ ఆయన అడిగారు:

"రాత్రిపొద్దు మా మనిషి ఒకర్ని కణ్ణడు అనే వాడెవడో కొట్టాడట."

అదే మొదటిసారి ఆ సంగతి విన్నట్టు మాస్టరు అన్నారు:

"అలాగా? కణ్ణడా? రాత్రి పాఠశాలకు కణ్ణడు అని ఒకడు వస్తుంటాడు. యువకుడు."

నంబియారు మాస్టరు చిత్తశుద్ధిని తూచుతున్నట్లు తీవ్రమైన చూపుతో చూశారు:



"వాడే, ఈ కయ్యూరిలో వేరే కణ్ణడు ఎవడున్నాడు.? నాకు తెలీదా?"

"సంగతి ఏమిటి అని కనుక్కుంటాను."

"మీరేమిటి కనుక్కుంటారు మాస్టరుగారూ? కనుక్కోడమంతా నాకు వదలండి. ఏమి చర్య తీసుకోవాలి అనేదంతా నేనే తీర్మానిస్తాను. మీ రాత్రి బడికి వాడు వస్తుంటాడు గదా....అందుకోసం వాడి విషయంలో మీకు హెచ్చరిక చెబుదామని పిలిచాను. మీరింక వెళ్ళిపోవచ్చు."

సంభాషణ సంగ్రహంగా ముగుస్తుందని మాస్టరు నిరీక్షించలేదు. మాస్టరు లేచి నిలుచున్నారు.

ఆయన బయలుదేరుతుండగా నంబియారు చివరి మాటగా అన్నారు:

"వారంతా జులాయిగాళ్ళు. వారి సహవాసంతో మీకు ఇబ్బంది కలుగకూడదు మాస్టరుగారూ! మీ పనికి అడ్డంకి కలుగరాదు. తెలిసిందా?"

గొంతు ఎండిపోయినా, మాస్టరు ప్రయత్నంతో "హుఁ. వస్తాను. నమస్కారం" అన్నారు.

తర్వాత నాలుగైదు దినాలవరకు కణ్ణనికి ఏమీ కాలేదు. అది ఒక రీతిగా ఆశ్చర్యకరమైన విషయం. తమకు కలిగిన అవమానాన్ని మింగి వూరికే కూర్చునేవారు కాదు. నంబియారు ఎన్నడూ. ఇప్పుడు తమకు ఎదురయినవాడు ఒక వ్యక్తిమాత్రం కాదనే అస్పష్టమైన భయమే ఆయనను తొందరపడకుండా ఆపి వుంటుందని మాసరు ఆలోచించారు. ఇప్పుడు ప్రతి రాత్రీ ఆయన చూస్తున్నది నిరుత్సాహి అయిన కణ్ణడిని. అతని ముఖం తేజోరహితమయింది. అతని హృదయంలోని బాధను మాస్టరు కొంతవరకు సరిగానే వూహించారు. అయితే దానికి ఇలాటిదే పరిహారమని నోరు తెరిచి సలహా ఇవ్వడానికి ఆయన వెనుదీశారు.

ఆ హృదయంలోని కల్లోలం ఏమిటని, ఆ మెదడులో ఏమి ఆలోచనలు చుట్టుకున్నాయని మొదట తెలుసుకున్నవాడు అప్పు. స్నానం కోసం నదికివెళ్ళిన అప్పు ఒంటిగా రాతిబండమీద కూర్చున్న కణ్ణడిని చూచాడు. ఇద్దరూ నీటిలో దిగి ఈదులాడారు. స్నానం చేశారు. అయితే

మనస్సు చల్లబడే వరకూ నీటిలో వుండాలని ఇద్దరికీ ఆసక్తి లేదు. గట్టెక్కి ఎండలో ఒళ్ళు ఆర్పుకున్నారు.

కణ్ణణ్ణి తదేకంగా చూస్తూ అప్పు అడిగాడు:

"ఎందుకురా అంత నీరసంగా ఉన్నావు?"

ఆ ప్రశ్నకు జవాబు రాలేదు. అయితే, కొంచెంసేపు ఆగి కణ్ణడు అడిగాడు:

"మాస్టరుగారు నా విషయం ఏమైనా చెప్పారా?"

"లేదే!"

మళ్ళీ మౌనం అప్పు సహనాన్ని పరీక్షించింది.

"నేను ఈ వూరు వదలి పోదామనుకున్నాను అప్పు."

అప్పు నిరీక్షించనిదానికన్నా చెడ్డగా వుంది సమాధానం.

"ఎందుకన్నా?"

"నీకు తెలియదా! ఇక్కడుండడం కష్టమవుతుంది. జనం ఏమేమి మాటాడుతున్నారు! నాకు చెవుల్లేవా ఏమిటి! వినపడవా!"

అది కణ్ణడు-దేవకి-వాళ్ళిద్దరికి సంబంధించిన మాటలు వయస్సులో చిన్నవాడైన తాను ఈ విషయంలో ఏమి చెప్పాలో తెలియక తటపట లాడాడు అప్పు. అయినా ఏమీ చెప్పక ఊరికే వుండడం సరికాదనుకొని అన్నాడు:

"దానన్నంతా నీవు మనస్సుకు పట్టించుకోరాదు. జనమందరూ చెడ్డ వారే వుంటారా?"

అది మాస్టరు నుంచి అప్పు నేర్చుకున్న పాఠం. అంతమందీ ఎప్పుడూ చెడ్డవారు కారు. జనంలో మంచివాళ్ళూ వుంటారు. చెడ్డవాళ్ళూ వుంటారు. చాలా చెడ్డవారి సంఖ్య అయితే చాలా తక్కువ....

"దేవకి ఇలా వుండడానికి సాధ్యంకాదు అప్పు. నేను ఆమెను పెళ్ళి చేసుకుంటాను."

ఆ జవాబు విన్నప్పుడు అప్పునకు అపూర్వమైన అనుభవం కలిగింది. తనకు తెలిసిన పద్ధతిలో అతడూ ఆ విషయం యోచించాడు.



దేవకిని కణ్ణడు పెండ్లాడితే, ఈ సమస్య చాలవరకు తెగుతుందని అప్పుకు తోచింది. అయితే దేవకి విధవ. చిన్నపిల్ల తల్లి. అయినా....

కణ్ణడే మాటలు సాగించాడు:

"కాసరగోడుకో, కణ్ణానూరుకో వెళ్ళి కూలిపని చేసుకుంటాను. ఈ ఊరు ఋణం తీరిం దనుకుంటాను."

అతని కంఠం గద్గదమై కళ్ళ చివర్లలో నీరు తొణికిసలాడినది. నీటి ఋణం-అనే మాట సాంప్రదాయకం. అప్పుకు అది తెలుసు. ఆ మాట వెనుక వున్న భావనలోని లోతూ అతనికి అర్థమయింది.

"ఎందుకలా అంటావు? ఈ వూరు వదలి ఎందుకు పోవాలి?"

''మరి యిక్కడ బతకనిస్తా రనుకున్నావా?''

ఆ నిస్సహాయతాధ్వని అప్పుకు ఎంత మాత్రమూ యిష్టంలేదు.

"మేం యింతమంది వున్నప్పుడు నీకు ఏమిటి భయం? పాటుపడి బతికే జనం ఎవరికి ఎందుకు భయపడాలి? మనం ఐకమత్యంతో ఉంటే..."

వేయిసార్లు విన్న, నూరుసార్లు తానే చెప్పిన మాటనే యిక్కడ పునశ్చరణ చేస్తున్నానని అప్పు మనస్సుకు తోచింది. అది మూల మంత్రం: కట్టు-జనం ఐకమత్యం. ఆ మాటలు అన్నాడు-వాస్తవమే. అయితే కణ్ణనిపైన అవి అనుకున్నంత ప్రభావం ప్రసరింప జేసినట్టు తోచలేదు. వెంటనే మాస్టరు జ్ఞాపకం వచ్చి అతడు అడిగాడు:

"మాస్టరుకు చెప్పావా?"

"లేదు."

"మరి చెప్పవద్దా?"

"చెప్పడానికి ఒక విధమైన సంకోచం అప్పూ. ఆయన ఏమను కుంటారో?"

"ఛ! ఛ? బాగా అన్నావు! ఇలాంటిదంతా ఆయనకు తెలుపకుండా ఉండడం అయ్యేనా!"

రెండు నిమిషాలు ఊరుకుండి కణ్ణడు శాంతమైన గొంతుతో అన్నాడు:

"మాస్టరు ఎదుట కూర్చున్నప్పుడు నాకు మాట రాలేదు. నీవొక పని చేస్తావా అప్పూ? నా మనస్సులో ఏమున్నది అనే దానిని మాస్టరుకు చెబుతావా!"

"హుఁ." అన్నాడు అప్పు. తనమీద విశ్వాసం ఉంచి కణ్ణడు అలాంటి పని ఒప్పించాడని అతనికి సంతోష మయింది....

....మాస్టరుకు ఆశ్చర్యం కాలేదు. కణ్ణడు దేవకిని పెళ్ళాడితే సమస్య పరిష్కార మవుతుందని ఆయన మొదట్లోనే ఆలోచింశారు. కాని, కణ్ణ మనస్సుదేవకి మనస్సు తెలుసుకోక ఏమి చెప్పడమూ సరికాదని ఆయన అభిప్రాయం. పెళ్ళికి కరుణ, సానుభూతి చాలవు. మగవాడు, ఆడది పరస్పరం ఇచ్చి పుచ్చుకునే ప్రేమా కావాలి—అని నమ్మిన మాస్టరు కణ్ణని నుంచే ఆ ప్రస్తావన వచ్చే వరకు తాము ఊరికే వుండాలని అనుకొన్నారు. ఇప్పుడు సంగతి స్పష్టమయి నందుకు ఆయన కుదుటబడ్డారు.

అప్పు తనకు వ్యాకుల కారణమైన ఒక సంగతి చెప్పాడు:

"పెళ్ళయిన తర్వాత ఊరు వదిలి వెళ్ళుతానని కణ్ణడు అన్నాడు."

మాస్టరుకు అది చోద్యమనిపించలేదు.

"వ్యధ కలిగినప్పుడు అలా మాట్లాడడం స్వాభావికం. నేను వాడికి చెబుతాను."

ఆ రాత్రే మాస్టరు కణ్ణడిని పిలిపించి ప్రత్యేకంగా మాట్లాడారు. దాని పరిణామంగా చాలనాళ్ళ తర్వాత మరొకమారు అతని ముఖం విప్పారింది. తడిసిన కన్నులు వెలుగుతో వెలిగాయి, పెదవులపై నవ్వు నాట్యమాడింది.

రాత్రిబడి తరగతి ముగియగానే మాస్టరు అక్కడున్న వారిని ఉద్దేశించి అన్నారు:

"ఇప్పుడు మీకొక సంతోష వార్త చెబుతాను.మన పాఠశాల విద్యార్థి కణ్ణడు మీ కందరికీ పరిచితురాలైన దేవకిని పెళ్ళాడనున్నాడు. ఈ శుభ కార్యం చాలినంత తొందరలో జరిగి మన కందరికీ పండుగ భోజనం లభించనీ అనేదే మన ప్రార్థన. కాదా? మరేమి అందాము!"



అక్కడున్న వారిలో గుస గుసలు, గుజ గుజలు, ప్రశంసలు వెలువడ్డాయి....

ఒకప్పుడు పసిపాపను ఎత్తుకొని పడరాని పాట్లు పడ్డ కణ్ణని విధవ తల్లి ఈ పెళ్ళికి ఆక్షేపణ చెప్పలేదు. గుణవతి, రూపవతి అయిన దేవకి తన కోడలవుతుందని ముసలమ్మకు సంతోషమే కలిగింది.

పెళ్ళి ఎక్కువ వెచ్చం లేకనే జరిగింది. ఆ సమయంలో పెద్దగా ఎక్కువ అటూఇటూ తిరిగినవాడు చిరుకండని తండ్రి. ఒకప్పుడు సాధువుగా, మాటా మంతీ లేక మూగవాడిలాగా వున్న ఇతడు, ఇప్పుడు పునర్జన్మ పొందిన కొత్తమనిషివలె తిరగటం, వెరగు పడజేసే సంగతి. జమీందారుగారి కళ్ళు మండుతుండగా, ఆయన నమ్మినబంటు తన నడుమును తడిమి చూచుకొంటుండగా కణ్ణడు, దేవకి ఆలుమగ లయ్యారు. మాస్టరు పెళ్ళి సమయంలో అక్కడ కనిపించకపోయినా, రాత్రి భోజనానికి తప్పక హాజరయ్యారు.

కణ్ణని సూచన ప్రకారం, మాస్టరు అనుమతి పొందిన కోరడు తన కొట్టం వదలి, ఇపుడు ఖాళీ అయిన దేవకి గుడిసెకు వచ్చి కాపురం పెట్టాడు. రాత్రి పాఠశాలకు వస్తున్న రైతులు ఆ గుడిసెను అక్కడ ఇక్కడ చక్కబరచి మరింత భద్రంగా చేశారు.

కణ్ణడు కయ్యూరు వాడుగనే ఉండిపోయాడు. విని తెలుసుకొన్న, చదివి తెలుసుకొన్న కొత్త పాటలన్నిటినీ ఇప్పుడు అతని చైతన్యవంత మైన కంఠం పాడింది.

పల్లెపిల్లలు, యువతులు దేవకిదైపోయిన ఆ నగను ఇంకనూ చూచారు. కాని ఆ చూపులో ఆక్రమించు కొందామనే ఆకాంక్ష లేదు. ఆశలేదు.

# 10

కాలం ఎప్పటిలాగ గడిచింది. రైతుల పాలిటికి అది దొర్లుతున్నది ఒకే రీతిగా. సృష్టి నియమం ప్రకారం వచ్చిపోతున్న ఋతువులు. ఋతువులకు అనుగుణంగా దుక్కి, విత్తడం, కోతలు, ఊడ్పులు. అయితే ఎక్కువ పంట, లేకపోతే తక్కువ పంట. కొంచెం సుఖం, లేకపోతే ఎక్కువ కష్టాలు. వారిలో అనేకుల సామాన్య దృష్టికి కనిపించేది నీరసమైన, ఒకే విధమైన బతుకు. మానవుడు పుడతాడు, పెరుగుతాడు, గిట్టుతాడు. పూర్వమూ అలా జరిగేది, ఇప్పుడూ అలా జరుగుతున్నది, ఇక ముందూ అంతే. అయితే వేరే కొందరున్నారు. నూతన ఆలోచనల నికషానికి తమ మెదడును రాచి చూసినవారు. బతుకు ఎందుకిలా వున్నదని వారికి తెలుసు. దానిని చక్కబరచాలనే బలవత్తరమైన ఆశ వారికి. ఎప్పుడలా చేస్తామో అనే తమకం. కాలం చాల నిదానంగా దొర్లుతున్నదని వారు ఆక్షేపించేవారు.

అప్పు, చిరుకండడు ఇప్పుడు 'వట్టి పోరలు' అని తాత్సారం చేయదగిన చిన్నవారు కారు, ఏటేటా వర్షాకాలంలో మొక్కబలిసేలాగ వారు పెరుగుతున్నారు.

"పిల్లవాడు పెద్దవాడయ్యాడు" అనేది కల్యాణి, పలుచగా ఎత్తుగా పెరిగిన కుమారుడు చిరుకండని చూస్తూ. ఎక్కడయినా అమ్మాయిని చూస్తూ వుండాలి అనే పరోక్ష సూచనే ఆ మాటల అర్థం. అయితే రోజులు గడిచినకొద్దీ చిన్నవాడవుతూ నడుస్తున్న ఆమె భర్తకు ఆ మాటల లక్ష్యం వుండేది కాదు.

చూడడానికి అప్పే భారీ మనిషి. తల్లి టార్చి ఇప్పించింది. చెప్పులు కొనిచ్చింది. రాత్రి విశేషమయిన పని ఏదీ లేక వెలుపలికి



వెళ్ళినప్పుడు అప్పు టార్చి వాడేవాడు. మసక వెలుతురున్న ఒక టార్చి చూడగానే అది అప్పు కావచ్చునని ఊరివాళ్ళ నమ్మిక. అయితే ప్రత్యేకమయిన ఏ పనికయినా వెలుపలికి వెళ్ళినప్పుడు అప్పు టార్చివాడేవాడు కాదు. రహస్య సంచారానికి అలా వుండడమే అనుకూలంగా ఉండేది. చెప్పుల విషయంలోను అంతే. చిరుకండనికి లేనిది తనకెందుకు?–అనేవాడు అప్పు. "ఎక్కువ తిరుగులాడేవాడు నీవా నేనా? బెట్టు చేయకుండా కొనుక్కో" అని చిరుకండడు బలవంతం చేశాడు. అయితే రహస్యంగా వస్తున్న మాస్టరు స్నేహితులను పిలుచుకొని రావడానికో, విడిచిపెట్టి రావడానికో రాత్రిళ్ళు వెలుపలికి వెళ్ళినప్పుడు, అప్పు చెప్పులు వాడేవాడుకాదు చప్పుడు అవుతుందని.

పదే పదే అప్పు మాస్టరును అడిగేవాడు:

"ఎప్పుడు సార్ సంఘం ఏర్పాటు చేయడం? ఇంకా ఎందుకు సార్ ఆలస్యం?"

ఆయన తడవ తడవకూ సమాధానం చెప్పేవారు:

"ఇంకా కొంచెం ఓపిక పట్టవయ్యా. ఇనుము కాగినప్పుడు గదా కొట్టాలి?"

ఒక రోజు అప్పు, మాస్టరు అప్పగించిన పనిమీద ఆ తాలూకా కేంద్రమైన హొసదుర్గానికి పోయివచ్చాడు. అక్కడ ఒక యింట్లో అజ్ఞాతవాసంచేస్తున్న పండితులు అతనికి కనిపించారు. అప్పు అంత దూరం ప్రవాసం చేయడం అదే మొదలు. అయినా అది నూరారు మైళ్ళ దారి అనేట్టు అప్పుకు భాసించింది.

అక్కడ అతనిని చూచిన ధుబ్బోడు అన్నాడు:

"భూమి గుండ్రంగా వుందనడానికి మరొక సాక్ష్యం నేడు నాకు దొరికింది."

హాస్యాని కిది పీఠిక అని తెలిసినా అదేమిటో అర్థంకాక అప్పు అడిగాడు:

"ఏమిటి? చెప్పండి...."

"వేరే వేరే దారులనుంచి బయలుదేరినా మనం అప్పుడప్పుడు ఒకరినొకరు కలుసు కొంటూనే వున్నాం."

అప్పు నవ్వాడు. ఆ మీదట ఒక మాట చేర్చాడు:

"ఇంత దూరం వచ్చాను. ఇక కయ్యూరి వారిని కప్పులని చెప్ప కండి!"

దుబ్బోడు కనుబొమలను నుదుటి మధ్య వరకు ఎత్తి, సర్కసు విదూషకుని లాగ కండ్లు తిప్పుతూ "ఆజ్ఞ" అన్నాడు.

....అప్పు కయ్యూరికి తిరిగి వెళ్ళిన మీదట మాస్టరుకు తన ప్రవాసం నివేదికను అప్పగిస్తూ అన్నాడు:

"హొసదుర్గంలో చాలామంది కన్నడం మాట్లాడుతారు."

మాస్టరు అతనికి మరొకమారు భూగోళ పాఠం జ్ఞాపక పరచారు:

"అవును! ఇంకా ఉత్తరానికి పోయిన కొద్దీ కన్నడమే జాస్తి. అదంతా కర్నాటకం. దక్షిణానికిపోతే అదంతా కేరళం. మన ప్రాంతం నిజానికి మలబారుకు చేరాలి. అయితే ఇంగ్లీషువారు కావాలనే కర్నాటకంలో చేర్చారు. ఎందుకు చెప్పు?"

"కన్నడులు, మలయాళీలు పరస్పరం పోట్లాడుతూ ఉండనీ అని."

"సరిగ్గా చెప్పావు."

....చిరుకండడు ఎన్నో వేళలలో వేరే విధమైన పనులలో నిమగ్నుడై వుండేవాడు. ఎవరి ఇంట్లోనయినా దాక్కొని మాస్టరు అంద చేసే వ్రాతలను నకలు చేసేవాడు. వేరే పల్లెకో, ఊరికో సంబంధించిన కరపత్రాలను వ్రాసి ప్రతులు తీసి తయారు చేసేవాడు. అలా వ్రాసి వ్రాసి చేతులు అలసిపోయేవి, అలసట అయ్యేది. అప్పుడు బుజాన్నే తలగడగా చేసుకొని, కొంచెంసేపు నిద్రపోయేవాడు. ఆలా ఐదు నిమిషాలే గడిచినా, ఎంత పొద్దయిందో ఏమో అని గాబరాతో లేచేవాడు. లేచిన మీదట మళ్ళీ వ్రాత ముందుకు సాగేది.

త్రికరపురం చందు అప్పుడే, అప్పు చిరుకండుల పాలిటికి "మన వాడు" అయ్యాడు. చందు బీడీ అంగడి ఉద్యమానికి ఒక లంకె అయింది. ఆ చుట్టంతో అప్పు అన్నాడు:



"మనదిక రెండింతల బాంధవ్యం చందూ. ఒకటి ఇంటితనం సంబంధం. మరొకటి దానికన్నా గాఢమయిన రక్తసంబంధం."

అప్పు కరపత్రాల కట్టను అక్కడికి మోసుకొనిపోయి అందజేసి నప్పుడెల్లా, చెప్పరాదనే నియమాన్ని కొంతవరకు భంగంచేసే, చందుకు తెలిపేవాడు:

"ఇదంతా చిరుకండడు వ్రాసినవోయ్!"

అయితే, ఇంతవరకు చిరుకండని చూడని చందుకు అంతమాత్రాన తృప్తి కలిగేదికాదు. ఒకసారి అతడన్నాడు:

"ప్రతిసారి అదే చెబుతావు. ఒకసారి పిలుచుకొని రాగూడదూ?"

ఒక్కొక్కరిది ఒక్కొక్క జవాబ్దారీ అనే నియమాన్ని ఉద్వేగం తొణికిసలాడే సన్నని గొంతుకలో అప్పు వివరించి, అన్నాడు:

"ఓపిక పట్టు. ఈ ప్రాంతంలోని మన వారంతా రహస్యంగా ఒకచోట చేరే సందర్భం వస్తుంది. అప్పుడు చూతువుగాని."

"అది ఎప్పుడోయ్?"

"ఎప్పుడూ అని ఇప్పుడే ఎలా చెప్పడం? ఇనుము కాలినప్పుడు గదా కొట్టాలి!"

మాస్టరు తనకు చెప్పినదే అప్పు చందుకు చెప్పాడు. అది చాలా ప్రభావం కలిగించింది.

"వేరే ముఖ్యులనూ, నాయకులనూ అప్పుడు నాకు చూపుతావా?"

"ఊఁ."

తనకు పరిచయమున్న పెద్దనాయకుడు ఒక్కడే. ఆయన విషయం, తాను చూసి ఆయన నేస్తాలు కొందరి సంగతి. అప్పుడే అక్కడే అంతా చందుకు చెప్పాలనే కోరిక అప్పు హృదయంలో పొంగి వచ్చింది. అయినా, రహస్య కార్యక్రమం ఘోర నియమావళి జ్ఞాపకం వచ్చి వూరికే వుండిపోయాడు.

చందు ఒకటి, రెండు పుస్తకాలు చదివి బడి వదిలినవాడు. అక్కడ సంపాదించిన అక్షర జ్ఞానాన్ని కాపాడుకోవాలనే పెద్ద ఆశ ఏమో బడి వదలినప్పుడు అతనికి లేదు. క్రమంగా పుస్తకం చేతపట్టుకునే అలవాటు

తప్పిపోయి త్వరగా దేనినీ చదువలేక పోయేవాడు. 'నా చదువేమో సంతకం పెట్టడానికి మాత్రమే' అని అతడు ఊరుకొన్నాడు. అయితే అప్పుడప్పుడు రాకపోకల వల్ల, రైతు ఉద్యమం సంబంధంవల్ల అతని జ్ఞాన దాహం మళ్ళీ తల ఎత్తింది. అతడు పత్రిక చదివాడు. కరపత్రాలు చదివాడు. ఇలా అంగడిలో కూర్చున్నప్పుడు అక్కడికి వచ్చిన వారితో కబుర్లాడడానికి అతనికి వేరే సంగతులు దొరికాయి.

విద్యార్జన చేద్దామనే వెర్రి ఆ సమయంలోనే ఎక్కువయింది. మాస్టరు సూచన ప్రకారం చిరుకండడు నలుగురైదుగురు స్త్రీలకు అక్షరాభ్యాసం చేశాడు. తర్వాత ఆ స్త్రీలే విద్యాదీపం ఎత్తుకొని చీకటున్నచోట వెలుగు వెలిగించడానికి బయలు దేరారు.

ఆ రోజులలోనే మనశ్శాంతిని పాడుచేసుకొని చీకాకుపడిన వ్యక్తి నంబియారు. మొదట అనుకున్నట్టు ఈ మాస్టరు ప్రామాణికుడని ఒప్పు కోడానికి ఇప్పుడాయన సిద్ధంగాలేరు. ఆయనను పంపించివేయడం బలవంతుడయిన నంబియారుకు కష్టమైన విషయమేమీ కాదు. అయితే ఖాళీ అయిన ఆ స్థానంలో మరొకరిని నియమించాలి. నంబూదిరి సాధారణంగా పెరవూరికి, పట్టణాలకు వెళ్ళే వ్యక్తి కాదు. వెళ్ళినా, కోర్టు కచేరీ పనుల కోసం ఎంతో అంతే. ఒక్కమారయినా పత్రిక తాకని ఆయనకు కయ్యూరు వెలుపల ఏమి జరుగుతున్నదీ స్పష్టంగా తెలియదు. నంబియారు అప్పుడప్పుడు కలుసుకొన్నప్పుడు ఏమైనా చెబితే, "అలానా?" అని, మరుసటి క్షణమే దానిని మరచిపోయేవాడు. కాని, వెలుపలి వ్యవహారాలను తగినంత తెలుసుకొన్న నంబియారు ఇలాంటి సమస్యలను గురించి వెలుపలివారితో చర్చించినట్టి వారు, అన్నిచోట్ల ఇప్పుడిప్పుడు "తల పొగరు" ఉపాధ్యాయులే ఉన్నారని విన్నారు అలా ఉన్నప్పుడు ఉన్న ఉపాధ్యాయుణ్ణి పంపివేసి అతనికన్న ఎక్కువ భయంకరుడయిన వాడిని పిలిపించ డానికి సిద్ధపడలేదు నంబియారు. అంతేకాక, ఆయన కుమారుడు కరుణాకరునికి అక్కడ వున్నది మరొక సంవత్సరం చదువు మాత్రం. తర్వాత వాడిని నీలేశ్వరానికి పంపాలి. అంతవరకు మాస్టరే ఉండనీ.... అనేది కూడా ఆ నంబియారు యోచన.



ఇలా వున్నా, ఒకమారు మాత్రం నంబియారుకు చాలా దిగులయింది. కరుణాకరుని నోటు పుస్తకాలపై చూపు సారించినప్పుడు చరిత్ర నోటు పుస్తకంలో వున్న కొన్ని వాక్యాలు చదివి ఆయన విస్తుపోయారు. ప్రశ్నోత్తరాల రూపంలో ఉంది ఆ నోటు.

"మనను పాలించేవా రెవరు?"

"విదేశీయులు."

"వారి ఊరు ఎక్కడ వుంది?"

"ఆరు వేల మైళ్ళకు ఆవల."

"పాలించేవారిని ఏమంటారు?"

"రాజులు.".

"పాలింపబడేవారిని ఏమంటారు?"

"ప్రజలు."

ఆ పుటల కింద ఒక పంక్తి వుంది:

"విదేశీ రాజుల ప్రజలు గులాములు – బానిసలు."

దేశానికి స్వాతంత్ర్యం కావాలనే వారంతా అవివేకులు, పోరాటం సాగించే వారంతా నిరుద్యోగులు – అన్నది నంబియారు స్పష్టాభిప్రాయం. నిరుడు మద్రాసు గవర్నరుగారు పర్యటనకు వచ్చినప్పుడు నంబియారు మంగుళూరికి నాలుగు నాళ్ల ముందుగానే వెళ్ళి కాచుకొని దర్శనం చేసుకొన్నారు. గాంధీ భక్తుల విషయంలో ఆయనకు ఎలాంటి సానుభూతి లేదు.

ఇప్పుడు కరుణాకరుని నోటు పుస్తకం చదువుతూ నంబియారుకు ఆశ్చర్యమయింది. తనకు తెలియకుండానే గాంధీ ఉద్యమం కయ్యూరికి వ్యాపించిందేమో అనిపించింది.... అయితే ఇక్కడ ఎవరి ప్రసంగమూ జరుగలేదు. ఎవరూ చరఖా తీసుకురాలేదు; తెల్ల ముతక బట్టలు కట్టుకొని టోపీ పెట్టుకోలేదు ఎవరూ.

ఇలాటి విషయాలలో ఆలసించడం సరికాదని ఆయన మాస్టరును పిలిపించారు. ఈసారి ఇదేమి విషయమో? – అని యోచన చేస్తూనే వచ్చిన మాస్టారు ఎదుట నంబియారు కరుణాకరుని నోటు పుస్తకం పట్టుకున్నారు.

"దీని అర్థమేమిటి మాష్టరుగారూ?"

మాష్టరు చిరునవ్వు నవ్వారు. నంబియారుకు కోపం వచ్చింది.

"దీనిలో నవ్వే విషయం ఏముంది? మీరు ఆలోచించే పాఠాలు చెబుతారు గదా?"

"ఎందుకు? ఏమైంది? ఇదంతా నిజమైన సంగతి కాదా?"

"నిజమైన సంగతి ఏమిటి? మన్ను? మొదటి వాక్యాలను మన్నించవచ్చు. వదలిపెడుదాము. కాని, ఆ చివరి - విదేశ రాజుల ప్రజలు బానిసలు - అదేమిటి తెలుసా?"

మాష్టరు మళ్ళీ నవ్వడానికి ప్రయత్నించారు.

"నవ్వకండి, నా మాట వినండి. మీరింకా చిన్న వయస్సువారు. ఇంతగా పత్రిక చదివి కూడా మీకేమీ అర్థం కాలేదా ఏమిటి? మీరు చేస్తున్నది రాజద్రోహం! ప్రభుత్వానికి తెలిస్తే మిమ్మల్ని బంధించి జైలులో పెట్టవచ్చు. ఏమంటారు?"

గంభీరంగా కూర్చున్నారు మాష్టరు. నంబియారు గొంతు తగ్గించి అన్నారు:

"నేనొక ప్రశ్న అడుగుతాను. మీరు గాంధీవాదులా ఏమిటి?"

"కానే కాదు."

అలా నేరుగా కచ్చితమైన జవాబు చెప్పడానికి మాష్టరు ఎంత మాత్రమూ బెదరలేదు.

"మంచిదయింది. ఈ జవాబు విని నాకు మనస్సు కుదుటబడింది. అయినా విదేశీయులు బానిసలు అనేదంతా గాంధీ వాదమే. రేపు ఈ చివరి ఒక్క వాక్యం తుడిచివేయండి."

మాష్టరు మాట్లాడలేదు.

"ఏమిటి చెప్పండీ! తుడిచివేస్తారు కదా?"

"అలాగే."

ఆ ధ్వని ఎంతో కష్టం మీద వెలువడింది.



ఆ సంభాషణ తర్వాత నంబియారు ఘనవిజయం సాధించినట్లు పెద్దగా నిట్టూర్చి, సిగరెట్టు ముట్టించి పొగ పీలుస్తూ, ఒకే విసుగుపుట్టించే కర్కశ స్వరంతో అన్నారు:

"ఎందుకో రాను రాను కాలం చెడిపోతున్నది. జనం మరీ మరీ పనిదొంగలవుతున్నారు. అవిధేయత హెచ్చిపోతున్నది. ఎక్కడచూచినా చదువు పిచ్చి - చదువు - చదువు - చదువు - హుం!"

మాష్టరు తన భావాలకు భద్రమైన కవచం తొడిగి, తర్వాత అన్ని మాటలకూ చెవి ఒగ్గారు. మాటలు వట్టిపోయి నంబియారు మౌనందాల్చిన తర్వాత, వెలుపలికి వచ్చి బడివేపు నడిచారు.

మరునటిరోజు కరుణాకరుని తరగతిలో చరిత్రపాఠం నోటుబుక్కు తెరిపించి ఆ చివరి వాక్యం తుడిచివేయండర్రా అన్నారు మాష్టరు.

"ఎందుకు సార్?"

"జమీందారుగారు ఆ వాక్యం వద్దన్నారు."

....అయితే అది జరిగిన తర్వాత మాష్టరు కింది తరగతిలో లెక్కల పాఠంలో ఒక లెక్క ఇచ్చారు:

"ఒకడి వద్ద 600 ఎకరాల భూమి వుంది. దానిని ఇన్నూరు మందికి సమంగా పంచితే ప్రతివారికీ లభించే పొలం విస్తీర్ణం ఎంత?"

# 11

కళిపరంబ జాతర సమయంలో అక్కడికి సమీపంలోని ఒక పల్లెలో జరగడానికి ఏర్పాటయిన ఉత్తర మలబార్ రైతుసభకు కయ్యూరు నుంచి సాధ్యమైనంత ఎక్కువమంది రైతులను ప్రేక్షకులుగా పంపాలని మాస్టరు యోచించారు. సభకు పోయే సంగతిని బహిరంగ పరచేట్టు లేదు. చర్వత్తూరు నుంచి కళిపరంబకు రైలులో కొన్ని గంటల ప్రయాణం. రెండు రోజుల సభ ముగించుకొని మూడవరోజు తెల్లవారు జామున కయ్యూరు చేరడం సాధ్యం. ఈ ప్రయాణమే కయ్యూరులో రైతు సంఘ స్థాపనకు పునాది కాగలదని మాస్టరు నమ్మారు. అప్పుకు, చిరుకందనికి ఆ సభ మహత్మ్యం అర్థమయింది. అయితే వెళ్ళేవారెవరు? ఆయువకులిద్దరూ, చిరుకందని తండ్రి, సాధ్యమయితే అప్పు తండ్రికూడ, కణ్ణడు, కోరడు, మరి నలుగురైదుగురు రైతులు. మాస్టరు ఈ సంగతి ప్రస్తావించినప్పుడు వాళ్ళు చూపిన ఆసక్తి అంతా యింతా కాదు.

పొలాల్లో కోతలు ప్రారంభమయ్యాయి. తర్వాత సభకు వున్న వ్యవధి ఒకే ఒక వారం. పైరు యింటికి రాగానే సభకు వెళ్ళిరావడం అనుకూలం.

అయితే, వెళ్ళడానికి ముందు దినం అప్పు ముఖం వేల వేసుకొని మాస్టరు వద్దకు వచ్చాడు.

"ఏమిటి విశేషాలు అప్పు?" అన్నారు మాస్టరు.

"కృష్ణన్‌నాయర్ రావడం పడదు మాస్టరుగారూ. అతని పొలంలో ఇంకా కోతలే కాలేదు. రేపటికి పెట్టుకొన్నాడు."

కృష్ణన్‌నాయర్ నంబియార్ కౌలుదారు. చాల ఉత్సాహవంతుడు. అతడు సభకు వెళ్ళి తీరాలని మాస్టరు ఆశ. ఆయనే ఆలోచించి అన్నారు:



"అంతేనా? రైతు సభకు వెళ్ళేవాళ్ళంతా రేపు పొలంలో దిగి కృష్ణన్ నాయర్‌కు సహాయం చేయండి. అతనిదేమిటి పదెకరాల పొలమా? చీకటి పడగానే మీరందరూ ఇక్కడి నుంచి బయలుదేరితే చాలు. సాయంకాలం మంగుళూరు నుంచి వచ్చే రైలు చిక్కనే చిక్కుతుంది. కాదూ?"

అప్పుకు ఊరట కలిగింది.

"హాఁ. మధ్యాహ్నం చిరుకందడూ అదే సలహా యిచ్చాడు. అయినా అడుగుదామూ అని వచ్చాను. మీరు చెప్పినట్లే చేస్తాము."

....మరునటి రోజు తెల్లవారి కృష్ణన్ నాయర్ పొలంలో ఎక్కడలేని సంబరం, సాటి రైతుకు తోడ్పడటానికి రైతుల దండే వచ్చింది. తమ కోతలు ముగిసిన ఇరుగు పొరుగువారూ పొలంలో దిగారు. మీది కెక్కుతున్న సూర్యునితో పోటీ పడుతూ కొడవలి పట్టిన చేతులు కంకుల బరువుతో వంగిన వరి మొక్కలను కరకర కోశాయి. రైతు మహిళలు పాటలు పాడారు. కణ్ణడు కొత్త పాటతో పాటుపడేవారి ఉల్లాసం ఎక్కువయ్యేటట్టు, చేతులవేగం ఇనుమడించేట్టు చేశాడు. పయిటాళకు మిగిలింది కొంచెమే. మూడు గంటలకల్లా కోతలు ముగియనే ముగిశాయి. కృష్ణన్ నాయర్ ముఖం విప్పారి చేటంతయింది.

ఇక నేమిటి! కోసిన దానిని రాశివేసి కృష్ణన్ నాయర్ గుడిసెకు చేర్చడ మొక్కటే పని. దానికి ముందుగా, నాలుగు నిమిషాలు అలుపు దీర్చుకొందామని రైతులు కూర్చున్నారు.

అంతలోగా, బలిసిన ఎద్దులు కట్టిన బండి అటువైపు రాసాగింది.

"బండికోసం చెప్పావేమయ్యా కృష్ణన్ నాయర్? వస్తూవుంది కదా ఏదో రథం" అని ఎవరో అన్నారు.

ఇదేమి తమాషావో, వాస్తవమో తెలుసు కొందామని అందరూ అటు మెడ తిప్పి చూశారు.

కృష్ణన్ నాయరే మొదట గిత్తలను గుర్తించి "అదిజమీందారుగారి బండి" అన్నాడు. అలా అంటుండగానే అతని ముఖం నల్ల బడింది.

"తమ సహాయమూ ఒకింత వుండనీ అని నంబియారే పంపారా?" అని ఎవరో నవ్వారు.

అయితే, ఆ వాతావరణం మారడానికి ఎంతో కాలం పట్టలేదు. కృష్ణన్ నాయర్ ఊహించినట్టే అయింది. అతని పంటను వశపరచుకొని జమీందారుగారి ఇంటికి చేర్చడానికే ఆ బండి వచ్చింది. బండి వెంట కరుడు క్రూరులని కువిఖ్యాతులైన జమీందారు బంట్లిద్దరు ఉన్నారు. ఇంతమంది జనాన్ని చూచి ఆ బంట్లు కొంచెం జంకినా, వాళ్ళలో ఒకడు కృష్ణన్ నాయర్‌తో అన్నాడు:

"పైరు సాగించుకొని రమ్మని జమీందారుగారు చెప్పారు."

ఆ మాట విని తిడుతూ ఆక్రోశించినది కృష్ణన్ నాయర్ భార్య. అంతమంది జనంసామీప్యంలో ఆమెపేద గొంతుకకు ఎక్కడలేని బలమూ వచ్చింది. రైతు లందరూ బండిని, బెదరిన ఎడ్లనూ, వారిద్దరినీ చుట్టు ముట్టారు. ఒకరి మాటలు మరొకరికి అర్థం కాని విధంగా ఆ ప్రదేశ మంతా మాటలతోనే నిండి పోయింది. కృష్ణన్ నాయర్ చెల్లించకుండా మిగిలిన ఇనూ్నరు రూపాయల అప్పు ఒకటుంది. వట్టి గుత్త కోసం కాచుకోకుండా పూర్తి పంటనే వశపరచుకుని తమ డబ్బును వసూలు చేసుకోవాలని జమీందారుగారు నిర్ణయించుకొన్నారు. దానివల్ల కృష్ణన్ నాయర్‌కు మరింత నష్టమవుతుందని, తర్వాత జీవిత నిర్వహణకు అప్పు కోసం జమీందారునే ఆశ్రయించ వలసి వుంటుందని స్పష్టమయింది.

రైతు బాంధవులవద్ద నిలుచున్న కృష్ణన్‌నాయర్ అధైర్యపడలేదు. "న్యాయం చూసోక్కండి"అని వాదించాడు. మాటలు తీవ్రమయాయి. నంబియారు బంట్లు బెదిరింపులకు రైతులు వెక్కిరింపులు సరి సమానంగా తూగాయి. అర్ధగంటసేపు పరిస్థితి అలాగే వుంది. బండీ, బంట్లూ వచ్చినట్టే వెనుదిరగవలసి వచ్చింది.

అక్కడ గుమికూడిన వారందరూ త్వర త్వరగా వనలను మోసుకొని కృష్ణన్ నాయర్ ముంగిలికి చేర్చారు.

ఆ పని ముగియగానే చిరుకండని తండ్రి అన్నాడు:

"జమీందారుగారు ఓడిపోవడం నా జీవితంలో ఇదే మొదటిసారి నేను చూడడం!"

కణ్ణడు ఉత్సాహధ్వనితో అన్నాడు:



"ఇదేపాటి ఓటమి మామా? ఇప్పుడు ఆరంభమయిందంతే. ముందు చూస్తూవంట?"

కాని అప్పు తండ్రి హెచ్చరిక మాట చెప్పాడు:

"ఇది ఇంత సులభమని, అనుకొన్నారేమో? ఈ వడ్ల కణజం (గరిసె) చేరే ముందే జమీందారుగారు మరొకమారు రాకుండా వుంటే, ఆ మీదట చెప్పండి."

కోరడన్నాడు:

"వడ్లమాట ఎందుకు? రాత్రో, రేపో ఎక్కువ జనం వచ్చి యీ వనలనే మోసుకొని పోవచ్చు."

వాళ్ళు మాట్లాడుతున్నారు. కాని కృష్ణన్ నాయర్ గొంతుకే ఉడికిపోయింది. అతడు ఆ దినం అత్యంతసుఖిగాను కనిపించాడు; అత్యంత దుఃఖిగాను కనిపించాడు. ఒకదృష్టితో అప్పుపేరుతో అతనికి అవమాన మయింది. అయితే, అక్కడ చేరిన రైతు లెవ్వరూ అది అతనికయిన అవమానంగా భావించ లేదు. తమనే ఎవరో అవమానించినట్టు ప్రవర్తించారు.

ఆరోజు జరిగినదంతా స్మరణకు వచ్చి కృష్ణన్ నాయరు కళ్ళు కన్నీటి ధారలు కురిపించాయి. అతని ముసలితల్లి చేతి కర్ర ఊపుకుంటూ వచ్చి, కళ్ళ యెదుట నడుస్తున్న దంతా నమ్మ వచ్చునా, నమ్మ గూడదా అనే సంశయం బాధిస్తున్నా "కూర్చోండి నాయనా, కూర్చోండి నాయనా ...."అన్నది.

రైతులు ఒక్కరొక్కరే వెళ్ళి పోయారు. రైతు సభకు వెళ్ళవలసినవారు మాత్రమే మిగిలారు.

"ముందేమి టయ్యోయ్!" అని అడిగాడు అప్పు తండ్రి.

కోరడు మళ్ళీ చెప్పాడు:

"జమీందారుగారి వైపు వాళ్లు ఇక్కడికి మళ్ళీ రావడం తప్పదు. ఇవాళ రాత్రో, రేపు తెల్లవారో– రావటం మట్టుకు కచ్చితం."

"అలా అయితే మనం రైతుసభకుపోవద్దు. ఇక్కడే వుందాము." అన్నాడు చిరుకండని తండ్రి.

"ఎందుకు? జమీంగారుగారితో మాట్లాడాలని ఆశగా వుందా ఏమిటి?" అని అంతవరకు ఊరికే వున్నవా డొకడు అన్నాడు.

మూలలో విడిగా వున్న అప్పును, చిరుకండనిని ఉద్దేశించి అన్నాడు అప్పు తండ్రి:

"ఏమంటర్రా ఊరుకున్నారు? ఏం చేద్దా మిప్పుడు?"

చిరుకండడు జవాబు చెప్పాడు:

"పోవడం ఆపరాదు."

"ఎవరైనా వెళ్ళి ఏం చేయాలని మాస్టరును అడిగి రాగూడదా? కావలిస్తే నేనే వెళ్ళి వస్తాను." అన్నాడు కోరడు.

చిరుకండడు గట్టిగా అన్నాడు:

"చీకటి పడడానికి ముందు ఎవరూ ఆయనను చూడరాదు."

కృష్ణన్ నాయర్ కంపించే ధ్వనితో అన్నాడు:

"ఈ రోజు ఇంత చేసింది నా కోసం ; నేనూ మీ వెంట రావాలని. ఇప్పటి స్థితిలో నేనయితే వచ్చేట్లు లేదు. దయచేసి మీరందరూ పోయిరండి."

ఈ మాటలకు ఎవరూ ఏమీ జవాబు చెప్పలేదు. అందరూ ఒకరి మొగం ఒకరు చూచుకున్నారు. చివరకు కోర డన్నాడు :

"నేను వచ్చి అయ్యేదేముంది గనుక? నాకు అర్థం కావడమూ అంతంతే. నేను ఇక్కడే వుంటాను."

ఆ మాటలను విమర్శించే ధ్వనితో చిరుకండ డన్నాడు:

"అర్థం కాదనేదంతా విడిచిపెట్టండి కోరన్నా! అలా కాదు. ఎవరైనా ఒకరిద్దరు ఇక్కడే ఉండడం విద్యుక్త ధర్మం. మీరు ఉండేట్టయితే సంతోషమే, ఏమయినా ప్రయాణం ఆపరాదు."

"ఎలా చెప్పినా ఒక్కటే, నీమాటే కానీ. నేను బుద్ధిమంతుణ్ణనే ఒప్పుకుందాము" అన్నాడు కోరడు నవ్వుతూ.

ప్రయాణ సన్నాహం కోసం వారంతా తమ గుడిసెలవైపు బయలు దేరినప్పుడు కోరడు గొంతు తగ్గించి అప్పుతో అన్నాడు:

"పోతూ పోతూ మాస్టరుకు చెప్పు - నేను ఇక్కడే వున్నానని" ఎనిమిదిమంది కయ్యూరు రైతులు కళిపరంబ జాతరకు పోతున్నామని చెప్పి రైతు సభకు పోయారు. రాత్రే రైతులు జాతరకు పోయిన వార్త నంబియారుకు తెలియక పోవడం వల్ల కృష్ణన్ నాయర్ పంట



విషయమై ఆయనేమీ చేయలేదు. రెచ్చిపోయి నిప్పులు గక్కినా, తమకున్న విరోధివర్గం ఎంత అనేదాన్ని మొదట తూచి చూచుకోవాలనే వివేకం ఆయన కుంది. దాని ఫలితంగా కోరడు, కృష్ణన్‌నాయర్ తెల్లవారు జామున ఒకింత మూతలు పడిన కళ్ళు రుద్దుకొని లేచి నప్పుడూ, ముంగిట్లో వరి పనల కుప్ప నిశ్చింతగా పడివుంది.

మాస్టరు రైతుసభకు పోలేదు. "రండి. మే మున్నాము" అని రైతులు పిలిచినా ఆయన బయలుదేరలేదు.... తెల్లవారగానే ఆయనలేచి "సాహిత్యం" చదువుతూ కూర్చున్నారు. వెలుపలనుంచే "మాస్టరుగారూ" అనే పిలుపు వినబడినప్పుడు ఒక్కమారుగా ఆయన అదిరిపడ్డారు. వెంటనే ఆయన "సాహిత్యం" పక్కకింద దాచి పిలిచిన పిలుపు ఎవరిదో నని గుర్తించి వెలుపలికి వచ్చారు.

"ఎందుకు? గాభరా అయిందా?" అన్నారు నంబియారు, తమ హృదయంలోని అవ్యవస్థను అదుపులో పెట్టుకుంటూ.

"అలాటి దేమీ లేదే? గొంతు వినిపించగానే తమరు అని తెలిసింది."

మాస్టరు జవాబు చెప్పారేగాని నంబియారును తమ గదిలోకి పిలవలేదు. నిలుచున్న చోటినుంచే నంబియారు అటువైపు తొంగి చూచారు:

"ఏమిటి? మీ రాత్రి పాఠశాల నిన్న లేదటనే?"

"ఔను. అంతా కళిపరంబ జాతరకు వెళ్ళిపోయారు."

"అలాగని తెల్లవారి తెలిసింది. మొదట్లో మిమ్మల్ని అడక్కుండా చేయకుండా ఎక్కడికీ పోయేవారుకారు. హాఁ.... మీకయినా విషయం తెలుసునేమోనని వచ్చాను."

"నాకు తెలీదు. అలాగే వెళ్ళిపోయారు చూడండి."

నంబియారు బడికప్పు బొంగు నొక దానిని పట్టుకొని గట్టిగా వుందా లేదా అని కదిలించి చూచి అన్నారు:

"అలాగే వెళ్ళిపోక ఏమి చేసేరు? నిన్న ఏమి జరిగిందీ అని మీకు తెలిసే వుంటుంది."

సంగతి తెలిసివున్నా మాస్టరు అన్నారు:

"లేదు. ఏమి జరిగింది?"

నంబియారు మాస్టరు మాటను నమ్మవచ్చునో, నమ్మగూడదో అని క్షణం అనుమానించి, వెనుకటిరోజు జరిగిన సంఘటనను తమ దృక్పథంతో తీవ్రంగా వివరించి అన్నారు:

"....ఆ కృష్ణన్ నాయర్. వాడిని ఆరోజే జైలుకు పంపాల్సింది. ఇప్పుడు చూడండి అహంకారం! కయ్యూరులో ఇక ఈ లమ్డీకొడుకులకు బుద్ధి నేర్పేవారే లేనట్టయిం దన్నమాట? నేను తలచుకున్నానంటే అంతమందిమీద కేసుపెట్టించి, వాళ్ళందరిన్నీ అరెస్టు చేయించవచ్చు. ఇంత కూడ అర్థంకాదా వారికి?"

రాత్రి మరేమయిందని మాస్టరుకు తెలియదు. అక్కడేమైనా అనాహూత మయిందా అని తెలుసుకొనే కుతూహలం ఆయనకు. వార్త తెలిపేవాడు లేక ఆయన వంచితు లయ్యారు - ఏమీ తెలియని స్థితిలో వున్నారు. నంబియారు నోటినుంచే ఏమైనా తెలుసుకొందామని నెమ్మదిగా ఆయన అన్నారు:

"ఆ మీదట ఏమయింది?"

"అయ్యేదేమిటి? నిన్న ఊరుకున్నాను. ఈ దినం మా ముంగిట్లోకి పంట మోయించి వేస్తాను. ఎవడు అడ్డు పడతాడో పడనీ, కాదు మాస్టరు గారూ? నా ఓర్పు చూచి ఒకొక్కప్పుడు నాకే ఆశ్చర్యం కలుగుతుంది. నేను సీదాసాదా మనిషిని. ఖండిత వాదిని. చెబుతున్నాను వినండి. వీళ్ళకు ఆ నంబూదిరిలాంటి యజమాని దొరకాలి. వెన్నలో వెంట్రుకలు తీసేట్టు మాట్లాడుతూ - మాట్లాడుతూ ఎలా కోస్తాడంటారు? మొద్దు నా కొడుకులు, థూ!"

మాస్టరు నంబియారు ఆలాపనకు చెవిఒగ్గినా, మనసంతా కృష్ణన్ నాయరును గురించే ఆలోచిస్తున్నది. అతడుగాని, కోరడుగాని ఏమీ చేసేట్టు లేదు. ప్రతిఘటనవల్ల ప్రయోజనమూ లేదు. నిన్నటి సాధన రైతుసభ ముగించుకొని ఉత్సాహంతో వారందరూ వెను దిరిగి వచ్చే వేళకు మట్టయే సందర్భం.... అయితే, అలా జరగడాన్ని ఆపడానికి దారే లేదు. అది అనివార్యం....



ఎక్కువ మాటలకోసం ఆగక నంబియారు వెళ్ళనే వెళ్ళారు. ఆయనతోపాటు వచ్చిన మనిషి ఆయనను వెంబడించాడు....

..............................

మాస్టరు నిరీక్షించినట్టే అయింది. జమీందారిగారి ఎనిమిది మంది దూతలు కృష్ణన్ నాయర్ ముంగిటిలో ఉన్నదంతా స్వాధీన పరచుకొన్నారు. అలాంటి పరిస్థితిలో నిరర్థకమైన ప్రతిఘటనను కోరడుగాని, నాయరుగాని చేయలేదు. దూరం నుంచే తక్కిన రైతులు జరుగుతున్న దాన్ని చూచారు. వారిలో ఇద్దరు జమీందారుగారి కౌలుదార్లూ వున్నారు. కొందరు స్వతంత్ర కర్షకులూ ఉన్నారు. అయితే, ఎవరూ కృష్ణన్ నాయర్ రక్షణకు రాలేదు. ఇది ఎంతో కాలంగా నడుస్తున్న దాని సహజ పునరావృత్తి అని వాళ్ళు ఊరుకున్నారు.

రాత్రి కోరడు తనను ఎవరూ వెన్నాడనట్లు హెచ్చరికతో వచ్చి మాస్టరును కలుసుకొన్నాడు.

"కృష్ణన్ నాయరును గుడిసె నుండి వెళ్ళగొట్టలేదు గదా!" అని అడిగారు మాస్టరు.

"లేదు."

యోచించి అన్నారు మాస్టరు :

"బహుశ వెళ్ళగొట్టరు. ఈ పరిస్థితిలో వేరే కౌలుదారును కుదుర్చుకోడం జమీందారుగారికి సులభం కాదు."

"అదేమో నిజమే. కృష్ణన్ నాయరుకు చాల కష్టమవుతుంది."

చాలసేపు ఊరికే వుండి మాస్టరు అన్నారు :

"వెళ్ళిన వాళ్ళందరూ తిరిగి రానీ. ఆ మీదట మొత్తంగా మాట్లాడుదాము కోరన్నా. నిన్న మనకు గెలుపు, నేడు ఓటమి. మళ్ళీ ఈ ఓటమిని మనము గెలుపుగా మార్చుకోవాలి."

ఎలాగు....అనేది కోరనికి అర్థం కాకపోయినా, ధైర్యమిచ్చిన ఆ ధ్వని అతని మెచ్చుకోలు పొందింది; అతని ముఖంలో ఉల్లాసపు కళ ఉదయించింది.

...........

మరుసటి ఉదయం "తళిపరంబ జాతరకు" వెళ్ళిన వారంతా తిరిగి వచ్చారు. రైతు జాగృతిని కన్నులారా చూచిన అనుభవం వారందరిలోను కొత్తశక్తి నింపింది. ప్రయాణం వల్ల అలసినా, వారి వీపులు చక్కగా వున్నవి. వంగలేదు. కళ్ళు నిద్ర చెడి యెర్రబడినా ఉజ్వలంగా వున్నవి. కపోలాలు వాడినా ఆత్మ విశ్వాసపు నవ్వు పెదవులపై నర్తిస్తున్నది.

అప్పు, చిరుకండడు సరాసరి మాస్టరు వద్దకు వెళ్ళి, ఉత్సాహపు అంటురోగాన్ని తాము మోసుకొని వచ్చామని తెలిపారు. వారు తమలాగే వున్న నూరారు రైతులను, పాత స్నేహితులయిన ప్రభు – ద్విబోధు, కేళప్ప, మరి ఇతరులను, రైతు నాయకులను చూచి వచ్చారు.

ఆ పిల్లవాళ్ళ—పిల్లవాళ్ళని ఇక అనగూడని యువకుల నడకలోను, నుడులలోను కలిగిన కొత్త దిట్టతనాన్ని చూచి, ఒకే ఒక రైతు మహాసభ వారిలో కలిగించిన మార్పునుచూచి మాస్టరుకు సంతోషమయింది.

తిరిగి వచ్చినవారు తాము ఊరిలో లేనపుడు కృష్ణన్ నాయరుకు దాపురించిన దుర్గతి వివరాలు తెలిసి వేసటపడ్డారు. అయితే, వారు నింపుకొని వచ్చిన ఉత్సాహపు సోన ఎదుట ఆ వేసట క్షణికమయింది.

వీరంతా జాతరకు వెళ్ళారనే పల్లెలోని వారంతా నమ్మడం వల్ల రాత్రి రహస్యంగా అప్పు ఇంట్లో సమావేశం కావడం కష్టమేమీ కాలేదు.

ఆ రాత్రి మాస్టరు చాలసేపు మాట్లాడారు. అది లెక్కల పాఠంగా లేదు. భూగోళ – చరిత్రగా లేదు. అయితే ఆయన మాటలలో శత శతాబ్దాలుగా జరిగిన అన్యాయాల లెక్కాచారం వుంది. కయ్యూరితో సహా సకల భూలోక వృత్తాంతం వుంది. అనాది కాలం నుంచి మానవుడు ఉత్తమ జీవితం కోసం నడిపిన పోరాటాల చరిత్ర వుంది. ఈ చరిత్రలో ఒక అంశం కృష్ణన్ నాయర్ పెంచిన పైరును రక్షించడానికి జరిగిన యత్నం కూడా; మన జనానికి ఏమి కావాలి? దాస్య శృంఖలాలు పొడి పొడి కావాలి; బానిసతనపు కాడి కిందికి దిగాలి. మన భూమి మీద మనం స్వతంత్రులమై నడిచేట్టు కావాలి....

దాని కోసం కయ్యూరు రైతులు వహించవలసిన పాత్ర....

"సంఘటనం మొదటి అడుగు. కయ్యూరు రైతు సంఘం మొదట స్థాపన కావాలి."



మాస్టరు కొత్తదేమీ చెప్పినట్లు అక్కడున్న వారి కెవరికీ తోచలేదు. తామందరి మనస్సుల్లో వున్న భావాలకే మాస్టరు రూపు దిద్దినట్టుంది.

ఆ మాటలు ముగిసిన తర్వాత అప్పు తండ్రి అడిగాడు:

"ఎప్పుడు ప్రారంభిద్దాం? ఎప్పుడూ యిదే రీతిగా రాత్రి వేళల్లో మనం కలుసుకుంటూ వుండాలా?"

"ఏమీ అక్కరలేదు. బహిరంగంగానే సభ జరిగి సంఘ స్థాపన కానీ." అన్నారు మాస్టరు.

చిరుకండని తండ్రి మొదటే అనుకున్న రీతిగా, కృష్ణన్‌నాయర్ వ్యవహారానికి సంబంధించి తమ కర్తవ్య మేమిటని సూచించాడు. నాయర్ ఈ సంవత్సరమూ జమీందారుగారి నుండి అప్పు తీసుకోకుండా అతనికి ధాన్యం వంతు వంతుగా ఇచ్చి అందరూ సహాయపడాలని సర్వసామాన్యమైన సలహా....

ఇది జరిగిన మరుసటి దినమే నంబియారు బడి వద్దకు వచ్చి, చేతిలోని "మాతృభూమి"పత్రికను ఆడిస్తూ, కర్కశ స్వరంతోఅన్నారు:

"చూచారా మాస్టరుగారూ? తళిపరంబ సమీపంలో రైతు సభ జరిగిందట! చదివారో లేదో? సామ్రాజ్యవాదం నశించాలి, జమీందారీ తత్త్వం నాశనం కావాలి అంటూ అక్కడ నినాదాలు చేశారట. నిజం చెప్పండి మాస్టరుగారూ, మన రైతులు కూడా అక్కడికే వెళ్ళారుకదా?"

పరిస్థితి విషమించడానికి ఇక ఆట్టే కాలం పట్టదని తెలిసినా, తమంతట తాము దురుసుగా మాట్లాడరాదని మాస్టరు అన్నారు:

"ఉండినా ఉండవచ్చు. నాకయితే ఎవరూ చెప్పనే లేదు."

"ఆహా....! ఆహా....?"

............

ఆ మరుసటి దినమూ నంబియారు బుసలు కొడుతూ వచ్చారు:

"మాస్టరుగారూ! ఒకవార్త విన్నారా? మాతృభూమి పత్రికకు పంపినా పంపవచ్చు."

మాస్టరు శాంతంగా ఉండడానికి ప్రయత్నిస్తూ అన్నారు:

"ఏమయింది?"

"కయ్యూరిలో ఇక రెండు రోజులలో రైతు సంఘం స్థాపన జరుగుతుందట హాహా!"

"అలాగా? ఎవరన్నారు?"

నంబియారు కెంపెక్కిన కన్నులతో మాస్టరును చూచి "థూ" అని ఉమ్మి వేశారు. వెంటనే సంబోధనం ఏక వచనానికి దిగింది; స్వరం మరింత కర్కశమయింది.

"ఛలే నల్ల తాచువయ్యా నీవు! ఇలాటివాడివి ఇంతకాలం సాకాను! అబ్బ!"

ఇక ఆత్మాభిమానం కాపాడుకొనడం తప్పు కాదని మాష్టరు నంబియారును నేరుగా చూచి అన్నారు:

"మీరు ధర్మకర్తల సమితి అధ్యక్షులు. నేను బడిపంతులు. ఎంత పనో అంతే మాట్లాడండి."

నంబియారు తాచుపాము పడగ తాకినట్లయి ఒక్కసారి బెదిరి, మళ్ళీ రౌద్ర ముఖకవళిక ధరించి దర్పంతో అన్నారు:

"మీ బడి సంవత్సర పరీక్షకు యింకా ఎన్నాళ్ళున్నవి?"

"ఒక నెల."

"అన్ని రోజులు వూరికే వుండి పని చేయండి. పరీక్ష ముగిసిన మీదట ఛార్జి నాకు అప్పగించి యిక్కడి నుంచి దయచేయండి."



# 12

కయ్యూరు రైతుల సభలో తొలిసారిగా ఎగిరిన ఎర్రజెండా, సంఘం తాత్కాలిక కార్యాలయమైన అప్పు ఇంటిమీద స్థిరంగా నిలబడింది. తమబడి చివరి పరీక్ష కోసం తయారవుతున్న అప్పు తమ్ముడూ, అప్పుడప్పుడే రాగయుక్తంగా చదువదొడగిన చిన్నవాడయిన కుట్టి ఆ జెండాను అభిమానంతో చూచారు. వాళ్ళ అవ్వ తడవ తడవకూ ఆ జెండా అర్థాన్ని అడుగుతూ, ఏదో నెపంతో ఎక్కువసార్లు వెలుపలికి పోయి, గుడిసె కప్పుమీద రెపరెపలాడుతున్న జెండాను చూచి సంతోష పడేది. అప్పు తల్లి నీళ్ళు చేదడానికి వచ్చినప్పుడు, అంట్లు తోము తున్నప్పుడు లేదా యెడ్లకు మేత వేయడానికి బయలుదేరినప్పుడు జెండాను దొంగ చూపులతో చూచేది. మేడ యింటి సిరిసంపదలే తనకు లభించాయన్నంతగా ఆమెకు మహదానంద మయింది.

చిరుకండని ఇంట్లో అతని తల్లి అడిగింది :

"కార్యదర్శి నీవుకదా చిరుకండా ?"

"ఔను !"

"మరి జెండా అక్కడ నాటినారే...."

తల్లికి కలిగిన అసూయ క్షంతవ్యమని తోచింది చిరుకండనికి. అతడు చిరునవ్వు నవ్వుతూ,

"జెండా అక్కడే వుండాలమ్మా. మనం జమీందారుగారి కౌలు దార్లం. జెండా ఇక్కడుంటే ఎప్పుడు కావలిస్తే అప్పుడు ఆయన దానిని తీసివేయించవచ్చు. అప్పు ఇంట్లో అయితే అలా కాదు."

కొడుకు చెప్పిన తెలివితేటల మాటను విని తల్లి తల ఊపింది. తాము పొలం పోగొట్టుకొన్న జ్ఞాపకం చేదుగా వున్నా, తమ ఏకైక

పుత్రుడు ఊరి రైతులందరి గౌరవానికి పాత్రు డన్న సంతోషం తియ్యగా వుంది.

సంఘ శక్తికి సంకేతమయిన జెండా నలుమూలలా తన సందేశం ప్రసారం చేసింది. దాని ప్రభావం ఎంతని తెలుసుకొనడానికి ఎక్కువ రోజులు పట్టలేదు. ఆ వారం చివరలోనే, మాస్టరు నీలేశ్వరానికి వెళ్ళిన ఒక ఆదివారం హొసదుర్గం నుంచి పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్, ఇద్దరు పోలీసులు కయ్యూరికి వచ్చారు. వారి ఆగమనం ఎంతో మంది రైతులను కలవరానికి గురి చేసింది. సంఘం జననాన్ని సందేహ దృష్టితో చూచిన, తగినంత పొలమున్న శ్రీమంతులయిన రైతులు కొందరు 'ఇలా అవుతుందని మాకు ముందే తెలుసు' అన్నారు. ఏ పక్షమూ వహించని తటస్థులైన కొందరు ముందేమవుతుందో అని కుతూహలంతో వేచి చూచారు.

పోలీసులు వచ్చి స్నాన భోజన విశ్రాంతులు ముగించుకున్నారు. మధ్యాహ్నం దాటిన మీదట అప్పుకు పిలుపు వచ్చింది. జమీందారుగారి ఒక మనిషి, ఎర్రటోపీ పోలీసొకరూ ముంగిట్లో నిలుచుని, "తక్షణం రావలెనంట" అన్నారు.

"ఎక్కడికి ?" అన్నాడు అప్పు.

"జమీందారుగారి ఇంటికి ?"

"మేము వారి కౌలుదార్లం కాము. ఏమైనా పని వుంటే ఇక్కడికే రమ్మనండి. వారికి బదులు పటేలు (గ్రామ మునసబు) గారు పిలిపిస్తే తప్పక వస్తాను."

జమీందారుగారు మనిషి చిడిముడిపడుతూ పోలీసులతో వెనక్కు మళ్ళాడు. అప్పుతండ్రి ఇంటిలో లేడు. కుమారుడు ఇలా జవాబు ఇవ్వడం సరయిందో కాదో అనే సందేహం తల్లికి వున్నా, కుమారుని ధైర్యం చూచి ఆమె లోలోపల సంతోషించింది. అవ్వ గాభరా పడ వచ్చునని అప్పు అనుకున్నాడు. కాని, ఆ వృద్ధురాలూ మౌనంగా, గంభీరంగా వుంది.

అంతలోగా చిరుకండడు వచ్చాడు.



కొంతసేపటికే జమీందారుగారి ఇంట్లో వున్న పటేలుగారి నుంచి పిలుపు వచ్చింది. అక్కడే పోలీసులూ ఉన్నారని స్పష్టమయింది. పాలక శక్తి కిరాయి బంట్లతో మొట్టమొదట ప్రత్యక్షమైన భేటీకి ప్రజాశక్తి ప్రతినిధులైన అప్పు, చిరుకండడు అక్కడికి బయలుదేరారు.

దూరాన ప్రేక్షకుడులా నిలుచున్న కోరడు ఒక్కడు మినహా, రైతుసంఘ సభ్యులు తక్కిన వారెవరూ అక్కడ లేరు. నంబియారు, నంబూదిరి, సబ్ ఇన్‌స్పెక్టర్ మొగసాలలో కూర్చున్నారు. పక్కలోనే బెంచిమీద పటేలుగారున్నారు. వారి వెనుక జవాను. దగ్గరలోనే ఖాకీ దుస్తులు ధరించి నిలుచున్న పోలీసులు, జమీందారుగారి అనధికారి బంట్లు కొందరు.

సబ్ ఇన్‌స్పెక్టరు, నంబియారు సిగరెట్లు తాగుతూనే ఉన్నారు. నంబియారు, నంబూదిరికన్న తాను ఎక్కువ విద్యావంతుణ్ణని చూపే ఆ అవకాశం వదులుకోక అప్పుడొకమారు, ఇప్పుడొకమారు తనకు తెలిసిన ఇంగ్లీషు ముక్కలలో పోలీసు అధికారితో మాట్లాడుతున్నాడు.

అప్పు, చిరుకండడు మొగసాల చేరి పటేలుగారికి నమస్కారం చేశారు. స్వభావతః బెదురు మనిషి అయిన పటేలుగారు అన్నారు :

"కూర్చోండి."

అయితే కూర్చోడానికి అక్కడ అప్పుడు ఎలాటి ఆసనమూ లేదు. అది గమనించకుండానే పటేలుగారు అలా అన్నారు. ఆ రీతిగా ఆయన వినయంతో మాట్లాడడం చూచి నంబియారుకు ఒళ్ళు మండింది. ఆయన సిగరెట్టు కొరికాడు. పొగాకుపొడి పెదవులకు అంటుకుంది. 'పని ప్రారంభించండి' అనేట్లు సబ్ ఇన్‌స్పెక్టరు వైపు చూచారు. అయితే ప్రస్తావనగా పటేలుగారే ఒక మాట చెప్పవలసి వచ్చింది :

"హొసదుర్గం నుండి ఇన్‌స్పెక్టర్ సాహెబుగారు తనిఖీకి వచ్చారు. ఉన్నది ఉన్నట్లు చెప్పండి. మీకేమీ యిబ్బంది కలుగదు."

అని ఆయన అభ్యాసబలంతో అన్న మాటలు, నిలుచున్న అప్పుకు తన చేతులను ఏమి చేయాలో తోచలేదు. అపరాధివలె చేతులు కట్టుకొని నిలుచుకోడమయితే అతనికి ఇష్టం లేదు. ఒక చేతిని వీపు వెనుక పెట్టుకొన్నాడు. మరొక చేతిని అటూ ఇటూ ఊపాడు. చిరుకండనికీ అలాగే

అయింది. అయినా అతడు నిశ్చలంగా వున్నాడు. ఎలాటి ప్రశ్నలు రావచ్చునో ఊహించడంలోనే అతని మనస్సు లీనమై వుంది.

మీసాలు పెట్టుకోక నున్నగా గడ్డం చేసుకొన్న సుందరాకారుడు, ఇన్‌స్పెక్టరు అడిగారు :

"మీ నాయకులు ఎవరు?" చిరుకండడే ముందుగా జవాబిచ్చాడు :

"మాలో నాయకులు లేరు, అనుయాయులు లేరు, మేమంతా రైతులం."

"ఇతడు చిరుకండడు" అన్నారు పటేలుగారు.

"ఓహూ ! నీవేనా కార్యదర్శి చిరుకండడు అనేవాడివి ?"

ఉగ్రమైన గొంతుకతో అప్పు అన్నాడు :

"మాలో బహువచనంతో సంబోధించి మాట్లాడడం పద్ధతి."

సబ్ ఇన్‌స్పెక్టరు బొమలు ముడివేసి అప్పునే చూచారు. నంబియారు సహించలేక కూర్చున్న ఆసనంలోనే అటూ ఇటూ కదులుతూ మరొక సిగరెట్టు ముట్టించారు. నంబూదిరి రాతితో చెక్కిన బొమ్మలాగ నిర్వికారంగా కూర్చున్నారు. అప్పు దుడుకు మాటలు విన్న బంట్లు కొందరు దానికి శిక్షగా ఇప్పుడే అతనికి దెబ్బలు పడవచ్చునని భావించారు. కోరడు అడుగులో అడుగు వేస్తూ దగ్గరికి వచ్చాడు.

సబ్ ఇన్‌స్పెక్టరు చిరునవ్వు నవ్వి "హూఁ" అని వ్యంగ్యంగా అన్నారు :

"తమరేనా అలా అయితే కార్యదర్శిగారు ?"

"అవును నేనే."

"మీకు తలమరుగు చేసుకొని తిరుగులాడే విప్లవకారుల పరిచయం లేదా ?"

"మాకు అదేమీ తెలియదు."

"పండితుడు అని ఒకడి పేరు విన్నారా ?"

అప్పు ముఖం ఎర్రబడింది. చిరుకండడు శాంతంగానే చెప్పాడు :

"మాకు ఏ పండితుల పరిచయమూ లేదు."



"అలాగా ఏమిటి ? తళిపరంబ రైతు సభకు ఎవరు మిమ్మల్ని పంపినవారు ?"

"ఎవ్వరూ లేదు. జాతరకు వెళ్ళినవాళ్ళం మా అంతట మేమే సభను చూచాము."

అంతవరకూ ఊరుకున్న నంబూదిరి నోరు తెరిచి "జాతర వెళ్ళారు. మరులు గొన్నారు. (మోసపోయారు)" అని ఖో ! ఖో ! అని నవ్వారు. నంబూదిరి ఈ ప్రవర్తన రుచించక ముఖం తిప్పుకున్నారు నంబియారు. నంబూదిరి నవ్వు విని సబ్ ఇన్‌స్పెక్టరు ఆలోచనా సరణి తెగిపోయింది. అయినా, సర్దుకొని ఆయన అన్నారు :

"మీ సంఘం ఉద్దేశమేమిటి ?"

అప్పు ఉద్వేగస్వరంతో అడిగాడు :

"ఏదో విచారణ చేసేటట్టు ప్రశ్నలు అడుగుతున్నారే !"

సబ్ ఇన్‌స్పెక్టరు గొంతు కొంచెం హెచ్చించారు :

"ఔను. విచారణే. మీ మీద ఫిర్యాదు వచ్చింది.

అప్పు తీవ్రంగా అన్నాడు :

"అలా అయితే, పట్టుకొని పోండి, న్యాయస్థానంలో విచారణ జరుగనీ !"

"ఎందుకు ? జెయిలుకు పోదామని ఆశగా ఉందా ?"

సంవాదం సరణి మార్చాలనుకొని చిరుకండడు అన్నాడు :

"మా సంఘం ధ్యేయం ధోరణి ఏమిటి అని వివరిస్తూ మేమొక కరపత్రం ప్రకటించాము మీరు చూచి వుండవచ్చు."

"హూఁ !"

"దాన్ని చదవండి, అన్ని సంగతులూ మీకు తెలుస్తాయి."

"రైతుల హిత రక్షణ తప్ప వేరే ఉద్దేశమేమీ లేదా ?"

"చెప్పాను గదా, అంతా ఆ కరపత్రంలో ఉంది."

ప్రశ్నోత్తరాలు తృప్తికరంగా నడవడం లేదని నంబియారు సబ్ ఇన్‌స్పెక్టరుతో అన్నారు :

"ఆ జెండా విషయం అడగండి."

సబ్ ఇన్‌స్పెక్టరు ఒక నిమిషం మౌనంగా వుండి, అన్నారు :

"ఆ జెండా మీకు ఎవరిచ్చారు ?"

"మేమే తయారు చేసుకొన్నాము."

"దానిని ఎగురవేయడం రాజద్రోహమని మీకు తెలుసా !"

"అది ఏ ద్రోహమూ కాదు. అది అఖిల భారత రైతు సంఘం చిహ్నం. చట్టబద్ధమయింది."

"ఓహో ! చట్టం అని మాట్లాడుతున్నారే ఎంత చదివారయ్యా మీరు ?"

"మీ అంత చదువలేదు." అన్నాడు అప్పు.

నంబియారు తటాలున కుర్చీలోనే నిటారుగా కూర్చుని చేయి విసిరి కేకలు వేశారు :

"అంటించండి వాడికి నాలుగు దెబ్బలు ! ర్యాస్కల్ ! ఎలా మాట్లాడుతున్నాడో చూడండి ?"

నంబియారు బంట్లు అప్పుమీద దూకటానికి ముందడుగు వేశారు. అయితే ఆ పని క్రమబద్ధంగా చేయడానికి పోలీసులున్నారని వాళ్ళు ఊరికే వుండవలసి వచ్చింది. పోలీసులేమో సిద్ధంగా వున్నారు. అయితే సబ్ ఇన్‌స్పెక్టరు సూచన రానందున, వాళ్ళు ముందుకు వెళ్ళలేదు.

జమీందారుగారు మెడ ముందుకు చాచి మొగసాల అర్ధగోడ అవతలికి "థూ !" అని ఉమ్మివేశారు.

సబ్-ఇన్‌స్పెక్టరు గొంతు హెచ్చించి అన్నారు :

"మలబారులో ఉండే ఈ రోగం మన తాలూకాకు వ్యాపించాలని అనుకున్నారా ? ఏమైనా వదిలిపెట్టం ? మేం ఉండడం ఎందుకు ! ఇంతకు ముందు పెద్ద పెద్ద స్వాతంత్ర్య సమర నాయకులనే జెయిలుకు పంపించాము. మీరు ఏమి లెక్క ? తెలిసిందా ?"

అప్పుకు ఈ బెదిరింపు మాటలు నచ్చలేదు. అతడు గట్టిగా అన్నాడు :

"ఊరికే ఎందుకు అరుస్తారు ? మేము న్యాయ మార్గంలోనే నడుస్తున్నాము. ఏ తప్పు చేయలేదు. చట్టం ప్రకారం ఏమైనా చేయవలసి వుంటే విచారణ జరిపించండి. వూరికే మాట్లాడకండి."



"చాలించు ?" అంటూ సబ్‌ఇన్‌స్పెక్టరు పిడికిలితో తమ తొడను గుద్దారు.

అంతలోనే ఈ వార్త వ్యాపించి రైతులందరూ నంబియారు ఇంటివైపు పరుగెత్తుకుంటూ రా సాగినారు. సంఘం ప్రముఖులు, సభ్యులు, సభ్యులు కానివారు అందరూ. స్త్రీలూ వచ్చి చేరారు. మొగసాలలో కూర్చున్నవారి గుండెల స్పందన వేగం హెచ్చింది. నంబియారు జాబు వ్రాసి పోలీసు అధికారిని పిలిపించారు. ఈ రీతి బలప్రదర్శనంతో రైతులలో భీతాహం కలిగించవచ్చునని ఆయన పథకం. ఇప్పుడు నీటి మీది హోమమయింది ఆ ప్రయత్నం. పోలీసులు సమర్థంగా ప్రవర్తించనే లేదు. పెండ్లిల్లో, చావు సంభవించిన ఇల్లో అన్నట్టు గుమి గూడుతున్న రైతులను చూచి నంబియారు వ్యర్థమైన కోపంతో మండిపోతూ, అటూ ఇటూ పచార్లు చేశారు.

ఈ పరిస్థితిని ఎంత త్వరగా పరిష్కరిస్తే అంత తమకు హిత మన్నట్టు సబ్‌ఇన్‌స్పెక్టర్ జమీందారుగారివైపు చూచారు. అక్కడి నుంచీ ఏ సూచనా రానందున తామే "మేరిక వెళ్ళవచ్చు ?" అని అప్పుతోను, చిరుకండనితోను అన్నారు.

నంబూదిరి లేచి సన్నని గొంతుకతో "నేనిక వెళుతాను. వెళ్ళనా?" అని నంబియారును అడిగారు. ఆయనకు లభించింది "హుం" అనే ఒకే ధ్వని జవాబు.

సంఘ యువ ప్రముఖుల కేమిటో ఆపద వచ్చిందనే భావించి రైతులు పరిగెత్తి వచ్చారు. అయితే అలా ఏమీ జరగనిది చూచి ఎంత మందికో మనస్సు కుములబడింది. అక్కడ జరిగిన సంభాషణను తాము వినలేక పోయాము గదా అని కొంచెం నిరాశ కలిగింది.

"ఇక్కడ ఎందుకు గుంపు కూడుతారు ! వెళ్ళండి !" అని జమీందారుగారు గర్జించారు.

సబ్‌ఇన్‌స్పెక్టరు సైగ చేయడం చూచి పోలీసులు "పొండి, ఇళ్ళకు పొండి !" అని మెల్లమెల్లగా జనాన్ని వెనక్కు నెట్టారు.

గుంపు అక్కడి నుంచి బయలుదేరింది. అప్పును, చిరుకండడిని ఆనుకొనే నడుస్తూ సంభాషణ వివరాలు వింటూ గుంపు ముందుకు సాగింది.

అప్పు తండ్రి అడిగాడు :

"మాస్టరు ఊళ్ళో లేరా ?"

ఆ ప్రశ్నకు కోరడు ఉత్సాహంతో జవాబు చెప్పాడు :

"లేదు. వూళ్ళో లేరు. వీరిద్దరూ రావడానికి ముందు మాస్టరు విషయం వచ్చింది. జమీందారుగారు మాష్టరుగారిని నోటికి వచ్చినట్టు అన్నారు. 'ఈ దినం ఊళ్ళో లేడు ఉండివుంటే మీ ద్వారా వేడి తగిలించ వచ్చునై ఉండేది' అని సబ్‌ఇన్‌స్పెక్టరుతో అన్నారు. ఏమి ధైర్యం!"

మాస్టరును గురించి అంత చులకనగా నంబియారు మాట్లాడారన్న సంగతి సహించరానిదయింది. చిరుకండడు అన్నాడు :

"వాళ్లు వేడి తగిలించే పద్ధతి ఎలాటిదో ఈరోజు చూశాము గదా! తమ సామర్థ్యం చూపాలని నంబియారే పోలీసుల్ని పిలిపించారు. చివరకు ఏమయింది? మనం వంగితే వీపుమీద గుద్దులు పడేవి. వంగ లేదు. ఊరుకున్నారు."

అంతలోనే గుంపునుంచి ఒకడన్నాడు :

"ఇక కొంచెం సేపటికే సబ్‌ఇన్‌స్పెక్టరు, పోలీసులు రైలు స్టేషనుకు బయలుదేరుతారు. ముగ్గురే ముగ్గురు. మనం వాళ్ళకు వేడి తగిలిద్దామా ?"

"శ్ !" అన్నాడు చిరుకండడు, ఎవరు అలా అన్నది అని తిరిగి చూస్తూ! "అలాటి ఆలోచనలు చేయకండి. వీధిలో పోయే మారె మ్మను ఇంటికి పిలవడమని దీనినే అంటారు."

ఆ మాట సరేనన్నట్టు ఇంకొకడన్నాడు :

"చేతులు దురదపుడుతున్నాయని బండకేసి గుద్దుకోడం మంచి దేనేమయ్యా ?"

అక్కడే వున్న కణ్ణడు మాటలు కలిపాడు :

"రాతిబండలు పగలడం వట్టిచేతులతో కాదు. వానికి వేరే సామాన్లు కావాలి!"

ఆ మాటలలో సూచితమైనది తమకు అర్థమయిందని పలువురు నవ్వారు.



ముందు సగంలో వదిలిపెట్టి వచ్చిన పనులను పూర్తి చేయడానికి జనం బయలుదేరారు.

....హోసదుర్గానికి బయలుదేరిన సబ్‌ఇనస్పెక్టరుకు, పోలీసులకు జమీందారుగారు ఉడుగరలేమో ఇచ్చారు. కాని తమ అసంతృప్తిని వ్యక్త పరచకుండా ఉండలేదు. ఆయన అన్నారు :

"మీరు మెతక, చాల మెతక."

తమ కింది పోలీసుల ఎదుట అలాంటి యోగ్యతా పత్రం పొంద డానికి ఇష్టంలేని సబ్‌ఇన్‌స్పెక్టర్ ఇంగ్లీషులో అన్నారు :

"మా కష్టం మీకు అర్థంకాదు. మీరింకా 19వ శతాబ్దపు న్యాయం మాట్లాడుతున్నారు. ఇప్పుడు పరిస్థితి మారింది. ముందయితే ఇష్టం వచ్చినట్టు ఏమయినా చేయవచ్చు. ఇప్పుడల్లాకాదు. పత్రికలున్నాయి. కాంగ్రెస్ వారు గోల చేస్తారు. అందువల్ల ప్రతిదీ న్యాయం ప్రకారం నడుస్తున్నది అని చూపుతూనే ముందుకు వెళ్ళాలి."

"అయితే మీరు ముందుకు వెళ్ళే సరికి అంతా ముగిసిపోతుంది."

"అంటే ఏమిటి ?"

"ఆ అప్పు....చిరుకండడు అందరూ నా కళ్ళ ఎదుటే పుట్టి పెరిగినవారు. చూడండి ఎలా పొగరెక్కి వున్నారో! వారికి రెండు అంటించవలసింది."

సబ్‌ఇన్‌స్పెక్టర్ తమ ఖాకీ నిక్కరు జేబులోకి చేతులు దోపుతూ అన్నారు :

"అంటించడం పెద్ద విషయం కాదు. కాని, అప్పుడు ఎంత జనం చేరారో చూచారా లేదా!"

"జనాన్ని చూచి గాభరా పడ్డారేమో మీరు! అంతమంది జనం ఇక్కడికి వచ్చి మీ ఎదుటే ఇంటికి నిప్పంటిస్తాము అంటేను ఊరికే ఉంటారాండి."

"అలాకాదు సార్."

"అలాకాదు. మరెలా ?"

"మీరు తప్పుగా భావించారు. మిమ్మల్ని అసంతృప్తి పరచి మేము చేసే పనన్నా ఏమిటి! మరొకసారి చూడండి. ఇలా కాదు."

సబ్ ఇన్‌స్పెక్టర్ కొంచెం దారిలో పడ్డారని జమీందారుగారన్నారు:

"నాకు కోపం వచ్చిందని మీరు తప్పుగా అనుకోకండి. విసుగు పుట్టింది. అందువల్లనే అలా అన్నాను."

"ఉండనీ, పెద్దదేమీకాదు అది."

"మీరు ఇక్కడి పరిస్థితిని పై అధికారులకు జోరుగా రిపోర్టు చేయాలి."

"చేస్తాను."

"మొక్కలోనే గిల్లి వేయకపోతే, మానయిన తర్వాత కష్టం. వీళ్ళ ఐకమత్యం వల్ల మనకింక ఎలాటి సహాయమూ వీళ్లు చేయరు. మా అప్పు వసూలు కావడం కష్టమవుతుంది. గుత్తల చెల్లింపు నిలిచి పోవచ్చు. గౌరవ మర్యాదలేమీ లేక మేము వూరు వదలవలసి వస్తుంది. అంతే....హాఁ....ఇవి మాకు సంబంధించినది మాత్రమే కాదు. వీళ్ళంతా సర్కారును గురించీ మాట్లాడుతారు. సామ్రాజ్యవాదాన్ని నామరూపాలు లేకుండా చేస్తామని ప్రతిజ్ఞ తీసుకున్నారట. మాస్టరు పిల్లలను ఎలా చెడుపుతున్నారనేదయితే మధ్యాహ్నమే చెప్పాను. వీళ్ళు గాంధీ వాదులయితే కాదు. మీరు వూహించినట్టు విప్లవకారులే కావచ్చు. నన్నడిగితే, ఈ రైతు సంఘం మీదే నిషేధాజ్ఞలు జారీ చేయించాలి. ఏమంటారు?"

నంబియారు మాటలు మౌనంగా విన్న సబ్ ఇన్‌స్పెక్టర్ అన్నారు:

"నిషేధాజ్ఞలు జారీ చేయించే విషయం రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించినది. రైతు సంఘం అనేది అన్నిచోట్ల వుంది చూడండి."

"అది నాకు తెలీదా? నిషేధించే విధంగా మీరు ఒత్తిడి చేయాలని నేనన్నాను."

"హుఁ!"

"ఇది నా ఒక్కని సంగతే కాదు. నంబూదిరి జమీందారుగారి అభిప్రాయమూ ఇదేనని వ్రాసివేయండి.... అతడు చాలా పిరికి. ఎలా కూచున్నాడో చూచారు కదూ. రేపు ఈ రైతులంతా 'భూమి మాదే' అంటే, 'ఒప్పుకున్నాను. మీదే....' అనే జాతి. ఇలాటి వారినంతా



నమ్ముకొని మేము పని చేయాలి. ఇక్కడ రోజులు గడపడం ఎంత కష్టమో, తెలుసా?"

ఔను, ఔను అన్నట్టు సబ్ ఇన్‌స్పెక్టరు ముఖకవళికల ద్వారా సంపూర్ణ సహానుభూతి వ్యక్తం చేశారు.

సబ్ ఇన్‌స్పెక్టరు హొసదుర్గానికి తీసుకొని వెళ్ళడం కోసం కయ్యూరు కూరగాయలు, పండ్లు, పూలు నిండిన బుట్ట తయారయింది. దానిని మోసుకొని వెళ్ళడానికి పోలీసులు ముందుబడినా, రైతుల ఎదుట పోలీసు ఘనతకు దెబ్బ తగులరాదని నంబియారు దానిని ఒక నౌకరుతో మోయించి చర్వత్తూరు రైలు స్టేషనుకు పంపించారు.

నంబియారు వారికి వీడ్కోలిస్తూ, అప్పుడప్పుడు దర్శనమిస్తూ వుండమని ఆహ్వానించారు. ఆయన అన్నారు:

"ఈ సారి అంతా తొందరయిపోయింది. ఇంకోసారి వచ్చినప్పుడు ఏడెనిమిది రోజులు ఇక్కడే మకాం చేయండి. కయ్యూరు ఆతిథ్యం ఎలాటిదీ అని చూపిస్తాను"....

....ఆ రాత్రే రైతు సంఘం కార్యవర్గం సమావేశమై పగలు జరిగిన సంఘటనలను పరిశీలించింది. చీకటి పడిన తర్వాత నీలేశ్వరం నుంచి తిరిగి వచ్చిన మాస్టరు సభలో పాల్గొన్నారు.

తాము లేనప్పుడు పోలీసుల రాకవంటి ముఖ్య సంఘటన ఒకటి జరిగి అంతా సవ్యంగా నడగడం విని మాస్టరుకు సంతోషమయింది. తాము కయ్యూరును వదలిపెట్టవలసిన పరిస్థితిని గూర్చి నీలేశ్వరంలో వున్న తోటి మిత్రులతో చర్చించి రావడానికి వెళ్ళిన మాస్టరుకు, ఇక నిశ్చింతతో తాము ఈ వూరు వదలిపెట్ట వచ్చునని తోచింది.

సంఘం ఇకముందు చేయవలసిన పనుల విషయమై దీర్ఘ చర్చ జరిగింది. పల్లెలోని రైతులను కొన్ని వర్గాలుగా నింగడించి, కథలు, పాటల కాలక్షేపంతో బాటు శిక్షణ కూటాలు నడపాలని నిర్ణయమయింది. ఇంకా చదువురాని మగవారికి, ఆడవారికి అక్కడక్కడ తరగతులు, సంవత్సరానికి ఒక "అణా" చందాతో ప్రాయంవచ్చిన రైతు లందరినీ సంఘంలో సభ్యులుగా చేర్చుకోడం.

వర్షాకాలం ముగిసే వరకు సంఘంకోసం స్వంతంగా ఒక గుడిసె వేయాలని, అక్కడ పఠనాలయం ప్రారంభించాలని సూచన వచ్చింది. దానికి ఊరి మధ్యనే ఎక్కడయినా స్థలం చిక్కుతుందేమోనని వారు దర్యాప్తు చేశారు.

కార్యవర్గం సభ్యుడొక డన్నాడు:

"స్థలం తెలుసుకునే జవాబ్దారీ నాకు వదలండి. మా నాన్ననూ. అన్ననూ ఒప్పిస్తాను. మా పొలం ఉత్తరాన ఖాళీస్థలం ఉందే, అక్కడే కట్టవచ్చు. కయ్యూరికి అది కేంద్రం."

ఈ సలహా యిచ్చినవాడు పొదవర కుఞంబు.

అప్పు తండ్రి అన్నాడు:

"మా స్థలంలోనూ కట్టవచ్చు. అయితే ఇది పల్లెకు కేంద్రం కాదు.... కానీండి. అలాగేకాని. పొదవర కుఞంబు చెప్పిన దానిని నివేదిక పుస్తకంలో వ్రాసుకోండి."

కిరసనాయిలు బుడ్డి దీపం పొగ వెలుతురిలో నేలమీద మండి వేసుకొని కూర్చుని చిరుకండడు దానిని వ్రాసుకొన్నాడు. నిటారుగా కూర్చుని కిందికి చూస్తూ ఇతరులకు వినిపించేట్టు వ్రాసినది చదివాడు.

వెనుక గోడకానుకొని కూర్చున్నారు మాస్టరు. ఆయన కళ్ళు చెమర్చాయి. ఎవరికీ తెలియకుండా వల్లెవాటు ఎత్తి తమ కళ్ళను అద్దుకున్నారు.



# 13

ఒక సందెపొద్దు కణ్ణుడు అప్పును వెదుక్కుంటూ వచ్చి, "రాత్రి భోజనానికి రా రాజా" అన్నాడు.

"విన్నావా అమ్మా?" అని అప్పు తల్లిని పిలిచాడు.

"ఏమిరా కణ్ణా, ఏమిటి సంగతి? దేవకి వేవిళ్ళ విందు భోజన మేమిటి రా?" అన్నది అప్పు తల్లి.

ఆ ఊహలో నిజం కొంత వున్నందున కణ్ణుని ముఖం రంగెక్కింది. అతడు మాట్లాడలేదు.

"ఆహా!" అన్నాడు అప్పు. "అమ్మ ఊహించింది నిజమే." తల్లివైపు చూచి అతడన్నాడు: "సరే కాని. నీకు ఎలాఅమ్మా తోచింది ఇది?"

"చాలు చాలు; అందరూ నీలాగే పగలూ రాత్రీ సంఘం — జెండా ధ్యానం మాత్రమే చేస్తూ కూచుంటా రనుకున్నావా!"

అప్పు నవ్వాడు. ఎదురు మాట్లాడలేదు. కణ్ణుని వైపు తిరిగి అన్నాడు:

"మాస్టరును, చిరుకండణ్ని, అందర్నీ పిలిచావేమోయ్?"

"ఊఁ."

"సరే! ఎన్ని గంటలకు రమ్మంటావు?"

చేతి గడియారం లేకపోయినా, అలా అడగటం, గంటల ప్రకారం మాట్లాడడం, క్రమశిక్షణ జీవి అయిన అప్పుకు అలవాటయింది.

"రా, త్వరగా రా!"

"ఏడు గంటలకు?"

"ఊఁ"

....సుమారు ఏడు గంటలకు - అప్పు మాటలలోనే చెప్పవలసి వస్తే ఏడు గంటలకు సరిగ్గా -- అతడు కణ్ణని గుడిసె చేరాడు. ఆడవాళ్ళ గొంతుకలు వినిపించాయి. కణ్ణడు తప్ప వేరే మగవాళ్ళెవళ్ళూ అక్కడ వున్నట్టు తోచలేదు.

కణ్ణడు ముసిముసి నవ్వులు నవ్వుతూ స్వాగత మిచ్చినప్పుడు, అప్పు అడిగాడు:

"ఇంకా ఎవరూ రాలేదా!"

"ఒంటిగాడవని భయమా? రావోయ్ లోపలికి."

కణ్ణని మాటలతీరు, నవ్వు సవ్వడి ఎందుకో విచిత్రంగా వున్నట్టు అప్పుకు తోచింది. నడిమింటిలో ప్రమిదదీపం పెద్దగా మండుతున్నది. పరచిన చాపమీద అప్పు కూర్చుంటుండగా కణ్ణడు అన్నాడు:

"మా అత్త వూరునుంచి వచ్చారు."

ఆ తల్లి పూర్వం దేవకి విధవ అయినప్పుడు, ఆమెను పిలుపించుకొనజాలని బీదరాలు. కణ్ణడు దేవకిని పెళ్ళాడిన తర్వాత మాత్రం రెండు మూడు సార్లు వచ్చింది. ఏమైనా, కయ్యూరికి కొత్తకాదు. అందువల్ల ఆమె రాకకు అప్పు ఆశ్చర్యపడకుండా అన్నాడు:

"తెల్లవారి వచ్చారా?"

"హూఁ."

దేవకి అక్కడికి వచ్చింది. కణ్ణని చేపట్టిన పిదప చాల దినాలకు, గర్భిణి అయిన ఆమెను - ఆ అక్కను-అప్పు కుతూహలంతో చూశాడు. దేవకి ముసిముసి నవ్వు నవ్వుతూ వంటయింటివైపు చూచి పిలిచింది:

"జానకీ రావే ఇక్కడికి."

అప్పు మనస్సు అడిగింది. ఎవరు ఈ జానకి? అమ్మా కాదు. అత్తా కాదు. వారిని పేరుతో పిలవడం ఎక్కడా లేదు. మరి ఎవరు?

ఒక బాలిక వచ్చి దేవకి పక్కన నిలిచి "ఎందుకక్కా పిలిచావు" అన్నది.

ఆమె ఎవరనేది స్పష్టమయింది. వెంటనే అప్పు చలించి పోయాడు. కణ్ణనివైపు చూచి రక్షణ కోరాడు. అయితే, కణ్ణడు అక్కడుంటే గదా! నెమ్మదిగా అప్పు ధైర్యం పుంజుకొని, నిలబడిన వారివైపు చూచాడు. వట్టి



గూడకట్టు పంచ - రవికె కాదు. ఇప్పటి పద్ధతిలాగ చీర- సాదా చీరకట్టు. ప్రమిద దీపం వెలుతురులో ఎర్రగా కనిపించే నిండయిన ముఖం. తాను కూర్చున్నది గమనించిన వెంటనే, సిగ్గుతో తలవంచి చూచిన దొంగ చూపు. వయస్సు పదహారో, పదిహేడో....

"ఈమె నా చెల్లెలు. ఈరోజు తెల్లవారి అమ్మతోపాటు వచ్చింది."

అప్పు నిద్రనుంచి మేల్కొన్నట్టు "హాఁ!" అన్నాడు. అటు తరువాత "ఊఁ!" అన్నాడు.

అమ్మాయి లోపలికి పరుగెత్తింది. దేవకి అన్నది:

"అప్పు వచ్చారు అత్తా...."

"వచ్చాడు" అని ఉన్నట్టిది, అప్పు సంఘ ప్రముఖుడయిన మీదట "వచ్చారు" అయింది.

అప్పుకు కలిగింది అపూర్వమయిన ఒక అనుభవం. అది సంతోషపు చల్లదనమందామంటే? ఏదో అసంతృప్తి వేడి దాని వెంటనే పడగ విప్పింది. భోజనానికి తనను ఒక్కణ్ణే పిలిచి వుండవచ్చుననే సందేహం ఇప్పుడు తలఎత్తి అతనికి మండింది.

భోజనం కోసమని కణ్ణడు అరిటాకులు కోసుకొని లోపలికి వస్తుండగా అప్పు అన్నాడు :

"ఇదేమిటోయ్ కణ్ణ? నీవు మరెవరినీ భోజనానికి పిలువలేదని తోస్తుంది."

కణ్ణడు లోలోపల నవ్వుకుంటున్నా అప్పు కోప స్వరానికి నొచ్చుకొన్న వాడిలాగా నటించి, ఊరికే వున్నాడు. ఒక క్షణం ఆగి నెమ్మదిగా అన్నాడు :

"అప్పూ, అమ్మ చేసిన కుడుములు తినడానికి ఒకమారు నిన్ను పిలుచుకొని వచ్చాను. జ్ఞాపకముందా? అయితే, ఆ సారి అలాగే వెళ్ళిపోయావు. ఆ మీదట ఎన్నోసార్లు నీవు భోజనానికి వచ్చినా, కుడుములు చేయలేదు. ఈ రోజు చేశారు. అందుకే, నిన్నొక్కణ్ణే పిలవడం."

ముందు ఒకసారి కుడుములు తినడానికి వచ్చిన రాత్రే ఎన్నటికీ మరువని సంఘటన. కణ్ణని మాటలు వినగానే అప్పు మనస్సు నిర్మలమయింది; హృదయం తేలికయింది. ఉల్లాసంగా మాట్లాడసాగాడు.

ఆడవాళ్ళు, ముఖ్యంగా దేవకి, జానకి – జానకి, దేవకి – తమ సంభాషణకు చెవి ఒగ్గుతున్నారనే జ్ఞానంతోనే, ఆ సంగతి, ఈ సంగతి ప్రస్తావించి, అప్పు స్వారస్యంగా మాట్లాడాడు.

....భోజనమయింది. అప్పు తాంబూలం వేసుకోలేదు. కణ్ణుడు బలవంతం చేసినప్పుడు దేవకి. "ఆయన తాంబూలం వేసుకోని బ్రహ్మచారి ! బలవంతం చేయకండి" అన్నది. కణ్ణుడు నవ్వాడు. ఏమి చెప్పాలో తెలియక వెర్రివాడిలా అప్పు నవ్వాడు.

అతడు బయలు దేరడానికి నిలబడినప్పుడు దేవకి తలుపు దగ్గరికి వచ్చి అన్నది :

"బ్యాటరీ తీసుకొని రాలేదా ఈ రోజు ?"

"ఇంతటి వెన్నెల వెలుగుంది."

"అయినా తిసుకురాలేదేమోనని అడిగాను."

ఇది అర్థంలేని మాట అని అప్పుకు అనిపించింది. అయితే దేవకి లోపలివైపు చూస్తూ అన్నది :

"బ్యాటరీ అంటే ఈయనకు ప్రాణమున్నట్టు."

లోపలి నుంచి సుందరమైన, ముగ్ధమైన కిలకిల వినిపించింది. ఆ నవ్వు ధ్యాసలోనే అప్పు దారిని నడిచాడు.

"వంట బాగా చేశారేం రా!" అని తల్లి ఇంట్లో అడిగింది :

అతడు "హూఁ !" అన్నాడు.

"అందరూ వచ్చారా ?"

మరొకమారు "హూఁ !"

....ఆ రాత్రి నిద్ర అప్పు వద్దకు రావడం తడవయింది.

....తెల్లవారి లేచిన అప్పు అంతా మరచిపోయినట్టు తలగోక్కొని, వడ్లకణజం కట్టడంలో తండ్రికి సహాయపడ్డాడు. సాయంకాలం చిరుకండనితో సమావేశం జరిగింది. అప్పుడు తాను రాత్రి కణ్ణని ఇంటికి భోజనానికి పోయిన విషయం చిరుకండనికి తెలుపుదామన్నది అప్పు మనస్సు. అయితే, ఆ యోచన తనకు తానే మరుగయిపోయింది.

కణ్ణుడు తన్ను ఎందుకు ఒక్కణ్ణే భోజనానికి పిలిచాడని అప్పు తర్కించాడు. విప్లవకారుడైన తాను అలాటి యోచనలు చేయడమే తప్పని అంతరాత్మ ప్రబోధిస్తున్నది. కణ్ణుడేమైనా ఆ ప్రస్తావన తెస్తే బాగా తిట్టాలని అనుకొన్నాడు అప్పు. అయితే కణ్ణుడు సాయంకాలం కనిపించలేదు. అందువల్ల అప్పుకు విసుగనిపించింది.

మరుసటి దినం మండుటెండలో అప్పు నదికిపోయి చల్లగా స్నానం చేశాడు. ముందొకమారు ఎండలో రాతిబండమీద ఒంటి నీరు ఆర్చుకొనే టప్పుడు దేవకికి సంబంధించి కణ్ణుడు అన్న మాటలు అప్పుకు జ్ఞాపకం వచ్చి నవ్వొచ్చింది. అయితే మరుక్షణమే మనసు కొసటబీసట అయింది. నది గట్టు పొడుగునా ఎగువకు వెళ్ళితే కణ్ణని ఇల్లు వస్తుంది. నిన్నంతా అతడు కనిపించనేలేదు. 'ఇంట్లో ఉన్నాడేమో చూడవచ్చు' అన్నది మనస్సు. మరుసటి క్షణంలోనే 'ఆ' కోరికలోని కోరిక స్పష్టమై అతడు తనకు తానే చీదరించుకున్నాడు.

ఆ రోజూ కణ్ణుడు కనిపించనప్పుడు అప్పు మనస్సు అస్తవ్యస్త మయింది.

"ఒంట్లో బాగులేదేమోయ్ ?" అన్నాడు చిరుకండడు.

"ఎందుకో ఒక విధంగా ఉన్నావు కదా అప్పు ?" అని మాస్టరు అడిగారు.

"ఏమీ లేదు. ఏమీ లేదు." అని చెప్పి అప్పు తప్పించుకున్నాడు. అయితే మనస్సును చుట్టుముట్టిన యోచనల ముట్టడి నుండి అంత సులభంగా తప్పించుకొనడం సాధ్యం కాలేదు.

మరునాడు కణ్ణుడు కనిపించినప్పుడు అప్పు అన్నాడు :

"ఎక్కడికి వెళ్ళావోయ్ రెండు రోజులు ?"

"ఇంట్లోనే వున్నానోయ్."

"అలాగా ! మీ అత్తను విడిచిపెట్టి రావడానికి నీవు ఎక్కడికైనా వెళ్ళావేమోనని అనుకున్నాను."

"వదలిపెట్టి రావడమా ! దేవకి బాలింత అయ్యే వరకు వారంతా ఇక్కడే వుంటారు."

"వారంతా" అన్నాడు పుణ్యాత్ముడు ! జానకి కూడా మరికొన్ని దినాలు ఇక్కడే ఉంటున్నట్టయింది.

కణ్ణడు అప్పునే నేరుగా చూస్తున్నాడు. తన మనస్సులో ఉన్న దానిని కణ్ణడు చదువ వచ్చునని అప్పు గాంభీర్యం వహించి, "రావోయ్ చిరుకండని ఇంటికి పోదాము. వర్షాకాల కార్యక్రమం గురించి చర్చించాలి." అన్నాడు.

తన సహచరి కావలసిన స్త్రీకి సంబంధించిన ఆలోచనలన్నీ ఇంత వరకు జానకి రాకకోసమే కాచుకొని ఉన్నవేమో అన్నట్టుగా, ఇప్పుడు కాడి తెంపుకొని పరుగులు తీశాయి. చేయవలసినపని గుట్టలాగ ఉండగా, సాధించవలసిన లక్ష్యం ఇంకా దూరాన ఉండగా, ఇలాటి యోచన తాను చేయరాదని అప్పు తనను తానే విమర్శించుకొన్నాడు. ఈ విషయం గురించి ఎవరితోనైనా గుండె తెరిచి మాట్లాడాలని అనిపించింది. ఉదాహరణకు మాస్టరు. ఆయనకు తెలుపక, సలహాలు అడుగక అప్పు ఏ పనినీ ఎప్పుడూ చేసినవాడుకాడు. అయితే ఈ సంగతిని ఆయనతో ప్రస్తావించడం ఎలాగ? సద్య. ఈ యోచన వదని ఊరికే వుండడం సాధ్యమే! కాని, ఆ నెల చివరిలోనే ఇక కొన్ని రోజులలోనే - మాస్టరు కయ్యూరు వదలి పోతారనే జ్ఞానం అప్పు కలవరాన్ని తీవ్రం చేసింది.

వీటన్నిటి సూక్ష్మ ప్రతిబింబం అప్పు నడతలోను, నుడువుల లోను - చేతలలోను, మాటలలోను కనిపించక పోలేదు. అప్పును ఏదో వేధిస్తున్నదని చిరుకండని మనస్సుకు తోచింది. చిరుకండడు ఒక అత్యవసరమైన పనికోసం అప్పును వెదుక్కుంటూ అతని ఇంటికి వచ్చాడు. అప్పు ఇంటిలో లేడు. హోటలులోను లేడు. కణ్ణని ఇంట్లో ఉండవచ్చునేమోనని అక్కడికీ వెళ్ళాడు. అక్కడా లేడు. ఆ యింట్లో "లేడు" అని సమాధాన మిచ్చినది, ఒక బాలిక! ముఖ లక్షణాలను బట్టే దేవకి చెల్లెలు కావచ్చునని చిరుకండడు ఊహించాడు. నదికేమైనా వెళ్ళాడేమోనని అటు వైపు నడిచాడు. అక్కడ చెట్టు నీడన పరచిన బండలమీద అప్పు అత్యంత వ్యాకులతకు లోనయిన వాడిలాగ పడుకున్నాడు.

ఏమిటి? ఎందుకు? అని ఆలోచించగా చిరుకండనికి వెంటనే విషయం స్పష్టమయినట్టనిపించింది.

పది సంవత్సరాల క్రితం చిన్నవాళ్ళుగా వున్నప్పుడు ఆట్లాడినట్టు చెట్టు మరుగున చిరుకండడు నిలిచి, పడుకొన్న అప్పుపైపు చిన్న



రాయి విసిరాడు. రెండవ రాయి తాకింది. అప్పు దిగ్గున పక్కకు పొర్లి మోచేతులూని మెడయెత్తి అటు ఇటు చూచాడు. చిరుకండడు నవ్వుతూ మరుగునుంచి వెలుపలికి వచ్చాడు.

"నిరాశ అయిందేమోయ్? ఎవరనుకున్నావ్?"

అప్పు ముఖం ఎర్రబారింది. అతడు చిరుకండని చురచుర చూసి అన్నాడు:

"రావోయ్ కూర్చో!"

మరొకరోజు అయివుంటే, సోమరితనం విషయంలో చిరుకండని విమర్శ పీఠికతో సంభాషణ మొదలయ్యేది. ఈ దినం చిరుకండడు అలా చేయక సరాసరి విషయానికి వచ్చాడు:

"చర్వత్తూరులో రేపు రాత్రి కార్యకర్తల సభ పెట్టారు. నీకు తెలుపమన్నారు మాస్టరు."

కర్తవ్యనిష్ఠ చీమ కుట్టినట్టు అప్పును మేల్కొలిపింది.

"హూం. అందరికీ చెప్పావా?"

"మనమిద్దరమే చాలునన్నారు."

"మాస్టరు వస్తారా?"

"హుం."

మాస్టరు కూడ రేపటి సభకు వస్తారన్న వార్తతో ఆయన త్వరలో వెళ్ళిపోతారన్న జ్ఞాపకం జాగృతమై అప్పు మరీ ఖిన్నుడయ్యాడు. ముఖంలో కలిగిన మార్పును గమనించిన చిరుకండడు అన్నాడు:

"స్నానమయిందా?"

"హూం"

"నడు. అలా అయితే గుడ్డలు వేసుకో."

—వాళ్ళు నడుస్తుండగా చిరుకండ డన్నాడు:

"వస్తూ దారిలో కణ్ణని ఇంటికి వెళ్ళాను."

అప్పు సర్రుమని అతనిని చూచాడు. ఆ చూపును గమనించి చిరుకండడు మాటలు ముందుకు సాగించాడు:

"నీవు అక్కడేమైనా వుంటావేమో నని వెళ్ళాను."

"అక్కడెందు కుంటాను నేను?" అన్నాడు అప్పు. గొంతు బొంగురుపోయింది.

"ఊరంతా వెదికి నీవు దొరక్కపోతే అక్కడికి వచ్చాను." అన్నాడు చిరుకండడు. నాలుగడుగులు నడిచేవరకు ఊరికే ఉండి మళ్ళీ అన్నాడు :

"దేవకి చెల్లెలు వచ్చినట్టుంది."

"ఔను." అన్నాడు అప్పు. కొంచెంసేపు అక్కడే నిలిచాయి మాటలు.

చిరుకండడే మళ్ళీ మొదలు పెట్టాడు:

"ఇక వర్షాకాలం. పెండ్లి ఓలగం, ఊరేగింపులకు మొదలు."

"నా కెందుకు చెబుతావు అది?" అన్నాడు అప్పు కోపంతో.

అంత గట్టిగానే చిరుకండ డన్నాడు :

"ఏమిటి? నీవు పెళ్ళి చేసుకుందామను కున్నావా?"

"చిరుకండా?"

పరస్పరం పొడుచుకొనిచూచిన చూపులు ఆరెండు. మళ్ళీ వారిద్దరి మధ్య దించిన మౌన యవనిక....

పొద్దు మునిగేవరకు వారు కలిసేవున్నారు. పెక్కు ఇండ్లకుపోయి సభ్యులను చేర్చారు. మాటలు గీటలు ఎంత అవసరమో అంతే. హాఁ.... హూఁ.... ఔను.... కాదు.

రాత్రి ఇద్దరూ తమ ఇండ్లవైపు మళ్ళారు. చిరుకండడు ఇక తన దారికి తిరగాలి. అతడు "వస్తాను" అని అన్నాడు. అయితే అప్పు మాటలు అతనిని ఆపాయి.

"నిలు చిరుకండా, నీతో కొంచెం మాట్లాడాలి."

దుఃఖభారం దిగిపోయి మనస్సు చులకనయి చిరుకండడు పక్కన కొండవైపు చూచాడు. కొండవాలులో ముంత మామిడిచెట్టు....అతనికి జ్ఞాపకం వచ్చింది. ఆరు సంవత్సరాల క్రితం ఒకనాడు అక్కడే ఒక ముంతమామిడి చెట్టు కింద కూర్చుని వారు ఆత్మీయతతో మాట్లాడారు.... అటు మళ్ళిన చిరుకండని అప్పు వెంబడించాడు. ఆ చెట్టు ఏదో? అక్కడే? అదే అయివుండాలి....అప్పుకు కూడ జ్ఞాపకం వచ్చి కళ్ళు కాంతితో



మెరిశాయి. అయితే అతడు ఊరకున్నాడు....ఆ దినం అది పగలు... ఎండ ఉండినది. ఇది పున్నమ సమీపిస్తున్న రాత్రి. విషయం కూడా అలాగే....వెనుకటి దాని కన్నా భిన్నం....

ఆ నీరవతలో మాటలు కదిలి కదిలి ముక్కలు ముక్కలుగా వచ్చాయి. చల్లనిగాలి నెమ్మదిగా వీచి, బాధపడుతున్న అప్పుకు హృదయ వేదనను తగ్గించింది

చిరుకండడు ఊరికే కూర్చుని వింటున్నాడు. చెప్పేది ముగిసిన మీదట తీర్పు ఎలా వుంటుందోనని ఎదురుచూచే నిందితుడిలాగా అప్పు కాతరమైన మనస్సును చిక్కబట్టి మౌనంగా కూర్చున్నాడు. చాలాసేపు ఇద్దరూ అలాగే వున్నారు. చివరకు అప్పే అడగ వలసి వచ్చింది:

"ఏమి చెబుతావు చిరుకండా?"

చిరుకండడు నిట్టూర్పు వదలి, సన్నగా నవ్వి అన్నాడు:

"నేనేమి చెప్పను? నేను నీకంటే ఒక సంవత్సరం చిన్నవాణ్ణి."

"అదిగో! మళ్ళీ వయసు సంగతి. ప్రతి విషయంలోను నీవు నాకు అన్న ఉన్నట్టు అని మరిచావా?"

"ఇదంతా తప్పని నేను ఎలా చెప్పను? అయితే, మధ్యాహ్నం నీ చిడుముడి పాటు చూచినప్పుడే నీవు ఉద్యమం వదలి పెడతావేమోనని దిగులయింది."

"ఉద్యమం విడువడం కాదు, ప్రాణాలు వదలడం. అలాటి మాట లాడి ఎందుకు నొప్పిస్తావు?"

"ఉండనీ... రేపు చర్వత్తూరికి పోతూ మాస్టరుతో మాట్లాడుదాము."

చివరి తీర్పు సద్య ముందుకు వాయిదా పడిందని అప్పు మనసు కుదుట బడింది. అయితే రేపు మాస్టరుతో ఈ విషయం మాట్లాడే సందర్భాన్ని చిత్రించుకొన్నప్పుడు హృదయం కుంగి పోయింది. అతడన్నాడు:

"నేనే చెప్పడమంటే సంకోచంగా వుందోయ్. ఆయన ఏమను కుంటారో ఏమో?"

ముందొకప్పుడు కణ్ణడు కూడా అప్పుతో ఇలాగే అన్నాడు. అతని పక్షంగా తాను మాస్టరుతో మాట్లాడడం జ్ఞాపకమయి చోద్య మనిపించింది:

"దీనిలో సంకోచం ఏలాటిది?" చిరుకండడు కూర్చున్న చోటి

నుంచి లేచాడు. అప్పుకూడ లేస్తూ మరొకమారు చుట్టూతా చూచి అన్నాడు :

"ఈ చోటనే పూర్వం...."

"ఔను. తెలుసు"-అన్నట్టు చిరుకండడు తల ఊపాడు.

.... .... ....

"విప్లవకారులు పెళ్ళాడవచ్చునా సార్?"

చర్వత్తూరికి వెళ్ళే దారిలో చిరుకండడు అడిగిన ప్రశ్నకు మాస్టరు చకితులయ్యారు. తమ విషయం గురించే అతడు అలా అడిగి వుండవచ్చునని ఆయనకు తమాషాగా అనిపించింది. నవ్వుముఖంతో ఆయన అన్నారు:

"పెరగడం, చావడం ఒక్కటే బతుకు లక్ష్యం అయిన వారికి పెళ్ళి అంటే వట్టి చిల్లరసంగతి. అయితే, విప్లవకారులకు అలా కాదు. సాధారణంగా వారికి పెళ్ళి అనేది మెడకు గుదిబండ కట్టుకున్నట్టు. వారి పాలికి సంసార సుఖం సాధ్యమే కాదు. సంసార సుఖమంటే అర్థమయిందేమర్రా? భార్యా భర్తలు జతగా కలిసి వుండడం, పిల్లలను సాకడం, పెంచడం."

గుండె బిగబట్టుకొని అప్పు ఆ మాటలు విన్నాడు. తట్టుకోలేనంత చలిగాలి వీచిందేమో అన్నట్టు అతని శరీరం వణికింది.

అయితే, ఏ విషయాన్నయినా అన్ని వైపులనుంచి వివరించి చెప్పే మాస్టరు ప్రతిపాదనా వైఖరిని చక్కగా తెలిసిన చిరుకండడు కుతూహలంతో వింటూనే నడిచాడు.

మాస్టరు మాటలు కొనసాగించారు:

"అయితే, విప్లవకారుడూ మానవుడే. యోగక్షేమాలు తెలుసుకోడం, పోషణ, ఉపచారం లేకపోయినా, అతనికి ప్రీతి కావాలి. జనం చూపే ప్రీతితోపాటు తన కోసమైన ఒక విశిష్ట ప్రీతిని అతడు కోరుతాడు. అది అతని లాగే విప్లవకారిణి అయిన స్త్రీ నుంచి లభిస్తుంది. ఆమె విప్లవకారిణి కాకపోయినా, అతనిని చక్కగా అర్థం చేసుకొని, అనుకూలవతిగా వుండాలి—అయినా, విప్లవకారుని దాంపత్య జీవనానికి ఒక మితి ఉందన్నది నిజం."



చిరుకండడు ముందు నడుస్తున్నాడు; అప్పు వెనుక; మధ్య మాస్టరు. అడిగేవారి ముఖభావాలను చూస్తూ తమ మాటల పర్యవసానమేమిటని తెలుసుకొనే అభ్యాసమున్న మాస్టరు ఇప్పుడు దానిని తెలుసుకోలేక నిరుత్సాహ పడ్డారు. పిల్లవాళ్ళు అలా మౌనంగా ఉండడం సరికాదనిపించింది. ఆయన అన్నారు :

" ఈ విషయం ఎందుకు అడిగారు? ఏమిటి సమాచారం?"

తాము అవివాహితులుగానే ఉండడానికి కారణం ఏమిటని వారు అడుగుతారని మాస్టరు అనుకున్నారు. కాని, ఆయన భావన తప్పయింది.

"మన అప్పు...."

పాత జ్ఞాపకాల లోకానికి ఎగిరిపోవడానికి సిద్ధమవు తున్న మాస్టరు చిరుకండనిమాట విని, కళ్ళు వెడల్పు చేసి నిలుచున్నారు.

"అలాగా? ఊం!"

చిరుకండడు నెమ్మదిగా మాట్లాడాడు; అప్పు కూడ నడుమ నడుమ ఒక మాట చేర్చాడు. మాస్టరు ఊగొడుతూ, అంతా వింటూ నెమరు వేసుకుంటూ నడిచాడు.

తమ అభిప్రాయాన్ని వినడానికి అప్పు, చిరుకండడు ఉబలాట పడుతున్నారని తెలుసుకొన్న మాస్టరు తడుముకోకుండా అన్నారు:

"సంతోషమోయ్! అప్పు! సంఘానికి కార్యకర్త ఒకామె లభించినట్టయింది. చదువు, వ్రాత వస్తుందా, రాదా! రాకపోతే నీవే నేర్పుదువుగాని."

పెద్దన్నలాగ - తండ్రిలాగ - మాస్టరు ఆశీర్వదించారని అప్పు కనులలో ఆనందాశ్రువులు నిండాయి. చిరుకండడూ సంతృప్తిగా నిట్టూర్చాడు.

మాస్టరు అన్నారు :

"ఇది పెద్ద బాధ్యత అప్పు. అయితే, నీవు ఉద్యమానికి దూరమైపోవనే నమ్మకం నాకుంది. ఒక విధంగా ఇదీ మంచిదే. పెండ్లికాని ఒంటరి ప్రాణికి మనలో గౌరవం తక్కువ. ఏమైనా కాని, ఆమెను కూడా విప్లవకారిణి చేయడం నీ జవాబ్దారీ."

"ఊఁ!" అన్నాడు అప్పు తన కర్తవ్యం తనకు తెలుసునన్నట్టు.

"అమ్మాయి పేరేమి;"

"జానకి."

ఆ విషయం మహత్వ పూర్ణం అన్నట్టు మాస్టరు "మంచి పేరు." అన్నారు.

కొంతసేపయిన తర్వాత చిరుకండడు తాను అడుగదలచిన దానికి పూర్వభావిగా ప్రశ్నించాడు:

"పండితులకు పెళ్ళయిందా సార్?"

ఇకనయినా తన వరస తప్పదని తెలుసుకొని మాస్టరు అన్నారు:

"ఊఁ! ఆమె ఉపాధ్యాయినిగా ఏదో ఊళ్ళో వున్నారు. చాల మంచివారు."

"మీరు ఎందుకు సార్?_"

ప్రశ్న పూర్తి కానివ్వకుండ మాస్టరు గట్టిగా నవ్వారు. చివరకు తల వూపి చెప్పారు:

"ఎందుకో చేసుకోలేదు."

"చేసుకోరా సార్?"

మాస్టరు నిదానంగా, పదాలను విడివిడిగా ఉచ్చరిస్తూ అన్నారు:

"నాకు తెలియదు. అప్పు వయస్సంత వయస్సున్నప్పుడు నాకు ఒక అమ్మాయి పరిచయమయింది. ఒకరినొకరు మెచ్చుకొన్నాము. అదే ప్రీతి అని నేను భావించాను. తర్వాత పెండ్లి తప్పిపోయింది."

"ఏమయింది సార్?"

"ప్రీతి అంటే మగవాడు ఆడది ఒకరి నొకరు ఆపేక్షించినంత మాత్రాన చాలదని నాకు మనస్సుకు వచ్చింది. నా జీవిత లక్ష్యం, ధ్యేయం ఒక్కటీ ఆమెకు అర్థంకాలేదు. అటువంటిదంతా ఆమెకు ఇష్టం లేదు. అందు వల్లనే సంబంధం విరిగిపోయింది.... ఆ మీదట పెళ్ళి యోచనే వదలి పెట్టాను."

"సరైన వారిని చేసోకరాదా సార్?"



"చూద్దాం.... ముందు సంగతి ముందు. మొదట మీ పెళ్లి కానీ, కయ్యూరు రైతు నాయకులు జులాయివాళ్ళు కాదు అని జనం పొగడనీ."

అలా చెప్పిన మాస్టరూ, దానిని విన్న అప్పు, చిరుకండడూ ఒక్కసారిగా నవ్వారు.

"తల్లిదండ్రులకు ఈ సంగతి ఎప్పుడు తెలుపుతావు?" అన్నారు మాస్టరు.

"ఆ జవాబ్దారీ మీది సార్!" అన్నాడు అప్పు.

"సరి! సరి! మీ అమ్మకు కోడలు నచ్చకపోతే నన్ను తిడుతారు. అంతే!"

"అమ్మల కేమిసార్? పిల్లల పెళ్లికి ఒప్పుకోడమే చాలునని వుంటుంది" అన్నాడు చిరుకండడు.

"స్వానుభవంతో ఈ మాటలు అంటున్నావేమయ్యా?" అని అంటూ మాస్టరు మరొకసారి నవ్వుల సుమారం లేపారు.

చర్వత్తూరు సమీపించింది....

...........

మాస్టరు రాయబారానికి సులభంగానే విజయం లభించింది. కణ్ణుడు విందు వల విసిరి అప్పును పట్టుకొన్న కథ పలువురి నోటి మాటయి, అందరూ కణ్ణడిని పొగిడారు.

"నేను కాదండోయ్.... భోజనానికి పిలువమన్నది నా భార్య." అన్నాడు కణ్ణుడు.

"ఇలాటి విషయాలు ఆమెకు బాగా తెలుసునయ్యా." అని అన్నారు ఎవరో.

సంవత్సరం చివరన పెళ్లి - అనే సూచన వచ్చింది.

"సంఘం కట్టడంలోనే పెళ్ళయితే బాగుంటుంది" అని వివాహితుడయిన పొడవర కుఞంబు అన్నాడు.

అప్పు తండ్రి దానికి ఇష్టపడక అన్నాడు:

"ఛ! ఛ! అదంతా సరికాదు. అమ్మాయికి సొంత యిల్లు లేదు గనుక మా యింట్లోనే పెళ్లి జరుగనీ."

"అయితే మాస్టరు లేకుండా పెళ్లి జరుగుతుందంటే ఏమిటి?"

"నేను ఎక్కడున్నా రానే వస్తాను." అని ఆయన ఆశ్వాసన మేమో యిచ్చారు. కాని, అప్పు ఒప్పుకోలేదు. మాస్టరు కయ్యూరు వదలడానికి ముందే, వేసవిలోనే పెళ్లి అని నిశ్చయమయింది.....

కయ్యూరు బడి పరీక్షలు జరిగాయి. ఆ సంవత్సరం కయ్యూరు 'పట్టభద్రుల'లో ప్రథమ స్థానం ఆక్రమించినవాడు కుఞంబు తమ్ముడు రామన్ నాయర్. రెండవవాడు అప్పు తమ్ముడు. నంబూదిరి పెద్దబ్బాయికి ఎక్కువ మార్కులు వచ్చాయి. కాని, నంబియార్ కుమారుడు కరుణాకరుడయితే ఎలాగో గట్టెక్కాడు.

....అప్పు మాస్టరుతో "పెళ్లి కొత్త పద్ధతిలో జరగాలి. రిజిస్టరు కావాలి" అని తన ఆశయం వ్యక్తపరిచాడు. విప్లవకారుడైన అప్పు అలా ఆలోచించడం సహజమే. కానీ అలాటి జ్ఞానం స్పష్టంగా కలుగని వాతావరణంలో ఈ విధంగా చేయడం సులభం కాదు. మాస్టరు శాంతంగా చాల సేపు అప్పుతో వాదించారు. పెద్దలకు. ఊరివారికీ సమ్మతమైనట్లు అయితే సాధ్యమైనంత పొదుపుగా - పెళ్ళి జరగడమే ఉచితమని ఎంతో ప్రయాసతో అప్పును ఒప్పించారు.

పల్లెలో ఎవరికి పెళ్ళి నిశ్చయమైనా మొదట భూస్వాములిద్దరి సమ్మతి పొందడం సంప్రదాయం. వారిని పెళ్ళికి పిలువడంకోసం వెళ్ళినప్పుడు "నజరానాను" సమర్పించాలి. పెళ్ళయిన తర్వాత దంపతులు జమీందారుగార్ల వద్దకు పోయి ఆశీర్వాదాలు పొందాలి. దానికి బదులుగా ఆ దంపతులకు ఏదైనా బహుమానం లభించేది. అన్నిటికన్నా ముఖ్యమయింది వివాహపు వెచ్చానికి డబ్బు. దానిని ఉదారులయిన జమీందారుల నుంచి ఋణంగా పొందక ఆ పల్లెలో జరిగిన పెండ్లి ఏదన్నా వుందా?

కాని, ఈసారి ఆ సంప్రదాయం విరిగిపోయింది. అప్పు తండ్రి. కణ్ణడూ మొదట జమీందార్ల వద్దకు వెళ్ళి వారి సమ్మతి పొందలేదు. "నజరానా" సమర్పించలేదు. పల్లెలోని వారినందరినీ పిలిచినట్టే వారినీ పిలిచారు. వీళ్ళు వెళ్ళినప్పుడు పూజకు కూర్చున్న నంబూదిరి వెలుపలికి రాలేదు. వెలుపల కూర్చున్న నంబియారు కళ్ళు ఎర్రగా చేసుకొని లోపలికి



వెళ్ళిపోయారు. దేవకి చెల్లెలి పెళ్ళనే వార్త అయితే ఆయన పాత గాయం కెలికినట్టయింది.

పెళ్ళి జోరుగా జరిగింది. ఎవరు ఎంత చెప్పినా, ఏమి చెప్పినా అప్పు తండ్రి చేయి వదులుగా వదలకుండా వుండలేకపోయాడు.

పెళ్ళి పందిట్లో సంఘం కట్టడం కోసం వరుని పక్షంగా పది రూపాయలు కానుక ఇచ్చినట్లు అప్పు తండ్రి ప్రకటించాడు. పది రూపాయలు పెద్ద మొత్తమే అయినా కణ్ణడు వెనుకంజ వేయక వధువు పక్షంగా వాగ్దానం చేశాడు.

"ఎర్ర జెండాకు ఖుషీగా వుంది! జోరుగా ఎగురుతూంది!" అన్నారు ఎవరో.

పెళ్ళి సంబరంలో మాస్టరు, చిరుకండడు. త్రికరపురం నుంచి వచ్చిన చందు వరుని దగ్గరే కూర్చున్నారు.

"పండితులు రావడం పడదా?" అన్నాడు అప్పు. "ప్రభు. దుట్పోడు, రాముణ్ణి, కెళప్పన్ వీరెవరూ రావడం పడదా?"

"పసిపిల్లవాడిలాగ మాట్లాడవద్దు. జమీందారువైపు వారు గుర్తుపడితే పోలీసులకు రిపోర్టు ఇవ్వడానికి అనుకూలమవుతుంది." అని చిరుకండడు చిరాకు పడ్డాడు.

"వారందరికీ నేనే ప్రతినిధిని అని భావించుకో అప్పు" అని మాస్టరు అన్నారు.

అయినా అక్కడ చేరిన జనాన్ని చూస్తున్న అప్పుకు రాజాలని తనవారి జ్ఞాపకం రాకుండా వుండలేదు.....

పెళ్ళి జరిగిన ఆ సమయంలో కయ్యూరి రైతుల వారి సంఘం కార్యకలాపం అదొక్కటే ఏమో అన్నట్టు కనిపించింది. కాని, ఆ భావన సరికాదని చూపినవాడు అప్పే. పెండ్లికొడుకు మొదటిలాగే సంఘం పనులలో నిరతుడయ్యాడు.

................................

సంతోషాధ్యాయం తర్వాత దుఃఖపు పుటలు ఉన్నవి. అది మాస్టరు వీడ్కోలు. బడుగు కోరడు మొదలు శ్రీమంతులైన రైతుల వరకు అందరూ ఆయనను విందుకు పిలిచేవారే. నంబియారు దురాగ్రహ

నికి లోనయి మాస్టరు వెళ్ళి పోతున్నారనే సంగతికి రైతులు ఏమీ బెదిరి పోలేదు.

"నేనిక ఎప్పుడూ కయ్యూరికి రానే రానన్నట్టు విందులు చేస్తున్నారు గదా." అని మాస్టరు నవ్వుతూ నవ్వుతూ ప్రతిఘటించారు.

"వచ్చేసారి రైతు సమ్మేళనం ఇక్కడే జరుపుతాము మాస్టరుగారూ. అప్పుడు మిమ్మల్ని పిలుస్తాము." అని పలువురు రైతులు చెప్పారు.

సంఘం కారణంగానే తానొక మనిషి అనిపించుకొన్న కృష్ణన్ నాయర్, ఏమి చేస్తే తన కృతజ్ఞత సూచిత మవుతుందో అని తటపట లాడాడు.

గురువుకు కానుకలు వచ్చాయి! ఒంటిగా చేతులు విసురుకుంటూ వెళ్ళ వలసిన మాస్టరు డబ్బు దస్కం, బట్ట బాత సంఘవశం చేశారు. పండ్లు ఫలాల బుట్టలను చేతితో తాకి స్వీకరించి, వెనక్కు పంపారు.

"ఇక్కడనుంచి ఏ వూరికి పోతారు సార్?" అని చిరుకండడు మాస్టరుతో పాటు తాను, అప్పు ఇద్దరే వున్నప్పుడు అడిగాడు.

"తలచేరికి అని అందరికీ చెప్పండి. అయితే, తర్వాత అక్కడి నుంచి కల్లికోటకు పోతాను. అక్కడ మన నాయకులను చూడాలి. అయితే, ఈ విషయం ఎవ్వరికీ చెప్పకండి. మళ్ళీ ఈవైపు వచ్చినా రావచ్చు. బదులలో మాస్టరు పని నాకు చిక్కుతుందో లేదో తెలియదు." అని ఆయన అన్నారు.

బయలుదేరడానికి వెనకటి సాయంకాలం బడి ధర్మకర్తల సమితి అధ్యక్షులయిన నంబియారు వద్దకు వెళ్ళి లెక్కాచారం ముగించుకొని వచ్చారు.

తెల్లవారి బయలుదేరి వెళుతూ, బడి పెరట్లో రెండు వైపుల ఎత్తుగా పెరిగిన రెండు మామిడి మొక్కలపైన దృష్టి సారించారు మాస్టరు. ఎదట గుమికూడిన జనాన్ని చూచి మాస్టరన్నారు:

"మొక్కలు పెరుగుతూ ఉన్నవి. అయినా ఫలమిచ్చే స్థితికి ఇంకా రాలేదు."

అలా చెప్పి ఆయన అప్పు, చిరుకండల వైపు చూచి నవ్వారు.



సంవత్సరాల క్రితం ఆ మామిడి మొక్కల సంబంధంగా మాస్టరు అన్న మాటలు వారిద్దరికీ జ్ఞాపకం వచ్చి వారి ముఖాలు వికసించాయి.

సగం దారి వరకు నూరార్ల జనం మాస్టరు వెంట వచ్చారు. "రాకండి. వెనక్కు వెళ్ళి పోండి" అని చెప్పి చెప్పి మాస్టరుకు చావయి పోయింది. పోలీసుల రిపోర్టుకు యిదీ ఒక విషయం కాకూడదని ఆయన "ఇది తప్పు చిరుకండా, ఇది ప్రమాదం. రావద్దని మీరే చెప్పండయ్యా వారికి." అన్నారు.

అప్పు తండ్రి, చిరుకండని తండ్రి గుంపును ఆపిన పిదప మాస్టరు ముందుకు నడవడం సాధ్యమయింది. అప్పు, చిరుకండడు కొంతదూరం వెంట వచ్చిన తర్వాత మాస్టరు తిరిగి చూచారు. గుంపు ఇంకా నిలబడే వుంది. మాస్టరు కుడి చేయి ఎత్తి గద్గద కంఠంతో "నమస్కారం" అని నత్తి నత్తిగా అన్నారు. ఆయన వ్రేళ్ళు పిడికిలి బిగించాయి.

అప్పు త్వరగా నడుస్తూ "వేగంగా అడుగులు వేయాలి. బండికి టయిమయింది." అన్నాడు.

వారు చర్వత్తూరు రైలుస్టేషను చేరినప్పుడు బండి రావడానికి యింకా పదిహేను నిమిషాలున్నాయి.

"టయిముకు సరిగ్గా వచ్చాము" అన్నారు మాస్టరు అప్పును చూసి నవ్వి.

"సార్ ఈ ఒక్క రోజు మట్టుకు ఇంటర్‌క్లాసు టికెట్టు తేనా!" అని చిరుకండడు అడిగాడు, తమ ప్రీతిని చూపడానికి అదీ ఒక మార్గమని.

"వద్దు డబ్బును వ్యర్థం చేయకండి! జబ్బు పడినప్పుడు నేనే ఇంటర్ క్లాసులో వెళ్ళుతాను" అని మాస్టరు ప్రతిఘటించారు.

ఆయన తన చేతి గడియారాన్ని విప్పి, దానికి 'కీ' ఇచ్చారు. అప్పు వైపు, చిరుకండని వైపు చూస్తూ, ఆయన అన్నారు:

"సంఘపు కట్టడం అయిన తర్వాత మీరు ఒక గోడ గడియారం తేవాలి."

"హుం తెస్తాము."

"ఇప్పుడు ఈ చేతి గడియారాన్ని మీకు బహుమతిగా ఇద్దామనుకొన్నాను. బండికి పొద్దయింది. చెప్పండి. ఎలా పంచుకొంటారు?"

ఇది తమాషా మాట అనుకున్నాడు అప్పు. "మీరే ఉంచుకోండి సార్" అన్నాడు చిరుకండడు. మాస్టరు ముఖం గంభీరమైంది.

"తీసుకో? చిరుకండా? నీ చేతికిస్తాను."

ఆయన ఇచ్చి తీరుతారని తెలిసి చిరుకండడన్నాడు:

"అప్పు చేతికి కట్టండి."

మాస్టరు అలాగే చేశారు. ముద్దు చేసిన బిడ్డలాగ అప్పు చిరుకండని చూచాడు.

రెక్కమాను వాలగానే, స్టేషన్ మూలలో నిలుచున్న ఆ ముగ్గురి వైపు ఎవరో పరుగెత్తి వస్తుండడం కనిపించింది. అతనిని మొదట గుర్తించిన మాస్టరన్నారు:

"కోరడు."

అతని ద్వారా ఏమిటో చెప్పి పంపి వుంటారని, అతడు వచ్చిన వెంటనే అప్పు అడిగాడు:

"కోరా, ఏమిటి?"

"ఏమీలేదు!" అని తన వంకర టింకర పళ్ళను చూపి, ఎగవూపిరి విడుస్తూ కోరడు అన్నాడు.

"గుంపునుంచి తప్పించుకొని వచ్చావా?" అని మాస్టరు అభిమానం నిండిన చూపుతో అతనిని చూస్తూ అడిగారు.

కోరడు సిగ్గుతో దూరంగా నిలబడ్డాడేగాని జవాబు చెప్పలేదు.

రైలు వచ్చింది. మాస్టరు అక్కడే ఎదుట వున్న పెట్టె ఎక్కి, తలుపువద్ద నిలబడి ముఖం వెలుపలికిచాచి, అప్పును,చిరుకండడినీ దగ్గరికి పిలిచి అన్నారు:

"ఇక నేను మీ మాస్టరును కాను. ఈ రోజునుంచి సార్ అని పిలవకండి. కామ్రేడ అని పిలవండి."

"హూ... హూ..."అని ఇద్దరూ తల ఊపారు.

ఈల వినిపించి బండి కదలింది. మాస్టరు ముగ్గురిని చూస్తూ చేయి ఆడించారు.

అప్పు, చిరుకండడు ఇద్దరూ గట్టిగా ఏక కాలంలోనే అన్నారు:

"నమస్కారం సార్"



# 14

మాస్టరు చూపించినది నిరంతరం పరిశ్రమ చేయవలసిన పెద్దదారి. కయ్యూరు రైతు లందరూ ఒకరిద్దరు శ్రీమంతులైన రైతులు తప్ప ఆ దారినే తొక్కారు. పూర్వం ఏమి జరిగినా విధిని నిందిస్తూ వుండేవారు. ఇప్పుడు తమ భవిష్యత్తు నిర్మించేవారు తామేననే సంగతిని గ్రహించారు. ప్రపంచంలో ఎన్నోచోట్ల ప్రతికాలంలోను జనం ఎదురు తిరిగి నిరంకుశ ప్రభుత్వాలను నిర్మూలనంచేసిన రోమాంచకారి గాథలు వారి బాహువులలో శక్తి నింపాయి. పరుల పరిపాలనకూ, తమ మనుగడకూ సంబంధంవున్నదనే జ్ఞానం స్వాతంత్ర్యోదయాన్ని జనం నిరీక్షించేట్టు చేసింది.

కణ్ణడు తనకు పుట్టిన ఆడబిడ్డకు చేతన అని పేరుపెట్టాడు. నూతన భావాలు మనస్సులోను, ఇంటిలోను వేరు తన్నాయనడానికి ఈ నామ కరణ నిదర్శనం.

ఆ ఊరిలోని రెండువేల మందిలో చిన్నపిల్లలు కాక జమీందారులు, వారి సేవకులు తప్ప తక్కిన వారందరూ సంఘసభ్యులయ్యారు. కుఞంబు ఇంటివారు ఇచ్చిన స్థలంలో సంఘ కట్టడం సిద్ధమయింది. రైతులు వంతులుగా వచ్చి దాని కోసం కాయ కష్టం చేశారు. వానకాలం వ్యవసాయం పనులు అయిన తర్వాత రైతులు శిక్షణ తరగతులలో నిమగ్నులయ్యారు.

జూన్ వచ్చింది. కయ్యూరుకు అది సంబరపు నెల నంబియారు, నంబూదిరి పిల్లలు హైస్కూలు చదువు కోసం నీలేశ్వరానికి వెళ్ళారు. అయితే మరుదినమే వేరే పిల్లవాళ్ళిద్దరు అదే ఉద్దేశంతో ఊరు వదిలారు: ఒకడు అప్పు తమ్ముడు, మరొకడు కుఞంబు తమ్ముడు. రైతులు

ఉన్నతవిద్య కోసం తమ పిల్లవాళ్ళను వెలుపలికి పంపడం అదేమొదలు. అది సామాన్య విషయం కాదు.

పిల్లలే లేని కోరడన్నాడు:

"రైతుల పిల్లలంతా మహామూఢులు అని అనేవారు. ఇప్పుడు చూద్దాము. ఎవరి పిల్లలు బాగా చదువుతారు? ఎవరి పిల్లలు పైకి వస్తారుఅని యిప్పుడు చూద్దాము."

అలాటి సందర్భాలలోను, ప్రస్తావన వచ్చి నప్పుడంతా కోరనికీ. ఇతరులకూ మాస్టరు జ్ఞాపకం వచ్చేది.

మాస్టరు వెళ్ళిన తరువాత ఆయననుంచి మొదటి జాబును ఎవరో తెచ్చి ఇచ్చినప్పుడు రైతులు తండోప తండాలుగావచ్చి "ఏమివ్రాశారు?" అని అడిగి వెళ్ళారు. అందరూ చదివిన పిదప, చదివినది విన్న పిదప అప్పు దానిని ఇంటికి తీసుకొని పోయి, ఒక్కడే చదివాడు. భార్య జానకికి దానిని చూపాడు.

అప్పు తండ్రి అన్నాడు:

"మాస్టరు బంగారు వంటి మనిషి. ఆయనను యిక్కడే ఉంచుకొనే అదృష్టం మనకు లేక పోయింది. ఉన్నప్పుడూ ఆయనను మనం సరిగ్గా చూచుకోలేదు."

కొత్త మాస్టరు ఎవరు వస్తారో అని పలువురు కుతూహలంతో నిరీక్షించారు. దారి చూచారు. అయితే ఎవరి జాడా తెలీలేదు. ఉపాధ్యాయుడు దొరకలేదనే నెపంతో జమీందారుగారు బడినే మూసివేయ వచ్చునని రైతులకు సందేహం కలిగింది. రైతుల కోరికపై సంఘ కార్యదర్శి చిరుకండడూ, వయస్సయిన ఇద్దరు రైతులూ జమీందార్ల దర్శనానికి వెళ్ళారు.

నంబియారు వచ్చిన వారిని కడగంటి చూపులతో చూచి "మీరు ఎవరు అడగటానికి?" అని హుంకరించారు.

"మేము సంఘం వాళ్ళం."

"సంఘానికీ, మాకూ ఏమీ సంబంధం లేదు."

"బడి నడిపే ముఖ్యులు మీరు కావడం వల్ల మన పిల్లల విద్యాభ్యాసానికి సంబంధించి మాట్లాడడానికి మేము వచ్చాము."



అలా అన్న చిరుకండణ్ణి నంబియారు పై నుంచి కిందివరకు చూచి, కుత్సితమైన నవ్వు నవ్వి అన్నారు:

"అప్పుడే పిల్ల లయ్యారేమోయ్ నీకు?"

ఆ ప్రశ్నను వినీ విననట్టు చిరుకండడు అన్నాడు:

"ఇక్కడ ఇంకా గ్రామ పంచాయితీ లేదు. మీరు దానికి అస్పదమే ఇవ్వలేదు. పంచాయతీ ఉండి వుంటే పంచాయతీవారే బడిని నడిపేవారు."

"ఓహో! నడపకుండా ఏమి చేశారు? ఇప్పుడూ పంచాయతీ స్థాపించకుండా ఎవరు మిమ్మల్ని అడ్డగించారు? వ్రాయండి ప్రభుత్వానికి. రానీ కలెక్టరు. ఎన్నికలు జరగనీ!"

"చేయవలసి వచ్చినప్పుడు చేయనే చేస్తాం. కాని ఇప్పుడు బడి మూసివేయడం సరికాదు."

"మీ సంఘానికి ఒక గుమాస్తా లేక చాలా ఇబ్బందిగా వున్నది కదూ? ఎవరైనా పేపరు చదివే మాస్టరు వస్తే సరిపోతుంది."

ఎంత రెచ్చగొట్టినా రెచ్చిపోక మాట్లాడే చిరుకండని సామర్థ్యం ఆశ్చర్యకరమైనది.

"మా సంఘంలో పనిచేసే వారికి ఇప్పుడేమీ కొదువలేదు. పిల్లలకు పాఠం చెప్పడానికి మాస్టరుంటే చాలు."

చిరుకండని భయంలేని శాంతమయిన ముఖకవళిక చూచి సహించ లేక పోయారు నంబియారు. కేకలు వేశారు:

"వెళ్ళండి! వెలుపలికి వెళ్ళండి! నేను బడి తెరవను. నా ఇష్టం."

చివరిసారిగా చిరుకండ డన్నాడు:

"ఇక కొన్ని రోజులు వేచి చూస్తాము. అప్పటికీ బడి ప్రారంభం కాకపోతే, ముందు కార్యక్రమం చేపడుతాము."

చిట్టచివరి మాట తమదే కావాలని నంబియారు అన్నాడు:

"ఆహా! సంతోషంగా అలాగే చేయండి."

అక్కడినుంచి సంఘ ప్రతినిధులు నంబూదిరి వద్దకువెళ్ళారు.

"సంఘం వాళ్ళా! రండి రండి. ఏమి సమాచారం?" అని ఆయన లౌక్యం నవ్వు విరజిమ్మారు.

సంగతి సందర్భాలు చిరుకండడు వివరించినప్పుడు ఆ జమీందారు గారన్నారు:

"ఏం చెయ్య మంటారయ్యా! నంబియారు గారికి ఇక్కడ చదివే పిల్లలు ఎవరూ లేరు. నాకు ఉన్నారు. బడి మూసినా ఇప్పుడు వారికి చింత లేదు. చింత నాకు మాత్రం! మానుంచి మీకు ఇబ్బంది. మా చిన్నబ్బాయిలను నీలేశ్వరానికి పంపి అక్కడే యిల్లు చేద్దామనే యోచన కూడ వుంది. ఏమయ్యా చేయడం?"

"తమ యిష్టం. బడి మూసివేస్తే ఎంతో మంది పిల్లలకు ఇబ్బంది కలుగుతుంది. బడి కోసమని ఏటా రైతులందరూ తమ వంతు ఇస్తున్నారు. ఇంతవరకూ ఎవరూ దాని లెక్కలు అడుగలేదు. ఇప్పుడు మూయడానికి కారణమయినా ఏమిటి? కారణమడిగే హక్కయినా రైతులకు ఉంది గదా?"

పొడుగాటి నల్లని శరీరం, పలుచని మీసకట్టు, పొట్టిగా కత్తిరించిన క్రాపు. శుభ్రమైన తెల్లని గూడకట్టు, పొడుగాటి తెల్ల కమీజు ధరించిన చిరుకండని నంబూదిరి ఎగాదిగ చూచారు. ఇతడు కయ్యూరి వాడేనా? అని ఆయనకు ఆశ్చర్యమయింది. తమకు తెలియకనే జనం ఎలా మారిపోయారు- అని విస్మయమయింది. చిరుకండడు ఏమి చెబుతున్నాడన్నది అప్పుడే మరచిపోయిన ఆయన స్వప్నం నుంచి మేల్కొన్నవాడిలా అన్నారు:

"హుఁ! ఏమన్నారు; మూయడానికి కారణ మేమిటా అనా? నాకు తెలియదయ్యా. నంబియారునే అడగాలి. బడి పెట్టి తీరాలని గలాటా చేసినవారూ ఆయనే, ఇప్పుడు మూయించిందీ ఆయనే."

"ఆయనా, తాము - ఇద్దరూ దీనిక్కారణమని జనం అనుకుంటున్నారు."

వైరి బృందంలో చీలికలుతెచ్చే కౌశలముంది చిరుకండని ఆ మాటలలో.

"ఛ! ఛ! అది సరికాదు. నంబియారుకు నేను చెబుతానయ్యా. వెంటనే ఎవరినైనా పిలిపించండి అని చెబుతాను."

సంఘం ప్రతినిధివర్గం వెనుదిరిగింది.



నంబూదిరి నంబియారుతో ఏమి మాట్లాడాడో, ఏమి లేదో, బడి మళ్ళీ ప్రారంభం కానేలేదు.

సంఘ కార్యవర్గం మళ్ళీ సమావేశమయి చర్చ జరిపి, బడి ధర్మకర్తల సంఘం అధ్యక్షునికి జాబులు వ్రాయాలని తీర్మానించింది.

జాబు సారాంశమిది: "బడి లెక్కపత్రాలన్నీ వెంటనే ప్రజల ముందు పెట్టాలని సంఘం ఒత్తిడి చేస్తున్నది. ధర్మకర్తల సంఘం అధ్యక్షులు బడిని తెరవకపోతే, బడి నడిపే జవాబ్దారీని సంఘం తన వశం చేసుకోదలచింది. దీనికి అడ్డు ఏర్పడితే, సొంత బడినే పెట్టే ఉద్దేశ్యమూ సంఘానికి వుంది. ఈ పరిస్థితిలో ఒకరు లేక ఇద్దరు ఉపాధ్యాయులను సంఘమే వెలుపలినుంచి పిలిపించుతుం దనేది స్పష్టమయింది."

నంబియారు జాబు చదివి మండిపడ్డాడు. దానిని ముక్కలు ముక్కలు చేసి పారేశారు. దానిని అక్కడికి మోసుకొని వెళ్ళిన కోరణ్ణి "వెళ్ళిపో! మూర్ఖుడా?" అని తిట్టారు.

జవాబు చెప్పడానికి చాల మంచి మంచి పదాలు కోరని నాలుక చివర నాట్యమాడాయి. నంబియారు ఏమిచేసినా ఊరికే వుండాలని చిరుకండని కట్టడి అయినందున కోరడు అలాగే తిరిగి రావలసి వచ్చింది.

అయినా, సంఘం జాబు పరిణామం కలుగనే కలిగింది.

ఈ సంఘటన జరిగిన వారం రోజులలోనే వయస్సయిన ఒక ఉపాధ్యాయు లొకరు అక్కడికి వచ్చారు. తల పూర్తిగా నెరిసింది. కొన్ని పళ్ళుకూడ ఊడాయి. ముక్కుమీద కళ్ళజోడు.

కణ్ణడు ఆయనను చూడడానికి వెళ్ళి అడిగాడు:

"ఒంటిగా వచ్చారే కొడుకులు, మనుమలు ఎప్పుడు వస్తారు?"

ఆ రైతు తనను గేలిచేస్తున్నాడేమోనని ఉపాధ్యాయునికి సందేహం వచ్చింది. మొదట ఆయన అతనిని చురచుర చూచారు. కాని కణ్ణని ముఖభావం నిష్కాపట్యానికి అద్దంలాగ కనిపించింది. అతడు మంచివాడే అయి వుంటాడని ఉపాధ్యాయులు తీర్మానించుకొని అన్నారు:

"లేదయ్యా లేదు. రిటైరయినవాణ్ణి. పనిలేక ఇంట్లోనే ఉన్నాను. భోజనం ఖర్చుపోను ఒక ఐదు రూపాయలన్నా నెలకు సంపాదన అయితే

చాలు అని వచ్చాను. మహా ఎక్కువయితే ఒక సంవత్సరం వుంటాను. నా సంసారమంతా నీలేశ్వరంలోనే వుంది."

ఆయన అలా చెప్పి కొంచెం స్వరం తగ్గించి ఒక రహస్యమయిన సంగతి ప్రస్తావించారు:

"ఇక్కడ సంఘం గలాటా చాలా ఎక్కువటకదా! ఔనా?"

కణ్ణడు నవ్వకుండా గంభీరముగా ఆ ప్రశ్నను ఆలకించినట్లు నటించాడు.

"హూఁ! హూఁ! అలాగనే చెప్పాలి."

"ముందు పనిచేసిన మాస్టరు బడి పని మీద దృష్టి పెట్టక సంఘం వారి జతలో వుండేవారట."

"అదేమోనండి. ఏమయినా, ఆయన హెచ్చుగా సంఘం వారి జతలో వుండేవారు."

"నేను ఇలా అడుగుతున్నానని ఎవరికీ చెప్పవద్దయ్యా. సద్యనాకెందుకు, ఇదంతా? జమీందారుగారు చెప్పారని కనుక్కున్నాను. అంతే."

"అయ్యో! ఇదంతా పెద్ద తప్పా ఏమిటి?"

"అలాకాదయ్యా! నేను పొరుగూరి వాడిని. వయస్సయిన వాడిని. ఎవరి విరోధమూ నాకు వద్దు. జమీందారుగారితోను నేను స్నేహంగా వుండాలి; రైతులతోను స్నేహంగా వుండాలి. కదేమయ్యా?"

"ఔను! ఔను!"

"నీ పిల్లలు ఈ బడికి వస్తారా?"

"మా అమ్మాయి యింకా చిన్నపాప."

"ఐదేళ్ళు కాలేదా?"

"లేదు. ఇంకా ఐదు నెలై."

"చాల చిన్నది అయితే" — అని ఆ ఉపాధ్యాయులు తమ అభిప్రాయం ప్రకటించారు. "నా బిడ్డకు పాఠం చెప్పడానికి మీరు ఇక్కడ వుండరులేండి" అని కణ్ణడు మనస్సులోనే అనుకున్నాడు.

ఇక్కడ బియ్యం, కూరగాయలు, పాలు, పెరుగు, అనుకూలమేనా అని కనుక్కోడానికి ముందుగా ఉపాధ్యాయులు ముక్కులో ఒక



చిటిక నస్యం ఎక్కించారు. ఆ విషయమై మరికొంతసేపు కబుర్లాడడానికి కణ్ణడూ నిరాకరించలేదు.

కాని, సంఘం కట్టడానికి తిరిగి వచ్చిన వెంటనే, కణ్ణడు జరిగినదంతా అభినయ పూర్వకంగా వర్ణిస్తూ, చూస్తున్న వాళ్ళతో, వినే వాళ్ళతో పాటు తానూ పడిపడి నవ్వాడు. ఇక ప్రతివారూ ఆ బీద ఉపాధ్యాయుణ్ని లేవడి పట్టించ వచ్చని చిరుకండడు అన్నాడు:

"ఇదిగో చూడండి. ఎవరూ ఆయన జోలికి పోరాదు. పాపం! పెద్దవాడు! ఉన్నంతకాలం ఉండనీ, పాఠం చెప్పనీ. ఎవరూ ఆముసలాయనను బాధ పెట్టకండి."

....బడి చదువు తర్వాత ఆటల ఏర్పాటు సంఘం చేసింది. పదకొండేళ్ళ కుట్టికృష్ణుని నాయకత్వంలో బాలసంఘం ఏర్పడింది. కుట్టికృష్ణుడు సమర్థుడైన బాల నాయకుడు అయ్యాడు. అతని సంఘటన సామర్థ్యానికి పెద్దవారు కూడా ఆశ్చర్యపడ్డారు.

కాని, అలా ఆశ్చర్యపడి కూర్చోడానికి ఇక అవకాశం లేదన్నట్టు సంఘటనలు జరిగాయి. ముఖ్యమయినది: ద్వితీయ మహా సంగ్రామం ఆరంభం. యుద్ధం ఆరంభ మయింది ఎక్కడో ప్రపంచపు మారుమూలలో; ఎక్కడో దూరంలో ఉన్న అడవిలో నిప్పు పడ్డట్టు. అయితే దాని వేడి కయ్యూరికి తాకకపోలేదు. నిప్పుపెట్టె మొదలు గునపం, గొడ్డలి వరకు సామగ్రి వెల నెమ్మదిగా ఎక్కింది.

రహస్యంగా వస్తున్న కరపత్రాలు, సాహిత్యమూ దేశబంధ విమోచనాన్ని సాధ్యం చేయడానికి విప్లవకర శక్తులకు లభించిన అవకాశం గురించి తెలిపాయి. ప్రజలు పోరాటానికి సిద్ధమవుతున్న వదంతి అందించాయి; వీరఘోషలు, భుజాలు అదిరేట్టు చేసే వివరాలు. పోరాటానికి కాహళి....

జానకి భుజాలింగనం స్మరణను పక్కకునెట్టి ఒకసారి అప్పు అన్నాడు:

"మనం సిద్ధంగా వుండాలి చిరుకండా."

"ఏమిటి సిద్ధంకావడం అంటే? ఎక్కడికయినా వలస వెళ్ళాల్సి వుంటుందా ఏమిటి?"

"ఎందుకు పోరాడు? పోరాటం నడిచే చోట...."

ఆ మాటకు చిరుకండనికి కోపం వచ్చింది. అది చదువు; ఇది చదువు; ఆలోచన చేయి; అన్నాడు.

చిరుకండడు ప్రతిసారీ వివరంగా చెప్పడం కద్దు:

"సామ్రాజ్యవాదుల పరిపాలన అనేది పూర్తి దేశాన్నే ఆవరించిన విస్తారమైన వల వంటిది. మన ఊరిపై వున్న ఆ వల భాగాన్ని మనం కత్తిరించాలి. అలాగే ఒక్కొక్క ఊరి వారూ తమ తమ పాలిటికి వచ్చిన భాగానికి కత్తెర వేయాలి. అయితే ఇదంతా ఒకే కాలంలో కావడం అవసరం. లేకపోతే, చినిగిన భాగం మరమ్మత్తు చేయడానికి సామ్రాజ్యవాదులకు తీరిక దొరుకుతుంది. స్పష్టమయిందా?"

విషయం స్పష్టమయింది. కాని వేడి రక్తపు యువకులు, "కాచుకొని వుండడం ఇంకా ఎన్నాళ్ళు?" అని అడుగుతూనే వున్నారు.

అలాటి సందర్భాలలో ఒక మారు కణ్ణడు "మన పల్లెలోనేమో సామ్రాజ్యవాది కనపడడమే లేదు. ఉండే దొంలు ఇద్దరు. వారిని దారికి తెచ్చి, వారూ, మనమూ అందరం జతగా పొలం పంచుకొని స్వాతంత్ర్యపు బావుటాను సులభంగా ఎగురవేయవచ్చు. అయితే ఇరుగు పొరుగు పల్లెలవారు సిద్ధంగాలేరు. అందువల్ల మనమూ కాచుకోవలసి వచ్చింది" అన్నాడు.

అతని మాటలు విన్నవారు నవ్వారు.

....................

దినాలు గడిచాయి. సామ్రాజ్యవాదం తాను సమీపంలోనే ఉన్నానని చూపించుకుంది.

పోలీసు అధికారంతోపాటు తాలూకా అధికారి ఒక మారు వచ్చి నంబియారు జమీందారుగారి ఇంట్లో విడిశారు. వచ్చినవారు కొత్తవారయినా సంఘానికి ప్రతికూలంగా ఆ అవకాశాన్ని వినియోగించుకోనడానికి నంబియారు ప్రయత్నించకుండా ఉండలేదు. ఆయన అన్నారు:

"నలుగురైదుగురు రైతు నాయకులు తప్పితే ప్రభుత్వాన్ని ద్వేషించేవారు ఇక్కడ ఎవరూ లేరు. వారిని కొంచెం జైలుకు పంపితే."

తాలూకా అధికారి ఉద్దేశం అది కాదు:



"అదంతా చేద్దాం మిస్టర్ నంబియార్. ఇప్పుడు మేము సైన్యంలో జనాన్ని భర్తీ చేయాలి. మీ పల్లెనుంచి ఎంతమందిని పంపుతారు?"

ఈ విషయంలో తాము నిస్సహాయులమని తెలుసుకొన్న నంబియారు నవ్వారు.

"నన్ను చేర్చుకోండి."

అధికారి కూడ నవ్వి అన్నారు:

"మీరంతా యుద్ధానికిపోతే మమ్మల్ని ఎవరండీ చూచుకొనేవాళ్ళు.... ఇవి తమాషా మాటలు కావు. మీ గ్రామం నుంచి ఇరవైమందన్నా కావాలి."

ఊరంతా దండోరా వేయించారు. సాయంకాలం వరకూ ఎవ్వరూ రాలేదు. రాత్రి అక్కడే మకాం చేశారు అధికారులు. వారితో అన్నారు నంబియారు:

"మా జనం చెడిపోయారు సార్. రేపు ఉదయం నా మనుష్యులు యిద్దరిని, నంబూదిరి మనుష్యులు యిద్దరిని పిలుచుకొని పోండి."

"అది ఎలాగూ ఉంది లేండి. అయినా, తెల్లవారగానే మరొక మారు దండోరా వేయించాలి. జనానికి అర్థం కానేలేదని తోస్తుంది."

జనానికి అర్థమయింది. అంతే కాదు. సంఘ కార్యాలయంలో ఈ విషయమై పెద్ద గోల కూడా జరిగింది. పల్లెలో కొందరు సైన్యంలో చేరుదామన్నారు. వారికీ తక్కిన వారికీ పోట్లాట కూడా జరిగింది. ఈ పోట్లాట తీర్పుకోసం సంఘ నాయకుల పద్దకు వచ్చింది. సైన్యంలో చేరుతామన్న వారికి తగినంత పొలం లేదు, ఉద్యోగం లేదు. సాకడానికి పెద్ద కుటుంబా లున్నాయి. అప్పుతో చిరుకండడు ఈ సమస్యపై దీర్ఘంగా సమాలోచనలు జరిపాడు. దాని ఫలితంగా వారు సరి అని నమ్మిన నిర్ణయానికి వచ్చారు.

చిరుకండడు వారినందరినీ అడిగాడు:

"మీరు ఎప్పుడైనా సంఘానికి గాని, దేశానికి గాని ద్రోహం చేస్తారా?"

"చేయము" అని, "ఖండితంగా చేయము," అని, "ఎప్పటికీ చేయము" అని ఒక్కొక్కరు ఒకొక రీతిగా అన్నారు.

"చేతిలో తుపాకి పట్టుకున్నప్పుడూ— ఈ వాగ్దానం జ్ఞాపకం పెట్టుకుంటారా?"

"తప్పకుండా పెట్టుకుంటాము."

"సరి. అలా అయితే, నాగేలు పట్టే చేయి తుపాకి ఎత్తడానికి నేర్చుకున్నట్టవుతుంది. తిరిగి వచ్చినప్పుడు మీరు మాకు మీ ముఖం చూపవలసి వుంటుంది అనేది జ్ఞాపకం వుండనీ."

తీవ్రమైన అభిప్రాయభేదంతో వాతావరణం కలుషితం కావలసిన సన్నివేశం సులభంగా శాంతితో పర్యవసానం పొందింది.

మరునటి రోజు ఉదయం మరొక దండోరా వేయగానే ఆరుగురు సైన్యంలో చేరడానికి అధికారుల ముందు నిలబడ్డారు. ఇద్దరు జమీందార్ల ఇంట్లలో నలుగురు వారితోపాటు చేరారు.

"కయ్యూరు ఫరవాలేదు; మిస్టర్ నంబియార్" అన్నారు అధికారి.

............

కయ్యూరు నిజంగాను "ఫరవాలేదు." అపూర్వమయిన రాజకీయ జాగృతితో గ్రామం కొత్తరూపు దాల్చింది. సంఘంవారు రైతుదినోత్సవాన్ని ఆ సంవత్సరం ఆడంబరంగా చేశారు. ఆ దినం గుడిసెలు ఖాళీ అయ్యాయి. ఆడవారు, పిల్లలు, ముసలివారు సయితం— అందరూ ఊరేగింపులో చేరారు. గాలిలో స్వేచ్ఛగా రెపరెపలాడే ఎత్తయిన జెండాను ఎదుట పట్టుకొని, పల్లె మూల మూలలోను వారు తిరిగారు. బహిరంగ సభలో వెలుపలనుంచి వచ్చిన నాయకులొకరు ఉపన్యసించారు.

పిల్లలులేని వట్టి బడి పెరటిలో ఎత్తుగా పెరిగిన మామిడిచెట్టు పక్కన నిలబడి ఉపాధ్యాయులు ఆదారిన వస్తున్న ఊరేగింపును చూచారు. జెండా పట్టుకొని పాడుతున్న వాడిని తాను ఎక్కడో చూచినట్టు ఆయనకు అనిపించింది. అతడే! "మీ— పిల్లలు, మనమలు ఎప్పుడు వస్తారు!" అని అడిగిన కిలాడి. "ఆహా!" అని పంతుల నోటినుంచి ఉద్గారం బయలుదేరింది. ముఖం నల్లబడి, చంకల్లో చెమటపట్టినా, పాడుతున్న కణ్ణడిని ఆయన కుతూహలంతో చూచారు.

నినాదాలు కొండల చరియలలో ప్రతిధ్వనించాయి.

"భూమి ఎవరిది?"



"రైతులది!"

"దున్నే వాడే...."

"భూస్వామి!"

"పాత బాకీలు___"

"రద్దు చేయండి!"

"జమీందారీ పద్ధతి...."

"నశించుగాక!"

"సామ్రాజ్యవాదం...."

"నశించుగాక!"

జమీందారు ఇంట్లో నుంచి వెలుపలికి అడుగు పెట్టలేదు, అయినా నినాదాలు వారికి స్పష్టంగా వినిపించాయి.

..............

ఆ సమయంలో కయ్యూరికి ఒక యువకుడు వచ్చాడు. "ఎప్పుడు వచ్చావురా అబూబకర్?" అని అతనిని గుర్తుపట్టి అందరూ అడిగేవారే. అతడు చేపలుపట్టి అమ్ముకొని బతికే బీద ముస్లిం బూబమ్మ పెద్దకొడుకు. అతని తండ్రి సరుకులు నిండిన సముద్రప్పడవలలో - మచ్వేలలో - సంచరించే నావికుడు. అతడు ఎప్పుడో ఒకమారు కయ్యూరికి వచ్చేవాడు. అమ్మకం సరుకు మోసుకొని మచ్వె కల్లికోటనుంచి ఉత్తరానికి బయలుదేరినప్పుడు అతడు ఒకసారి కయ్యూరికి వచ్చి భార్యను, పది సంవత్సరాల పెద్దకొడుకు అబూబకరును, ఇంకా చేతి పాపడయిన రెండవ కుమారుణ్ణి చూచిపోయాడు. అలా పోయినవాడు మళ్ళీ రాలేదు. చేపలుపట్టే వృత్తినే జీవనాధారంగా బూబమ్మ కాచుకూర్చుంది. భర్త సముద్రం పాలయినాడనే మాటను ఆమె ఎప్పుడూ ఒప్పుకోదు. అబూబకర్ కొంచెం పెద్దవాడయిన పిదప కాయకష్టంచేసి సంపాదించడానికి తలచేరికి వెళ్ళాడు. అక్కడ బీడీలు కట్టడం నేర్చుకొన్నాడు. తల్లికి కొంచెం డబ్బు పంపేవాడు. మొదట్లో సంవత్సరానికి ఒకమారు అతడు కయ్యూరికి వచ్చేవాడు. కాని, ఈ నడుమ రాక నాలుగేళ్ళు అయ్యాయి.

ఇప్పుడు కొడుకు వచ్చాడని తల్లికి కలిగిన సంతోషం అంతా ఇంతా కాదు. కనిపించిన వారికెల్లా "నా కొడుకు వచ్చాడు." అని ఆమె చెబుతూ వచ్చింది. పల్లెలోనివారు అబూబకరును సరిగా చూడడం చిన్నపిల్లవాడుగా ఉన్నప్పుడు. అయితే ఇప్పుడు అతడు ఇరవయ్యేళ్ళ యువకుడు. కట్టుదిట్టమైన మనిషి. సంప్రదాయం ప్రకారం తల గుండు కొట్టుకోక చిన్నగా క్రాపు పెట్టుకొన్నాడు. నిక్కరు, దానిలోకి దోపిన షర్టు. ఏమయినా, చూచినవారు మరొకమారు చూచేట్టున్న ఆసామి.

అతనిని "ఎప్పుడు వచ్చావు?" అని ప్రశ్నించినవారు, 'ఎన్నాళ్ళు ఉంటావు!' లేక 'ఎప్పుడు బయలుదేరడం?' అనడిగారు. వారందరికీ అబూబకర్ "ఇదిగో, ఇప్పుడే వచ్చాను. ఇంతలోకే బయలుదేరాల్నా!" అని కాని, "ఊరు చూస్తే ఇక్కడే వుండి పోదాము అనిపిస్తోంది." అనో, "వెళ్ళిపొమ్మంటే వెళ్ళిపోతానండీ!" అనో నవ్వుతూ జవాబు చెప్పాడు.

వచ్చిన రాత్రే అబూబకర్ చిరుకండని ఇంటికి వెళ్ళాడు. "రండి!" అనే సహజమైన స్వాగతం ఆత్మీయమైన కరచాలనంగా మారింది. దానికి కారణం అబూబకర్ తెచ్చిన పరిచయపత్రం. మాస్టరు దానిని వ్రాశారు. చిరుకండడు ముఖం ఇంతచేసుకొని దానిని మళ్ళీ మళ్ళీ చదివాడు.

"భోజనానికి ఇక్కడే లేవండి." అని ఒత్తిడి చేశాడు చిరుకండడు.

"లేదండీ, భారీ వంట చేసి అమ్మ కాచుక్కూచుంది. మిమ్మల్ని రేపు కలుసుకుంటాను." అంటూ, అబూబకర్ లేవనే లేచాడు.

అతనితోపాటు చిరుకండడు పదడుగులు వెళ్ళాడు. మాస్టరు సంగతి అడుగుదామని అతని మనస్సు కుతూహల పడింది. అంతలోనే అబూబకరే అన్నాడు:

"ప్రస్తుతం తలచేరిలో వున్నాను. ఇంత బడి పంతులు పనికోసం వెదుకుతూనే ఉన్నాను - అని మాస్టరు మీకు తెలుపాలన్నారు."

"ఆయన ఆరోగ్యంగా వున్నారా?"

మాస్టరు విషయంలో అత్యంత ఆత్మీయతను సూచించే ఆ గొంతు విని అబూబకర్ చకితుడయ్యాడు.



"హాఁ, ఆరోగ్యంగా వున్నారు. నేను యిక్కడ పిల్లవాడుగా వున్నప్పుడు వారి పరిచయం లేదు. నాకు ఆయన మాస్టరు కావడం తలచేరిలోనే."

అయితే, మరొకటేదో ఆలోచిస్తున్న చిరుకండడు అన్నాడు:

"మంచిదయింది కామ్రేడ్! రేపు ఉదయం సంఘ కార్యాలయానికి రండి. అందరినీ పరిచయం చేయిస్తాను. కలిసి పనిచేద్దాం. మనం చేయవలసింది కొండంత వుంది. మాస్టరు సూచించినదయితే చాలా విశిష్టమయినది. వివరంగా రేపు మాట్లాడుదాము.

.........................

ఆ రేపు, సంఘం కొత్త అడుగులు వేసిన దినమయింది. తలచేరిలో బీడీ కార్మికుడుగా వున్న అబూబకర్ కయ్యూరిలోనే స్థిరపడడానికి వచ్చాడు. అతడు పట్టణంలో ఒక స్వయం సేవక దళానికి ఉపనాయకుడుగాను ఉన్నాడు. కయ్యూరులోని అందరి దృష్టిలోను అది అతనికి లభించిన విశిష్ట శిక్షణం. ఆ శిక్షణం ప్రయోజనాన్ని సంఘం పొందింది.

అబూబకర్ క్రమబద్ధరీతిలో కార్యోన్ముఖుడై, కయ్యూరు యువకుల స్వయంసేవకదళం ఏర్పాటు చేశాడు.

....సంఘంముందు వేరే ఎన్నో సమస్యలున్నాయి. కయ్యూరికి గ్రామ పంచాయితీ కావాలని వారు జిల్లా అధికారికి అర్జీ పెట్టుకున్నారు. జవాబు రాలేదు. పొలాలు లేని రైతులకు పల్లెలో ఒక మూలలో వున్న బంజరు భూమిని దున్నుకొనడానికి అవకాశమివ్వాలని ప్రభుత్వాన్ని కోరారు. దానికి సమాధానం రాలేదు.

బడికి యువకుడయిన కొత్త ఉపాధ్యాయులు వచ్చారు. కొంతవరకు రైతు ఉద్యమానికి అనుకూలులే. గ్రామ పంచాయితీ అప్పటికప్పుడే ఏర్పడాలని రైతులు మొండిపట్టు పట్టలేదు. కాని, బంజరుభూమి ఇంకా అలాగే పడివుండే అని వారికి విసుగు పుట్టింది. "మక్కీచేసేద్దాం. పన్ను తర్వాత ఏర్పాటు చేయనీ." అని నిర్ణయించి సంఘ నాయకత్వంలో రైతులు పొదలు, పుట్టలు కొట్టి భూమిని పదును చేశారు.

....ఆ సంవత్సరం ఓణం పండుగ వేళకు చిరుకండని పెండ్లి అయింది. అప్పు వివాహమయిన తర్వాత చిరుకండని తల్లి ఒకే సమంగా

కొడుకును పీడిస్తూ ఉంది: పెళ్ళి చేసుకోరా, చేసుకోరా అని, తల్లిదండ్రుల ఏకైక పుత్రుడు. వారు ఊరుకుంటారా? అతనికోసం వెదుక్కొని వచ్చిందీ వెలుపలి పిల్లకాదు. త్రికరపురం చందూ చెల్లెలు. పెద్దల సంతృప్తికోసం తాను చేస్తున్న త్యాగం ఇదొకటని భావించే చిరుకండడు పిల్లను చూడడానికి వెళ్ళాడు. తన చేతి వ్రాతతో వున్న కర పత్రాలను, వ్యాసాలనూ ఆమె చదివిందని తెలిసిన తర్వాత మారుమాట లేకుండా వచ్చాడు. త్యాగమనే ఆలోచన ఆ మీదట రాలేదు. దానికి మారుగా, బాల సంఘం లాగే మహిళల శాఖను త్వరలో ఆరంభించాలనే ఆలోచన ఉదయించింది.

సంఘ ప్రముఖుల మండలిలోని కల్లోలం చాలనట్టు అప్పు తండ్రి అయ్యాడు. జానకి ముద్దుకురిసే మగపిల్లడిని కనింది.

....ఇంతయినా, ఈ వైయక్తిక విషయాలవల్ల సంఘ కార్యకలాపాలకు హాని ఏమి కలుగలేదు.

జాతీయ సమరం మరల ప్రారంభమయింది. ద్వితీయ మహా సంగ్రామానికి విరోధులు అక్కడొకరు ఇక్కడొకరుగా చెరసాలకు వెళ్ళారు. విప్లవకారులకోసం వేట జరిగింది. క్రూరమైన శాసనాలు రూపొందాయి.

అయినా, కయ్యూరు రైతులు ముందంజ వేశారు....

ప్రతి దినమూ పని తర్వాత సాయంకాలం కవాతు. వారి వారి ఖర్చులతోనే దుస్తులు - యూనిఫారం. లెఫ్ట్ - రైట్, లెఫ్టు - రైట్, లెఫ్ట్.

నాయకుడు అబూబకర్ వారికందరికీ చెప్పేవాడు:

"కామ్రేడ్స్! దీనిని మరువకండి. మనం హింసకు విరోధులం. అన్ని విధాలైన హింసకు విరోధులం. ఈ శిక్షణం దుర్బలులపైన చేయిచేసుకోడానికి కాదు. ఇది ఆత్మరక్షణకు, న్యాయ సాధనకు."

....జమీందారు నంబియారు ప్రభుత్వానికి ఫిర్యాదుపై ఫిర్యాదు చేయనే చేశాడు,

"ఇక్కడ విప్లవకారులు పోగయ్యారు. సర్కారు భూమి స్వాధీనపరచుకొన్నారు. సైన్యం కట్టారు. పోటీ ప్రభుత్వం నెలకొల్పారు. గృహస్థులు, స్త్రీలు, పిల్లలు, ఇక్కడ బతకడమే కష్టమయింది. బ్రిటిష ప్రభుత్వానికి గండం తప్పదు. ఇది వ్రాసి నేను నా కర్తవ్యం నిర్వహిస్తున్నాను. జ్ఞాపకం పెట్టుకోండి!"

# 15

నంబియారు యిప్పుడు కోరలు విరిగిన సింహం. ఇల్లే ఆయనకు బోను. నంబూదిరి పిల్లల చదువుకు అనుకూలమని నీలేశ్వరంలోనే కాపురం వుండడానికి నిర్ణయించుకొన్నారు. నంబియారు ఆ మాట విని "పిల్లల చదువనేది నెపం. భయపడి పరిగెత్తి పోతున్నాడు. థూ." అన్నారు. అయితే "మనమూ ఎందుకు నీలేశ్వరానికి వెళ్ళగూడదు?" అని తమ రెండవ భార్య అడిగినపుడు "ఎందుకు కాగూడదూ?" అని నంబియారు కూడా యోచించారు. మరుక్షణమే ఆ యోచనను వదలిపెట్టి "నేను పిరికిపందను కాదు! ఒకటి ఈ మృగాలను దారికి తెస్తాను. లేకపోతే యిక్కడే చస్తాను" అని గర్జించాడు.

ఆయన వేటకువెళ్ళి చాలా దినాలయాయి. నూరుమంది రైతుల గుంపు వెంట రాగా, తాము పులివేట లాడిన గత వైభవం జ్ఞాపకం వచ్చి నంబియారుకు చాలా దుఃఖమయింది. తమ జోడుగుళ్ళ తుపాకినెత్తి, ప్రీతితో తడుముతూ, దానిని చక్కబరచడంతోనే చాలాసేపు గడిపారు. ఆడవాళ్ళ వేటకూడా ఇప్పుడు లేదు. ఇంటి ఆడవాళ్ళు కాక తాము ఉంచుకొన్న ఇద్దరితోనే ఆయన ఇప్పుడు తృప్తి పడవలసి వచ్చింది. ఆ కృష్ణన్‌నాయర్ - పంట లాక్కున్న మీదట మరొకమారు అప్పు అడగడానికి రాడని స్వప్నంలోనైనా భావించడం సాధ్యమా? ఆ చిరుకండడు - ఎనిమిది సంవత్సరాల క్రితం వాడి తండ్రి నుంచి తాము పొలం వశపరచుకొన్నారు. బాగా పండే స్థలం. క్రమంగా అతనిని వెళ్ళగొట్టి, ఎక్కువ గుత్తకు మరొకరికి ఇవ్వవచ్చునని అప్పుడు ఆయన యోచించారు. అయితే ముందు అలా చేయడం దుస్సాధ్యమయింది. అదే విధంగా కార్యరూపం చెందని పథకాలు ఇక ఎన్నో. అప్పులు వసూ

అయితే నిలిచిపోయింది. వడ్డీ రూపంలో కావలసినంత డబ్బు వచ్చింది నిజమే. అయితే అసలుకు మోసమయింది!

"హుం!" అని తమంతకు తాము హుంకరించారు, నంబియారు. తుపాకి ఎత్తి ఊరికే అటు ఇటు గురి పెట్టారు. సైన్యంలో చేర్చుకొనడానికి అధికారులు వచ్చినపుడు నిష్ప్రయోజకులైన ఇద్దర్నే ఆయన పంపారు. అయినా, ఆయన నౌకర్ల సంఖ్య ఆ మేరకు తగ్గింది. పూర్వం తమ వద్దవున్న వేటకుక్క చచ్చిపోయిన తర్వాత ముందు నిదానంగా ఒక జత కుక్కలను తీసుకొని రావాలని ఆయన కోరిక. అయితే యీ పరిస్థితిలో ఆ సంగతి యిష్టం కాలేదు...తుపాకిని మళ్ళీ మళ్ళీ చూస్తూ వేటకయినా పోదామా అనిపించింది. దానికి నౌకర్లను పిలిచి, సూచనలిద్దామనుకొనేలోగా విసుగు ఆవరించి, వేట ఆలోచనను విడిచిపెట్టాడు.

తుపాకిని ఎత్తి లోపల పెడుతూ ఆయన మనసులోనే అనుకున్నారు:

"వేటకు కాకపోతే ఇంకోదానికి తుపాకి ఉపయోగం ఉండనే వుంటుంది."

........................

రైతు సంఘం స్వయం సేవకులు మాత్రం పట్టుకోడానికి, తినడానికి, విసరడానికి నేర్చిన అస్త్రం ఒకటే - లాఠీ. వ్యక్తిహితం కన్నా, సమష్టిహితం గొప్పది. తనకన్నా పెద్దది తన జాతి. అవమానకరమైన దాస్యజీవితం కన్నా స్వాతంత్ర్య పోరాటంలో లభించే మరణం స్వర్గసమానం—అనే ఉదాత్త భావనలు ఆ రైతులు దినమూ పెరిగేట్టు చేశాయి.

ఇప్పుడు ఆ రైతులు నడుము వంగిన బడుగు పచేళ్ళు కారు. తమ రెక్కల బలంపై అచంచల విశ్వాసమున్న కర్షక భటులు. సందేహ సంశయాలు ఎవరినీ పీడించలేదని కాదు; దౌర్బల్య క్షణాలలో ఎవరికీ కళ్ళు మసకలు కమ్మలేదని కాదు. అయినా అలాటి వారి సంఖ్య తక్కువయింది—చాలా తక్కువయింది.

సామ్రాజ్యం అస్తిత్వం కోసమే పోరాడుతున్న పరాయి ప్రభుత్వం నిద్రపోలేదు. దాని గూఢచారులు ఊరూరు తిరిగారు. కయ్యూరికి వచ్చారు.



వారు టీకా టిప్పణులు వేశారు. ఎక్కడ ఎలా కొట్టాలనీ లెక్కలు వేశారు. అయితే సంఘ స్వయం సేవకులు సర్కారు చాకర్లకన్నా ఎక్కువ సూక్ష్మబుద్ధులు. ఎలాటి గూఢచారులూ వారి కనుగప్పి కయ్యూరికి రావడం సాధ్యం కాలేదు. యూనిఫారం ధరించిన పోలీసులకయితే బాల సంఘ సభ్యుల "లీల"ల ఫలితంగా వారికి ఇక చాలు చాలు అనిపించింది.

అలాటి వాతావరణంలో ఆ తాలూకా రైతుసభ కయ్యూరులో జరగాలని నిర్ణయమయింది. కయ్యూరు రైతుల దృష్టిలో అది వారికి లభించిన గొప్ప గౌరవం. సభ ఏర్పాట్లు ప్రారంభమయ్యాయి. ప్రభుత్వం పట్టుకోవడానికి వెదుకుతున్న రైతు నాయకులు రహస్యంగా అక్కడికి వచ్చి వెళ్ళారు. పల్లె సమీపంలోనే సురక్షితమైన స్థలంలో సభకు దారి చూసి రహస్య స్థావరం ఏర్పాటయింది.

ఆహ్వాన సంఘ కార్యదర్శులైన అప్పు, చిరుకండడు తమపైన వున్న గురుతర బాధ్యతను విజయవంతంగా నిర్వహించడానికి అత్యంతోత్సాహంతో కృషి చేశారు తక్కినవారూ అంతే. ఎవరూ ఎవరికి తక్కువ కాదు. పెక్కు పల్లెల నుంచి రైతులు సభ కోసం కయ్యూరికి వస్తారన్న సంగతి—అదొక పెద్దపండుగ—జాతర అనేభావాన్ని వారిలో కలిగించింది.

అది వేసవి ఆరంభం. రోజులు గడిచిన కొద్దీ సూర్యుడు ఎక్కువ ఉగ్రుడవుతున్నాడు. రైతుల దేహాలు ఎండకు చాలా సులభంగా చెమర్చసాగినాయి. ఆ స్థితిలోను రైతులు సంఘ కార్యాలయం ముందు విశాలమైన పందిరి వేయసాగినారు.

సభ కింకా ఒక వారం వుందనగా ప్రతి దినమూ ప్రభాత ఫేరీ ఆరంభమయింది, అది తెల్లవారి ఊరేగింపు. స్వయం సేవకులు జెండా పట్టుకొని సంఘ కార్యాలయం నుంచి బయలుదేరి పాడుతూ, సభ నినాదాలు చేస్తూ ఊరుచుట్టూ తిరిగి వెనకకు మళ్ళేవాళ్ళు.

...........

ఆ వారం పోలీసు ఒకడు కయ్యూరికి దయచేశాడు. అతడు వచ్చింది హొసదుర్గం నుంచి — పోలీస్ స్టేషన్ నుంచి. వచ్చినవాడు

నంబియారు ఇంట్లో మకాం చేశాడు. చూడడానికి భారీ ఆసామి. వయస్సింకా ముప్పయ్యయిదు లోపే. మెలి వేసిన నల్లటి మీసాలు. తీక్షణంగా చూచే కళ్ళు. దిట్టతనం తెలిపే నడక—ఇతడు సామాన్యుడు కాదన్నది స్పష్టపరిచేవి.

జమీందారుగారు అతనితో అన్నారు :

"మీరేమీ సంకోచించకండి సుబ్బయ్యా. ఏమి కావాలన్నా అడగండి. దేనికీ ఇబ్బంది పడకండి."

"అలాగే కానీండి స్వామీ" అన్నాడతను. ధ్వని కూడ అతని లాగే దృఢంగాను, కఠోరంగాను ఉంది.

సుబ్బయ్య ఠీవిగా నడుస్తూ నంబియారు గారి ఒక నౌకరు జతలో పల్లెను ఒక ప్రదక్షిణం చేసి వచ్చాడు. అక్కడక్కడ తనను తేరిపార జూసిన రైతులతో ఏమీ మాట్లాడకపోయినా, తనవెంట వస్తున్న మనిషితో ధారాళంగా మాట్లాడాడు. ఆ మాటల ధ్వని - కయ్యూరు భవిష్యత్తంతా తన పిడికిలిలో వుందని చాటేది.

భయంతోను, గౌరవంతోను ప్రవర్తిస్తున్న మనిషితో అతడన్నాడు :

"పల్లెటూరు రైతులంతా గొర్రెమంద వున్నట్టు. ఒకడు వరదలో పడ్డాడు అంటే అందరూ పోయి పడతారు. ఒకింతయినా బుద్ధిలేదు."

"ఔను సబ్ ఇన్‌స్పెక్టరుగారూ" అని వెంట వున్న బంటు తల ఊపాడు.

తాను సబ్ ఇన్‌స్పెక్టర్ కానని నిరాకరించే తంటాకు పోకుండా పోలీసు సుబ్బయ్య తన మాటను కొనసాగించాడు :

"లేకపోతే మన సర్కారుకు ఎదురు నిలవడం అంటే ఏమిటి ? బ్రిటిష్ రాజుల శక్తి ఎక్కడ ? ఈ పురుగు లెక్కడ ? ఇదంతా చక్క బడాలంటే ఔషధం ఒక్కటే. ఏమిటి తెలుసునారా ?"

"లేదు సబ్ ఇన్‌స్పెక్టర్‌గారూ."

"ఆ నాయకులయిన లంజకొడుకులు నలుగుర్ని పట్టుకొని చీల్చి సభ పందిరి ఎదుట తోరణం కట్టాలి."



బంటు ఊపిరి తీసుకోలేదు. సుబ్బయ్య చెప్పినట్టు చేసే సమర్థుడని అతడు నమ్మాడు.

ఊరిలో దిగిన భారీ పోలీసు విషయమై కర్ణాకర్ణిగా వార్త వ్యాపించింది. సంఘ కార్యాలయంలో జనం సమావేశమై ఆ సంగతి చెప్పుకొన్నారు.

"మలబారులో ఎక్కడా అతను పనిచేసినట్టులేదు. మన జెండా రుచి అతనికి తెలియదని తోస్తుంది."

"ఆటల పందేలలో సమర్థుడట. ఎన్నోసార్లు బహుమానాలు పొందాడట."

"పటుగెత్తడంలో ?"

"సభకు ముందురోజు పోలీసుల దళం వస్తుందట. రిజర్వు పోలీసులూ వస్తారట. అంతవరకూ సుబ్బయ్య ఇక్కడ వుంటాడు."

"అలాగా ! ఉండడం నిజమేనటనా !"

"ఏమైనా, జమీందారుగారి కోళ్ళకు, కల్లుకూ కాలం !"

కొన్ని సంవత్సరాలకు ముందు, పోలీసుల ఎర్రటోపీ కనిపించగానే రైతులు ఊరికే పొలాల్లోనో, గుడిసెలలోనో దాక్కునేవారు. అయితే ఇప్పుడు, వారి ప్రసక్తి వచ్చినపుడు నవ్వుకుంటూ మాటలాడుతున్నారు.

కార్యాలయం పనిలో, కాయితాల మధ్య మునిగివున్నా, చిరుకండడు జనం అనుకునే మాటలను చెవిలో వేసుకుంటూ అందరికీ వినబడేటట్టు అన్నాడు :

"సద్య మీరెవరూ వాడి జోలికి పోకండి. కయ్యానికి కాలుదువ్వకండి."

— మరునాటి ఉదయం ప్రభాత ఫేరీకోసమని వస్తున్న కణ్ణడు సంఘ కార్యాలయంలో అప్పుడే లాంతరు వెలుగుతుండడం దూరం నుంచి చూచి, ఆలస్యమయిందని త్వరత్వరగా అడుగులు వేశాడు. అయితే, కార్యాలయంలో కనిపించింది మేజా ఎదుట కూర్చుని వ్రాస్తున్న చిరుకండ డొక్కడే.

"ఎందుకింత తొందరగా వచ్చావు ?" అన్నాడు చిరుకండడు. తలయెత్తి కణ్ణడిని చూచి. నిద్రలేక చిరుకండడి కళ్ళు లోపలికి దిగిపోయాయి. చెంపలు వాడిపోయాయి.

కణ్ణడు "టిక్ టాక్" మంటున్న గడియారం చూచాడు. అప్పుడే మూడు గంటలు కొట్టింది.

"ఐదయిందేమో నని పరుగెత్తి వచ్చాను. ఛూ ! త్వరగా లేపమని దేవకికి చెప్పాను. అప్పుడే లేపి పొద్దయింది అని పంపింది." అన్నాడు కణ్ణడు మొగంలో ఆశ్చర్యం కనిపిస్తుండగా.

"అంతే కదా ! ఆ చాప పరచుకొని పడుకో." అని చిరుకండడు అవగానే, కణ్ణనికి సిగ్గయింది.

"నీవు ఇంటికి వెళ్ళనే లేదా !"

లేదని చిరుకండడు తల ఊపాడు.

"నాకు చెబితే నేనూ ఇక్కడే వుండేవాణ్ని. ఒక్కరే వుండడం మంచిదా !"

"లేదు కణ్ణా. అప్పు తక్కినవారు రెండు కొట్టగా వెళ్ళారు."

"హుఁ !" ఇకనాకు నిద్రరాదు. ఏమైనా పని చెప్పు."

"నీవు చేసేపని ఇప్పుడేమిలేదు. పడుకోడానికి ఇష్టం లేకపోతే ఏదైనా పుస్తకం తీసుకొని చదువు."

కణ్ణడు షెల్ఫు దగ్గరికి వెళ్ళి ఒక పుస్తకం తీసుకున్నాడు. అది 'సమాజ వికాసం'. మరొక కుర్చీన నెమ్మదిగా వెలుగు వుండే చోటికి లాక్కొని కూర్చుని పుస్తకం చదువ సాగినాడు. ఒక పుట, రెండు పుటలు.. వెలుపలి నుంచి గాలి చల్లగా వీచింది. కంటిరెప్పలు ఒకదాని నొకటి కౌగిలించుకొన్నాయి.

చిరుకండడు అది చూచి చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. కణ్ణణి లేపలేదు.

కాని, కణ్ణనికి కొంచెం సేపటికి మెలకువ వచ్చి తాను నిద్రపోయానని తెలిసి, తప్పు చేసిన వాడిలాగ చిరుకండని చూచాడు. నెమ్మదిగా లేచి అన్నాడు :



"నేను కొంచెం పడుకుంటాను చిరుకండా. అబూబకర్ వచ్చిన తక్షణం లేపు."

చిరుకండడు కణడిని చూచి నవ్వి" హుఁ !" అన్నాడు.

కణ్ణడు చేతిలోని పుస్తకాన్ని షెల్ఫులో పెట్టి చాపమీద పడుకొని ఒళ్ళు చాచాడు.

ఐదు కొట్టడానికింకా కొంచెం పొద్దుందనగా అందరూ రాసాగారు. ఆ సద్దు విని కణ్ణనికి మెలకువ వచ్చింది. బాల సంఘం కుట్టికృష్ణుడు కణ్ణడిని చూచి "ఏమి మామా ? రాత్రంతా ఇక్కడే వున్నావా ?" అన్నాడు

"ఔనోయ్. మూడు గంటలవరకూ వ్రాస్తూ వున్నాను. ఇదిగో ఇప్పుడే పడుకొన్నాను." అన్నాడు కణ్ణడు నవ్వుతూ, ఒళ్ళు విరుచు కుంటూ.

"నీవు వ్రాయడం ! తెలుసులే, పాపం!" అన్నాడు కుట్టికృష్ణుడు.

చిరుకండడు, అబూబకర్, అందరూ నవ్వారు.

అలిసిపోయిన చిరుకండడిని ఇంటికి పంపి తక్కిన వారు కార్యాలయం బాధ్యత వహించారు. స్వయం సేవకుల నందరినీ అబూబకర్ వరుసగా నిలబెట్టాడు.

అరుణోదయానికి ఊరేగింపు బయలుదేరింది. జెండా పట్టుకొన్న కణ్ణడు నవోదయ నాందిని పాడాడు. "ఇన్ కిలాబ్ జిందాబాద్ !" నినాదం నీరవతను చీల్చుకొని, అడవుల మధ్య, కొండ గుహలలోను ప్రతిధ్వనించింది. మానుల తొర్రలలోని పక్షులు గాబరాపడి వెలుపలికి వచ్చి ఎగురుతూ కలకల ధ్వని చేశాయి. తర్వాత "మీరేనా ? మనవారేనా ?" అని ప్రశాంతంగా మళ్ళీ తమ గూడు చేరాయి !

కాలిబాటలో పొలాల గట్లమీదనుంచి నడక. అబూబకర్ కంఠం : లెఫ్ట్-రైట్, లెఫ్ట్-రైట్. లెఫ్ట్....మధ్య మధ్యన నినాదాలు....ఆ నడుమన పాటలు.

ఎప్పటిలాగ నంబియూరు ఇంటిముందు నుంచీ ఊరేగింపు సాగింది. అక్కడ కూడ నినాదాలు లావెన గోడలు దాటి లోపలికి జొరబడ్డాయి. "ఇన్ కిలాబ్ జిందాబాద్ !" "విప్లవానికి విజయమగు గాక !" "జమీందారీ

పద్ధతి నశించుగాక !" "సామ్రాజ్యవాదం నశించనీ !"

మొగసాలలో పడుకొన్న పోలీసు సుబ్బయ్య గడబిడగా లేచాడు. నినాదాలు విన్నాడు. వూరేగింపు ముందుకు సాగుతుండగా, తానేమి చేయాలని అరక్షణం ఆలోచించాడు. మళ్ళీ పడుకొని ముసుగుతన్ని నిద్ర పోవడమే మంచిదనుకొన్నాడు.

అయితే, అంతలోనే లేచి వెలుపలికి వచ్చిన నంబియారు మాటలు వినబడ్డాయి :

"చూచారా సుబ్బయ్యా ? ప్రతిదినం దీనిని మేము సహించాలి !"

సుబ్బయ్య నిద్ర పారిపోయింది. తన కర్తవ్య నిష్ఠను చూపడమే సరైనదని అతడు తొందరగా యూనిఫారం ధరించాడు. నల్లని బూట్లలో ఎర్రని పాదాలు తురికాడు.

"ఎక్కడికి ?" అన్నారు నంబియారు.

సుబ్బయ్య కూడ తనను మనసులో అడిగాడు : 'ఎక్కడికి ?'

"వస్తానండీ, వీళ్ళతోపాటు కొంచెం దూరం పోయివస్తాను."

తొందరగా సుబ్బయ్య క్రాపు దువ్వుకొని, దానిమీద తన స్థానానికీ, గౌరవానికీ చిహ్నమైన ఎర్రటోపీ పెట్టుకొన్నాడు.

"మా మనుషులిద్దరినీ వెంట తీసుకు వెళ్ళుతారా ?" అన్నారు నంబియారు. ఆయన మాటలలో వ్యంగ్యం ఉందో, లేదో చెప్పలేని స్థితిలో ఉన్నాడాయన.

"వద్దు ! ఎందుకు ? వూరికే వెళ్ళి వస్తాను. సర్కారు బతికి ఉంది అనేది వారికి తెలియనీ !"

"అలాగే. వెళ్ళిరండి."

సుబ్బయ్య వీధిలోకి దిగి ఊరేగింపు వెంట వుందామని తొందరగా నడిచాడు. రొండిన ఒక చేతి పిస్తోలు వుంటే చూడడానికి ఎంత బాగుండేది అనిపించింది సుబ్బయ్యకు. అయితే పిస్తోలు వుండాలంటే, అతడు పోలీసు అధికారి కావాలి. అధికారి కావడానికి ప్రయాస పడాలి. సుబ్బయ్య తొందరగా ముఖంమీద చేయి ఆడించి, మీసాలు తిప్పాడు. ముఖానికింత నీళ్ళయినా కొట్టుకోలేదు. అద్దం చూచుకోవడమూ పడలేదు "ఛూ! నా కొడుకులు వీళ్ళమ్మను....?" అని తిట్టాడు.



పోలీసువాడు వెంబడిస్తున్నాడని ఊరేగింపు పొడవునా వార్త పాకింది. అందరూ మెడ తిప్పి చూచారు.

"నేరుగా చూడండి!" అని అబూబకర్ ఆజ్ఞాపించి, తానే "ఇన్‌క్విలాబ్!" అన్నాడు. "జిందాబాద్!" అని నలభై అయిదు మంది ఒక్కటిగా నినాదం చేశారు. ఇప్పుడు నినాదాలు మరింత గట్టిగా వెలువడ్డాయి.

ఒకడు నెమ్మదిగా అన్నాడు:

"ముందు ఎర్రజెండా. వెనక ఎర్రటోపీ."

దానిని విన్నవారు కిసుక్కున నవ్వారు.

స్వయం సేవకుల క్రమశిక్షణం, యూనిఫారం చూచి సుబ్బయ్య ఒళ్ళు మండింది. ఆ ఊరేగింపునకు తోకగా తాను నడవడం అసహ్యమనిపించింది. పొలాలు రాగానే అతడు మరొక గట్టుమీద నడక సాగించాడు. ఊరేగింపునకు సమానాంతరంగా అప్పుడయినా రాజ ప్రతినిధి అయిన తనను చూచి, రైతులు చల్లబడి పోవచ్చు- అని అతడు భావించాడు. అయినా, అప్పటికీ అతడు ఆపేక్షించిన ఏ పరిణామమూ జరుగలేదు. దానికి మారు 'పోలీసు నిరంకుశాధికారానికి ధిక్కారం!' అనేకొత్త నినాదం చేశారు స్వయం సేవకులు.

సూర్యుడు పైకి వస్తున్నాడు. ఊరేగింపు చూడడానికి గుడిసె గుడిసె నుంచి వెలుపలికి తొంగి చూచిన రైతులు పోలీసును చూశారు. ఇదేమిటో జరుగుతుందని కొందరు రైతులు తామూ ఊరేగింపు వెంట వెళ్ళారు.

సుబ్బయ్య దిగ్భ్రాంతి చెందాడు. 'ధిక్కారం' అన్నప్పుడంతా స్వయం సేవకులు అతనిని వేలు పెట్టి చూపేవారు. 'అబ్బ! ఈ పల్లె మొద్దుల గుండె!' అని పెదవులు కరచుకున్నాడు. అది చాలక రైతులు తనను చూడసాగినారు. ఏమయినా, అవమానం. ఏమి చేసయినా, తాను తన అధికారం చూపక పోతే మూడు దమ్మిడీల విలువా మిగిలేట్టు లేదు.

ఊరేగింపు ఎడమకు తిరిగి నది ఒడ్డు పొడుగునా నడిచింది. అక్కడే కోరని, కణ్ణని, తక్కినవారి గుడిసెలున్నాయి. రైతుల ఇండ్ల ఆడవారు గుడిసెల నుంచి వెలుపలికి వచ్చి పోలీసువాడు ఎర్రజెండా నీడలాగ వస్తున్న దృశ్యం చూచారు. దీనిలో అపాయముందేమోనని వారు ఒకసారి

దిగులుపడినా, ఆ జన సముదాయంలో అతడు ఒంటరి వాడన్నది స్పష్టమయి నవ్వుతూ, పోలీసు వానివైపు వేలు చూపుతూ, గుసగుసలాడారు. ఆడవారి ఈ ప్రవర్తనయితే సుబ్బయ్యకు మింగలేనిముద్దయింది. అతనిలో వివేకం మరుగయి, దురభిమానానిదే పై చేయి అయింది. సుబ్బయ్య పొలందాటి పరుగెత్తుతూ ఊరేగింపు ముందు భాగం చేరాడు.

దారికి అడ్డు తగిలినందున కణ్ణడు నిలవ వలసి వచ్చింది. కణ్ణడు నిలవడం వల్ల జెండా రెపరెపలాడడం ఆగింది. ఆగి పోయింది పాట కూడ.

"హాల్ట్ ! నిలుచున్న చోటే నిలుచోండి!" అని అబూబకర్ ఈల ఊదాడు.

ఎవరో "ఇన్‌క్విలాబ్" అన్నారు. దానికి జవాబు వచ్చింది. మళ్ళీ నినాదాలు చెలరేగాయి.

"వదులు దారి!" అన్నాడు కణ్ణడు.

"వదలను. ప్రభుత్వం చచ్చి పోయిందనుకున్నారా?"

అబూబకర్ వచ్చి పోలీసు రెక్క పట్టుకుని "జరిగి నిలబడు! ఏమిటి సంగతి?" అంటూ అతనిని పక్కకు లాగాడు. సుబ్బయ్య పాలికి కూడ అది బలమైన పట్టే! అతడు చేయి రుద్దుకొని అబూబకర్ చెంపకు ఒకటి ఇచ్చుకున్నాడు. ఊరేగింపు వరుస చెదరి పోయింది. అంతా జండా చుట్టూ, పోలీసు చుట్టూ గుంపు గూడారు. కేకలు వినిపించాయి: "ఇవ్వండి వాడికి!" "బిగించండి నాల్గుఏట్లు:"

"దీని పరిణామం ఏమవుతుందో జ్ఞాపకం వుంచుకోండి!" అని సుబ్బయ్య అరిచాడు.

నాయకుని సూచనను నిరీక్షిస్తూ జనం అలాగే నిలబడింది. ముఖం ఎరుపెక్కింది అబూబకర్‌కు. తాను తిరిగి కొట్టాలా, వద్దా అనేదే అతనికి తెగని ప్రశ్న అయింది. మాటలు మాత్రం వెలువడ్డాయి:

"కొట్టావా కొడకా?"

"కొడుకు అంటావా?"

మళ్ళీ చేయి విసిరాడు సుబ్బయ్య. చిన్నవాడయిన కుట్టికృష్ణుడు అతనిని వెనక్కినెట్టాడు. తూలిపడ్డట్టయింది. అరక్షణంలో అతడు నిలవదొక్కుకొని, కుట్టికృష్ణుని బూటుకాలితో తన్నాడు. కుట్టి కృష్ణుని లేతగొంతుక నుంచి "ఆ!" అనే శబ్దం వెలువడింది. జనమంతా ఒక్కొమ్మడిగా మాట్లాడుతూ పోలీసు పైకి పడ్డారు. చుట్టుపట్ల రైతులూ పరుగెత్తి వచ్చారు. సుబ్బయ్యకు బలమైన దెబ్బలు తగిలాయి. నొప్పికి తట్టుకోలేక అతడు గుంపును చీల్చుకొని వెలుపలికి వచ్చాడు. టోపీ పొలంలోపడింది. దానిని లెక్కపెట్టకుండా సుబ్బయ్య పరుగెత్తాడు. పరుగెత్తుతున్న అతనిని స్వయంసేవకులు, రైతులు వెన్నాడారు. కణ్ణడూ జెండా పట్టుకునే జనంతోపాటు నడిచాడు. నూరుగజాలు పరుగెత్తాడో లేదో కాలు జారి పడ్డాడు సుబ్బయ్య. లేచి మళ్ళీ పరిగెత్తాడు. జనాల కేకలు సమీపంలో వినిపించి పొలంమట్టి బెడ్డఒకటి వెన్నుకు తగిలినట్లయి సుబ్బయ్య అధీరుడయ్యాడు. "బదికితే బలుసాకు తినవచ్చు" అన్నట్టయింది అతని స్థితి. అయినా రైతుల ఎదుట ఓటమిని ఒప్పుకోలేక అతడు నది ఒడ్డుకు పరిగెత్తి నీటిలో దూకాడు.

జనం వచ్చి చుట్టుముట్టారు. అతడు ఈది ఆవలిగట్టు చేరి దాటి పోతాడని స్పష్టమయింది. "దొంగ తప్పించు కొన్నాడు" అన్నారు పలువురు. "నీలేశ్వరం మీదుగా నడుస్తు హొస దుర్గం చేరనీ సబ్ ఇనస్పెక్టరుగారు" అన్నాడొకడు. "ఇంకోసారిరా నేర్పుతాము" అన్నది ఒక పిల్లవాని గొంతుక.

కణ్ణడు జెండాతోపాటు అక్కడికి వచ్చి చేరాడు.

ఎవరో అన్నారు:

"రండర్రా. నదిలో దిగండి. పట్టుకొని వద్దాం వాడిని."

"వద్దు! వద్దు!" అన్నారు మరికొందరు.

"తీసోక్కండి ఒక్కొక్కరాయి. ఉడుగర్లిచ్చి పంపుదాం."

నది ఒడ్డున ఉన్న రాళ్ళు తీసుకొని కొందరు ఈదుతూ పోతున్న సుబ్బయ్య వైపు విసిరారు. ఏదో ఒక రాయి తగిలినపుడు ఈదుతున్నవాడు తల తడుము కొన్నాడు. ఒడ్డు మీదున్నవారు నవ్వారు. సుబ్బయ్య మళ్ళీ ఈదాడు; మళ్ళీ రాళ్ళు అతని వైపుకు వెళ్ళాయి.

అప్పుడు వినిపించింది అబూబకర్ కంఠం:

"పోనీ, వదిలి పెట్టండి!"

అంతలోనే నంబియారు ఇంటి నుంచి పోలీసువాడు ఊరేగింపు వెన్నంటి వెళ్ళాడని విని అప్పు,చిరుకండడు పరుగెత్తుకుంటూ, గసపెడుతూ జనం మూగిన చోటికి వచ్చారు. ఏమి జరిగిందని అడగ నవసరం లేదు.

కొందరి చేతులలో రాళ్లు ఉండడం చూచి చిరుకండ డన్నాడు:

"పోదయిపోనీ, రాళ్ళు రువ్వకండి !"

ఆటల పోటీలలో నిపుణుడని వెనుకటి దినం ఆత్మస్తుతి చేసుకొన్న సుబ్బయ్య ఈతగానితనం గురించి తిరస్కారంతో మాట్లాడుతూ జనం నవ్వింది.

సుబ్బయ్య చేతులు ఈది ఈది సోలిపోయాయి. అప్పు భయంతో అటువైపు చూచాడు. చిరుకండని నొసలు యోచనతో ముడుతలు పడింది.

ఎవరో అన్నారు :

"విశ్రాంతి తీసుకుంటున్నాడర్రా...."

ముందుకు ఈదడానికి మరొక ప్రయత్నం. మళ్ళీ సోలిపోవడం.

"ఏమయ్యా, సబ్ ఇన్‌స్పెక్టరుగారు కష్టంలో వున్నారని తోస్తుంది ?" అని ఒకరు రాగాలాపన చేశాడు....

....అప్పు....చిరుకండడు ఊహించినట్టే అయింది. ఎట్టనదేట సుబ్బయ్య మునిగాడు. నల్లచుక్కలాగ అంతవరకు కనిపిస్తున్న అతని తల కనిపించక పోయింది.

అక్కడ చేరినవారంతా మాటలు ఆపి క్షణకాలం మౌనంగా వుండిపోయారు.

"పాపిష్ఠి మునిగాడు !" అన్నది ఒక గొంతుక.

అప్పు, చిరుకండడు ఒకరి మొకం ఒకరు చూచుకొన్నారు. ఇద్దరి దృష్టి ప్రశ్నార్థక చిహ్నంగా నదిని చూచింది. అక్కడ జరిగిన దేమి ? అతడు ఈత కొట్టలేక చచ్చాడా ? లేక సుడిలో చిక్కుకున్నాడా ? అథవా మొసలి అతని కాలు పట్టుకొని లాగిందా ? ఏమయింది ?

ఎంత చూచినా, ఒక ప్రాణి అక్కడ మునిగి చచ్చిందనడానికి ఏ సాక్ష్యమూ లేదు. ఎప్పటిలాగే పారుతున్నది తేజస్విని.

చిరుకండడు దీర్ఘంగా నిశ్వసించి అన్నాడు :

"స్వయం సేవకుల ఊరేగింపు సరాసరి సంఘ కార్యాలయానికి వెళ్ళనీ. తక్కినవారు తమతమ పనికి వెళ్ళండి."

ఆ ధ్వని భారంగా వుంది.

కోరడు వచ్చిన దారినే బయలుదేరాడు. పోలీసు ఎర్రటోపీ పడిన చోటే పడివుంది. కోరడు తన చేతిలోని కర్రతో దానిని పక్కకు జరిపి నది ఒడ్డుకు తోశాడు. అక్కడ నుంచిఅది దొర్లి నీటిలోపడి మునిగిపోయింది.

# విరామం

# 1

పోలీసు మరణ దుర్ఘటన నంబియారుకు కడుపులో గుబులు పుట్టించింది. ఆ క్షణమే ఆయన ఆడువారితో సహా ఊరు వదలిపోవాలని నిర్ధారించుకొన్నారు. అయితే, అది సులభం కాదు. దారిలోనే రైతులు తమను ఆపివేయవచ్చుననే శంక కలిగి అతనికి వ్యాకులత కలిగింది. ఇలా అయి ఆయన తుపాకి అంటిపెట్టుకొని, దేవుని మీద భారం వేసి, ఇంట్లోనే కూర్చున్నారు. ఏ క్షణమయినా రైతులు తమ ఇంటిమీద పడవచ్చునని ఆయన తలంపు అయితే ఇంటి సింహద్వారంలో కావలి వున్న జవానులకు రైతుల అలికిడే కనిపించలేదు. వారి గుండెలలో అటుకులు దంచుతున్నట్టున్నా, క్రమంగా భయం మాయమై నిలిచి నిలిచి విసిగెత్తి, ఆవలించేట్టయింది.

మధ్యాహ్ననికి ఒక వేగులవాడు నంబియారుకు ఒక వార్త తెచ్చాడు. రైతులు రణోత్సాహం చూపక నిరుత్సాహంగా వున్నారని తెలిపాడు. కొందరు గుడిసెలలోనే దాక్కొని వున్నారని, ముందు ఏమవుతుందో అనే భయం కొందరిని పీడిస్తున్నదని. ఇటువంటి పరిస్థితిలో, రైతుసభ నడపాలా వద్దా అనే చర్చ జరుగుతున్నదని రిపోర్టు చేశాడు.

నంబియారు ముఖం వెడల్పయింది. ఆయన కొంచెం తేరుకొని, కొంచెంసేపు అటు ఇటు పచారు చేశాడు. తర్వాత కూర్చొని, పరిస్థితి భయంకర స్వరూపాన్ని మనస్సుకు హత్తుకొనజేసే సుదీర్ఘ లేఖను వ్రాశారు. మలయాళ భాషలో చాలదని తమకు వచ్చిన ఇంగ్లీషు ముక్కలతో మరొక వక్కణం సిద్ధం చేశారు. వాటిని ఒక లకోటాలో

వేసి నమ్మకమైన దూతలతో రహస్యంగా హొసపురానికి పంపారు. మరొక బంటు నీలేశ్వరానికి పోయి, కయ్యూరు రైతులు సాయుధ విప్లవంలో పోలీసును హత్య చేసిన వార్తలను తంతి మూలకంగా మద్రాసు ప్రభుత్వానికి, మంగుళూరు జిల్లా అధికారికి తెలిసే ఏర్పాటూ చేశారు.

ఇంతచేసి ఆయన తృప్తితో నిట్టూర్పు విడిచి, శాంతిభద్రతల రక్షకుల రాకను ఎదురు చూశారు. అయినా చీకటి కాగానే ఆయనకు భయం పట్టుకుంది. హెచ్చరికతో వుండమని నౌకర్లకు చెప్పి తలుపులు భద్రంగా మూసి గడియ పెట్టారు. నంబూదిరి నీలేశ్వరంలో సుఖంగా వున్నాడనే సంగతి ఆయనను అప్పుడప్పుడు కెలక వేసేది. "కిలాడి ! ఇలా అవుతుందని వాడికి మొదటే తెలుసునో ఏమో.... !" అని ఇష్టం వచ్చినట్లు తిట్టాడు.

..............................

రైతు సంఘ కార్యాలయంలో జనుల సందడి ఎక్కువయింది. కొందరు భయంతో అటువైపు తొక్కలేదనడం నిజమే. కాని, ఎక్కువ మంది వచ్చేవారు, పోయేవారు. అయితే మాట్లాడేవారు తక్కువ. అందరి ముఖాల మీద ప్రశ్నార్థక చిహ్నం కనిపించింది. "ఏమిటి ? ఇంకేమిటి ? ముందేమిటి ?"

ఈ సంఘటన జరిగిన కొంతసేపటికే, సంఘ కార్యవర్గం అత్యవసర సమావేశం జరిపింది. అర్ధగంటలో ప్రకటన ఒకటి సిద్ధ మయింది. అందరూ చదవడానికి వీలుగా చిరుకండడు దానిని వెడల్పాటి కాగితం పైన పెద్ద పెద్ద అక్షరాలతో వ్రాశాడు. ఆ కాగితాన్ని వెదురు తడకకు అంటించి, ఆ తడకను సంఘ కార్యాలయం ముందు భాగంలో వ్రేలాడదీశాడు. ఆ ప్రకటనలో యిలా వుంది :

"ఈ ఉదయం సంఘటనను సంఘ కార్యవర్గం వివరంగా పరి శీలించి చేసిన ఆ నిర్ణయం ఏమిటంటే :

"పోలీసు మరణానికి కయ్యూరు రైతులు యే రీతిగాను బాధ్యులు కారు. నదిలో దూకకుండా ఉంటే అతనికి ఏమీ అయ్యేది కాదు. నదిలో ప్రమాదానికి లోనై వాడు మరణించాడు. అందువల్ల ఎవరూ ఏ యోచనా



చేయక తమ పనులలో నిరతులు కావాలి. సభ సంసిద్ధతలో భాగంగా ఎప్పటిలాగే రేపు ప్రాతఃకాలమూ ఊరేగింపు జరుగుతుంది. స్వయం సేవకులు మాత్రమే కాక రైతు బాంధవు లందరూ ఆ వూరేగింపులో పాల్గొనాలని సంఘం ఆహ్వానిస్తున్నది."

"న్యాయానికి జయమగుగాక !"

"ఇన్‌కిలాబ్ జిందాబాద్ !"

ప్రకటన ముందు రైతులు గుమిగూడారు. కొందరు పునఃపునః దానిని చదివారు. అది అన్ని సందేహాలను దూరం చేసే స్పష్టీకరణ మయింది. ఊరటకు కారణ మయింది.

అయితే, ఇంతమాత్రంతో సంఘ ప్రముఖులు ఊరకే ఉండలేదు. సాయుధ పోలీసుల దండు రానే వస్తుందని వారు ఊహించారు.

"అధికారులకు వార్త చేరడానికి ఎంతసేపు కావాలి ?" అన్నాడు అబూబకర్.

తలా ఒక అభిప్రాయం తెలిపారు.

"ఈలోగా జమీందారు యెవరినయినా పంపాడో ఏమో ?"

వారిలో జమీందారు దూతను ఆపవలసింది.

అంతా ఆలోచించి చిరుకండ దన్నాడు :

"అలా ఆపడంవల్ల ప్రయోజనమేమీ లేదు. ఉదయం కూరగాయలు తీసుకొని నీలేశ్వరం బజారుకు వెళ్ళినవారి మూలంగా ఇప్పటికే వార్త వ్యాపించి వుంటుంది. దానిని ఆపడం సాధ్యం కాదు. ఇప్పుడు విపత్తును ధైర్యంతో ఎదిరించాలి. రిజర్వు పోలీసుల దండు రానే వస్తుందనే ఊహతోనే చర్చ జరుపుదాము."

"మనమందరం అండర్ గ్రౌండ్‌కు—అజ్ఞాత వాసానికి—వెళ్ళాలి. ఎవరూ దొరకక్కూడదు." అన్నాడు అప్పు. ఆ ధ్వనిలో ఉద్వేగం తొణికిస లాడింది.

ఆ మాటలు విని ఒక నిమిషం ఎవరూ ఏమీ అనలేదు. ఆ విష యంలో చిరుకండని అభిప్రాయం ఏమని తెలుసుకొనడానికి వారంతా త్వర పడ్డారు.

చిరుకండని నుదురు ముడుతలు పడింది. అతడు యోచించి నిదానంగా అన్నాడు:

"నిజమే. అయితే మనకు ఇలాటి క్లిష్ట పరిస్థితి ఏర్పడడం ఇదే మొదటిసారి. అలాంటప్పుడు ఒకేసారిగా జనాన్ని వారి దారికి వారిని వదలి పెట్టి కార్యకర్తలందరూ అజ్ఞాతవాసానికి వెళ్ళడం సరికాదు."

ఆ మాటలలో నిజం కొంత వుందనడం స్పష్టమయినా, అప్పు ఒప్పుకోక అన్నాడు:

"అలా అయితే పోలీసులను ఎదుర్కోడ మనేనా?"

అబూబకర్ మధ్యన వచ్చాడు:

"అది ఎలా అవుతుంది? చుట్టుపట్ల దేశంలో ఆ కార్యక్రమమే లేనప్పుడు, ఎన్నాళ్ళు మనం ఎదిరించగలం? పోలీసుల వెంట సైన్యమూ వస్తుందని మరువకండి."

మాట మాటకు పెరిగి పెద్ద దవుతున్న సమస్యను గురించి అందరూ యోచించారు.

మౌనాన్ని భంగంచేస్తూ చిరుకండడు అన్నాడు:

"పల్లె వెలుపలి కేంద్రంలో ఎవరైనా వుండనే ఉంటారు. వాళ్ళకు సంగతి సందర్భాలు తెలుపుదాము. నీలేశ్వరానికి ఎవరినైనా పంపుదాము. కాని, దానికి ముందు మన నిశ్చయానికి మనం రావాలి. దానిని పరిశీలించి వారు నిర్దేశించనీ."

అందరికీ ఆ సూచన నచ్చింది. చిరుకండడు ఇంకా ఇలా అన్నాడు:

"ఇప్పటి పరిస్థితిలో ప్రతిఘటించడం ఉచితం కాదని నా అభిప్రాయం. మనలో కొందరు చీకటి పడగానే అజ్ఞాతవాసానికి వెళ్ళాలి. తక్కినవారు జనంతోపాటు వుండి బహిరంగంగానే మార్గదర్శకులు కావాలి. ఒకటి రెండు రోజుల పరిస్థితి చూచుకొని, ఆ మీదట కొత్త తీర్మానం చేసుకోవచ్చు. ఇది మీకు ఒప్పితమైతే, మా అభిప్రాయం ఇలా వుంది అని మన వాళ్ళకు వ్రాసి పంపుదాము."

చుట్టూ చేరినవారు తమలో తాము మాట్లాడుకొని, 'సమ్మతం' అన్నారు.



అప్పు అడిగాడు:

"ఒక వేళ పైనుంచి సూచనలు రాకపోతే?"

జవాబు స్పష్టంగా వుంది.

"రాకపోతే మనం ఇప్పుడు చేసిన తీర్మానం ప్రకారం నడచుకుందాం."

కార్యదర్శి అయిన చిరుకండడు బాధ్యతగల వ్యక్తిగా పల్లెలోనే వుండాలని అందరూ అన్నారు. చిరుకండని వద్ద తానూ వుంటానని కోరడు అన్నాడు. జెండా. పాటల కామ్రేడ్ అయిన కణ్ణని ఉపయోగమున్నదేమో జనం మధ్య. అప్పు. అబూబకర్, సాహసులైన మరి యిద్దరు స్వయం సేవకులు అడవులలో దాక్కోవాలని నిర్ణయమయింది....

ఎప్పుడూ గొప్ప సంఘటనలనే ఊహిస్తున్న అప్పు ఇంట్లో భార్య జానకిని ఒకర్తనే పిలిచి చెప్పాడు:

"ఒక రహస్యం ఎవరికి చెప్పరాదు."

ఆ దినం ప్రతిక్షణం అపాయమే నిరీక్షిస్తున్న జానకి "హుం!" అన్నది.

"నేను ఈ రాత్రే అండర్ గ్రౌండుకు వెళ్ళుతాను. అర్థమయిందా?"

అప్పు భార్య అదేమిటో తెలియని అజ్ఞాని కాదు. ఆమె మౌనంగా అర్థమయిందని తల ఊపడం చూసి అప్పు అన్నాడు:

"నీవు నా భార్యవు మాత్రమే కాదు. కామ్రేడ్‌వి కూడా. ఎంతటి ఆపదలోను ధైర్యంగా వుంటానని మాటయివ్వు."

ఆమె అతని కుడిచేతిని తన రెండు చేతులతోను ఎత్తి తనరొమ్ముమీద పెట్టుకుంది. ఆమె కన్నీటి చుక్క ఒకటి అతని చేయి సోకింది.

"ఏడువవద్దే ! ఇంతేనా నీవు?"

నిజానికి అతడే ఏడిచేటట్టు వుంది అతని కంఠధ్వని.

"లేదు" అన్నది జానకి. ఇప్పటి గొంతుకలో ధైర్యముంది, గాంభీర్యముంది.

అప్పుకు దానినుంచి మనస్సు నెమ్మది పడింది. అతడు ఆమెను తొందర తొందరగా ముద్దు పెట్టుకొన్నాడు. పాపను ముద్దు లాడాడు. సద్దుచేయక చీకట్లో కలిసిపోయాడు.

అబూబకర్ నిజం చెప్పి బూబమ్మను విడిచిపెట్టి రావడం సులభం కాలేదు. అందుకోసం అతడు ప్రయోగించినది అబద్ధమనే ఆయుధం.

"కొన్నాళ్ళు తలచేరికి వెళ్ళొస్తానమ్మా!"

మరొక దినమయితే బూబమ్మ అతనిని అడ్డగించేది. కాని.... ఆ దినం కుమారునికి అపాయం కలుగవచ్చుననే భయం ఆమె హృదయాన్ని దహించి వేస్తున్నది. కొడుకు తలచేరికి పోవడమే సురక్షితమని ఆమెకు తోచింది.

"ఒక్కడే వెళ్ళుతున్నావా?"

"వేరే వాళ్ళూ వుంటారు.... నేను ఎక్కడ అని ఎవరైనా అడిగితే ఏమి చెబుతావు?"

"ఏమి చెప్పను నాయనా?"

"కల్లికోటకు వెళ్ళాడు అని చెప్పు."

"హూం. నిన్ను నీవు కాపాడుకో నాయనా అల్లా చూస్తాడు!"

వద్దన్నా ఆమె కట్టి యిచ్చిన తినుబండారాలతో అబూబకర్ మాయమయ్యాడు.

అలాగే ఇద్దరు స్వయం సేవకులు వచ్చారు. రాత్రే నలుగురూ నది ఒడ్డు పొడువునా ఎగువకు నడిచి అడవి చేరుకున్నారు....

చిరుకండన్ని ఊహ నిజమయింది. హొసదుర్గంనుంచి నలభయి మంది సాయుధ పోలీసులు ఏదో గూడ్సుబండిలో చర్వత్తూరు వరకు వచ్చి అర్థరాత్రి గడుస్తుండగా, కయ్యూరు చేరుకున్నారు. కయ్యూరు చేరే దారిలోను, నదిదాటే రేవులోను, పల్లెనుంచి వెలుపలికి వెళ్ళే రెండు కాలి బాటలలోను పోలీసులు నలుగురు నలుగురు చొప్పున కావలి కాచారు. తక్కినవారు జమీందారుగారి బంట్ల సహాయంతో తెల్లవారు జామున అప్పు. చిరుకండడు, అబూబకర్ల ఇండ్లను, సంఘ కార్యాలయాన్ని ముట్టడించారు. ప్రభుత్వ ఆగమనం జరిగింది, అని చాటడంకోసం నాలుగైదు



తుపాకిగుండ్లు గాలిలో ప్రేలి ఢం ఢం ధ్వనిచేశాయి. వాటి ప్రతిధ్వనితో కయ్యూరు కంపించింది.

వెలుతురు వెల్లివిరియగానే చాలమందిని బంధించారు; రాజ మర్యాదతో కాదు; శత్రువులను కుచ్చి పొడిచి గాయపరచి చెరపట్టే పద్ధతితో; సన్నీలకుమ్ములాట. హేయమైన, నింద్యమైన దుర్భాషల పొడుపులాట. బూటు కాళ్ళ తన్నులాట.

ఆ పోలీసు అధికారి మహా చతురుడు. నల్లని భయంకర శరీరం ఉన్న ఆ మోటు మనిషిలో అంతటి చాతుర్యం, తెలివితేటలూ ఉంటాయని సామాన్యుల దృష్టికి కనిపించదు. అయితే అతనికి ఎంతటి గొప్ప వేటగాళ్ళనయినా సిగ్గుపడజేసే సామర్థ్యం వుంది.

అందరూ వినేట్టు అతడు చాటి చెప్పాడు:

"మాకు కావలసింది నాయకులు మాత్రం.మరెవరికీ మేము ఇబ్బంది కలిగించం."

నంబియూరు ఏనాడో సిద్ధపరచిన నాయకుల పట్టిక అతని చేతిలో రెపరెపలాడింది.

"కార్యదర్శి కోయికట్టి చిరుకండడు."

అతని రెండు చేతులూ వెనక్కు విరిచి బిగించి బేడీలు వేశారు.

"మఠం అప్పు."

వాడు లేడు.

"రెండు అంటించండి వాడి బాబుకు. సరి. అలాగా! వాడినే పట్టుకోండి! ఈ యింటికి కావలి వుంచండి!"

మరొక పేరు?

"పొడువరి కుఞంబు. ఓహో! సంఘం కట్టడానికి స్థలం దానంచేసిన పెద్ద మనిషి! అరెస్టు!"

తర్వాత బూబమ్మ యింటి సందర్శనం. అబూబకర్ లేడు. 'కల్లికోటకు పోయాడట.'

"దొంగ లంజకొడుకు! ఈ ముసలి దానికి ఎలా నేర్పాడో! లోపల వెదకండి. ఎవరు ఆ పిల్లవాడు? తమ్ముడా? వడ్డించండి. అలాగే తెరవరా నోరు! సువర్ కా బచ్చా!"

అక్కడి నుంచి ఇంటింటికి.

"పాట పాడే కణ్ణడు! ఆహా! సంగీతగాడు! సన్నీలతో పొడవండి తుంటిని. ఏదీ వాడి స్వరం కొంచెం విందాము!"

నిస్సహాయుడయిన నిర్జీవ వ్యక్తి తాను అన్నట్టు కోరడు గాజు వంటి కళ్ళతో చల్లని చూపులు చూస్తూ, నిశ్చలంగా నిలబడి వున్నాడు. వాడే కోరడని నంబియారు బంటొకడు వేలితో చూపాడు.

"వీడేనా కోరడు! బాడిగార్డు! రాముని బంటు హనుమంతుడు! లగావ్ ఇస్కో."

ఆ మీదట కృష్ణన్‌నాయర్, మరి ఇతరుల బంధనం.

అరెస్టయినవారి నందరినీ సంఘ కార్యాలయానికి నడిపించుకొని వచ్చారు. కూరగాయల బుట్టలతో నీలేశ్వరానికి బయలుదేరిన స్త్రీలు నది దాటడానికి పోలీసులు అనుమతించనందున వెనక్కు తిరిగి వచ్చారు. పారిపోదా మనిపించింది చాలామంది రైతులకు. వారికి చాలా భయమయింది. కాని దారులన్నిటినీ పోలీసులు కావలి కాచడంవల్ల హతాశులయ్యారు. క్రమంగా నాయకులను మాత్రం పట్టుకున్నారని తెలిసిన తర్వాత "బతికాము" అని కొంచెం ఊపిరి తీసుకున్నారు.

పోలీసు ఒకడు సంఘ కార్యాలయం కప్పు యెక్కి, జెండాకర్రను విరిచాడు. జెండా వేలాడుతూ కిందికి జారి వచ్చి బంధితుల గుంపు వద్ద కుప్పగా పడింది. మరొక పోలీసు దాని నెత్తి ముద్ద చేసి, అధికారివద్దకు తీసుకొని వెళ్ళాడు.

"గాడిదా! నాకెందు కిస్తావురా దాన్ని? కట్టి నేలమీద పెట్టు" అని అధికారి గద్దించాడు.

బంధితులను ఇష్టం వచ్చినట్టు తిట్టి హీనంగా అవమానించడం జరిగింది. అయితే చిరుకండడు మొదలు ఒక్కరూ పెదవి కదపలేదు.

కార్యాలయం ముందు వేలాడుతున్న ప్రకటనను చదివాడు అధికారి.

"పోలీసు మరణానికి కయ్యూరు రైతులు ఏ రీతిగాను బాధ్యులు కారు.... ఆహా! రేపు ప్రాతఃకాలమూ ఊరేగింపుజరుగుతుంది....ఓహో! ధారాళంగా!"



గద్దెను మళ్ళీ సంపాదించిన రాజకుమారునిలాగ నంబియారు అక్కడికి వచ్చి, అధికారి యెదుట వినయంతో తమ ఇంగ్లీషులో అన్నారు:

"ఇంటివైపు వెళ్ళుదాము. విశ్రాంతి తీసుకోండి...."

అధికారి నంబియారును చూచాడు; ఖైదీలను చూచాడు; తన పోలీసులనూ చూచాడు.

"విశ్రాంతి తీసుకుందాము. ఇంత చేసిన తర్వాత విశ్రాంతి వద్దా? అయితే మొదట వీరి ప్రాతఃకాలం ఊరేగింపు జరిపించాలి!"

ఖైదీలను చర్వత్తూరుకు తీసుకొని వెళ్ళి అక్కడి నుండి హొసదుర్గానికి సాగించాలని అధికారి ఆజ్ఞ. ఎనిమిది మంది ఖైదీలను, ఇప్పుడు వేరే విధంగా ఒకరి చేతిని మరొకరి చేతికి జోడించి బేడీలు వేశారు. "ఇలా బేడీలు వేస్తే పొలం గట్లమీద నడవడం కష్టం" అన్నారు యెవరో. "కాడికి కట్టిన యెడ్లలాగ పొలంలో నడిచి వెళ్ళుతారు. ఇదే సరి." అన్నాడు ఇంకొకడు. పదిహేనుమంది సాయుధులైన పోలీసులు ఆ ఖైదీల గుంపును తీసుకొని వెళ్ళారు. దారిలో కావలి కాస్తున్నవారి సంఖ్యను రెండింటికి రెండింటికి తగ్గించి తక్కిన పోలీసులు, అధికారి విశ్రాంతి కోసం నంబియారు ఇంటికి నడిచారు.

రైతులు – స్త్రీలూ, పురుషులూ తడకల సందులలో నుంచి, తలుపు చాటునుంచి ఖైదీలు నడిచి వెళ్ళే ఆ దృశ్యాన్ని తొంగిచూచారు. పెదవులు బిగించి నిలుచున్న కోడలిని చిరుకండని తల్లి ఒడిలోకి లాక్కుని శోకాలు పెట్టింది. అప్పు కన్నతల్లి ఏడ్చింది. దేవకి అప్పును సమాధానపరచింది. స్త్రీలు, పురుషులు ఊపిరి బిగబట్టారు. ఇది పెనుకాడు– పెద్ద అడవి – అన్నట్టు కాగిన నేల భణభణ లాడింది.

# 2

ఎనిమిది మంది నిర్బంధంతో ఆ ప్రకరణం సమాప్తమయిందని భావించినవారు పొద్దు మునుగగానే సడు చేస్తూ వచ్చిన పటాలం చూసి వణికిపోయారు. గుసగుసగానే మిలిటరీ వచ్చిందనే వార్త గుడిసె నుంచి గుడిసెకు వ్యాపించింది.

"ఎంచి చూశాను. అరవై మంది జవానులూ, సైన్యాధికారీ!"

"కలికోట నుంచి వచ్చి వుండవచ్చు."

"పరమాత్మ! ఇంకేమి గతి భగవంతుడా!"

"అయ్యో?"

"వచ్చినది మిలిటరీ కాదు. కాని, అంతటి సమర్థమయిన మలబార్ స్పెషల్ పోలీసు దళం ఎమ్. ఎస్. సి. ఈ సాయుధ దళం విశాలమైన ఒక తోపులో డేరా వేసి, విడిసింది. ఆ దళం నాయకుడు, పోలీసు అధికారి పరస్పరం కలుసుకొని చర్చించుకొన్నారు. నంబియారు యెదుట సమాలోచనలు జరిగాయి.

చీకటి పడగానే రైతులు అక్కడక్కడ గుంపుగూడారు. ముందేమి చేయాలి? ఇదే సరైన మార్గమని అనేవారు అక్కడ లేరు. వారు పరస్పర సందేశం ఒక్కటే – భయ సందేశం. రేపు మనఅందరిని పట్టుకోవచ్చు. గుడిసెలకు నిప్పంటించవచ్చు. స్త్రీలపై అత్యాచారాలు చేయవచ్చు– అందరం పరుగెత్తి పోదామా? ఊరు విడిచి పోదామా? దారులలో ఇంకా పోలీసు కాపలా వుంది....

పెదవులు ఎండి, గొంతు ఆరి, ధ్వని వెలువడక, ఒళ్ళు వణకే ఆ పరిస్థితిలో అప్పు కనిపించాడు. అటు తర్వాత అబూబకర్,

"అప్పు! ఎక్కడి నుంచి వచ్చావు?"



"అప్పు! ఇలా అయింది గదా మన గతి!"

"దీనికంతా అబూబకరే కారణం!"

"ఆ దినమంతా ఏమి జరిగిందని అప్పు అడిగి తెలుసుకొన్నాడు. పడవ మునుగుతున్నది. కెప్టెనుకు వినిపించిందొకటే, ప్రయాణీకుల ఆక్రందనం....భయాందోళనల మాటలు; ఆడవారిపై అత్యాచారం జరుగవచ్చు!" కట్టానతి అన్నట్లు అప్పు అన్నాడు;

"ఆడపిల్లలను, చేతి పాపలను, యువకులను పల్లెనుంచి వెలుపలికి తరలించాలి – ఇప్పటికిప్పుడే!"

"ఎలాగు? ఎక్కడికి? పోలీసు కాపలా వుందే?"

"ఉండనీ? నదిలేదా! పడవలు లేవా? అవతలి ఒడ్డుకుపోయి, తెల్లవారే లోపుగా అక్కడినుంచి చెదరిపోతే చాలు. కొందరు మగవారూ వెంటరానీ! హు; లేవండి!"

రైతులు లేచారు. బిడ్డను ఎత్తుకొని జానకి, చిరుకందని భార్య దేవకి, పుట్టింటికి వచ్చిన కృష్ణన్ నాయర్ కోడలు, కుఞంబు భార్య శ్రీదేవి అమ్మ, ఇంకా ముప్ఫయి, నలభై మంది....చీకటి ముసుగులో, చీమల లాగ నది ఒడ్డు చేరారు. కయ్యూరు బలిష్ఠ బాహువులు దొరికిన ఒక పడవకు తెడ్డు వేశాయి. చుక్కాని తిప్పాయి. మౌనంగా వున్న నది గుండెలు చీల్చుకుంటూ ఆ పడవ రెండుసార్లు ఆవలిగట్టుకు పోయి వచ్చింది. అంతమంది స్త్రీలూ, వెనుక కావలికి కొందరు మగవారూ నది దాటారు.

అక్కడున్న మగవారితో అప్పు అన్నాడు:

"రేపు ఇక్కడ నడిచేది నిరంకుశరాజ్యం. ఓడిపోయిన ప్రజల గుండెల మీద పిశాచ నృత్యం....కాని అందరూ ఒకే ముద్దకు రేపు బలి కావడం సరికాదు. నాతోపాటు అడవికి వచ్చే వారుండండి. రేపు రాత్రి తిరిగి వత్తురుగాని."

ఆ మాట ప్రకారమే పలువురు అతని వెంట వెళ్ళారు. తక్కిన వారు పల్లె చేరారు.

అబద్ధం కాలేదు అప్పు చెప్పిన మాటలు. తెల్లవారుజామున

సాయుధ పోలీసులు ప్రభాత ఫేరీ నడిపారు; బాకా: లెఫ్ట్ - రైట్, లెఫ్ట్ - రైట్; ఎబౌట్టర్న్!

అటు తర్వాత నంబియారు సేవకులు సిద్ధ పరచిన అల్పాహార స్వీకారం. దాని తర్వాత జట్లు జట్లుగా చెదరి, వేట - మనుష్యులవేట. వారు గుడిసెలలో దూరారు. ఆడపిల్లల కోసం వెతకి హతాశులయి, "నాయకులు లేరు" అంటూ వెలుపలికి వచ్చారు. వాళ్ళు దాచుకొన్న చిల్లర డబ్బులను దోచుకున్నారు. కుండలు, ముంతలను పగులగొట్టారు. బీదలయిన మగవారి గుండెలను తుపాకి మడమలతో పొడిచారు. ముసలమ్మలను తల వెంట్రుకలు పట్టుకొని లాగి వాళ్ళు ఏడుస్తుంటే బొబ్బరిస్తూ నవ్వారు; నవ్వుతూ బొబ్బరించారు. మధ్యాహ్నానికి బలంగావున్న నూరు నూటయాభై మంది మగవారిని పట్టుకొని వచ్చారు. వారిని పోలీసులకు అప్పగించి విందు భోజనానికి కూచున్నారు.

భోజనం తరువాత ప్రారంభమయ్యాయి. మాటలు:

"ఆడవాళ్ళను ఎక్కడ దాచారు?"

"పరుగెత్తిపోయిన మగవారు ఎంతమంది?"

"సామ్రాజ్యవాదం నశించనీ అని ఇప్పుడు అనండి చూద్దాం?"

"పోలీసుల ఒళ్ళు తాకితే ఏమవుతుందో ఇప్పుడు తెలిసిందా?"

దెబ్బలు పడ్డాయి. అవాచ్యమైన తిట్లు దెబ్బలకంటే ఎక్కువ నొప్పి కలిగించాయి. సాయుధ దళంవారు ఆ గుంపునుంచి ముప్పైమంది రైతులను ఏరుకొన్నారు. ఆ రైతులలో చిరుకండని తండ్రికూడ ఒకడు. వారందరిని సంఘ కార్యాలయంలో తోసి, దానినే బందెల దొడ్డిలాగ చేశారు. తర్వాత పల్లెచుట్టూ కావలి ఉన్నారు.

ఆ నాగసర్పాల కావలిని భేదించుకొని ఇద్దరు స్వయం సేవకులు ఆ రాత్రి పల్లెకు వచ్చి సంగతి తెలుసుకొని, వెనుదిరగక ఉండలేదు.

మరుసటి ఉదయం మళ్ళీ బాకా: లెఫ్ట్ - రైట్, లెఫ్ట్ - రైట్, ఎబౌట్టర్న్ !....

సాయుధ దళంవారు అరెస్టు చేసిన ముప్పయి మందిని పోలీసులకు అప్పగించి హోసమర్గానికి పంపాలని అధికారులు తీర్మానించారు. వీడ్కోలు గొప్పగానే జరిగింది. ఖైదీలను వెలుపల నిలబెట్టి సంఘం కార్యాలయం



కప్పుకు సాయుధ దళంవారు నిప్పుపెట్టారు. మంటలు ఆకాశమంటుతున్నప్పుడు అధికారుల అనుమతితో "సంఘం నాశనమగుగాక! బ్రిటిషు ప్రభుత్వం జయించుగాక! జమీందారుగారు నూరు సంవత్సరాలు వర్ధిల్లనీ"! అని నంబియారు సేవకులు నినాదాలు చేశారు. తర్వాత పోలీసులు పగలంతా వస్తుపడి, రాత్రి నిద్రలేని బంధితులను చర్వత్తూరు రైలు స్టేషనుకు నడిపించారు.

ఆ వీడ్కోలు తర్వాత మరల వేట, ఏమీ చిక్కకపోతే ఒక్కొక్కరినే పిలిపించి, చాణక్యుడైన పోలీసు అధికారి విచారణ.

కయ్యూరు బడి కొత్తమాస్టరు వారి యెదుట చేతులు కట్టుకొని నిలబడవలసి వచ్చింది. స్వయంగా నంబియారే పరుగెత్తివచ్చి, "ఈతడు మనవాడు" అని చెప్పినందున అతనికి దెబ్బలు తప్పాయి.

అయినా అధికారి అడిగాడు:

"ఇతడు విప్లవకారుడు కాదనడం నిశ్చయమేనా?"

"నేను భరోసా ఇస్తున్నాను." అన్నారు నంబియారు.

అధికారి ఉపాధ్యాయుణ్ణి ప్రశ్నించాడు:

"ఏమయ్యా, ఈ దినం బడి ఎందుకు నడుపరాదు?"

వణుకుతున్న బడిపంతులు నత్తినత్తిగా జవాబిచ్చాడు:

"పిల్లవాళ్ళు లేరుసార్."

"పిల్లవాళ్ళు లేకపోయినా బడి నడుపాలి."

"అలాగే సార్."

"పరీక్ష దగ్గరపడుతున్నది. ఏమి చేస్తావు?"

"పిల్లవాళ్ళు...."

"పిల్లవాళ్ళను వెదుక్కొనివచ్చి పరీక్షలు నడపాలి."

"అలాగే. అలాగే - సార్!"

"హు! వెళ్ళు!"

అతడు బ్రతికానురా భగవంతుడా అని వెనుదిరిగినంతనే మళ్ళీ పిలిచాడు అధికారి:

"ఏదీ చెప్పు - లాంగ్ లివ్ ది కింగ్!"

"లాంగ్ లివ్ ది కింగ్."

పంతులు పాఠం అప్పగించాడు.

"ఇక బయలుదేరు!"

ఇతరులకు మరొక రీతి ప్రశ్నలు. ఆడవాళ్ళంతా ఎలా మాయమయ్యారు? -అనే పురుము. తల తప్పించుకొన్న ముండావాళ్ళ కోసం గర్జనలు.

"అప్పు - అబూబకర్....ఎలాటి శిక్ష విధించినా చాలదు. వారిద్దరికీ?"

మరొకరోజు గడిచింది. వేట పద్ధతి కూడ మారింది. సాయుధ దళాల పోలీసులు నంబియారు బంట్లు చూపిన కొన్ని గుడిసెలను తగులబెట్టి హోళీపండుగ చేశారు. ఒక చోట కాయిలాపడి పరిగెత్తి పోజాలక ఉండిపోయిన ఒక స్త్రీ పైన నలుగురు జవానులు అత్యాచారం చేశారు. తమను చూచి దగ్గరకు వచ్చి మొరిగిందని ఒక కుక్కను చంపారు.

పల్లె వెలుపలి సరిహద్దులలోనే వున్న చాలమంది ఆకలికి తట్టుకోలేక పోయారు. గుడిసెల నుంచి కనిపించని మంటలయితే వారికి అపారమైన కలవరం కలిగించాయి. ఆ కంగాళి పరిస్థితిలో అప్పు అన్నాడు:

"మీరు పొండి కామ్రేడ్స్! ఇక్కడ వుండి ఏమీ తెలియక బాధపడడంకన్నా, పల్లెలోనే మీరు ఉండడం మేలు."

కొందరన్నారు:

"మీరూ వచ్చి వేయండి అప్పు. అంతమందిని పట్టుకొని పోయారు. వారితో పాటే మనమూ."

"లేదు. నేను, అబూబకర్ ఇంటికి ఇంకా కొన్నినాళ్ళు వెలుపల ఉంటాము. పండితులను, మాస్టరును, మరెవరినైనా చూడటానికి ప్రయత్నిస్తాము."

"కానీ—అలాగే కానీ."

ఆ ఇద్దరు మినహాగా రైతులందరూ పల్లెకు తిరిగివెళ్ళారు.

మరొకరోజు వేటలో, మరి పదిహేను మంది రైతులను అరెస్టు చేశారు. అంత మందీ అప్పు, అబూబకరుల మిత్రులని అత్యధిక హింసకు గురి అయ్యారు. అయినా వారి నుండి కూడా అధికారులకు కావలసిన సమాచారం దొరకలేదు.



"అప్పు, అబూబకర్‌లను పట్టిచ్చిన వారికి పెద్ద బహుమానం!" అని అధికారులు పల్లె అంతటా దండోరా వేయించారు.

అయినా, ఆ ఇద్దరి పత్తా దొరకకనే రోజులు గడిచాయి.

..........

ఏమయినా యుద్ధం వచ్చింది కయ్యూరికి. తాము గెలిచిన పల్లెలో సాయుధ పోలీసు దళాలవారు విజేతలయిన సైనికులవలె ప్రవర్తించారు. వారిని తృప్తి పరచడం సామాన్యమైన ఖర్చు మాట కాదని నంబియారుకు త్వరగా మనసుకు తెలిసింది. మళ్ళీ లభించిన గద్దె కోసం ఆయన చెల్లిస్తున్న వెల అపారం. దీనికి ఒక మితి ఉండాలని రోదించింది ఆయన మనస్సు. దీనికి ముఖ్యమయిన కారణం సాయుధ పోలీసు దళం అధికారి జమీందారుగారి అంతఃపురం వైపు కన్ను వేయడం. పల్లె బీడయిందని, తాము మెచ్చిన ఒకతెను ఆయన అధికారి కోసం వదలవలసి వచ్చింది. ఆ నష్టాన్ని ఆయన ఎంతో ఆవేదనతో అనుభవించారు. రాజ్యం తనకు వశపరచి ఇక వీరు వెళ్ళిపోరాదా—అని గొణుక్కున్నారు.

కాని, సాయుధ పోలీసులు వెళ్ళే స్థితిలో లేరు. వారు భోజనం, అల్పాహారం తక్కువగా కనిపించరాదని గ్రామంలో కనిపించిన కోళ్ళనీ, గొర్రెలను, పందులను పట్టి తెప్పించారు. బియ్యం వారి శిబిరాలకు తరలించారు. అరటి గెలలను నరుక్కుపోయారు. చెట్లమీద యింకా మిగిలిన పండ్లను, కాయలను కొల్లగొట్టారు.

తేజస్విని నది వారి జలక్రీడలతో విసిగిపోయింది....

—తర్వాత కార్యక్రమం ఏమిటని సాయుధ పోలీసు దళం అధికారిని అడుగడానికి బయలుదేరిన నంబియారు ప్రశ్నను ఉచ్చరించే ధైర్యం లేక "ఆ కుక్కలు రెండూ చిక్కనేలేదు!" అన్నారు.

"చూద్దాం. ఎన్నాళ్ళు తప్పించుకొంటాయి. కాని, మేమేమో వాటిని పట్టుకొని కాని ఇక్కడి నుంచి వెళ్ళం."

తమ కష్టకాలం ఇంకా పొడుగయ్యే సూచన తెలిసి నంబియారు చల్లబడ్డారు. వచ్చిన వారికి సిగరెట్లు ఒదిగించి ఒదిగించి చాలయి, తాము సిగరెట్టు తాగడమే మానుకొన్నారు ఆయన. ఊరికే కూర్చుని ఆలోచించి, ఆలోచించి ఆయన అన్నారు :

"వారిద్దరూ వేరే వూరికి పరిగెత్తిపోయి వుండవచ్చు."

తాగుడు కొంచెం ఎక్కువయి మత్తెక్కిన ఆ అధికారి అన్నాడు:

"నీ వెందుకయ్యా భయపడుతావు ? మే మింత మంది వున్నప్పుడు ఎందుకయ్యా బెదురు ?"

తమ మర్యాద ఏకవచనం ఘట్టానికి దిగింది కదా అని నంబియారు ఎంగిలి మింగి చల్లబడిపోయారు.

అతిథి సత్కారంచేసి అలిసిపోయిన జమీందారు గోడుచూచి చిరునవ్వు నవ్వి, సాయుధ దళంకన్నా తానే మెరుగని చూపుతూ పోలీసు అధికారి అన్నాడు :

"నేనేమో రేపు బయలుదేరుతాను. తర్వాతి కార్యక్రమానికి ఏర్పాటు చేయాలి. మీకు కొంచెం బరువు తగ్గుతుంది."

నవ్వాలని నంబియారు ప్రయత్నించారు. కాని దానికి మారు ఏడుపు వచ్చింది.

"ఆ నంబూదిరి చూడండి. రానేలేదు. నీలేశ్వరంలోనే వున్నాడు." అని తన వ్యవసాయ బంధువును నంబియారు ఆడిపోసుకొన్నారు. వచ్చిన వారిని చూచుకొనే బాధ్యత నుంచి నంబూదిరి తప్పించుకొన్నారని నంబియారుకు బ్రహ్మాండమైన కోపం వచ్చింది.

పోలీసు అధికారి కొంచెం గొంతు తగ్గించి అన్నాడు :

"ఏమయినా వర్షాకాలం వరకు. వర్షాలు పడ్డ తర్వాత సాయుధ దళం ఇక్కడ వుండడం పడదు."

అయితే ముంగారు వానలు పడడానికి దీర్ఘమయిన ఒక నెల ఉంది ఇంకా. నంబియారు ఇంటి నుంచి వెలుపలికి వచ్చినప్పుడల్లా నల్లటి మబ్బులు కనిపిస్తాయేమో అని పడమటి వైపు చూచేవారు.



# 3

అప్పు, అబూబకర్ ఒళ్ళంతా కళ్ళయి ఎదురు వస్తున్న అపరిచితు లందరూ గూఢచారులేమో అని సందేహపడుతూ, పగలు కొండకోనల దారిపట్టి, రాత్రి రాజమార్గం పట్టి తలచేరి చేరారు. అది, అబూబకర్ కార్మికోద్యమ వీరుడుగా రూపొందిన వూరు. వారు చీకటయ్యే వరకు కాచుకొని వుండి, తర్వాత రాత్రి పాఠశాలకు కబురు పంపారు. అక్కడి నుంచి అబూబకర్ సావాసగాడు ఒకడు వచ్చాడు. పత్రికల మూలంగా అప్పుడే అంతా తెలుసుకొన్న అతనికి ఏమీ వివరించ నవసరం లేక పోయింది. బడలికతో ఎండిపోయిన ముఖాలు, వారు ఎలా వచ్చారనే దాన్ని చాటి చెప్పాయి.

"మేము మాస్టరును యిప్పుడే చూడవలసి వుంది." అన్నాడు అప్పు.

"నీవు ఎవరు?" - అని అతడు అడుగలేదు. తలవూపి అత డన్నాడు:

"మీరు రావడం ఒకరోజు ఆలస్య మయింది. నిన్ననే మాస్టరు ఇక్కడ నుంచి వెళ్ళారు."

"ఎక్కడికి?"

చెప్పాలా వద్దా అని అరక్షణం అతడు ఊరికే వుండి జవాబు చెప్పాడు:

"అజ్ఞాత వాసానికి-అండర్ గ్రౌండ్ వెళ్లారు. మీ వూరి గలాటాకు సంబంధించే ఆయన పేరున వారంటు వెలువడినట్టుంది."

అప్పు తల దించి, నేలను చూచి, తల ఎత్తాడు.

"ఆయన ఇప్పుడు దొరకడం సాధ్యమే, కాదంటారా?"

"ఆయన ఈ ఊళ్ళో లేరు. మీ వైపే వెళ్ళారు."

"మరెవరైనా? పండితులు—"

దృఢమయిన ధ్వనితో జవాబు వచ్చింది:

"లేదు. ఇప్పుడు ఊళ్ళో ఎవరూ లేరు కామ్రేడ్."

అప్పు అబూబకర్ వైపు తిరిగి అన్నాడు:

"అలా అయితే ఇక్కడ మనకిక పనిలేదు. బయలుదేరుదాం."

అబూబకర్ మిత్రుడన్నాడు:

"తలదాచుకోవాలంటే చెప్పండి. మీ రిద్దరూ వుండడానికి ఏర్పాట్లు చేస్తాము."

అప్పు ఇచ్చింది నిశ్చయ పూర్వకమైన సమాధానం:

"లేదు మేము ఊరికి పోవాలి."

అప్పు అలా అన్న వెంటనే, ఏమిటో ఆలోచించి అబూబకర్ వైపుచూచి అన్నాడు:

"నీవు కావలిస్తే ఇక్కడుండు, కామ్రేడ్."

ఆ ఆలోచన అవసరమే లేదన్నట్లు అబూబకరు తక్షణం జవాబు చెప్పాడు:

"లేదు. నేనూ నీ జతలోనే వస్తాను నడు."

...............

దారి ఖర్చుకని వారు కొంచెం డబ్బు తీసుకుని, అర్ధరాత్రి రైలులో గుర్తు చిక్కనట్టు ముఖం మరుగుచేసి, త్రికరపురానికి పయనమయ్యారు. అక్కడ రైలుస్టేషన్ ఎదుట మలుపు నుంచే దూకి ఊరు చేరారు.

చందు లేడు. అతన్నీ ఆ వూరి మరొకన్ని అరెస్టు చేశారు. చందు చెల్లెలు — చిరుకండని భార్య అప్పుడే అక్కడికి చేరింది. వెలుపల వెలుగు పడుతుండడం చూసి ఆమె అన్నది :

"లోపలికి రండి. పగలు గూఢచారులు ఇక్కడ ఎదురుగా కావలి వుంటున్నారు ఎవరన్నా రావచ్చు అని. ఇక్కడ వేరే ఎవరి యిల్లయినా మీకు తెలుసా!"

అప్పుకు తెలియదు. అతడు అన్నాడు:



"లేదు. మీకు ఇబ్బంది కాకపోతే, పగలు ఇక్కడే వుంటాము. రాత్రి మేము నీలేశ్వరానికి పోవాలి."

చందు తల్లి అన్నది:

"మాకు ఎలాంటి ఇబ్బంది? చందు ఒకటి మీరొకటేనా? మీరంతా నా బిడ్డలే కాదా? ఇక్కడుంటే మీకు ఏమయినా అపాయం అయ్యేనని నా కుమార్తె అలా అన్నది."

అపాయం వుందనడం నిజమే. అయితే వేరే స్థలం లేదు. అందువల్ల అప్పు, అబూబకర్ పగలు అక్కడే ఉన్నారు. రాళ్ళు, ముళ్ళు తగిలి, బొబ్బలయి పగిలి, వాచి, మండుతున్న పాదాలను వేడి నీళ్ళతో కడిగి నూనె రాచారు. భోజనం చేసి నిద్రపోయారు. ఆ పగలల్లా ఎక్కువసేపు తలుపు వద్దనే కూర్చున్న చిరుకండని భార్య, ఆమె తమ్ముడు వారికి కాపలా వున్నారు.

అప్పు లేవగానే ఏవేవో ప్రశ్నలు వేద్దామని ఆమెకు అనిపించింది. ఎన్ని ప్రశ్నలు? ఒకటి, రెండు, మూడు—నూరు, లెక్కకు అందనన్ని. అయితే చీకటి పడిందేమోనని అప్పు గాభరాపడి లేచి, కళ్ళు నులుము కొన్నప్పుడు ఆమె ఏమీ అడగలేదు.

వారు పెరట్లోకి దిగి, ఇంటి దడి దాటి వీధిచేరి, మళ్ళీ నడిచారు. కాళ్ళు వారిని మోసుకొని పోయాయో, వాళ్ళు కాళ్ళను ముందుకు లాక్కుంటూ పోయారో చెప్పడం కష్టం.... చర్వత్తూరు.... తర్వాత ఉత్తరానికి నడిస్తే నీలేశ్వరం. అడ్డంగా తేజస్విని, చీకట్లో రైలువంతెన మీద నడవడం అపాయం. ఆ అపరరాత్రిలో నదిని దాటించే పడవ వాడెవడు? చివరకు ఒకడు ఒక రూపాయి ఇస్తే తెప్ప నడుపుతా మన్నాడు. అప్పుడు వాళ్ళవద్ద మిగిలిందే రూపాయి చిల్లర. "సరే" అన్నాడు అప్పు.

తెప్ప నదిప్రవాహం దాటగానే పడవవాడు అడిగాడు:

"ఏ వూరు మీది? మిమ్మల్ని ఎక్కడో చూచినట్టుంది."

సముద్రం నుండి వచ్చే తేమ నిండిన ఉప్పుగాలికి పెదవులు సవరించుకొని అప్పు అన్నాడు:

"త్రికరపురం. ఒకరికి కాయిలా. డాక్టరును పిలవడానికి నీలేశ్వరానికి పోతున్నాము...."

ఆ పడవవాడు దానినెంత నమ్మాడో ! నమ్మలేదో !

ఒడ్డు చేరగానే పడవవాడు డబ్బు ఇవ్వడానికి వచ్చిన చేతిని అడ్డగిస్తూ, నెమ్మదిగా అన్నాడు :

"వద్దు, మీరు వెళ్ళండి."

పడవవాడు తనను గుర్తు పట్టాడనడం వారికి స్పష్టమయింది. ఆ విషయంలో ఎలాటి సందేహమూ వద్దన్నట్టు పడవ వాడు మళ్ళీ అన్నాడు:

"చేతి గడియారం జేబులో పెట్టుకో కామ్రేడ్. దానిని చూచి ఎవరయినా...."

చివరి పదాలను గాలి మింగివేసింది. పడవ వానికి ధన్యవాదాలు చెబుదామన్నా గొంతు పెగలలేదు. అప్పు, అబూబకర్ – ఇద్దరికీ. వాళ్ళు ముందుకు నడిచారు. అప్పు చేతి గడియారం విప్పి మాస్టరును తలుచుకొంటూ జేబులో పెట్టుకొన్నాడు.

నీలేశ్వరంలో, మాస్టరు సాధారణంగా బసచేసే ఇంటికి వారిద్దరూ నడిచారు. రెండుసార్లు సంకేతంగా సద్దుచేసి, తలుపు తట్టిన మీదట ఇంటివాళ్లు తలుపు తెరిచారు. కాని అక్కడ వారికి లభించింది బెదురు బెదురయిన స్వాగతం. ఇంటివాళ్ళన్నారు:

"మీకింకా తెలియదా? మీ రెందుకు వచ్చారు ఇక్కడికి? మాస్టరును నిన్న సాయంకాలం ఇక్కడ అరెస్టు చేశారు. ఎవడో పట్టించి ద్రోహం చేశాడు. మీరు వెళ్ళండి త్వరగా వెళ్ళండి."

అయితే, ఎక్కడికి పోవాలి? పరుగెత్తి వస్తున్న పగటిపూట వాళ్ళు ఎక్కడ వుండాలి?

వివేచన, సామర్థ్యం లేక తలుపు ద్వార బంధానికి ఆనుకుని నిలుచున్న అప్పుతో ఇంటివాళ్ళు గట్టిగానే అన్నారు :

"ఇంకా కోడి కూయలేదు. కావలసినంత పొద్దుంది....బయలు దేరండి!"



ఇద్దరూ వీధిలోకి వచ్చారు. పాదాలు నెమ్మదిగా ముందుకు అడుగులు వేశాయి. అప్పుకు కళ్ళ ఎదుట ఐదు పదాలు, నాట్యం చేశాయి. ఇంకా కోడి కూయలేదు....కావలసినంత పొద్దుంది....అబూబకర్ చీకటిలాగే నీరసంగా వున్నాడు. అతడు మౌనంగా అప్పు కుడి ప్రక్కనే నడిచాడు.

ఊరు దాటి హొసదుర్గం దారి పట్టినమీద, తెల్లవారగానే వారు సముద్ర తీరం చేరారు. పశ్చిమ సముద్రం తరగలకు తలఒడ్డి స్నానం చేసి, ఇసుక దిబ్బలమీద, చెట్ల నీడన నిద్ర పోయి ఆకలి దప్పులనే మరచారు.

వారు హొసదుర్గం సమీపించినపుడు ఇంకా అర్ధరాత్రి కాలేదు. రైలుస్టేషను దగ్గరున్న డేరాలోని టూరింగ్ టాకీసు సినిమా ముగిసి, జనం అప్పుడప్పుడే వెలుపలికి వస్తున్నారు. సంతృప్తితో వస్తున్న ఆ జనాన్ని చూసి అప్పు, అబూబకర్ – ఇద్దరికి సంకటం కాకపోలేదు. కయ్యూరు పొగలు సెగలు కక్కుతూంటే, హొసదుర్గంలో నగవులు, వగలూను. అక్కడ కయ్యూరు పుత్రులు జైలులో ఖైదీలయి వుంటే, వీళ్ళు సినిమా చూస్తున్నారు. ఈ జనమంతా స్వాతంత్ర్య మహా యజ్ఞం కోసం ఎన్నడైనా సహకారం నెరపడం సాధ్యమా?— అనిపించింది అప్పుకు. అయినా ఆ జనంతో పాటే తామూ సినిమా నుండి ఇంటికి తిరిగి పోతున్నట్టే నటిస్తూ, ఊళ్ళోకి నడిచారు.

తాము చేరవలసిన ఇళ్ళు చేరినప్పుడు ఇంట్లో దీపం మండుతూంది. "ఎవరు?" అని లోపలినుంచి వచ్చిన ప్రశ్నకు సంకేతపు జవాబు వచ్చిన పిదప ఆ ఇంటి ముసలిది తలుపు తీసింది. గదిలో ఎవరో ఒక వ్యక్తి చదువుతూ కూర్చున్నారు అతడు "రాండి" అని పిలుస్తుండగా, అప్పు ఆయనను గుర్తు పట్టాడు. కొన్ని సంవత్సరాల క్రితం ఆయనం కయ్యూరుకు వచ్చి రైతు దినోత్సవంలో పాల్గొన్నారు.

వచ్చిన వారి వెంట నిలుచున్న ఇంటామెతో ఆయన అన్నారు.

"అవ్వా, వీళ్ళకు భోజనం పెటవా?"

"అదే అడుగుదామని వచ్చాను" అన్నది ఆమె, వీరిద్దరికీ భోజన అయినా అయివుండవచ్చు అని, ఆ సందేహ నివారణ కోసం ఆ ముసలమ్మ

నిలబడింది. అయితే అప్పు—అబూబకర్ ఏమీ చెప్పలేదు. ఆ మౌనాన్ని ఆమె అర్థం చేసుకొంది. "వీరిలో ఒకరిని ముందు చూచాను. రెండోవాడు కొత్తవాడు" అంటూ గంజికి నీళ్ళు పెట్టడానికి లోపలికి వెళ్ళింది.

"ఐదు సంవత్సరాలకు ముందు ఈ ఇంట్లో పండితులను చూచాను" అన్నాడు అప్పు. క్షీణ స్వరంతో పాటు చూపులు ఒకరి నొకరు చూచుకొన్నవి. పరిచయ వాక్యాల అవసరం ఎవరికీ తోచలేదు. ఆయన చూపిన బెంచీ మీద కూర్చుంటూ అప్పు అన్నాడు :

"మాస్టరును చూడడానికని నీలేశ్వరానికి వచ్చాము."

ముందు మాటలు అనావశ్య మనుకొని ఆయన అన్నారు :

"మాస్టరు అరెస్టు కావడం పెద్ద నష్టం. మాతోపాటు పనిచేసే వాడే ఒకడు ద్రోహం చేశాడు."

"కయ్యూరు పరిస్థితి తెలియ చేద్దామని వచ్చాము."

"కయ్యూరి పరిస్థితా ? ఎన్నాళ్ళయింది మీరు వూరు వదలి ?"

"కయ్యూరిలో సంఘటన జరిగిన దినమే మేము అజ్ఞాతవాసానికి వెళ్ళాము."

ఆ మాటలలో సూక్ష్మంగా ఆత్మాభిమానం కనిపించింది.

"అది సరే. కయ్యూరు సంబంధం లేకుండా ఎన్నాళ్ళయిందేమిటి ?"

"నాలుగు నాళ్ళు !"

"అలా అయితే కయ్యూరు పరిస్థితి మీకు చెప్పవలసిన వాణ్ణి నేను."

ఆ మాటలు అప్పును, అబూబకర్‌ను గాభరా పెట్టాయి. అబూబకర్ అన్నాడు :

"ఏమి వార్తలు వచ్చాయి ? కయ్యూరిలో ఏమయింది ?"

ఆయన చదువుతున్న పుస్తకం మూసి, కుర్చీ వీపుకు ఆనుకొని, రెండు అరచేతులు జోడించి, నిదానంగా చెప్పుకు పోయారు. సాయుధ పోలీసుదళం కయ్యూరిలో జరుపుతున్న నిరంకుశత్వం నూతన స్వరూపాల వివరాలు తెలిపారు. మండుతున్న సిగరెట్టును ముక్కులో



దూర్చడం, గోళ్ళమధ్య గుండుసూదులు గుచ్చడం, కాళ్ళు, చేతులు బిగించి, నోట్లో అమేధ్యం పోయడం....

"అంత మంది స్త్రీలనూ మీరు ఊరు దాటించటం మంచిదయింది కామ్రేడ్. వాళ్ళు చెప్పిన సంగతులు విన్నప్పుడు నేను మూగవాడయి పోయాను. మీరు అలా చేయడం సామాన్య విషయం కాదు. అలా చేయడంవల్ల మానభంగాల సంఖ్య ఎంతో తగ్గింది."

వాడిన కళ్ళు మరల సజీవాలై నీరు నిండుతున్నట్టు అప్పుకు, అబూబకరుకు అనిపించింది.

అయితే కొత్త అఘాతంగా వచ్చి పడింది తర్వాతి ప్రశ్న.

"మీకు తెలుసా ? ప్రభువును, దుబ్బోణ్ణి నేడు ఉదయం పట్టుకున్నారు."

"ఆఁ !"

"నే నిప్పుడు చెప్పిన కయ్యూరు సంగతంతా వాళ్ళు నిన్న రాత్రి పంపిన రిపోర్టు. మిమ్మల్ని చూద్దామనే ఉద్దేశంతోనే వాళ్ళు అవతలికి వెళ్ళారు. దుఃఖానికి మితే లేదేమో అని అప్పు గాఢంగా నిట్టూర్చాడు. ఆయన మాటలు కొనసాగించారు :

"ఇక్కడ సర్కారు ఠాణానుంచి లోపలి వర్తమానం మాకు అందింది. కయ్యూరు ఉదంతం పేరుతో ఈ ప్రాంతపు రైతు ఉద్యమ ప్రముఖుల నందరినీ పట్టుకోవాలని ప్రభుత్వం పథకం. వారు పెట్టుకొన్న లక్ష్యం అరవై యిద్దరు. రైతులు, కార్యకర్తలు కలిసి మొత్తం ఇప్పటికి యాభై ఎనిమిది మందిని పట్టుకున్నారు. మీరిద్దరూ చేరితే అరవై. అటు తర్వాత వారికి కావలసినవారు ఇద్దరు. వారిద్దరు ఎవరని వారికే సరిగా తెలియదు ! పేర్లు చూస్తే రెండూ పండితులు పెట్టుకొనే మారుపేర్లే...."

అప్పు, అబూబకర్ మౌనంగా వుండడం చూసి ఆయనే అన్నారు :

"కయ్యూరు రైతుల ఇప్పటి కష్టాలకంతా కారణం అప్పు. అబూబకర్ ఇద్దరేనని ప్రచారం చేస్తున్నారు. మీరిద్దరు చిక్కిన వెంటనే, పోలీసుదళం అక్కడినుంచి బయలుదేరుతుందట. బయలుదేరాలని ఆజ్ఞ కూడా ఉందట."

అప్పు వెనక్కు వాలి, గోడకు తల ఆనించి అడిగాడు :

"అలా అయితే అంతా ముగిసిపోయిందని అర్థమా ?"

"ఏమిటి అలా అంటే ? ఇది ఆరంభం - అంటే, ఈ ఘర్షణలో ఉక్కుదేలే రైతులే రేపు ఇంకా పోరాటాలు కొనసాగిస్తారు."

"అది రేపటి మాట. నేడు సద్య ఏమిటి లేదా ?"

కొంచెం విసుగుదల ధ్వనితోనే వారిద్దరు అన్నారు :

"మీరు ఎందుకో పసిపాపల్లాగ మాట్లాడుతున్నారు కామ్రేడ్ ? జనతా సమరమంటే ఇలాగే, వేయిచోట్ల నిప్పురాజి మిణుగురులు వ్యాపిస్తే, రేపు పెద్ద మంట అవుతుంది."

"అంతకుముందే మిణుగురులు ఆరిపోతే ?"

"ఎప్పటికీ ఆరదు. జనుల హృదయాలలో ఎప్పుడూ ఉండనే వుంటుంది. అది జ్వలించడానికి ప్రేరకశక్తి ఒకటుంటే సరి—"

ముసలమ్మ వచ్చి పిల్లలను అదలించే రీతిగా అన్నది :

"ఇక మాటలు చాలు. వచ్చినవారు గంజి తాగి విశ్రాంతి తీసుకొని, మీరూ పడుకోండి. రేపు లేచి కబుర్లు ప్రారంభించవచ్చు. అదేమి ముగియనిచర్చో! ఆ దేవునికే తెలుసు !"

....గంజి తాగి, దీపం ఆర్పి అప్పు, అబూబకర్ దగ్గిరగా పడుకొన్నారు. నిద్ర రాలేదు. యోచన చేసి చేసి వారి మెదడు వేడెక్కింది.

చాలా పొద్దుపోయిన తర్వాత అప్పు నెమ్మదిగా అన్నాడు :

"మనం కయ్యూరికి వెళ్ళిపోవడమే మేలు — కదూ కామ్రేడ్ ?"

"నేనూ అలానే యోచన చేస్తున్నాను, అప్పు."

"రేపు ఆయనకు తెలిపి వెళ్ళిపోదాము."

"అలాగే."

తెల్లవారి తమ అభిప్రాయం తెలిపినప్పుడు నాయకు లన్నారు :

"నేనయితే ఈ సలహా ఇచ్చేవాడినో, కాదో ! ఏమి చెప్పాలి అది నాకింకా స్పష్టం కాలేదు. వేరే పనిమీద వెళ్ళిన పండితులు చాల దూరంలో వున్నారు. ఆయన అభిప్రాయం ఇప్పుడు తెలిసేట్టు లేదు. ఒక విధంగా మీరు చెప్పేది సరి. రైతులకు మీ మీద విశ్వాసం ఎక్కువవుతుంది. కాని న్యాయాలయం వ్యవహారం, జరుగవలసిన పని. ఇదంతా ఆలోచించినప్పుడు మీరు అజ్ఞాతవాసంలో వుండడమే మేలనిపిస్తున్నది."



అయితే జనం దుఃఖం చూచికుత కుత లాడుతున్న అప్పు హృదయం పట్టుదలతో అన్నది :

"క్షమించండి కామ్రేడ్ ! మా జనం దగ్గరికి తిరిగి వెళ్ళాలని మేము నిర్ధారించుకొన్నాము."

ఆయన ఒక క్షణం మౌనంగా వుండి అన్నారు :

"కానీండి అలాగయితే. ఈ రీతిగా తీర్మానం చేసుకొన్నారని జైలుకు చెప్పి పంపనా !"

"అంతమాత్రం చేయండి."

అరెస్టు తప్పదని తెలిసినా కయ్యూరు చేరేవరకు తాను సురక్షితంగా వుండాలని అప్పు, అబూబకర్ కోరుకొన్నారు. దేవకితో పాటు పుట్టినింట్లో చేరిన జానకిని, పాపడిని ఒక్కసారి చూడాలి. తన తల్లిని, అవ్వను, తమ్ముళ్లను చూడాలి — అని అప్పు ఆశ. తల్లి బూబమ్మను ఒకసారి చూస్తే బాగుండునని అబూబకరుకు ఆశ. అయితే, ఇద్దరూ ఆ విషయాన్ని మనస్సులోనే యోచించి ఒకరి కొకరు తెలుపుకొనక, ఆ భావాలను మనసులోనే అదిమిపెట్టుకొన్నారు.

చర్వత్తూరు వరకు రైలులో వచ్చి కయ్యూరుకు కాలి నడకన బయలుదేరారు.

ఎదలోని మూగ ఆర్తనాదంతో వారికి సహించరాని వేదన కలిగింది.

కయ్యూరు సమీపించే వేళకు ఎండ తీక్షణమయింది. అడిగేవారు, వినేవారు లేరని పొలాలు నోరు తెరచుకొని పడున్నవి. తాము అనాథ ప్రాణులన్నట్లు కంటికి కనిపించని పచ్చికను వెదకుతూ ఎడ్లు తిరుగులాడుతున్నవి.

ఇదంతా చూస్తూ అప్పు, అబూబకర్ సాయుధ పోలీసు దళం డేరా వున్నవైపు నడిచారు.

వారిని దూరం నుంచే గుర్తు పట్టినవారు నంబియారు సేవకులు. వారు పరిగెత్తిపోయి అధికారికి వార్త అందించారు.

"అప్పు, అబూబకర్ వస్తున్నారు !"

ఇది బహుశ తమ పోలీసు దళంపైన ముట్టడి కావచ్చునని అధికారి దిగ్గున లేని అన్నాడు :

"ఎంతమంది ?"

"ఇద్దరే."

"ఇద్దరా ?"

"హూఁ !"

అధికారి ఆశ్చర్యపడినా, సంతోషంతో పొంగి వారిని ఎదుర్కొనడానికి తన భటులకు ఆజ్ఞ యిచ్చాడు. పదిమంది తుపాకులు బారుచేసి ఎత్తి పట్టుకుని ముందుకు నడిచారు.

మళ్ళీ గుడిసెల తడకల సందుల నుంచి, తలుపుల మరుగు నుంచి, భీత కాతర దృష్టులు ఆ దృశ్యాన్ని చూచాయి. అప్పు, అబూబకర్‌లను గుర్తుపట్టినవారు "అయ్యో!" అన్నారు. ఇక ఒక క్షణంలో గుండ్లు పేలుతాయని చాలామంది కొయ్యబారి పోయారు.

ఎదురు బదురుగా వస్తున్నారు, పదిమంది తుపాకులు గురిపెట్టిన సైనికులు. వట్టి చేతులతో ఇద్దరు యువకులు.

నడక ఇక చాలునని అప్పు, అబూబకర్ నిలబడి పోయారు. చిత్రహింసకు సిద్ధమై నిలబడి పోయారు. సైనికులు వారిని చుట్టుముట్టడానికి ఎంతోసేపు పట్టలేదు. అయితే రైతులను కొట్టి కొట్టి విసుగెత్తి పోయిన సైనికులు వీరిద్దరిపైన చేయి చేసుకోలేదు. ఈ నాయకులు పట్టుబడ్డారనేదే వారికి ఆనంద కారణమయింది.

పట్టుబడ్డ అప్పును, అబూబకర్‌ను సాయుధ దళం వారు అధికారి వద్దకు నడిపించారు.

సాయుధ పోలీసు దళం బాకా మ్రోగి విజయవార్తను చాటింది.

డేరా మీద పెద్ద యూనియన్ జాక్ ఉంది. గాలి లేక ఈ యూనియన్ జాక్ పతాకం వేలాడుతున్నా, శస్త్రాస్త్ర సంరక్షణలో జాగరూకమై వుంది.



# 4

హొసమర్గం నుంచి పోలీసు దళం ఒకటి కయ్యూరికి పోయి అప్పును, అబూబకర్‌ను పిలుచుకొని వచ్చింది. ఆ పోలీసుల దృష్టిలో వారిద్దరూ అజ్ఞాతవాసంలో వున్న విప్లవకారులు. అతి భయంకరులు. సుబ్బయ్యను చంపి అతని పేగులు విసరివేసిన ఆ చేతులు యింకా ఎర్రగా వున్నట్టే వారికి తోచింది. సర్కారుకు ఘోర శత్రువులు వారిద్దరూ. సామ్రాజ్య కంటకులు. వాళ్ళు తప్పించుకొన్నారంటే లోకానికి ఆపత్తు. ఆ ఆపద మొదటి పరిణామంగా ఆ పోలీసులందరి నౌకరీ పోతుంది. అందుకోసం వారు ఆ యిద్దరు ఖైదీల ఒక్కొక్క చేతిని జోడించి బేడీలు వేశారు. మరి రెండు చేతులకు విడిగా బేడీలు వేసి, గొలుసులు తమ చేతులతో గట్టిగా పట్టుకొన్నారు.

ఆ ఊరిలో వున్నది పెద్ద చెరసాల కాదు. విశాలమైన లాకప్పు బందెలదొడ్డి. అక్కడ బంధితులైన యాభై రెండు మంది, తమవైపు వస్తున్న ఇద్దరు బాంధవులను నేరుగా చూచారు. అప్పు, అబూబకర్ బ్రతికి ఉన్నారనే ఊరటతో. ఇప్పటికి తమ నిస్సహాయత చిత్తరువు సంపూర్ణమందని సమాధానం కలిగింది. అందరినీ చూస్తూ, ఆ గుంపులో తండ్రిని వెతుకుతున్న అప్పు కండ్లు మొదట చూచింది మాస్టరును. ఎప్పటిలాగే ప్రశాంతమయిన ముఖముద్ర, వ్యధనిండినా, ఆత్మీయత సూచించే చూపు. ఆయన పక్కనే చిరుకండడున్నాడు. శుభ్రమైన దుస్తులు మురికయ్యాయి. అయితే నిలువు (ఆకృతి) గాంభీర్యానికి ఎలాటి చ్యుతీ లేదు - నూలుగింజంతయినా. చుట్టూ ఉన్న ఒక్కొక్క ముఖమూ పంకటంగా మారిన క్రోధమూ, బీటలువారి కన్పిస్తున్న కాతరతానూ....

వారందరి పరంగానో అన్నట్టు మాస్టరు మృదువుగా వారిని పిలిచారు ;

"రా! అప్పు. రా! అబూబకర్ ! రాండి !"

బందెలదొడ్డి తలుపులు మూసుకొన్నాయి. తాళం పడింది.

లోపల వున్నవారంతా వచ్చిన యిద్దరి చుట్టూ మూగారు. అందరికీ కయ్యూరు సమాచారం విందామని ఆత్రం. అప్పు భావోద్వేగంతో మాట్లాడలేకపోయాడు. గొంతు నరాలు బిగుసుకున్నట్టయింది. అక్కడ, మూలలో, అందరికన్నా వెనుక, అప్పు తండ్రి నిలుచున్నాడు. నిశ్చలమైన, నిర్వికారమైన అతని చూపు కుమారుణ్ణి చూచింది.

ఒక్కొక్కరుగా అంతా కూర్చున్నారు. ఆ నీరవతను భేదిస్తూ, పసివాడయిన కుట్టి కృష్ణుడు వెక్కి వెక్కి ఏడ్చాడు. "ఏడవవద్దు !" అన్నారు పిల్లవాడి ప్రక్కన వున్న వారెవరో.

అప్పు నిదానంగా తనను తాను సర్దుకొని మండుతున్న కయ్యూరు కరుణ కథను చెప్పాడు. అడపా దడపా అబూబకర్ తానూ ఒకటి రెండు మాటలు కలుపుతూ "అది ఇలా" అని స్పష్టం చేశాడు. జట్లుజట్లుగా వేరువేరు రోజులలో వచ్చిన ఖైదీల నుంచి ఎక్కువ విషయాలన్నీ అప్పుడే అందరికీ తెలిశాయి. వారు అప్పు మాటలకు చెవిఒగ్గి "అదంతా నిజం" అనే జ్ఞానాన్ని మరొకమారు ధృవపరచుకొన్నారు.

"ఇప్పటికయినా సంతృప్తి కలిగిందటనా కుక్కలకూ ?" అని ఎవరో అన్నారు కర్కశ ధ్వనితో.

"మొత్తానికి. మనం కయ్యూరుకు తిరిగి పోయేటప్పుడు కోడి పిల్లలను గూడ కొత్తగా కొనుక్కొని వెళ్ళవలసి వుంటుందని తోస్తుంది" అన్నాడు దుబ్బోడు.

ఆ మాటలు విని ఆ సంకట స్థితిలోను కొందరు నవ్వారు.

మాస్టరు నిదానంగా అన్నారు :

"చస్తున్న మనిషిలాంటిది ఈ ప్రభుత్వం. యముడు వచ్చి ఎదురు నిలబడినప్పుడు పటపట కొట్టుకులాడడం ఎక్కువ....మనవారే మన జనంమీద పడడమనేది ఎంత అసహ్యం ! ఆ మేరకు మన వారిని పాలకులు బానిసలుగా, పశువులుగా చేశారు...ప్రభుత్వం అనేది ఎక్క-



డుంది, అది ఎలా పనిచేస్తుంది, అని ఇంతవరకు మనం చూడలేదు. కేవలం జమీందార్లిద్దరే మన కళ్ళకు కనబడేవారు. వారి రక్షణకు ఉండే శక్తి ఎటువంటిదీ అని మన కిప్పుడు తెలిసింది. ఆ శక్తిని పడగొట్టడానికి మన శక్తి ఎలా ఉండాలనేదీ తెలిసింది. ఏమయినా మన పాలిటికి ఇదొక అగ్నిపరీక్ష....దీనిలో మనం నెగ్గి ఒగ్గట్టుగా ఉంటేనే రేపు భూమిమీద స్వర్గం సృష్టించేము...."

దుబ్బోడు లేచి తలుపు వద్దకు వెళ్ళి కమ్ముల సందు నుంచి వెలుపలికి తొంగి చూశాడు. "ఈ దినమన్నా మామగారింటికి పిలుచుకుని పోతారో లేదో ?" అని గొణిగాడు. నిలుచున్న చోటనుంచే మెడతిప్పి అడిగాడు :

"టైమెంత అప్పు ?"

అప్పు అలవాటు ప్రకారం చేయి చూసుకొన్నాడు. అయితే ఎక్కడుంది చేతి గడియారం ? నవ్వేటట్టయింది. దుబ్బోడు మళ్ళీ అడిగాడు :

"ఏమిటి ? చేతి గడియారం లేదేమోయ్ ? ఎవరి కిచ్చావు ?"

"లాక్కున్నారు."

"ఆఁ ఎవరు ? పోలీసులా ? అధికారా ?"

"అధికారే."

"అలా అయితే విసుక్కోనక్కరలేదు."

ఎవరో ఒకరు అడిగారు :

"ఏమిటి అలా అంటే ?"

"ఈ చేతి గడియారంలో టైము చూచే విప్లవం ప్రారంభించారు అని న్యాయస్థానంలో అతడు దానిని హాజరు పరుస్తాడు."

"ఓహో !"

"మన ప్రభుత్వం వచ్చిన వెంటనే న్యాయస్థానం వారు ఈ గడియారాన్ని చారిత్రక వస్తువు అని మనకు తిరిగి ఇచ్చి వేస్తారు."

ఆ మాట విని మాస్టరు మొదలు అందరూ నవ్వారు.

దుబ్బోడు మరొకమారు వెలుపలికి తొంగి చూసి అన్నాడు :

"ఆహా ! వచ్చారు ! చూడవోయ్ అబూబకర్ ! ఎలా వస్తున్నారో లెఫ్ట్-రైట్, లెఫ్ట్-రైట్. ధం-పుస్క్."

అందరి చూపులూ అటు తిరిగాయి. సాయుధ పోలీసుల ఒక పెద్ద పటాలమే వారివైపు వస్తున్నది.

మాస్టరు లేచి నిలబడి చెప్పారు :

"లేవండి కామ్రేడ్స్ ! విచారణ నాటకం మొదటి అంకం ఇప్పుడు ప్రారంభం. మనమిప్పుడు న్యాయాలయానికి వెళ్ళాలి."

మళ్ళీ చేతులకు బేడీలు. పొడుస్తూ వస్తున్న తుపాకుల జోడు వరుసల మధ్య ఒకరి వీపుకు ఒకరు ఆనుకొని నడక....

ఊరి జనమూ వచ్చి చుట్టు మూగారు. ఏ భావమూ స్పష్టంగా తెలుపని చూపులు కొన్ని. కుహనా భయం తెలిపే ముఖ భావాలు కొన్ని....

ఆ చిన్న న్యాయాలయంలో అంతమంది ఖైదీలు నిలువడానికి స్థలం వుండలేదు. ఎత్తయిన స్థలంలో ఒంటరిగా కూర్చున్న వయస్సు మళ్ళిన న్యాయాధీశులు, ఇంటి అరుగుమీద పరుగులు తీసే పాలేరు పిల్లలను చూచినట్టు ఆ ఖైదీలను చూచారు. నాయకులు ఎవరన్న దానిని నిర్ధారించలేక ఆయన అందరికన్నా చిన్నవాడయిన కుట్టికృష్ణుని మీద దృష్టి నాటారు. తర్వాత పోలీసు అధికారి వైపు చూసి, "ఇవ్వండి ఇక్కడ. ఎక్కడసంతకాలు చేయాలి? ఆలస్యం చేయకండి. అన్నారు. వెలుపలగుంపు చేరిన జనాన్ని చుర చుర చూస్తూ, వారిని చెదర గొట్టడానికి ఉత్తరువు చేశారు.

అరవై మంది ఖైదీల పేర్లు చదవడం జరిగింది. ఒక్కొక్కరుగా ఖైదీలు ఊగొట్టారు. న్యాయాధీశుడు వారికందరికీ పదిహేను రోజుల రిమాండ్ ఇచ్చి, మంగుళూరు సబ్‌జెయిలులో పెట్టేటట్టు వ్రాశారు. "సరేనా?" అని అధికారిని అడుగుతూ సంతకం చేశారు. "వారికి భోజనం పెట్టవలసివుంటే, దానిని ముగించి పిలుచుకొని పోండి," అన్నారు. అక్కడికి ఆ దృశ్యం ముగిసింది.

ఖైదీలు నమస్కారం చేసే సంప్రదాయం పాటించక వెలుపలికి పోతున్నప్పుడు, ఇలాటి వారే నాయకులయి వుంటారని తాము వూహించిన వారిని న్యాయాధీశులు మరీ మరీ చూచారు.



....భోజనం పెట్టించే యోచనలేక ఖైదీలను సరాసరి రైల్వే స్టేషన్‌కు పిలుచుకొనిపోయే సూచన కనిపించింది. దుబ్బోడు కోపంతో మండిపోయినట్టుగా నటిస్తూ అరిచాడు:

"ఈ ఆటలు సాగవు. మొదట భోజనం, ఆ మీదట ప్రయాణం. అబూబకర్; ఆర్డరు యివ్వు- హాల్ట్!"

అబూబకర్ ఆదేశం లేకనే ఖైదీలు ఆగిపోయారు. పోలీసొకడు తుపాకి మడమతో దుబ్బోడిని కొట్టాడు. పిడికిలితో ముఖాన్ని బలంగా గుద్దాడు, "థూ" అన్నాడు దుబ్బోడు' ఉమ్మి ప్రసాదానికి మరు కానుకగా మళ్ళీ దెబ్బలు పడ్డాయి. తక్కిన ఖైదీలు దీనిని చూస్తూ నిస్సహాయులై నిలుచున్నారు.

"నడవండి ముందుకు" అన్నాడు అధికారి. అయితే ఖైదీలు ముందుకు అడుగు వేయలేదు. "భోజనం అయిన మీదట బయలు దేరుతామండీ.... మేము పసుపడి దారిలో చస్తే సంఖ్య అరవయికి తగ్గి మీ తలకు వచ్చీని తప్పు?" అన్నాడు కోరడు, మాస్టరువైపు చూస్తూ.

దాని ఫలితంగా మళ్ళీ బందెల దొడ్డికి నడక. అక్కడ కొంచెం సేపటికే మా చెడ్డ బియ్యం, ఉడికించిన గంజినీళ్ళ భోజనం.

దుబ్బోడు నాలుక చప్పరిస్తూ "మృష్టాన్న భోజనం" అంటూ వట్టిగానే త్రేన్చి "మంగళూరికి కాకపోతే బెంగుళూరుకు పిలుచుకొని పోండి ఇక?" అన్నాడు.

"నీ ఉపకారంతో ఇంతయినా అయింది మహానుభావా" అని ప్రభు అన్నాడు.

"ఇలాటి ఎన్నో ఉపకారాలు చేద్దామని మనస్సులో వుంది. అయితే ఏమి చేద్దాం చెప్పు? ఉదాహరణకు బీడీలు. సాధ్యమయితే నేనిప్పుడు అందరికీ ఒక్కొక్క బీడి ఇప్పించేవాడిని. అబూబకర్ తలచేరిలో వున్నప్పుడు బాగా కట్టేవాడట బీడీలు. ఇప్పుడు మరిచి పోయాడో ఏమో! ఏమోయ్, రాలిన ఆకులు తెచ్చిస్తాను. బీడీలు కడుతావా?"

ఆ మాటలతో బయలుదేరి ప్రవహించే నవ్వుల ప్రవాహంలో ఈదులాడుతున్న ఖైదీలకు మనస్సు తేలికయింది.

అంతలోనే ఆజ్ఞ వినిపించింది:

"లేవండి ఇక! లేవండి! రైలుకు ఆలస్య మవుతుంది."

....మూడవ తరగతి పెట్టెను ఒకదానిని ఖాళీ చేయించి ఖైదీలను దానిలో నింపారు. కట్టివేసిన అరవై మందికి కావలిగా బారుచేసిన తుపాకుల వలబై మంది పోలీసులు ఒకటిగా ప్రయాణం చేశారు.

ఆ బండినుంచి అక్కడ దిగిన ప్రయాణీకులు, తక్కినవారు గుంపులు గుంపులుగా రైలు స్టేషనులో నిలుచున్నారు. వారి మధ్యన గూఢచారులూ దూరారు. "కయ్యూరు, కయ్యూరు" అనే గుసగుసలు గాలితోపాటు రైలుస్టేషను అంతటా సంచరించాయి. జనం ముఖంలో ఎలాటి భావమూ కనబడనీయక అక్కడే నిలబడ్డారు.

వారినందరినీ పరికించి చూచారు మాస్టరు, చిరుకండడు. మాస్టరుకు పరిచయమున్న వారూ అక్కడ వున్నారు. కాని, పరస్పరం మాటలకు.... కంటి సైగలకు కూడా.... అక్కడ అవకాశం ఉండలేదు.

బండి ఉత్తరదిశగా కదలింది. ప్రతిక్షణానికీ మరింత దూరమయింది కయ్యూరు.

ఒకే రకమైన విసుగు అందరినీ ఆవరించి హింసించింది. ఎండకు చెమర్చిన దేహాలు గాలికి అలిసిపోయి వారికి కునుకు పట్టింది. పోలీసులనూ బాధించింది కూరుకు.

కాసరగోడు రైలుస్టేషను.... మళ్ళీ మెలకువ....

"ముందుకయితే మలయాళం తీరా తక్కువ." అన్నారు మాస్టరు.

అధికారి మరొక తరగతి పెట్టెలో ప్రయాణం చేస్తున్నందున ధైర్యంగల ఒక పోలీసు పత్రిక కొని చదువ సాగినాడు. ఖైదీల కళ్ళన్ని ఆ పత్రిక మీదే నాటాయి.

"అంతా పత్రిక చదువడంవల్లే ఆరంభమయింది కదూ చిరుకండా?" అన్నాడు దుబోబ్బడు.

చిరుకండడు జవాబుగా చిరునవ్వు నవ్వాడు. కాని, ప్రభు అన్నాడు:

"మాస్టరుగారూ ఒకసారి ఆ పత్రిక ఇవ్వమని అడగండి. మన విషయం ఏమైనా ఉందేమో!"

పోలీసు చదివి ముగించి ఆవులించాడు. పత్రికను మడిచి దీల వైపు విసిరాడు. అది చేతి బేడీల బలత్కారంతోపాటు మాస్టరును చేరింది.



ఆయన పుటలు తిరగవేస్తూ మనసులోనే చదువుకొన్నాడు.

చిరుకండనికి రాత్రి పాఠశాల జ్ఞాపకం వచ్చింది. అక్కడయితే గట్టిగా చదివిన దానిని రైతులు వినేవారు. అటు తర్వాతనూ అంతే. ఒకరు గట్టిగా చదివితే తక్కినవారు చెవి ఒగ్గడమే పద్ధతి. అయితే ఇక్కడవారు చెరలోనివారు— ఆ పోలీసు.... అతడు పత్రిక ఎందు కిచ్చాడు?

చిరుకండని దృష్టి ఆ పోలీసుమీద నాటింది. యువకుడు. చదువు గుర్తు వున్నది కళ్ళలో. అతడూ సగం మూసిన కళ్ళతో ఒక్కొక్కరుగా ఖైదీలను చూస్తున్నాడు. ఒకమారు అతని చూపు, చిరుకండని చూపు కలుసుకున్నాయి. అరక్షణం అలానే ఒక దానినొకటి ఎదిరించి నిలిచాయి. అతని పెదవులమీద సూక్ష్మంగా నవ్వు పారాడినట్టు చిరుకండనికి కనిపించింది.

ఆ భావన వెంటనే యిది భ్రమ అని తోచింది. మళ్ళీ ఆలోచన. ఉండినా వుండగూడదా? కయ్యూరి నుంచి సైన్యంలో చేరిన వారిలోనే మనవాళ్ళు లేరా? అలాగే పోలీసు దళంలోను అందరూ సుబ్బయ్యలాగే వుండాలి— అనేదేమిటి? "పోలీసులు చాలవరకు రైతుబిడ్డలే అనడం గమనార్హం." పుస్తకంలో చదివిన వాక్యం. "అయితే వారు జనంతో కలవడం చివరికి. విప్లవ విజయం సన్నిహితమయినకొద్దీ పోలీసులు, మిలిటరీ అంతా ప్రజల పక్షం చేరుతారు...."

మాస్టరు చదవడం ముగించి పత్రికను చిరుకండని వద్దకు పంపారు.

ఒక పోలీసు అప్పుడే ఆ పత్రికను చూచిన వాడివలె ఆజ్ఞాపించాడు:

"ఎవరది? పత్రిక చదువరాదు."

వాడి పక్కనే వున్న మరొక పోలీసన్నాడు:

"పోనీ లేవోయ్!"

తాము చదివిన దాని సారాంశం మాస్టరు పక్కన వున్నవారికి వినిపించారు. అన్ని వార్తలు చాలా త్వరగా అందరి సొమ్ము అయింది.

మదరాసు రాష్ట్రమంతటా రైతుసంఘాన్ని చట్ట విరుద్ధమని ప్రకటించారు. హొసదుర్గం తాలూకాలో సభలు, ఊరేగింపులు నిషేధించే 144 వ నిబంధన మరొక నెలపాటు అమలులో వుండాలని ఆజ్ఞ అయింది.

రైతు నాయకుడు అప్పు, స్వయంసేవకదళ నాయకుడు అబూబకర్ వీరిద్దరు పట్టుబడ్డారనే వార్తా ప్రకటిత మయింది.

మంగలపాడి రైలుస్టేషను. ఎండ కొంచెం తగ్గి కడలి వైపునుంచి మెల్లగా గాలి వీచసాగింది.

"మాస్టరుగారూ! కణ్ణనికి గొంతు నస పెడుతున్నదట!" అన్నాడు దుబ్బోడు.

దుబ్బోని సూచనకు తన ప్రతిఘటన లేదన్నట్టు కణ్ణడు మాస్టరు ముఖం చూచాడు.

"అలా అయితే అడిగి చూడు." అన్నారు మాస్టరు.

"జమాదారు సాహెబ్, ఒకటి రెండు పాటలు పాడవచ్చునా?" అని కణ్ణడు గట్టిగా అడిగాడు.

అయితే అక్కడ జమాదారు లేరు. తానే ముఖ్యమైన వాణ్ణను కొన్న నడివయస్సు పోలీసు ఒకడు గర్జించాడు:

"కూడదు. ఇదేమిటి సంగీత కచ్చేరి అని అనుకున్నారా?"

ప్రభు రాగాలు తీస్తూ అన్నాడు:

"లేదు సార్ ఒకే ఒక సినిమా పాట."

పోలీసులు ఊరికే ఉన్నారని "జ్ఞానాంబిక" అనే చిత్రంలోని ఒక పాటను కణ్ణడు ఆరంభించాడు.

"చిన్నగా పాడు. వెలుపలికి వినిపించ కూడదు?" పోలీసు ఆజ్ఞ.

"చిన్నగానే పాడాడు కణ్ణడు. అదయిన తర్వాత ఒకజానపదగీతం. ఒక పల్లెపట్టు సొగసు గత్తెను వలచడానికి ఒక సొగసుగాడు కట్టిన కవిత. అటు తర్వాత ఒకదాని తర్వాత మరొకటి. నవకవుల నూతన భావనల గీతాలు, శోక - సంతాపాల, క్రోధ - ఆహ్వానాల గీతాలు. ధ్వని హెచ్చింది. అది కిటికీల నుంచి వెలుపలికి పోయి, ముందుకు పయనిస్తున్న రైలుకు పరాఙ్ముఖంగా వ్యాపించింది. వరి వంపులు వచ్చినప్పుడు ఇతర ప్రయాణీకులకూ వినిపించింది.... లోపల నిగళబద్ధులైన వారిని ఒక్కటిగా కలిపింది.

ఇద్దరు ముగ్గురు పోలీసులు అరిచారు:

"ఇక చాలు!"



"అలాగే, చివరిది ఒకటే."

అది మార్చింగ్ గీతం. కణ్ణని గొంతుకతో ఖైదీలందరి గొంతుకలూ కలిశాయి.

పోలీసులు గాబరాపడి దానిని ఆపాలని అరిచారు:

"ఆపండి! ఆపండి! ఏమనుకున్నారు? మీరు ఖైదీలా? మేము ఖైదీలమా?"

ఆ రైతులు నవ్వుతూ పాడారు. ఉబికి వస్తున్న ఉత్సాహంతో పాడారు. స్వరం గగనానికి ఎక్కుతున్నట్టు.... తామందరు దేగలయి స్వచ్ఛందంగా విహరిస్తున్నట్టు పాడారు.

అది ముగిసిన తర్వాత పోలీసుల నోటి నుంచి తిట్లదండకం బయలు దేరింది. రైతులు నవ్వారు. అంతే.

దుబ్బోడు అన్నాడు:

"ఆహా! కణ్ణని జతలో వుంటే నిశ్చింతగా అండమాను వరకు పోవచ్చు."

—మంజేశ్వరంలో రైలు నిలిచినప్పుడు పోలీసు అధికారి ఆ పెట్టె వద్దకు వచ్చి చిందులు తొక్కాడు:

"ఎవర్రా పాడింది? మీరు దాన్ని వింటూ నిలుచున్నారేంరా కుక్కల కొడుకుల్లారా? థూ మీ అమ్మ...."

రైతులలో ఒక రన్నారు:

"ఆ పాటల్లో ఏమీ లేదు సార్. కావలిస్తే ఇంకోసారి పాడి చూపుతాము వినండి."

"మూయి నోరు."

సాయంకాలానికి మంగుళూరు. అప్పుడింకా ఆరు గంటలు.

రైలు స్టేషన్ నుంచి పట్టణానికి ఎక్కి వచ్చిన దారినిండా కంకర రాళ్ళు. ఎడమ వైపున ఆస్పత్రి నుంచి పారుతూ వస్తున్న మూతలేని మురుగు కాల్వ నుంచి భరింపరాని చెడు కంపు.

"ఇస్సీ! థూ!" అన్నాడు కుట్టి కృష్ణుడు.

పోలీసులు చుట్టూ వలయాకారంగా పరివేష్టించగా ఖైదీలు నడిచారు. అటు ఇటు పోతున్న వాహనాలు ఆగి పోలీసులు, ఖైదీలు వీధిదాటడానికి అవకాశ మిచ్చాయి.

"ఇది కోర్టు రాస్తా!" అన్నారు మాస్టరు, తాము నడుస్తున్న వీధిని గురించి చెబుతూ.

"న్యాయ మార్గం" అని దుబ్బోడు మాస్టరు మాటలకు భాష్యం చెప్పాడు.

వీధితోని అంగళ్ళ నుంచి ఈ ఊరేగింపును జనం చూచారు. కయ్యూరు రైతులకిది అపరిచితమయిన ఊరు. అర్థం కాని భాష. చూచే వారంతా తమకన్నా వేరయిన జనం.

తుళు - కొంకణి - కన్నడ భాషలలో చుటుపట్ల నుంచి మాటలు వినిపించాయి.

"వీరు ఎవరు?"

"ఎర్ర జెండా వారా?"

"దొంగలో ఏమో!"

అది అర్థమవుతున్న మాస్టరు ప్రభుతో అన్నారు:

"మనం దొంగలం కామని కన్నడంలో కొంచెం చెప్పవోయ్!"

మరొకరు సలహా కూడ యిచ్చారు:

"కణ్ణడు ఒక పాట పాడనీ, వాళ్ళకు అర్థమవుతుంది."

ప్రభు నోరు తెరచే లోపలే కణ్ణడు పాడాడు. అధికారి అతనిపైకి దూసుకుంటూ వచ్చి, తలమీద కొట్టాడు. ముఖం మీద గుద్దాడు. రెండు నిమిషాలు గందరగోళ మయింది. మరల శాంతి ఏర్పడి ఊరేగింపు జైలు వైపు సాగింది. అయితే అంతకంటె ముందే కయ్యూరు విప్లవకారులను చెరపట్టి తెచ్చారన్న వార్త పట్టణం నాల్గు మూలలకు పాకింది....

....ఆ అరవై మందికి కోడియాల బయలులో వున్న సబ్‌జైలు ఎత్తయిన గోడల దర్శన మయినప్పుడు చీకటిపడింది. మహా ద్వారపు పిల్ల వాకిలిగుండా ఖైదీలను వంచి వంచి ఒక్కరు ఒక్కరుగా లోపలికితోశారు.



# 5

సర్కారుకు చేయి బాధ్యతలు. వివిధ యుద్ధ రంగాలకు భారత దేశం పేరిట సైన్య సామగ్రి పోవాలి. అవి సుగమం కావడానికి బెల్లం వంటి మాటలతో జాతీయ నాయకుల మనస్సును మభ్య పెట్టాలి. అది చాలక దేశంలోని పెక్కు మూర్ల ప్రాంతాల్లో శాంతి భద్రతలు రక్షించాలి. సర్కారు దృష్టిలో కయ్యూరు అధ్యాయానికి అత్యంత మహత్త్వ ముంది. ఒక్క పోలీసు చచ్చాడని అదేమీ తల్లడ పడలేదు. సామ్రాజ్యవాద ఉద్యానంలో సుబ్బయ్య ఒక గరిక పోచ. గాబరా పడినందుకు నిజమయిన కారణం భారత దేశపు జనమనే గొర్రెల మంద ఆ గరికపోచను మూజూ చిందనే.

ఇప్పుడు ఆ గొర్రెలను శిక్షించడం అవసరం. కాని, అది సామాన్య మయిన శిక్షగా వుండదు. తక్కిన గొర్రెమందల కంతా ఆ శిక్ష మరువరాని పాఠం కావాలి.

అయినా శిక్షకు ముందు విచారణ అవసరం. తామే ఆరోపణ చేసి, తామే విచారణ నడిపి, తామే శిక్షించడం. అయితే ఏమిటి? అదే చట్టబద్ధ మైన శిక్ష. అప్పుడు లోకం దృష్టిలో బ్రిటిషువారి న్యాయనీతి గొప్పదనానికి చ్యుతి కలుగుతుందా?

చెరసాలలో సహ బాంధవులకు మాస్టరు దానినే వివరించారు:

"న్యాయాలయ మనేదేమిటి ఆకాశంనుంచి ఊడి పడిందా? దానిని ఏర్పాటు చేసింది ప్రభుత్వమే. ప్రభుత్వ ఉపయోగం కోసమే న్యాయాలయం ఉండడం. అది రాజ్య యంత్రంలో ఒక చక్రం. ఈ విషయాన్ని మనం మొదటే తెలుసుకోవడం మేలు."

....విచారణ ఆలస్యమయింది. ఖైదీలు రెండుసార్లు సామాన్య న్యాయాధిపతి ముఖం చూసి వచ్చారు. మరిద్దరు నిందితుల కోసం గాలింపు జరుగుతూనే వుంది. ఇద్దరు-అదే తమాష. శేఖర్ ఉరుఫ్ పండితులు. మాధవన్ ఉరుఫ్ వర్మ. వాస్తవానికి ఆ నాలుగూ పండితుల వివిధ నామధేయాలే. ఈ ప్రస్తావన వచ్చినప్పుడల్లా ఖైదీలు పొట్టపగిలేట్టు నవ్వేవారు. "పండితులు చిక్కకుండా ఉండాలి" అని అనుదినమూ వారు తమ అభిప్రాయం వ్యక్తపరిచేవారు.

తెరపి లేకుండా వానలు పడ్డాయి.

అప్పు తమ్ముడు వచ్చి అన్నను, తండ్రిని కలుసుకొన్నాడు. ఏది ఎలాగు చెప్పాలనేది తయారు చేసుకొని వచ్చిన ఆ పిల్లవాని మాటల నుంచి ఎన్నో విషయాలు తెలిశాయి. జెయిలరు తమను చూస్తున్నప్పటికీ అత డన్నాడు:

"వచ్చిన చుట్టాలందరూ వెళ్ళి పోయారు. ఇప్పుడు వానకాలం. అప్పుడే ఐదారు వానలు జోరుగా కురిశాయి. మరల సాగుబడి ప్రారంభించాము, వదినె వాళ్ళందరూ వచ్చారు."

మొత్తానికి సాయుధ పోలీసు దళాల హింస ముగిసింది. ఊరు వదలిన వారంతా తిరిగి వచ్చారు. అటు తరువాత?

"నేను నీలేశ్వరం పాఠశాలకు ఎలా పోను? ఇంటిలో ఎవరున్నారు చూసుకోడానికి? ఇక చాలు చదువు. ఇక వెళ్ళను. కుఞంబు తమ్ముడు రాముడు మాత్రం వెళ్లాడట!"

అది స్వంత విషయం. అనంతరం:

"అన్నా, నీకు మొదటిసారి కొయిలా అయింది చూడు. అప్పుడు ఒక వైద్యుడు ఔషధం ఇచ్చారు గదా? ఆయన మళ్ళీ వచ్చారు!"

జెయిలరు కూర్చునే వున్నాడు. అయినా పండితులు కయ్యూరికి వచ్చి పోయిన గొప్ప వార్త జెయిలు లోపల ప్రవేశించనే ప్రవేశించింది.

"అమ్మకూడ వస్తానని మొండితనం చేస్తూంది. వచ్చేనెల నాతో పాటు పిలుచుకుని రానా?"

అప్పు తండ్రి ముఖం చూచాడు. అక్కడ ఎలాటి భావమూ చూడక తానే ఉద్వేగం నిండిన గొంతుకతో చెప్పాడు:



"వద్దు. మేమంతా బాగున్నామని చెప్పు. విచారణ ముగించుకొని తొందరగా వచ్చేస్తాము. ఓణం పండుగ వేళకు ఊళ్ళో వుంటాము అని చెప్పు. ఇంటింటికీ వెళ్ళి చెప్పు."

"హూఁ"

....పగలు గదుల వెలుపల చచ్చౌకంగా వున్న లోముంగిలిలో సమావేశమయే బాంధవులకంతా అప్పు తమ్ముడు మోసుకు వచ్చిన వార్తను మళ్ళీ మళ్ళీ వివరించి చెప్పాడు. ఒక్కొక్క మాటమీద వ్యాఖ్య జరిగింది. "పండితులు ఈ పరిస్థితిలో పల్లెకు పోకుండా వుండవలసింది" అని ఆక్షేపించిన వారే ఎక్కువమంది. మాస్టరు, చిరుకండడు "హెచ్చరికతోనే వెళ్ళి వుంటారు. ఎవరూ వెళ్ళకుండా వుంటే, జనానికి సమాధానంగా వుంటుందా?" అని ఎంత వివరించినా ప్రయోజనం కలుగలేదు.

అయితే కయ్యూరినుంచి అలాటి సందేశం ప్రతి దినమూ రావడం సాధ్యమా? అందరికీ ఆశే - తమ చుట్టాలు తమను చూడడానికి వస్తే బాగుంటుందని. అయితే, అంత దూరం నుంచి, అంత ఖర్చు చేసుకొని వాళ్ళంతా రావడం పడుతుందా?

అలాటి సంగతి వచ్చినప్పుడల్లా కోరడు అనేవాడు:

"నేనే పుణ్యాత్ముణ్ణి. భార్య రాలేదు, కొడుకు రాలేదు. అని ఒక యోచనయినా నాకుందా?"

అయితే, నిజానికి వారందరి యోచనలూ కయ్యూరికే ప్రత్యేకంగా సంబంధించినవి. ఈ సంవత్సరం ఎన్ని పొలాల్లో ఎంత మంది దుక్కి చేయడం సాధ్యమవుతుందో? జమీందారుగారు ఇంకేమి ఘోరాలు చేస్తారో?

ఎక్కువమంది నిరుత్సాహంగా ఉన్నప్పు డంతా మాస్టరు కణ్ణిని "పాడు" అనేవాడు. ఆ గీతాల మలాము అందరి నొప్పులను తగ్గించేది.

రాత్రిళ్ళు ఖైదీలను పక్క పక్కన వున్న పది గదులలో వేసి బీగం తగిలించేవారు.

ఆ నూతన జీవనానికి చాల త్వరగా అలవాటు పడినవారే ఎక్కువమంది. అయినా కొందరు కొయిలా పడ్డారు. నలుగురయిదుగురికి

వాంతి భేది. కుట్టి కృష్ణనికి జ్వరం, అయితే, మాస్టరు కనుక్కోడం ఫలితంగా అందరికీ నయమయింది.

కొందరికి విసుగు ఎక్కువయినప్పుడు, వారిలో వారికి మాటలు పెదవులు దాటి పోట్లాటలు జరిగేవి. అప్పుడూ మాస్టరుగారి ఒకటి రెండు మాటలు విన్న వెంటనే వారంతా సిగ్గుతో తలలు వంచుకొనేవారు.

పట్టణపు సామాజిక జీవితంనుంచి అనివార్యంగా వేరయి వుంటున్న జెయిలరు తీరిక వున్నప్పుడెల్లా ఖైదీల వద్దకు రావడం కద్దు. విద్యావంతులయిన వారితో ఆయన మాట్లావాడేడు. కయ్యూరు ఖైదీలలో ఈ "విశిష్ట గౌరవం" పొందినవారు మాస్టరు. మందహాసాలకు, ఆత్మీయతకు అక్కడ అవకాశం లేకపోయినా, ఆరోగ్యానికి సంబంధించిగాని, వానకు సంబంధించికాని ఏవైనా మాటలు జరిగేవి. అప్పుకు ఈ సంభాషణం ఇష్టంకాక "అతనితో మాట్లాడడం వల్ల ప్రయోజన మేమిటి? ఊరికే కాలం దండుగ." అని వ్యాఖ్యానించాడు. "మనదేమి పోతుంది? అతడే వచ్చి పలకరిస్తున్నప్పుడు మాట్లాడడం మంచిది. ఏనాటికయినా ప్రయోజనకర మవుతుంది" అని మాస్టరు సమాధాన మిచ్చారు.

ఆ మాటల వాస్తవం నిరూపించేటట్టు కొన్ని రోజులలో ఒక సంఘటన జరిగింది.

ఒకమారు మాస్టరును చూడడానికి వచ్చినప్పుడు జెయిలరు అడిగారు:

"మీ కింకా సంగతి తెలీ దనుకుంటాను."

మాస్టరు కుతూహలం చూపారు.

"లేదు. ఏమిటి సంగతి?"

"కల్లికోటలో కయ్యూరు రైతుల రక్షణ సమితి అని ఏర్పాటు చేశారు గదండీ. పేపరులో వచ్చింది."

మాస్టరు ముఖం వికసించింది.

"అలాగా!"

"ఈ సమితివారు ప్రసిద్ధులయిన వకీలులను నియమిస్తారట. మొత్తానికి అసాధ్యులు మీరు। ఈ ఊరిలో గోరీ తప్పితే మరొకచోట ప్రత్యక్షమవుతారు గదా।"



మాస్టరు నవ్వారు.

"కొంచెం ఆ పేపరు తెస్తారా?"

జెయిలరు భుజాలు ఎగురవేసి అన్నారు:

"లేదు. ఆ విషయం అడగకండి."

....అలా అన్నవారు ఒక ఇంగ్లీషు పేపరు సాయంకాలం తెచ్చి మాస్టరుకు ఇచ్చారు.

"చివరి పుట, చివరి కాలంలో ఉంది చదవండి."

అక్కడున్నది మొత్తం నాలుగే పంక్తులు. జెయిలరు ఎంత చెప్పాడో అంతే. దానిని చదివి వేరే పుటలమీద కూడ ఒక నిమిషం చూపు పరిగెత్తించి మాస్టరు పత్రికను వెనక్కు యిస్తూ "థ్యాంక్స్!" అన్నారు.

జెయిలరు నోటిమాటగా చెప్పిన వార్త తెలిసే ఖైదీలకు సంతోషమయింది. పత్రికలో ప్రకటించింది నిజమని తెలిసినప్పుడు మనస్సు కుదుటపడింది. "రక్షణ సమితిని ఏర్పాటు చేసినవారు ఎవరు? ఎవరి పేరుతో?" అని అందరూ ప్రశ్నించారు.

దుబ్బోడు అన్నాడు:

"ఈ వివరాలన్నీ పత్రికలో వేస్తారని అనుకున్నారా। మన వార్తలు ఎప్పుడూ చివరి పుట చివరే!...."

....ఇది జరిగిన కొన్నినాళ్ళకే కయ్యూరు కేసు విచారణ కోసం ఒక ప్రత్యేక న్యాయాధీశుని నియామకం జరిగిందనే వార్త వచ్చింది.

"ఇక విచారణ ఆలస్యం కాదు కదూ మాస్టరు గారూ!" అని కుఞంబు అడిగాడు.

"ఆలస్యమేమీ కాదు. కాని, ఇదొకటే న్యాయస్థానంలో ముగుస్తుందని అనుకోకండి. ఇది ఏకాంక నాటకం కానే కాదు" అన్నారు మాస్టరు.

మొత్తంమీద యీ కేసు త్వరలో ముగియదని అందరికీ స్పష్టమయింది. అబద్ధం చెప్పి, లేనిపోని ఆశలు కల్పించి, నిరాశ కలిగినప్పుడు ఎక్కువబాధ కలిగించడానికి మారు, చేదు నిజాన్నే చెప్పి, వారి హృదయా

లను మరింత దృఢం చేయడానికి ప్రయత్నించడమే సరియని మాస్టరు నమ్మారు.

విసుగు మొయిళ్ళు దట్టంగా ముసురు కున్నప్పుడు వారికి బాధ కలిగేది. ఈ మంగళూరు కయ్యూరికి చాలదూరం. అక్కడే ఎక్కడయినా సమీపంలో విచారణ జరిగివుంటే దానికి సంబంధించిన వారితో ఎక్కువ సంబంధం సాధ్యమయ్యేది. కయ్యూరు వైపునుంచి వీచే గాలే సరిపోయేది వారిలో చైతన్యం నింపడానికి.

అంతేకాక, ఆ రోజు అరెస్టు చేసినప్పుడు, ఎక్కువ తెలివి తేటలు లేని కొందరు రైతులను నిర్బంధించారు. ప్రముఖులందరూ వారితోనే ఎక్కువసేపు వుంటూ, వారిలో ధైర్యాన్ని, ఉత్సాహాన్ని నింపారు.

జెయిలు జీవితంలో కొన్ని రసమయ క్షణాలు ఒదిగిసున్నవాడు దుబ్బోడు. అతడు పహరావారితో స్నేహం కలిపి, ఊరివాళ్లు చూడడానికి వచ్చినప్పుడు డబ్బు ఇప్పిస్తానని చెప్పి, దినాని కొక కట్ట బీడీలు దొరికేటట్టు చేశాడు. మునుపు విపరీతంగా బీడీలు తాగుతున్న మాస్టరు ఇప్పుడు ముట్టడమే లేదు. మరికొందరికి తాగే అలవాటులేదు. మొత్తం మీద బీడీలు కావలసిన వారికి దుబ్బోడు నాయకు డయ్యాడు. చాల తక్కువ బీడీలను చాల ఎక్కువ మంది - రహస్యంగా - తాగడం సాధ్యమయ్యేట్టు అతడు దక్షతతో వ్యవస్థ చేశాడు.

మానవుని అనివార్యమైన అవశ్యకతలను గురించి దుబ్బోడు ఉపన్యాసాలు ఇచ్చేవాడు:

"పాటుపడే జీవికి మరేమిటి కావాలి చెప్పండి. ఒక బీడీ, ఒక కప్పు చా."

అక్కడున్నవారిలో కొందరికి చా జ్ఞాపకం వచ్చి గొణిగినప్పుడు, దుబ్బోడు అసంతృప్తి వ్యక్తపరుస్తూ అనేవాడు:

"పోలీసులు అంతా బాగానే చేశారు సరే, ఒక్క విషయంలో మాత్రం మోసం చేశారు. ఆ హోటలు రాముణ్ణి అలాగే వదల వచ్చా? అతణ్ణి ఇక్కడికి పంపివుంటే, అప్పుడు చూపేవాళ్ళం: ఏమిచేద్దాం?"



# 6

చిరుకండడు, అప్పు, మాస్టరు - ఈ ముగ్గురికి పిలుపు వచ్చింది. ఎవరో చూడడానికి వచ్చారు. ఆగంతుకులు చూచే భేటీ గదికి బయలు దేరుతూ ముగ్గురూ యోచించారు: ఎవరై వుంటారు? వెనుకటి దినమే కయ్యూరు నుంచి కొడుకుతోపాటు దేవకి, పాపను ఎత్తుకొని జానకి వచ్చారు గదా.

ఇప్పుడు ఇంతలోనే మరి ఎవరు?

రక్షణ సమితివారు వచ్చినా వచ్చి వుండవచ్చునని ఊహిస్తూ ఆ ముగ్గురూ గదిలో ప్రవేశించారు. జెయిలరు అప్పటికే వచ్చి కూర్చున్నారు. ఆ భేటీకోసం తెప్పించిన కుర్చీలో ఒక రున్నారు. ఎత్తయిన శరీరం, ఎర్రటి నిండుముఖం, వుంగరాల జుట్టు, విడివడి నవ్వుతున్న పెదవులు, నల్లకోటు, వకీలు అనడంలో సందేహం లేదు. ఆయన చేతిలో తోలుసంచీ.

ఆ ముగ్గురు రాగానే వకీలు లేచి నిలబడి తమ పరిచయం తెలిపారు.

"నేను రాజారావు, వకీలు. మీ వైపు వకీలు——"

ముగ్గురు అతనికి చేతులెత్తి నమస్కారం చేశారు.

వకీలు లేచి నిలబడడం జెయిలరుకు సరిపడలేదు. ఆయన అన్నారు :

"మీరు కూర్చోండి మిస్టర్ రాజారావ్."

జెయిలరువైపు చూచి రాజారావు వినయంగా అన్నారు :

"చెప్పడానికి సంకోచంగా వుందండీ. ఇది చుట్టపు చూపుకాదు. వకీలుగా కక్షిదార్లను చూడడానికి వచ్చాను. ఈ సంభాషణను మీరు వినరాదు. చట్టం ప్రకారం........"

జెయిలరుకు చట్టం తెలుసు. పెద్ద నల్లగండుచీమ వ్రేలికి కుట్టి నట్టయి, ఆయన లేచిపోయారు.

"ఈ భేటీకి సమయ నిర్బంధం లేదు. మీరు కూర్చోడమే మంచిది" అన్నారు రాజారావు.

చిరుకండడు, అప్పు, మాస్టరు గోడకు ఆనుకొని కూర్చున్నారు. వకీలు వారి ఎదుట కుర్చీలో కూర్చుని ఆ ముగ్గురు ఎవరు ఎవరని అడిగి తెలుసు కొన్నారు.

"మొదట మొదటి, రెండవ నిందితులుగా శేఖర్ ఉరుఫ్ పండితులు, మాధవన్ ఉరుఫ్ వర్మ అని వేశారు. అలా ఇద్దరు లేరని నాకు తెలిసింది. అయినా గుట్టు వదలరాదు. ముందు ముందు కేసులో దానిని ఉపయోగించు కొందాము. ఇప్పుడు జాబితాలో ఆ రెండు పేర్లను చివర వేశారు. మొదటి నిందితుడు అప్పు, రెండవవాడు మాస్టరు, నంబరు మూడు చిరుకండ, నాలుగు ప్రభు, ఐదు కోరడు, ఆరు కణ్ణుడు, ఏడు కుట్టి కృష్ణుడు, ఎనిమిది అబూబకర్, ఇలా...."

వకీలుచేతిలో వున్న కాయిత పత్రాలలో ఆ వివరా లున్నాయి.

మాస్టరు ప్రశ్నలకు జవాబుగా ఆయన అన్నారు:

"ఈ నెల చివర విచారణ ప్రారంభం కావచ్చు. తమ వైపునుంచి వాళ్ళు ముప్ఫయి నలభై మంది సాక్షుల పేర్లిచ్చారు."

"అంతమంది! అసంభవం. మాకు విరుద్ధంగా అంతమంది సాక్ష్యం ఇవ్వజాలరు." అన్నాడు అప్పు.

మాట్లాడే ఆ పద్ధతి రాజారావుకు నచ్చలేదు. ఆయన గొంతు పెద్దగచేసి అన్నారు:

"హూఁ! మీ పక్షాన సాక్ష్యం చెప్పేవారు ఎంతమంది దొరకవచ్చు?"

"మొత్తం కయ్యూరే మా వైపు."

అప్పుకు అడ్డుతగిలి మాస్టరు అన్నారు:

"నిరంకుశత్వంవల్ల సాక్షులు దొరకడం కొంచెం కష్ట మయ్యేని."

వకీలు తామే గెలిచామని నవ్వి అన్నారు:

"కొంచె మేమిటి? పూర్తిగా కష్టమే. ఆ వూరిలో ఏమయిందో మీకు తెలుసా! సాక్షుల కోసమయినా నేనే అక్కడికి పోవలసి రావచ్చును."



"అది నిజం."

"చర్వత్తూరునుంచి నడిచిపోవాలి కదూ?"

"అవును. అయితే వేరే సౌకర్యాలన్నీ మావాళ్ళు చేస్తారు."

"కానీండి, కానీండి. నా సౌకర్యం విషయం ఆమీదట మాట్లాడుదాం. మొదట ఈ కేసును మనం గెలవాలి."

చిరుకండడు అన్నాడు:

"ఈ కోర్టులో కేసు ఎన్ని నెలలు నడవవచ్చు?"

వకీలు చిరుకండనివైపు ఆసక్తితో చూచి అన్నారు:

"కనిష్ఠపక్షం నాలుగు నెలలన్నా కావచ్చు. స్పెషల్‌కోర్టు న్యాయాధీశులు త్వరగా ఎందుకు ముగిస్తారు చెప్పండి?"

ఇతనికి న్యాయ వ్యవహారం ఎక్కువ తెలియదని నిశ్చయమయి వకీలు అన్నారు:

"ఈ న్యాయాధీశులు ఆరోపణలను ధ్రువ పరచి సెషన్స్‌కు పంపుతారు. సెషన్స్ విచారణకు మనవైపు మదరాసు నుంచి పిళ్ళైకూడా వస్తారట. పిళ్ళై పేరు విన్నారా?"

అదెవరో అప్పుకు, చిరుకండనికి తెలియదు. మాస్టరు అన్నారు:

"హూఁ. ఆయన ప్రఖ్యాత న్యాయవాది అని తెలుసు."

"సరే, మీరేమీ భయపడకండి."

వకీలు భయం సంగతి ప్రస్తావించినందుకు అప్పుకు నవ్వు వచ్చింది. అయితే నవ్వడం అసభ్యమనిపించిని అని అతడు పెదవులు బిగించాడు.

తాము చిత్రించుకున్న కేసుస్వరూపాన్ని రేఖామాత్రంగా రాజారావు ఆ ముగ్గురిముందు పెడుతూ అన్నారు:

"ఆ పోలీసువాడు....ఏమిటి వాడి పేరు? వల్లకాటిది....హాఁ.... సుబ్బయ్య....వాడు చచ్చింది యాదృచ్ఛిక మనే మన డిఫెన్స్‌వాదం. అదే సరయినది."

వీళ్ళ మాటా మంతీ యింకా ముగియలే దేమిటని చూస్తూ, అటు వచ్చిన జెయిలరును చూచి వకీలు గొంతు తగ్గించి అడిగారు:

"ఇక్కడ మీకంతా సౌకర్యంగా వుందా? మీరు రాజకీయ ఖైదీలు కాదు. లేకపోతే ఏమయినా చేయగలిగే వాళ్ళం...."

"అదేమీ పెద్దవిషయం కాదు. ఊళ్ళో మన జనం అనుభవించే కష్టం ఎదుట మా కష్టమేమీ పెద్దదికాదు." అన్నారు మాస్టర్.

వకీలు లేచి "విచారణకు ముందు ఇంకొకసారి వస్తాను." అని చెప్పి వెలుపలికి నడిచారు.

—జెయిలు లోపల తెరపి లేని ప్రశ్నలకు కారణమయింది వకీలు ఆగమన వార్త.

"ఆయన మన వాడా?"

దానికి జవాబివ్వడం సులభం కాదు. మాస్టరు అన్నారు:

"మనవారా అని అడిగితే ఏమి చెబుతాము? మన పిల్లలను కాలేజీకి పంపి వకీలులను చేయాలనే యోచన ముందే మనకు ఉండి వుంటే, మన వకీలే అని ఇప్పుడు చెప్పడం సాధ్యమయ్యేది. ఈయన పట్టణవాసి. పది సంవత్సరాలకు ముందు ఈయనా జాతీయ సమరంలో జెయిలు చూచారు. మనమీద సానుభూతి ఉన్నందువల్లనే మన పక్షాన వకాలతుకు ఒప్పుకొన్నారు. మనవాళ్ళు జనం నుంచి వసూలు చేసి ఇచ్చే ఫీజు అంతంత మాత్రమే వుంటుందని ఆయనకు తెలిసే వుంటుంది. మదరాసు పిళ్ళే అనేవారు అంతే...."

....మాస్టరు ఊహించి చెప్పినట్లే వెలుపల రక్షణ సమితివారు కరపత్రాలను వెలువరించారు. న్యాయస్థానం వెచ్చం కోసం సహాయ ధనానికి యాచన; ఖైదీల కుటుంబాల కోసం సహాయం చేయాలని విజ్ఞప్తి.

ఈ కరపత్రాల సంగతి సూక్ష్మంగా తెలిసిన చిరుకండని భార్య చూడడానికి వచ్చినప్పుడు.

"వెనకటికి మీరు అప్పన్నద్వారా చీరలు పంపించేవారే? అలాంటివే రెండు మూడు మళ్ళీ వచ్చాయి."

తాను పంపించిన చీరా....చిరుకండనికి అదేమిటా అని మొదట అర్థంకాలేదు. తర్వాత సంవత్సరాలక్రితం తాను వ్రాస్తున్న కరపత్రాలను అప్పు త్రికరపురానికి తీసికువెళ్ళి చందువుకు ఇస్తూండడం జ్ఞాపకం వచ్చి భార్య మాటలు అర్థమయ్యాయి.



మెరుస్తున్న అతని కళ్ళను చూచి ఆమె అన్నది?

"ఇప్పుడు అవి దూరంనుండి వస్తున్నవి. ఈ చీరలవారు డబ్బు వసూలు చేస్తున్నారు."

ఆమె అత్తతోపాటు వచ్చింది. ఆ ఇద్దరు చందువును చూచారు. చిరుకండని తండ్రిని చూచారు. తల్లి ఏడుస్తుందని చిరుకండడు అనుకున్నాడు. కన్నీళ్లు ఆ ముసలి కళ్ళలో ఒత్తుకొని వస్తున్నట్టు కనిపించింది. కాని, ఆ కన్నీళ్ళను ఆమె పైటతో అద్దుకొని వెనక్కు నెట్టింది....ఇక ఏకాకినిగా ఆ భార్యపడుతున్న సుఖమో!

చిరుకండనికి పట్టరానంత దుఃఖమయింది. అయితే దానిని మనసులో అదిమిపట్టి నవ్వులు ఒలికిస్తూ మాట్లాడాడు.

...ఊరికే ఉన్నప్పుడు కూడ నవ్వుతున్నట్టే కనిపించే వకీలూ వచ్చి కరపత్రాల విషయం చెప్పారు.

"మీ వారు ధైర్యశాలురు. ఇంతటి నిరంకుశత్వం, మనుష్యులవేట అన్నిచోట్ల నడుస్తున్నా కార్యక్రమం సాగిస్తూనే ఉన్నారు కదా!"

అలా ఎక్కడో వున్న ఎవరినో పొగిడారు వకీలు. అయితే అక్కడ ఖైదీలయిన వారందరికీ దాన్నుంచి సంతోష మయింది.

....మొత్తానికి విచారణ ప్రారంభమయింది. జెయిలు నుంచి కయ్యూరు రైతులు కోడియాల మైదానం దారిలో హంసనకట్టె మైదానం దాటి ఎర్రటి గోడలు, ఎర్ర పెంకులు, లోకప్పువున్న న్యాయస్థానం వైపు నడిచారు.

న్యాయస్థానంలో నడివయస్సు పొట్టి న్యాయాధీశుడు ఎవరో తల నెరసిన బడి పంతులలాగ తమ ఎత్తయిన స్థానంలో కూర్చున్నారు. ఆయన ఎదుట ఆరు వరుసలుగా ఖైదీలు నిలుచున్నారు. ఎలాటి అల్లరీ లేని వాతావరణం. వర్షాకాలం చివర కనిపించే ఎండ. ఉక్క, చెమట, తలుపు ఆవలవున్న జవాను పంఖాపగ్గం లాగుతూనే వున్నాడు. న్యాయాధీశుల తలమీద గుడ్డ జాలరి పంఖా ముందుకు వెనక్కు కదలాడింది. న్యాయాధీశుల వెనుకపక్కన గోడను గతించిన విక్టోరియారాణి చిత్రం అలంకరించింది. కింద న్యాయాధీశుల ఎదుట ఒకపక్క పోలీసు వకీళ్ళు, పోలీసు అధికారి; మరొకపక్క రాజారావు; వేరే పనిలేక విచారణ చూడ

డానికి వచ్చిన ఇద్దరు యువకులైన వకీళ్లు; వారిమధ్య న్యాయస్థాన గుమాస్తాలు; బ్రౌను కాయితాలు, మానిబుడ్లు, కలాలు.

న్యాయాధీశులు అడిగారు :

"ప్రారంభిద్దామా ?"

క్షీణించిన స్వరం. ఒడలి లోపలి నుంచి వచ్చింది కాదు. విచారణ దర్పం - వైభవం - భయోత్పాదకమైన గాంభీర్యం చిత్రించుకొని వచ్చిన పలువురు ఖైదీలకు యిదంతా చప్పగా తోచింది. ఈ విచారణలో భయపడవలసిందేమీ లేదు. కొన్ని రోజులలోనే తామందరం యిక్కడ నుంచి వెలుపలికి వెళ్ళిపోవచ్చు - అని వాళ్లు భావించారు. అయితే, అప్పును తక్కినవారిని వేరే బాధలు బాధించాయి : ఇక్కడ తమవారెవరూ లేరు. కయ్యూరులోనే ఈ విచారణ జరిగివుంటే అప్పుడు చూపి వుండేవారు. జనంతో కిటకిటలాడేది న్యాయస్థానం. ఇక్కడ ఏమీలేదు. అతి ముఖ్యమైన, చరిత్రాత్మకమైన విచారణ చూచేవారు, వినేవారులేక ఆరంభమయింది. మాస్టరు, చిరుకండడు వేరే యోచన చేస్తున్నారు : ఇక ప్రతిదినమూ తాము యిక్కడికి రావాలి. అప్పుడు కయ్యూరులోని తమ వారితో ప్రతి దినమూ సంబంధం పెట్టుకొనడానికి తాము ఏమైనా చేయవచ్చా ? ఇక్కడికి ఎవరూ రానేలేదా ? కట్టడం వెలుపల అక్కడ ఇక్కడ కొందరున్నారు. వారిలో కొందరు గూఢచారులు ఉండవచ్చు. తక్కిన వారు పోలీసులకూ భయపడక ఇక్కడ తమతో మాట్లాడగలవారు ఎవరు ? ఎవరు ?

ఇది కయ్యూరు పోలీసు హత్యకేసు.

బడిలో హాజరీ తీసుకొనేట్టు ఆరవైమంది ఖైదీల పేర్లు చదివారు. మొదటి రెండు పేర్లను న్యాయస్థానం గుమాస్తా చదివినప్పుడు, కొందరు ఖైదీలు ఒకరి ముఖం ఒకరు చూచుకొని నవ్వారు.

న్యాయాధీశుడు ఇంగ్లీషులో అన్నారు :

"ఆరోపణల వివరాలు చదవండి."

అంతమంది మీద ప్రభుత్వపు పోలీసులు న్యాయస్థానానికి ఇచ్చిన ఫిర్యాదు. ప్రభుత్వపు వకీలు ముప్ఫయి నలభై పుటలంత వ్రాసుకొని



తెచ్చిన ఫిర్యాదును నిదానంగా, మోటుగా చదవసాగినాడు. ఇంగ్లీషు భాష.

ఖైదీల పక్షం వకీలు ఆక్షేపించాడు :

"దానికి నా ఆక్షేపణవుంది మైలార్డ్. ఆరోపణల వివరాలు ఏమిటో నిందితులకు అర్థం కావడం లేదు."

"మీరు వివరించవచ్చు గదా ?" అన్నారు న్యాయాధీశులు.

"ప్రధాన విషయం ఏమిటో - ఆ వక్కాణం ఉన్నదున్నట్టు ఖైదీలకు అర్థంకావడం అవశ్యం మైలార్డ్."

"మలయాళంలో ఫిర్యాదు ఇస్తే మాకు అర్థం కాదు కదా ?"

రాజారావు ఊరుకున్నారు. అది చూచి న్యాయాధీశు లన్నారు :

"క్రొత్తగా ఈసారి మీరు ఇలా అడగడం ఆశ్చర్యమే ? మనం ఇంగ్లీషులోనే ఫిర్యాదులు దాఖలు చేసుకోవడం పద్ధతి. కనుక మీ ఆక్షేపణను తోసివేయడమయింది."

న్యాయాధీశులు పోలీసు వకీలు వైపు చూచి "ముందుకు సాగించండి." అని సూచన చేశారు.

మళ్ళీ నిదానంగా మొరటు ధ్వని వినిపించింది.

రాజారావు నవ్వుతూ కూర్చున్నా, తమకు ఓటమి సంభవించిందని ఎక్కువమంది ఖైదీలు కోపగించుకున్నారు. మొదటి వరుసలో వున్న అప్పు ఈ ప్రహసనాన్ని చూచి తుచ్ఛీకారమైన చూపులు విసురుతూ ఎడమవైపు. కుడివైపు. చుట్టూరా చూచాడు.

న్యాయాధీశులు కుర్చీ వీపుకు ఒరిగి దాని చేతులమీద తమ మోచేతులు పెట్టారు. కుడి అరచేతిని చెంపకు ఆనించారు. ఇప్పుడు ఆయన మరీ పొట్టిగా తోచి కుర్చీమీద పెట్టిన ప్లాస్టిక్ బొమ్మలాగా కనిపించారు.

ఆ వివరంలో కయ్యూరు సంఘటనను గురించి మళ్ళీ మళ్ళీ విసుగు పుట్టించేటట్టు వ్రాసిన నివేదిక లున్నవి. ప్రభుత్వాన్ని కూలదోయడానికీ, జమీందారులను హత్య చేయడానికి నడిపిన కట్టుకథ వుంది. ఈ పితూరీలో కయ్యూరివారు మాత్రమే కాక చుట్టుపట్ల విస్తార ప్రదేశాల ప్రజలు పాల్గొన్నారనే అంశమూ వుంది.

రాజారావు కాక ఆ ఫిర్యాదు ఏమిటని సంపూర్ణంగా తెలిసినవారు మాస్టరు ఒకరే. ఆయన ప్రతి అంశాన్ని చెవి ఒగ్గి విన్నారు. తక్కినవారు విసుగొచ్చి ఆవలించారు. బేడీలు తీసిన చేతులెత్తి గడ్డాన్ని, తలను గోక్కున్నారు.

విరామ సమయానికి ఫిర్యాదు చదవడం ముగిసింది. అయితే ఉదయం గంజి తాగివచ్చిన ఖైదీలు సాయుధులైన పోలీసుల "సాము కావలి"లో న్యాయస్థానం నేలమీద కూర్చున్నారు.

రాజారావు మాస్టరుతో రెండు నిమిషాలు మాట్లాడి వెలుపలికి పోయి చా తాగివచ్చారు.

మరొకమారు న్యాయాధీశులు త్వరత్వరగా చిన్న అడుగులు వేస్తూ వేదికను ఎక్కగానే, ఖైదీలు లేచి నిలుచున్నారు. అలవాటుకొద్దీ అబూబకర్ తాము నిలుచున్న వరుస సరిగా వుందా లేదా అని చూచాడు.

తర్వాత జరిగింది పోలీసు అధికారి సాక్ష్యం. అతడు కయ్యూరిలో ధూర్తుడుగా, క్రూరుడుగా ప్రవర్తించిన వ్యక్తి. సర్కారును రైతుల పితూరీనుంచి దాటించిన వీరుడు తాననే అహంకారపు చూపుతో అతడు న్యాయాధీశుని వైపు, వకీలు వైపు చూచాడు. అక్కడికి వచ్చి తాను వాఙ్మూల మివ్వడానికి ఒప్పుకోడం తన ఔదార్యమని, తానొక మహాపురుషుణ్ణని అన్నట్టుగా ప్రవర్తించాడు.

ఇపుడు న్యాయాధీశులు మేజా బల్లమీదికి వంగి సర్కారు వకీలు ప్రశ్నలకు పోలీసధికారి ఇచ్చిన జవాబులను వ్రాసుకున్నారు.

అప్పటికి సాయంకాల మయింది. ఆనాటి విచారణ ముగిసింది. ఖైదీలు మళ్ళీ పట్టణ వీధులను దాటి జెయిలు చేరారు.

.... మరుసటి దినం నిందితుల పక్షం వకీలు పోలీసు అధికారిపై క్రాసు పరీక్ష జరిపారు. రాజారావు ఎగిరెగిరి ప్రశ్న బాణాలను విసురుతున్న రీతి, అధికారి కోపగించుకొని అతని నల్లని ముఖం ఎర్రబడడం చూడముచ్చటగా వుండేవి. అదేమి టనేదంతా అర్థంకాక పోయినా ఖైదీలు విసుగులేక ఉత్సాహంతో ఉన్నారు. కోడిపందేలను చూస్తున్న ప్రేక్షకులయ్యారు వారు. సర్కారు వకీలు దుఃఖంతో మాట్లాడినప్పుడెల్లా చప్పట్లు కొడదామా అన్నంతగా ప్రేక్షకులు సంతోషపడ్డారు.



ఆ సాయంకాలం, సాక్ష్యం చూపడానికి పది దినాలు వ్యవధి కావాలని సర్కారు వకీలు న్యాయస్థానాన్ని అభ్యర్థించారు.

రాజారావు ఆక్షేపణను త్రోసివేసి న్యాయస్థానం, అంటే న్యాయాధీశులు సర్కారు వకీలు కోరికను మంజూరు చేశారు.

న్యాయస్థానం నుంచి బయలు దేరుతూ రాజారావు మాస్టరుతో అన్నారు:

"చూచారా? ఎలా వుందో? ఈ పదిరోజులలో సాక్షులకు తర్ఫీదు ఇస్తారు."

—పది రోజుల తర్వాత విచారణ మరొక దృశ్యం ప్రారంభమయినప్పుడు సాక్షులందరూ రాలేదు. రోజుకు ఇద్దరూ ముగ్గురూ వచ్చారు. ప్రతిసారీ ఎవరు వస్తారని ఖైదీలు కుతూహలపడేట్టు అయింది. నలభై మంది సాక్షులున్న మాట నిజమే. కాని వారిలో సగానికన్నా హెచ్చుమంది కయ్యూరు వారు కారు! తక్కిన వారిలో కొందరు ఊరిలోని ఇద్దరు జమీందారుల బంట్లు; ఒకరిద్దరు సంఘమంటే ఇష్టంలేని శ్రీమంతులైన రైతులు; ఒకరిద్దరు ఆశకు లోనయిన బీదలు.

ప్రతిరోజు, వచ్చినవారిని ఖైదీలు ఎర్రటి కళ్ళతో చూచారు. ఆ సాక్షులు ఖైదీలవైపు ధైర్యంగా చూడనూలేదు.

"దైవసాక్షిగా సాక్ష్య మిస్తాను" అంటూ అబద్ధాల చిలుక పలుకులు అప్పగించిన వారినెల్ల రాజారావు అడ్డు పరీక్షలో ఓడించారు; ఒంటి కాలిమీద నాట్యం చేయించారు. ఆరోపణలను సమర్థించడానికి వాళ్ళు అబద్ధమాడినట్టు పసిపాపకు కూడా అర్థమయేట్టు ఉంది. ఇంత జరిగిన పిదప న్యాయాధీశులు విచారణ ఇక్కడికి చాలు ననవచ్చు. తమను బంధవిముకులను చేయవచ్చు అని కొందరు రైతులు భావించారు. మలయాళ భాషలోనే ఉన్న సాక్ష్యాలను విన్న ఖైదీలకు ఆరోపణలు అబద్ధమని రుజువు కావడానికి మరేమీ అక్కరలేదనిపించింది. అయితే న్యాయాధీశులు మౌనంగా వుండి అప్పుడప్పుడు ప్రశ్నోత్తరాలను అడిగి తెలుసుకుంటూ దానినంతా వ్రాసుకొంటూనే వున్నారు.

నడుమ నడుమ ఆదివారాలు, సెలవు రోజులు వచ్చాయి. రెండవ నెలకు సర్కారు సాక్ష్యం ముగిసింది.

తమ పక్షాన కయ్యూరే సాక్ష్య మిస్తుందని అన్నాడు అప్పు. అయితే వాస్తవస్థితి అలా లేదు. నిందితులకు విరుద్ధంగా సాక్ష్య మిచ్చిన వారికి ప్రభుత్వం ప్రయాణపు బత్తా ఇచ్చేది. కాని ఖైదీల పక్షాన వచ్చే వారికి లభించేవి గూఢచారుల వంకర చూపులు మాత్రం. ఆ స్థితిలోను రైతులు రావడానికి సిద్ధంగా వున్నారు. కాని, వారిని పిలుచుకొని రావడానికి కార్యకర్తలు లేరు.

రాజారావు ఎదిరి పక్షానికి తమ ఇబ్బందుల గుట్టు తెలుపకపోయినా మాస్టరు, చిరుకండడు, అప్పు ఆయనతో చప్పచప్పగానే మాట్లాడారు.

"సెషన్స్‌లో చూచుకుందాం. మన సాక్షులను సెషన్సుకు తెస్తామని చెబుతాను. ఏమంటారు?"

మరే దారీ లేక మాస్టరన్నారు:

"అలాగే చేయండి."

అయితే, ఒక తమాషా జరిగింది. తమ పని సులభం కానీ అని న్యాయాధీశులు రాజారావును పిలిచి చెప్పారు:

"ఎందుకప్పా ఊరికే పొడుగ్గా పెంచుతారు! సెషన్సుకు దాటిస్తే ముగిసింది నా పని. అక్కడ ఏమయినా చేసోకోండి. డిఫెన్సు సాక్షులను ఇక్కడికే తీసుకొని రావాలని పట్టుదల ఎందుకు? మీ వాళ్ళకు కొంచెం చెప్పండి. అందరూ చేరి దీనిని త్వరగా ముగిద్దాము."

రాజారావు ఈ సారి మనసులోనే నవ్వుకొని, ఒక క్షణంపాటు గంభీరంగా వుండి, ఆలోచించినట్టు నటించి, అన్నారు:

"అలాగే, అలా అని తమ కోరిక అయితే, నాకు అభ్యంతరం లేదు!"

న్యాయస్థానం ఆరోపణలను ప్రతిపాదించింది.

మరొకరోజు రాజారావు వాదం జరిగింది. దానిని సమర్థిస్తూ తాము నిరపరాధులమని ఖైదీలు ఇచ్చిన వాఙ్మూలం దాఖలయింది.

కయ్యూరు పోలీసు హత్య కేసును సెషన్సు కోర్టుకు పంపుతున్నట్టు ప్రత్యేక న్యాయాధీశులు తీర్పులో వ్రాశారు.

ఆ తీర్పు ఏమిటని మాస్టరు వివరించినప్పుడు కోరడు అన్నాడు:

"మరొక కోరటులోను ఇదే నాటకం మళ్ళీ ఆడాలా? ఛీ వీళ్ళ....! ఇది ఎలాటి విచారణో?"



# 7

ఆ సంవత్సరం ఓణం పండుగకు ఊరికి తిరిగి వస్తాము – అని అన్నాడు అప్పు. మొదటిసారి తన తమ్ముడు తనను చూడడానికి వచ్చినప్పుడు. కాని, కయ్యూరులో ఈ సారి అప్పు, చిరుకండడు కాని వారి మిత్రులుగాని లేకనే పండుగ గడచింది. కయ్యూరు చైతన్యవంతమయిన మాట నిజమే. పత్రిక చదవడం, చర్చించడం, "సాహిత్య" ప్రచారం చేయడం – అనే కార్యక్రమం రహస్యంగా జరుపుతుండడమూ నిజమే. అయితే తమవారు అరవై మంది జనం లేక కయ్యూరు గొడ్డుపోయింది.

ఆ అరవై మంది మంగుళూరు జెయిలులో రోజులు గడుపుతున్నారు, పై న్యాయస్థానం విచారణను ఎదురుచూస్తూ. ఆ విచారణ దినం ఏదో ఒక కారణంతో ముందుకు సాగిపోతున్నది. ఇకనేమిటి! విచారణ ప్రారంభం కావాలి అనే లోగానే వృద్ధ న్యాయాధీశులు పదవీ విరమణకు ముందు తీసుకునే శెలవు తీసుకున్నారు. తర్వాత క్రిస్మస్ వచ్చింది. కొత్త సంవత్సరంలో కొత్త న్యాయాధీశులు ఆలస్యంగా వచ్చారు. వచ్చినా మొదట వేరే మూడు నాలుగు కేసులను ముగించారు.

ఈ సారి కయ్యూరు ఖైదీలు గుట్ట ఎక్కి న్యాయస్థానం చేరారు. అది బావుటాగుట్ట. అక్కడ నిలబడితే, చెట్లక్రింద విశ్రమిస్తున్న ఉద్యాన పట్టణంగా కనిపించేది మంగుళూరు. పడమటవైపు గర్జిస్తున్న విశాల నీల సముద్రం మొత్తానికి ఆ స్థలం న్యాయదానపు కైలాస పర్వతమే!

ఖైదీలకు ఆ అనుభవం వెనుకటి అనుభవం కన్నా భిన్నమయింది. ఇక్కడ వారికి ఎక్కువ చురుకుదనం కనిపించింది. మొదటి రోజు ఆ వూరు విద్యార్థులు, మరికొందరు, కూలీలు, కయ్యూరు నుంచి

వచ్చిన కొందరు రైతులు న్యాయస్థానం వెలుపల ప్రేక్షకులయి గుంపు కట్టి నిలబడ్డారు. పత్రికా ప్రతినిధులూ అక్కడ వున్నారు. న్యాయస్థానం - అంటే ప్రభుత్వమే—నియమించిన జ్యూరీలు వేరే. వీటివల్ల విచారణ మొదటి దినం కళగా వుంది.

అయితే, ఇలా జరిగింది మొదటి దినం మాత్రం. తర్వాతి దినాలు మళ్ళీ విసుగుకు కారణమయ్యాయి. ప్రేక్షకులు తక్కువయ్యారు. అక్కడ జరిగినదంతా వెనుకటి న్యాయస్థానం పునరావృత్తే.

నిందితుల పక్షాన వకాలత్తుకు ఇప్పుడు మద్రాసునుంచిపిళ్ళే కూడా వచ్చేరు. చక్కగా దుస్తులు ధరించే రీతి, నడుమ పాపిటతో వెనక్కు దువ్విన క్రాపు, నిరంతరం హెచ్చరికతో వున్న కళ్ళు - అందరి దృష్టినీ ఆకర్షించేవిగా వుండేవి. రాజారావుతోపాటు ఆయన సమర్థతతో ఖైదీల రక్షణలో నిమగ్నులయ్యారు.

ఈ సైన్యాధీశుల వెనుక గోడమీద పంచమ జార్జి చిత్రం వుంది. తలమీద నిలువైన గుడ్డ జాలరు పంఖా. న్యాయాధీశుని నిండైన వెడల్పాటి ముఖంకన్నా పెద్దది ఆయన తెల్లని తలపాగా. నొసట మూడు నామాలు - అవి మీదికి ఎక్కి రుమాలులో దూరుతున్నట్టు కనిపించేది. ఎవరు ఏమన్నా ఆయన "ఔను ! ఔను !" అంటూ తల పంకించి ఊరుకుండేవారు.

ఈసారి పోలీసుల పక్షం సాక్షుల సంఖ్య తక్కువయింది. కింది కోర్టులో చెప్పిన దానికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పవచ్చుననే సందేహంతో కొందరిని వారు వదలిపెట్టారు. నిందితుల పక్షాన పదిమంది పురుషులు, స్త్రీలు సాక్ష్య మిచ్చారు. వారి మాటలలో దృఢత, స్థిరత వున్నవి. ఆ సంఘటన జరిగినప్పుడు ఆ స్థలంలో నిందితులలో చాలమంది లేనేలేరని, పోలీసు మరణం ఆకస్మికమని, రైతు సంఘం చట్టబద్ధమైనదని—ఇద్దరు వకీళ్ళు నిరూపించారు.

సర్కారు వకీళ్ళ సవాళ్ళకు, బెదిరింపు గర్జనలకు ఆ సాక్షులెవరూ లొంగిపోలేదు.

ఆ గడియలలో ఎక్కువమంది ఖైదీలకు అనిపించేది :



"మనకు జయం తప్పదు. త్వరగా మనం తిరిగి వెళ్ళిపోవడం తప్పదు."

అయితే, మాస్టరు, చిరుకండడు, అప్పు మరి ఇతరులు మౌనంగానే వున్నారు. వారు పైకి నవ్వు ముఖంతో కనిపిస్తున్నా, లోపల ఇలాంటిది అని చెప్పరాని బాధ వారిని పీడిస్తూన్నది.

విచారణ ముగిసే దినం వచ్చింది. ఆ దినం నిందితుల పక్షం వాదం. పిళ్ళే సాటిలేని వాక్ ప్రౌఢిమ చూపారు. సూది పడినా చప్పుడయేటట్టు న్యాయస్థానం నిశ్శబ్దంగా వుంది. ఇంగ్లీషులో వున్న ఆ వాదం మాస్టరు ఒక్కరికే అర్థమయింది. తక్కినవారు అప్పుడప్పుడు మాస్టరు ముఖం చూచారు. అలా చూచి ఆయన ముఖంలో కనిపించే మార్పులు ఆధారంగా పిళ్ళే వాదాన్ని అర్థం చేసుకొనేవారు.

పిళ్ళే వాదంలో ధైర్యముంది. వాడి మొన బాణంవలె వుంది.

ఒక్కొక్క మాట ఆయన అన్నారు :

జమీందారులు నడిపించే దోపిడీ రక్షణకు పోలీసులు పన్నిన కుట్రే ఈ సన్నివేశం. ఒక పోలీసువాని ఆకస్మిక మరణాన్ని ఆధారంగా చేసుకొని ఈ ప్రాంతపు రైతు ఉద్యమాన్నే నామరూపాలు లేకుండా చేయడానికి ఈ కేసు మూలంగా ప్రయత్నించడం జరిగింది. ఈ సంఘటన జరిగిననాడు సంఘ కార్యాలయం రాత్రి పాఠశాలలో పాఠాలు చెబుతున్నారని ఎలాటి సందేహానికీ ఆస్పదం లేకుండా నిరూపితులైన మాస్టరు పోలీసు హత్య కేసులో నిందితులు ! ఎన్నో మైళ్ళ దూరంలో వున్న ప్రభు, మరికొందరు నిందితులు ! సంఘటన జరిగిన స్థలంలోనేలేని చిరుకండడు - అప్పు, వారికి జన్మనిచ్చిన ముసలి రైతులు ఇద్దరు నిందితులు ! మరికొందరు అప్పుడున్నది తమ గుడిసెలలో. శాంతిగా ఊరేగింపునకు వెళ్ళడమే తక్కిన వారి తప్పు ! ఇంతేకాదు. పోలీసులను బట్టి ఇంకా పట్టుబడని ఇద్దరు నిందితులున్నారు. శేఖర్ ఉరుఫ్ పండితులు- మాధవన్ ఉరుఫ్ వర్మ. ఇలాటి పేరుగల వ్యక్తులయినా వున్నారా ? ఈ పేరున్న రైతులు ఏ కాలంలోను కయ్యూరిలో. లేరంటే, మైలార్డు, మీకు ఆశ్చర్యం కలుగవచ్చు ! పండితులు అనే వారొకరు మలబారు రైతు నాయకులని నేను విన్నాను. ఆయన ఏఊరి వారో ఎవరికీ తెలియదు.

ఆయనను చూచినవారూ ఇక్కడలేరు. ఇక వర్మ అనే వారెవరో ఏ వర్మ? ఏ రాజవంశం వారు? ఎవ్వరికీ తెలియదు. అయితే సర్వజ్ఞు లయిన పోలీసులు అలాటి ఇద్దరిని ఈ కేసులో నిందితులుగా చేశారు. ఇక్కడ రాజద్రోహపు కుట్ర సంగతయినా ఎందుకు వచ్చింది? నాకు తెలుసు, పరిపాలన యంత్రాంగం సహాయం వున్నా, రైతులు పోలీసును హత్య చేశారని రుజువు చేయడం దుస్సాధ్యమని సర్కారు వకీలుకు తెలుసు. ఆ కారణంగా, ప్రభుత్వాన్ని కూలదోయడానికి ఈ బడుగు రైతులు రహస్యంగా కుట్ర జరిపారని వాదం. ఈలాటి సంఘటనకు అత్యంత తీవ్రమైన స్వరూపం ఇవ్వడానికి ప్రయత్నించారు.... ఇది నడిచిన తీరయినా చూడండి. దర్యాప్తు పేరుతో నిరంకుశత్వం నడిచింది. ఏ వివేచనా లేకుండా అరెస్టులు జరిగాయి. మొదట మొదట రైతులను బెదిరించి, భయపెట్టి నిందితుల పక్షాన ఎవరూ సాక్ష్య మివ్వకుండా చేశారు. పాములు, గద్దలంటే ఎప్పుడూ భయపడే గువ్వపిట్ట గూటిలో నెమ్మదిగా వుందామనుకుంటే, రవి అస్తమించని సామ్రాజ్యాన్నే పాలించే బ్రిటిష్ ప్రభుత్వం దానిపై ప్రయోగించింది బ్రహ్మాస్త్రం...."

ఆయన మాటలు అలలు అలలుగా బయలుదేరి న్యాయస్థానాన్ని వ్యాపించాయి. అక్కడ స్థలం చాలక తలుపులు, కిటికీల గుండా వెలుపలికి ప్రవహించాయి. మాటలు నిండిన వాతావరణంలో ఊపిరి ఆడని న్యాయాధీశులు తాము క్రుంగిపోయామనే భ్రాంతితో నడుం సరిచేసుకుని నిటారుగా కూర్చున్నారు.

........ఆ దినం గడిచి మరొక దినం.

పిళ్ళే, రాజారావు ఖైదీల వద్దకు వచ్చి మాట్లాడారు :

"మా నుంచి సాధ్యమయినదంతా మేము చేశామయ్యా."

చిరుకండడు అన్నాడు :

"తీర్పు ఏ రోజు? ఇంకా ఏముంది?"

"ఏ రోజన్నది రేపు తెలుపవచ్చు. న్యాయాధీశులు ఈ రోజు వ్యవహారాన్నంతా జ్యూరీల కోసం సూక్ష్మ పరిశీలన చేస్తారు" అన్నారు పిళ్ళే.



మాస్టరు మాట్లాడారు :

"జ్యూరీల అభిప్రాయం ఎలా వుండీని?"

"దాని నుంచి ప్రయోజన మేమీ లేదు మాస్టరుగారూ! వారి అభిప్రాయం మీద న్యాయాధీశులు తీర్పు చెబుతారని అనుకున్నారా?"

"అలా కాదు. అయినా...."

"వారిలో ఒకరిద్దరు మినహా తక్కినవారు 'అపరాధులే' అని అనవచ్చు."

రాజారావు అన్నారు :

"తీర్పునాడు కయ్యూరిలోని మీ వారి నందరినీ రమ్మని చెబుదామా!"

"హూఁ" అనాలనిపించింది అప్పుకు, మరి పలువురికి. విడుదల అయిన తర్వాత ఆ క్షణమే బాంధవులను కలుసుకొని కౌగలించుకొనడం ఎంత సుఖకరం! మాస్టరు, ఊరికే వున్న చిరుకండని అభిప్రాయాన్ని అడిగారు; అప్పును కూడ కనుక్కున్నారు. తర్వాత ధ్వని తగ్గించి అన్నారు :

"వద్దు, వాళ్ళకు తీర్పుదినం తెలియరాదు. తీర్పు ఎలా వుంటుందో ఎవరికి తెలుసు?"

....తీర్పు ఇచ్చే దినం తెలిసింది.

ఆ దినం సమీపించిన కొద్దీ ఖైదీల మనస్సుకు శాంతి లేక పోయింది. తన నవ్వులాటల మాటలు ఇప్పుడిప్పుడు విఫలమవుతూ వచ్చాయని దుబ్బోడూ ముఖం గంద్ర చేసుకొని ఈల వేస్తూ కూర్చున్నాడు.

మనసులోని దుఃఖం తట్టుకోలేక అప్పు అన్నాడు :

"తీర్పు చెప్పడానికి ఇన్నాళ్ళెందుకు వీరికి? ఇంకా వారు నిర్ణయించుకోలేదు – అనేనా?"

ప్రభు అన్నాడు :

"తీర్పు వ్రాయాలి కదా! అది నూరు పుటలుంటుందో, వేయి పుట లుంటుందో?"

అలాంటి పరిస్థితిలోను తెలివి తేటల మాటలు అన్నారు మాస్టరు :

"ఇలాంటి సందర్భాలలో న్యాయస్థానాలలో జరిగేదే ఇలాగం ఈ కేసు ఎలా వుండాలి? ఏమి తీర్పివ్వాలి? – అనేదంతా మొదట్లోనే తీర్మానమయి వుంటుంది. విచారణ నాటకమంతా పూర్తయిన తర్వాత తీర్పు చెబుతారు."

ఒక రైతు అన్నాడు:

"ఈ న్యాయస్థానమే చివరిది కాదు గదా!"

కోరడు సాగదీస్తూ అన్నాడు:

"ఏమిటి? మరొక కోర్టులో ఇంకోసారి ఇదే నాటకం జరగాలి అంటారా?"

మాస్టరు నవ్వి అన్నారు:

"ఇంకా సులభం హైకోర్టులో. అక్కడ నిందితుల ముఖం చూడకుండానే తీర్పు చెబుతారు."

....తీర్పు చెప్పే రోజు కయ్యూరు నుంచి ఎవ్వరూ రాలేదు. కాని, మంగళూరువారే న్యాయస్థానంలో కిక్కిరిశారు.

న్యాయాధీశులు ఆ దినం ఆలస్యంగా వచ్చారు. వచ్చీ రాగానే వ్రాసుకొని వచ్చిన దానిని తొందర తొందరగా చదవ సాగినారు — అది నూరు పుటల తీర్పు. పూర్తిగా చదివితే సాయంకాలం వరకు ముగిసేదో, కాదో? ఆయన చదివే వేగం వల్ల, ఏమి చదువుతున్నారో స్పష్టంగా వుండలేదు. నడమ నడమ కొన్ని పుటలను చదవకనే ఆయన తిరగవేశారు. అక్కడ వ్యాపించిన నిశ్శబ్దంలో పుటలు త్రిప్పిన శబ్దం కూడా వినిపించింది........ ఆయన నిదానించింది చివరభాగం వచ్చినప్పుడు మాత్రం. అది శిక్ష వివరం.

న్యాయస్థానం హెడ్ గుమాస్తా ఆ భాగాన్ని మలయాళ భాషలో ఖైదీలకు తెలియజెప్పారు. మొత్తంమీద శిక్ష ఈ విధంగా ఉంది:

రాజ ద్రోహ కార్యక్రమం జరిపిన అపరాధానికి మాస్టరు, అప్పు, చిరుకండడు, కణ్ణడు, అబూబకర్, కుఞంబు, మరి ఇరవై మందికి చెరి ఐదు సంవత్సరాల కఠిన కారాగారవాసం. కృష్ణన్ నాయర్, మరి పద్దెనిమిది మందికి చెరి రెండు సంవత్సరాల కఠిన కారాగార శిక్ష. ప్రభు,



కేశునాయర్, దుబోడు, చంపు, అప్పు తండ్రి, చిరుకండడి తండ్రి మరి తక్కినవారికి విడుదల. పోలీసును హత్య చేసిన అపరాధానికి అప్పు, చిరుకండడు, కుఞంబు, అబూబకర్, కుట్టి, కృష్ణన్ వీరికి మరణశిక్ష. చివరివాడు చిన్నవాడు కావడం – మైనరు, పిన్నవాడు కావడం వల్ల మరణ దండనకు మారు, ఖైదీల బడికి రవాణా కావాలి.

"ప్రాణాంతకమైన దెబ్బ పోలీసుకు ఎవరు తగిలించారో చెప్పడం కష్టం!" అనే అభిప్రాయం తీర్పులో వుంది. అయినప్పటికీ మరణ శిక్ష నలుగురికి పడనే పడింది.

# 8

న్యాయాధీశులు తీర్పు చదివిన తర్వాత కోర్టు కార్యకలాపం ఆ రోజుతో ముగిసిందని ప్రకటించారు. విడుదలయిన ఇరవై రెండు మంది చేతి బేడీలను తీసివేశారు. వారు 'వెళ్ళిపొండి' అన్నప్పటికీ కదలకుండా నిలబడ్డారు. సదా సర్వకాలమూ నవ్వే రాజారావు అప్పుడు మాత్రం నవ్వలేదు. ఆయన ఎర్రటి గుండ్రని ముఖం వేలాడుతూ నల్లబడింది. ఆయన నిలుచున్నారు, ఒక కాలిమీద దేహం బరువు వేస్తూ కొంతసేపు, మరొక కాలిపై బరువు వేస్తూ మరికొంతసేపు, "న్యాయం హత్య ఈ విధంగా అయ్యేనని నాకు తెలియనే తెలుసు" అని పిళ్ళై గొణిగాడు. "అప్పీలుకు ఏర్పాటు చేద్దాము. నిరాశ పడకండి" అని చెప్పి ఆయన తమ వసతి గృహానికి బయలుదేరారు.

ఆ దినం ఉదయం ఖైదీలు నడచి వచ్చిన వెంటనే వారి వెంట పోలీసు వ్యానూ వచ్చింది. ఎక్కువ మంది సాయుధ పోలీసులు వచ్చారు. అయితే తీర్పు సంగతి అధికారులకు ముందే తెలిసి జాగ్రత్త కోసం ఈ ఏర్పాట్లు చేశారని ఊహించడం మాస్టరుకు కూడా సాధ్యం కాలేదు.

కోర్టు వెలుపల మూగిన జనంలో కొంత మంది చెదిరిపోయినా, తక్కిన వారి సందడి దట్టంగానే ఉంది. ఖైదీల కోసం జనం కాచుకుని ఉన్నారు. ఖైదీలు గుజ గుజ మంటూ వెలుపలికి వచ్చారు. మరణ దండనకు గురి అయిన నలుగురిని, కుట్టికృష్ణను తక్కిన వారి నుంచి వేరు చేయాలి. అయితే ఆ పని అంటుకొని వున్న కవల పిల్లలను శస్త్ర చికిత్స చేసి వేరు చేయడం కన్నా కష్టతరమయింది. ఆ విధంగా విడదీసి తమ ఐక్యాన్ని భగ్నం చేస్తారేమోనని ఖైదీలు ఒకరినొకరు అనుకొని నిల



బడ్డారు. కుట్టికృష్ణకు, అబూబకర్‌కు కలిపి బేడీలు వేశారు. స్వయం సేవక దళ నాయకుడు అబూబకర్, బాల సంఘం నాయకుడు కుట్టి కృష్ణుడు. వారిద్దరికి మరణశిక్ష పడినా, వారు ఇక జతగా వుండే అవకాశం లేదు. ఉరితాడు గొంతును బిగించేటంత పెద్దవాడు కాదు కుట్టికృష్ణన్. వారినిద్దరినీ విడదీయడానికి పోలీసులు వచ్చారు. కుట్టికృష్ణుడు "అన్నా, అన్నా!" అంటూ అబూబకర్ రెక్కలు గట్టిగా పట్టుకున్నాడు. బలవంతులైన పోలీసులు ఇద్దరికీ కలిపి వేసిన బేడీలను తీసి, మరొక బేడీ బిగించారు కుట్టికృష్ణుడు పెద్దగా ఏడ్చాడు: "అన్నా! అన్నా! నేను నీతో పాటే వస్తాను." నిస్సహాయుడయిన అబూబకర్ శూన్యంలోకిచూస్తూ నిలబడ్డాడు. కన్నీటి ధారలు చెంపల మీది నుంచి రొమ్ము మీదికి దుమికాయి. వజ్ర హృదయుడని అందరూ అన్న దుబ్బోడు గోడకు ఒరిగి, ముఖానికి భుజాలు మరుగుచేసి ఏడ్చాడు. మాస్టరు ఇప్పుడూ శాంతంగా వుండి చిరునవ్వు నవ్వడానికి ప్రయత్నించారు. తల్లి జతలో తిరగడానికి వెళ్ళిన పిల్లలు చీకటి పడిందని యోచిస్తూ, తల్లిని చూచినట్లు అప్పు చిరుకండడు రాతి బొమ్మలాగ నిలబడిన మాస్టరును చూస్తూ అడిగారు:

"మమ్మల్ని ఇప్పుడే పిలుచుకొని పోతారా సార్?"

తన ఎదుట సదా సర్వకాలమూ విద్యార్థులయిన పిల్లవాళ్ళ ఆత్మీయ భావనను కలిగించే "సార్" సంబోధనం.... మాస్టరు కళ్ళకు కట్టింది. పది సంవత్సరాల వెనుకటి పసివారయిన అప్పు, చిరుకండడు.... ఏమన్నారు వాళ్ళు? మీరు 'జాస్తిగా బీడీలు తాగుతారు కదూ సార్' అనా? 'లేదు అప్పు. లేదు చిరుకండా – నేనిప్పుడు బీడీలు తాగడమే లేదు;' ఏమిటి? అది కాదూ?

ప్రశ్న మరొకసారి వచ్చింది:

"మా నలుగురిని ఇప్పుడే తీసుకుపోతారా సార్?"

గుండె నుంచి దుఃఖం ముద్ద గట్టి గొంతులోకి రావడానికి యత్నించింది. అయితే గొంతు చిన్నది. కాని, మాస్టరు ఎంగిలి మింగి, ఆ ముద్దను కిందికి తోస్తూ అన్నారు:

"లేదోయ్. ఇంకా మనం కలిసే వుంటాం."

ఎవరో అడిగారు:

"వీళ్ళకు ఐదు సంవత్సరాలయిన తర్వాత మరణ శిక్షా వకీలు గారూ?"

అలా కాదన్నారు రాజారావు. ఒక్కొక్క అపరాధానికి ఒక్కొక్క విధమైన శిక్ష. మరణ శిక్షతో పాటు మరొక శిక్ష వున్నప్పుడు, అది మరణ శిక్షలో ఇమిడి పోతుంది.

చిరుకండడు మాస్టరును అడిగాడు:

"విడుదలయినవారు ఈ దినమే కయ్యూరుకు వెళ్ళడం మంచిది కదా సార్?"

అతడు ఎప్పుడూ కార్యదర్శియే. ఎప్పుడూ తర్వాతి కార్యక్రమం ఏమిటనే ఆలోచనే అతనికి.

"హూఁ. ఔను."

"వారి ఖర్చుకు?"

అక్కడ నిలుచున్న రాజారావు అన్నారు:

"వెలుపల మీ వాళ్ళు కొందరున్నారు. అంతా చూచుకొంటారు. ఆ యోచన చేయకండి."

అంతలోనే పోలీసుల గొంతు వినిపించింది:

"ముందుకు నడవండి."

ఈ దినం మిగిలిన ముప్ఫయి ఎనిమిది మంది వీధిలో నడవవలసిన అవసరం లేదు. ఈ న్యాయస్థానం చివరి దర్శనం తర్వాత వారికందరికీ యిప్పుడు మోటారు వాహనాలు.

జనం వారి దగ్గరి దగ్గరికి వచ్చారు. వీరు రైతులుకాదు. కయ్యూరు ఇక్కడి నుంచి చాల దూరం. వీరు పట్టణ వాసులు.... బీదల బాధలు ఏమిటని తెలిసినవారు.... వారి మధ్యన గూఢచారులూ వుండవచ్చు. పూవు కాడకు అంటుకొనే ముళ్ళూ....

మొదట నలుగురు—అప్పు, చిరుకండడు, కుంజంబు, అబూబకర్, తర్వాత— కుట్టికృష్ణుడు, వాడి వెనుక శిక్షకు గురైన మాస్టరు, తక్కిన వారు. వారి వెనుక మోటారును ఎక్కడానికి ప్రయత్నించిన విడుదలయిన వారు.



"మీరు రావద్దు! బుద్ధిలేదూ మీకు! వేయండి తలుపులు!"

ఉద్వేగం నిండిన ధ్వనితో ఎవరో అరిచారు:

"ఇన్‌క్విలాబ్—"

అది అనిరీక్షితం. భయపడుతూ జవాబిచ్చింది ఒకే గొంతు:

"జిందాబాద్!"

మళ్ళీ మొదటి గొంతుకే గట్టిగా నినాదం చేసింది:

"ఇన్‌క్విలాబ్!"

ఇప్పుడు ధైర్యంతో జవాబిచ్చినవి నూరు గొంతుకలు:

పల్లెల వారు, పట్టణం వారూ, వాహనం లోపల వున్నవారు, వెలుపల వున్నవారు నూరారు జనం ఇప్పుడు నినాదం చేశారు!

"నిరంకుశ ప్రభుత్వానికి...."

"ధిక్కారం!"

"సామ్రాజ్యవాదం...."

"నశించుగాక!"

"విప్లవానికి...."

"విజయమగుగాక!"

మూగిన జనాన్ని చెదర గొట్టడానికి పోలీసులు లాఠీలు ఎత్తుతుండగా వాహనం బయలుదేరింది.

చివరి సారిగా పెక్కు గొంతుకల నుంచి వందనం:

"కయ్యూరు బాంధవులకు అరుణ నమస్కారం!"

దానికి, పరుగెత్తుతున్న వాహనం నుంచి పెక్కు ధ్వనుల ప్రతి నమస్కారం.

"కామ్రేడ్స్ అరుణ నమస్కారం!"

....మళ్ళీ ఎత్తయిన చెరసాల ప్రాకారం వెనుక విశ్రాంతి.

జెయిలరు వచ్చి పలుకరించారు:

"అప్పీలుకు వెళ్ళనే వెళతారు, గదూ?"

"అవును."

"సహజమే. వేరే సమయం అయివుంటే ఇంత ఇబ్బంది అయ్యేది కాదు. అయితే ఇది యుద్ధకాలం చూడండి. అందుకోసమే ఇలా."

ఆ మాటలకు జవాబు ఇవ్వవలసిన అవసరం లేదు. యుద్ధమే. యుద్ధంకాక మరేమిటి? దుక్కికోసం, కొత్త బతుకు కోసం యుద్ధం. దానికి ఎదురుగా పాలకుల పైశాచిక దమనశిక్ష.

మరణశిక్షకు గురైన నలుగురిని వేరే గదిలో వేసి తాళం వేశారు. కుట్టికృష్ణుని వేరే చోట. తక్కిన వారికి విడిగా ఏర్పాటు.

మాస్టరు జెయిలరును అడిగారు:

"ఎలాగూ ఇక కొన్ని రోజులు. అందరినీ ఒకేచోట వుండనివ్వరాదా!"

"సారీ. ఇది నియమం. నేను ఏమీ చేయలేను."

చీకటి పడింది. మాటలు తక్కువయి నిద్ర మంపరం వచ్చింది. మాస్టరుతో పాటున్న కణ్ణడు, పిల్లలు లేరని దేవుళ్ళకు మొక్కుకొని. చివరకు పిల్లలు పొందిన పల్లెటూరి తల్లి పాటను నెమ్మదిగా పాడాడు. కాని, ఆ ధ్వని అడ్డంగా వున్న గోడలు దాటి అప్పు, చిరుకండడు, తక్కిన వారిని చేరింది.

కావలివాడు వచ్చి గుసగుసగా అడిగాడు:

"బీడీలు వద్దా ఇవాళ?"

బీడీలు తీసుకొని పంచడానికి దుబ్బోడు అక్కడ లేడు. జవాబే రాలేదు కావలి వాడికి. మాస్టరు అరచేయి ఆడించి వద్దని సైగచేసినట్లయి కావలివాడు ఊరికే వుండిపోయాడు.

— మరొక వారమైనా ఈ చెరసాలలో వుండవలసి వుంటుందని మాస్టరు భావించారు. కయ్యూరినుంచి అందరి బంధువులు చూడడానికి రావాలని చెప్పి పంపాలని ఆయన యోచించారు.

అయితే, మరుసటి ఉదయం రైలులోనే భద్రంగా సాయుధ పోలీసుల రక్షణతో వారి నందరినీ కణ్ణనూరు జైలుకు మార్చడమయింది.

హొసదుర్గం, నీలేశ్వరం, తేజస్వినీనది. చర్వత్తూరు రైలుస్టేషను, త్రికరపురం.... వీరి ప్రయాణవార్త వ్యాపించడానికి అవకాశం లేకుండా రైలు నడిచింది.

అది పెద్ద చెరసాల. దాని ప్రాకారంలో వున్న దొంగలు, దోపిడి గాండ్ల సంఖ్య ఎక్కువో, దేశభక్తుల సంఖ్య ఎక్కువో చెప్పడం కష్టం.



తళిపరంబ రైతు సభలో కయ్యూరువారు కలుసుకొన్న చాలమంది అక్కడున్నారు. "ఓహో? ఏమిటి సంగతులు?" అని వెలుపలినుంచి వచ్చిన వారిని ఆదరంతో పలుకరించే బంధువుల విశాల కుటుంబంవలె ఉంది ఆ చెరసాల....

అయితే అక్కడా నియమ నిబంధన లున్నాయి. మరణశిక్ష పడిన నలుగురినయితే విడిగా పెట్టారు. అది ఇరవైనాలుగు గంటలపాటూ నిర్బంధం. తక్కినవారు పాత ఖైదీలతో కలిసే అవకాశం వున్నది పెరేడులోనో, పని చేసేటప్పుడో మాత్రమే.

పహరా ఇలా వున్నా అక్కడ గోడల నాలుకలు గుసగుసలాడేవి. మూగవారివలె వున్న కావలివారు కొన్ని సమయాల్లో గబుక్కున గదుల వైపు తిరిగి ఏదైనా వార్త తెలిపేవారు. చీటీలు వచ్చేవి....

తర్వాత మిగిలింది మదరాసు హైకోర్టు అప్పీలు విచారణ. విచారణ దినం నిర్ణయం కావడానికి ఆలస్యమయిందే కాని, ఒకమారు న్యాయమూర్తులు కేసును విచారణకు తీసుకొన్న తర్వాత తీర్పివ్వడం ఆలస్యం కాలేదు.

అది ఏకగ్రీవమయిన తీర్పు.

వారి ఘనమయిన అభిప్రాయం ప్రకారం సెషన్సు న్యాయాధీశుల తీర్పు సమర్పకమైంది (సరైంది).

....ఆ వార్త వచ్చినప్పుడు అప్పు ప్రక్కన వున్న గదిలోని చిరుకండడిని అడిగాడు:

"ఇంకైనా ఈ విచారణ పీడ విరుగడయిందో లేదో?"

అది ముగియలేదు. రక్షణ సమితివారు లండన్ ప్రీవీ కౌన్సిల్‌కు వెళ్ళారు. అయితే యుద్ధ కాలంలో భారత దేశానికి సంబంధించిన ప్రీవీ కౌన్సిల్ వ్యవహారాలన్నీ భారతదేశంలోని ఫెడరల్ న్యాయస్థానానికి మార్చారు. ఫెడరల్ న్యాయస్థానం దృష్టిలో మదరాసు హైకోర్టు తీర్పుపై వ్యాఖ్యానించ దగిందేమీ లేదు.

"ఇప్పటికైనా ముగిసింది కదా!" అన్నాడు అప్పు, హృదయంలో కుతకుతలాడే దుఃఖాన్ని అదుపులో పెట్టుకొనడానికి ప్రయత్నిస్తూ.

అప్పటికీ ముగియలేదు. రక్షణ సమితి వైపు నుంచి వకీలు

ఒక్కరు వచ్చి ఆ నలుగురి సంతకాలు కోరారు.

"ఇకనూ ఏదైనా విధానాన్ని చేపట్టుతారా?" అని అడిగాడు చిరుకండడు.

"ప్రాణ దానానికి అర్జీ పెట్టుకోవాలి కదా ?"

అప్పు గర్జించాడు :

"ఎలాటి ప్రాణదానం! ఎవరి ప్రాణాలను ఎవరు దానం చేయడం ? ఒక్కటీ వద్దు. వెళ్ళండి మీరు!"

"అలా కాదు కామ్రేడ్!"

"గౌరవంతో మేము చావడానికయినా వదలుతారా, లేదా?"

వకీలు వైఫల్యంతో వెనుదిరిగారు. అయితే అటు తర్వాత మాస్టరుకు, తక్కిన వారికీ మధ్య రహస్యంగా చీటీలు పరుగెత్తాయి; సందేశాలు అటూ ఇటూ వెళ్ళి వచ్చాయి.

మాస్టరు ఓర్పుతో వాదించారు:

"అలా చూస్తే, ఆ న్యాయ స్థానాలలో మనకు నమ్మిక వుందా ? అయినా మనం వాళ్ళముందు చేతులు కట్టుకొని నిలిచి విచారణకు లోబడ్డాము. ఇదంతా ఒక పద్ధతి అప్పు. మన లక్ష్యమేమిటి ? ఆ లక్ష్య సాధన కోసం మీరు నలుగురు ప్రాణులూ వుండడం అవసరం కాదా? ప్రాణదానం కోసం అర్జీ పెట్టుకోడం అవమానకరమైనదేమీ కాదు. మన ఆ ఉద్దేశాన్ని జ్ఞాపక మ్ముంచుకొని సంతకం చేయండి. దేశంలో ప్రతీ చోటా మిమ్మల్ని బతికించాలని ఉద్యమం జరుగుతున్నదని మీరు మరువ రాదు."

మాస్టరు గెలిచారు. అర్జీ మీద వారి నలుగురి సంతకాలూ పడ్డాయి

కుట్టి కృష్ణుణ్ని దూరంలో వున్న బెజవాడ జెయిలుకు తీసుకుని వెళ్ళారు. తక్కినవారు శిక్ష అనుభవిస్తూ కాలం వెళ్ళబుచ్చారు. నలుగురి ప్రాణాలు కాపాడడానికి మాత్రం దేశమంతటా ఉద్యమం జరిగింది. ప్రపంచంలోని ప్రముఖ నగరాలలోను కయ్యూరు రైతుల పేరు ధ్వనించి, ప్రతిధ్వనించింది.



అయినా పాలకులు చలించలేదు. విషమిస్తున్న ప్రపంచ యుద్ధ జ్వరంలో చిక్కుకొన్న ఆ ప్రభుత్వం జనాభిప్రాయాన్ని మన్నించి తల వంచడం దౌర్బల్యచిహ్నం అయ్యీని అని, మౌనం వహించింది.

రక్షణ సమితివారు, దేశం నాలుగంచుల దేశభక్తులు, కయ్యూరు కుటుంబాలవారు గవర్నర్ ఆజ్ఞ ఎలా వుంటుందో అని ఇంకా నిరీక్షించారు.

ఆ సమయంలో భారతీయ రాజకీయాకాశంలో కారుమబ్బులు కమ్ముకున్నాయి. నాలుగు దిక్కుల నుంచి పెనుగాలి వీచింది. మెరుపులు కళ్ళను మిరుమిట్లు గొలిపాయి. ఉరుములతో చెవులు బద్దలయ్యాయి. మరి ఒక్కుమ్మడిగా ఆగస్టు 9వ తేదీ తెల్లవారి ఆకాశమే పగిలి నీరు కారినట్లు, సముద్రమే కట్లు తెగినట్లు కుండపోతగా వాన కురిసింది. అప్పుడు జలప్రవాహంలాగ వీధివీధిన వాడ వాడన జన ప్రవాహం కనిపించింది. అహింసా మాయాజాలాన్ని చించి జనం బడుగు రెట్టలు భీముని భుజాలయ్యాయి. చెలరేగి న జానిసల పరిక్రమధ్వని గిరికందరాలలో ప్రతిధ్వనించింది.

థర థర వణికిన ప్రభుత్వం, అప్పుడు న్యాయస్థానాల చట్టాల క్రమబద్ధత అనే పద్ధతి మాని తన నగ్నరూపం ప్రదర్శించింది.

ఆ స్వాతంత్ర్య సమర తరంగాలు కారాగార ప్రాకారాలను తాకనే తాకాయి. లోపల వున్నవారు చెవులు రిక్కించి విన్నారు. కారాగారం జనంతో నిండిపోయింది.

అలాటి ఒకరోజు, మదరాసు ఆంగ్ల గవర్నరు కయ్యూరు ఖైదీలు నలుగురి ఉరి శిక్షను రద్దుచేయడానికి నిరాకరిస్తూ ఉత్తరువు చేసిన వార్త చెరసాలకు చేరింది.

అప్పుడు అప్పు చిరుకండణ్ణి అడిగాడు :

"ఈసారయినా ముగిసింది నిజమే కదా?"

చిరుకండడు నవ్వి అన్నాడు :

"హూ! ఇక ప్రశాంతతతో ఒకరి చేతులు ఒకరు పట్టుకొని నవ్వుతూ ఉరికంబం ఎక్కుదాము అప్పు!"

....అయితే ప్రభుత్వానికింకా తీరిక లేదు. ఆ నలుగురు ఉరిశిక్ష అనుభవించవలసిన దినాన్ని తర్వాత గూడ చాలా కాలం వరకు నిర్ణయించలేదు.

# 9

అప్పుకు ఒకరాత్రి విచిత్రమైన కల పడింది: విప్లవకారుల సైన్యం కారాగార ప్రాకారాలను ఛేదించి లోపల ఉన్నవారి బేడీలను తొలగించినట్టు, దేశం నాలుగంచులా బంధ విమోచన జనసేన జైత్రయాత్ర జరుపుతూ ఆంగ్లాధికారులనూ, వారికి తమ ఆత్మలను అమ్ముకున్న దేశీ నౌకర్లను, పాలిస్తున్న రాజులు – జమీందారులు – పెట్టుబడిదారులనూ పట్టి బంధించినట్టు——

కలను చిరుకండనికి అప్పు గది తలుపు సందుల నుంచి వివరిస్తూ అన్నాడు :

"అలా బంధించి చెరపట్టిన వారిలో నంబియారు ఉన్నాడోయ్? అతడు గోడు పోసుకుంటూ,ఏడుస్తూ 'అప్పు మునుపు రాత్రి పాఠశాల నడపడానికి అనుమతి ఇవ్వలేదా? నన్ను విడిపించు నాయనా?' అంటున్నాడు. కాని, నేను, నీవు, కుఞంబు, అబూబకర్ – నలుగురం భుజం మీద తుపాకి మోసుకొని, చేయి చేయి పట్టుకుని పాడుతూ, నవ్వుతూ ముందుకు వెళ్ళాం. కణ్ణడు అందరికన్న ముందుగా గొంతు వినబడనంత దూరంలో జెండా పట్టుకొని వున్నాడు. మాస్టరూ, పండితులూ మనకన్నా చాలా దూరంలో వున్నారు. పండితులు మీసాలు పెంచారోయ్, మాస్టరు! 'పరుగెత్తవద్దండ్రా.... నిదానంగా పోండ్రా' అని అరుస్తున్నారు.... అయితే అంతలోకే మెలకువ వచ్చింది?"

స్వారస్యంగా వున్న ఆ వివరణను చిరుకండడు ఆసక్తితో విని. "కల అనేది ఎప్పుడూ మనసులో వుండే ఏదో ఆశల మరొక రూపం." అన్నాడు.



అక్కడి నుంచి మరొక గోడ ఆవల వున్న కుఞంబుకు ఆ వివరాలు వెళ్ళాయి. అతడు అబూబకర్‌కు దానిని తెలిపాడు. అది కేవలం స్వప్నం వివరణే అయినా, అందరూ మురిసిపోయారు.

అబూబకర్ అన్నాడు:

"మనం నలుగురం వుండకపోవచ్చు. అయితే ఏదో ఒకరోజు అలా జరిగేదీ, నంబియారుకు ఆ స్థితి దాపురించేది ఖాయం."

కుఞంబు, అబూబకర్ మాటను చిరుకండనికి దాటించారు. అతడు దానిని అప్పుకు అందించాడు.

ఇలా గొలుసు కట్టుగా వారు నలుగురూ సంభాషణలో నిరతులయ్యారు.

అయితే కలకన్నా దూరంగా వుంది వాస్తవికత. వర్షం నిలిచింది. జనప్రవాహం తగ్గిపోయింది. ఐకమత్యం లేని, నాయకత్వం లేని పోరాటాన్ని ప్రభుత్వం అణచివేసింది....

కయ్యూరు ఖైదీలు నలుగురిని ఉరితీయడానికి పాలకులు దినం నిశ్చయించారు. అది మళ్ళీ ముందుకు పోయింది. దినం మొదట్లోనే ప్రకటించడం మూర్ఖత్వం అయ్యాసని, జనం ఉగ్రులై పరిస్థితి విషమించవచ్చునని ప్రభుత్వం భయపడింది.

అప్పు రెచ్చిపోయి అన్నాడు :

"ఎలాటి హింస! ఒకేమారు ముగించరాదా?"

దెబ్బతిని పడుకొన్న కొండచిలువ లాగ మనస్సు రోసిన ఆ స్థితిలోనూ, దినమూ మాస్టరు ఎవరో కావలివారిని ఆ నలుగురి వద్దకూ పంపి యోగక్షేమాలు కనుక్కొనేవారు.

కుఞంబు ఆరోగ్యం అంత బాగులేదు. అతడు లేవడం ఆలస్యమయితే కుడి ఎడమల వున్న అబూబకర్. చిరుకండడు భయపడుతూ "ఒళ్ళు బాగలేదా కుఞంబూ?" అని అడిగేవారు. చిరుకండడు నిద్రలో పలవరిస్తే అప్పు మేల్కొని, పిలిచి అడిగేవాడు: "చిరుకండా! ఎందుకలా పలుము తావు?"

వారు, ఒకరి నొకరిని విడదీసిన గోడలున్నా, ఒకరి ముఖం మరొకరికి కనిపించకపోయినా, సదా సర్వకాలమూ పరస్పరం చూస్తూ, మాట్లాడుతూ కలిసే వున్నామేమో అనేలాగ రోజులు గడిపారు.

ఉరితీసే రోజును చివరివరకు రహస్యంగా వుంచుతారనీ, నెల చివర మరణ శిక్ష అమలు కావచ్చునని కచ్చితమయిన వార్త అధికారుల కనులు గప్పి జాగ్రత్తగా చెరసాల ప్రవేశించింది.

అప్పు, మరి ముగ్గురు కామ్రేడ్ల బంధువులను చివరి చూపులకు పిలిపించే విషయంలో ఆలస్యం కాకూడదని మాస్టరు కార్యోన్ముఖులయ్యారు.

ఆ నలుగురు కయ్యూరు యోధుల బంధువులు కణ్ణనూరుకు వచ్చి ఖైదీలను చూడడానికి రావడం ఒక మధ్యాహ్నం.

ఉక్కపోయడంవల్ల అప్పుకు నిద్రమగత వచ్చింది. కళ్ళు అరవిచ్చి అలాగే గోడకు ఒరిగి కూర్చున్నాడు. ఎవరో ఎదుట నిలుచున్నట్టు మసక మసకగా కనిపించింది. అంతా తెలుపు. మహిళ, పాపడు.

"జానకీ!" అంటూ అప్పు దిగ్గున లేచి కూర్చున్నాడు.

అది కల కాదు. పసివాడిని చేయి పట్టుకొని నిలబెట్టుకొని జానకి అక్కడ వుంది.

"అప్పా! అమ్మా?"

కుమారునితోపాటు చెరసాల సుఖం అనుభవించి గ్రామానికి వెళ్ళిన అప్పు తండ్రి తల్లితోపాటు వచ్చాడు.

లేచి నిలబడి అప్పు తలుపు వద్దకు వచ్చాడు. తెల్లటి మీసాలు. దవడలను ఆవరించిన తెల్లటి గడ్డం....

కుమారుణ్ణి చూస్తూ తల్లి వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఎందుకమ్మా ఏడుస్తావు?"

తండ్రి అన్నాడు – నీకింకా అనుభవం చాలదు అనే గొంతుకతో:

"నీవు వూరికే వుండు అప్పు. ఏడవనీ!"

ఆ తల్లి అన్నది :

"కన్నతల్లి వద్ద ఏనాడయినా, కన్నీళ్ళు తక్కువవుతాయా అబ్బాయ్?"



జానకి పాపడిని ఎత్తుకుంది. మూడేళ్ళ ఆ చిన్న పాపడు తండ్రి ముఖం చూచాడు. పరిచితుడు కాడు. తాత, నాయనమ్మల ముఖం చూచాడు. ఆ ముఖ భావాలు నచ్చలేదు. తల్లిని చూచాడు. అక్కడా కళ్ళు కన్నీళ్ళు కక్కుతున్నవి. ఒక్కదానినీ సహించనన్నట్టుగా గట్టిగా ఏడ్చాడు. అప్పుకూ ఏడిచేట్టయింది.

అప్పు, అక్కడే దూరంలో కూర్చున్న ఒక కారాగారాధికారిని, నిలుచున్న పహరావాడిని చూచాడు. తాను విప్లవకారుడనే విషయం జ్ఞాపకానికి తెచ్చుకొంటూ, మనస్సును చిక్కబట్టి భార్యను అడిగాడు :

"చివరకు బాబుకు ఏమి పేరు పెడదామని నిశ్చయించారు, జానకీ?"

"అప్పు కుట్టి అనే!"

"నీ కొడుక్కి ఇంకేమి పేరు పెట్టమంటావు నాయనా?" అంటూ తల్లి కన్నీళ్ళు తుడుచుకుంటూ కోడలి మాటలను సమర్థించింది.

అప్పు నవ్వాడు. ఆ నవ్వును చూచి అప్పుకుట్టి ఏడుపు ఆపి, పళ్ళు ఇగిలించి "ఇహి!" అన్నాడు.

ఇలాటి భేటీలలో సమయం విలువ ఎంతటిదని తెలిసిన అప్పు తండ్రి అన్నాడు :

"ఊరికే నిలబడకండి. మాట్లాడండి."

అయితే ఏమిటీ!....ఏ విషయం? పెద్దవాడయిన తండ్రి అలా అన్నప్పటికీ వారు మౌనంగానే ఉన్నారు.

తర్వాత సంగతుల కోసం తడువుకుంటూ అప్పు అన్నాడు :

"అక్కను ఇటీవల చూచావా?"

"హూఁ."

"పాప కులాసాయేనా?"

"హూ! చేతనకు అప్పుడే ఐదు నిండాయి. వచ్చే ఏడు బడికి వేద్దామంటూంది అక్క."

"మంచిదే?"

పూర్వం కయ్యూరిలో ఆడపిల్లలు బడికి వెళ్ళేవారు కారు. ఇప్పుడు ఆడపిల్లలను పంపే మాటలు వినవస్తున్నాయి. మంచిదే.

అమ్మవైపు తిరిగి అప్పు అడిగాడు :

"అవ్వ కులాసాయేనా అమ్మా ?"

"హూ ! నాయనా !"

"తమ్ముడు ?"

"పాపం పనంతా వాడే ఇప్పుడు చూసుకుంటున్నాడు."

చిన్న తమ్ముడి జ్ఞాపకం పీడించగా అప్పు అడిగాడు :

"కుట్టి ఇప్పుడు పెద్దవా డయి వుంటాడు కదూ ? వాడిని సరిగా చూస్కో అమ్మా ? వాడిని చాలా చదివించాలి."

చదివించే మాట ఒక పాత జ్ఞాపకాన్ని కెలికింది.

"నాన్నా నేను చెడు సావాసంలో పడుతానని మునుపు అనుకున్నావు, కదూ నాన్నా ? నేను సోమరి కాలేదు. కాని కన్నవారికి సుఖమూ ఇవ్వలేదు."

"అలా మాట్లాడరాదు అప్పు."

అక్కడ వున్న పహరావాడు గట్టిగా అన్నాడు :

"పొద్దయింది. బయలుదేరండి !"

ఆ సూచన విని అందరి దుఃఖమూ హెచ్చింది. అంతవరకు వున్న గాంభీర్యం కరిగి జానకి కుత్తుక నరాలు బిగుసుకున్నాయి. పెదవులు కంపించాయి.

అప్పు అన్నాడు :

"పక్క గదిలో చిరుకండడు ఉన్నాడమ్మా, మేము చిన్నవాళ్ళంగా ఉన్నప్పుడు నీవు నేంద్రం అరటిపండు ఇవ్వడం ఎప్పుడూ జ్ఞాపకం చేసుకుంటుంటాడు. మాట్లాడించి పోమ్మా."

తల్లి తండ్రీ చిరుకండని వద్దకు కదిలారు.

అప్పు రెండు చేతులనూ వెలుపలికి చాచి జానకి బుజాలు పట్టుకున్నాడు.

ఎంతో కష్టంమీద ఆమె అడిగింది :

"ఎప్పుడు ?"

"తెలీదు జానూ....మనం కలుసుకోవడం బహుశా ఇదే చివరిది."



"అయ్యో !"

"ఏడవద్దు జానూ !"

ఆమె బుజాలు వదలి అప్పు, పిల్లవాని ముఖం తనవైపు లాక్కొని ముద్దు పెట్టుకున్నాడు.

"పిల్లవాడిని చూచుకో జానూ !"

"హూ ! "

చెప్పదలచిన ఒక విషయాన్ని చెప్పలేక సంకటపడుతూ అప్పు అన్నాడు :

"ఒక్క సంగతి జానూ...."

పహరావాని గొంతు మరింత బలంగా వినిపించింది :

"బయలుదేరండి. పొద్దయింది ! వేరేవాళ్ళ దగ్గర ఎందుకండి మాట్లాడతా రక్కడ ?"

జానకి అన్నది :

"చెప్పండి....చెప్పండి !"

"నీవు యికమీద ఎవరినన్నా...."

జానకి తన అరచేతితో అతని నోరు మూసింది. ఉద్వేగంతో అతడు దానిని తడిపాడు.

తల్లి, తండ్రి చిరుకండని మాట్లాడించి వచ్చారు.

"వాడి ఇంటివాళ్ళూ వచ్చారు. అందరూ వచ్చారు. కలిసే వచ్చాము" అన్నాడు అప్పు తండ్రి.

మళ్ళీ ఏడుపు ప్రారంభించిన తల్లిని చూచి అప్పు అన్నాడు :

"అమ్మా ! ఏడవద్దమ్మా, ముందు ముందు ఒకనాడు మన రాజ్యం వస్తుంది. అప్పుడు పెద్దకొడుకును కానుక యిచ్చిన వీరమాత అని నిన్ను పూజిస్తారు ?"

"అయ్యో !"

మళ్ళీ పహరావాని గొంతు :

"బుద్ధి లేదూ మీకు; నడవండి !"

తండ్రి గొంతు :

"వస్తాము అప్పు...."

వారు కదలడానికి ఇష్టం లేని పాదాలను లాక్కుంటూ వెళ్ళారు. వెనక్కురాని చూపులను బలవంతాన పెకలించుకొని ఈడ్చుకొంటూ వెళ్ళారు. అప్పు నిలుచున్న చోటే నిలుచున్నాడు....

....వీపు వంగిపోయిన బూబమ్మ "ఎక్కడున్నావు రా!" అంటూ ఏడుస్తూ పిలుస్తూనే చిన్న కొడుకుతో పాటు వచ్చింది. ఆమె అప్పును చూచింది, పిదప చిరుకండణ్ణి, తర్వాత కుఞంబును.

"రామ్మా, రా!" అని అబూబకర్ పిలిచాడు.

ఏడుస్తూనే ఆమె తలుపు కమ్మల సందుల లోపలికి చేతులు పెట్టి కొడుకు ఒళ్ళు తడివింది. ముక్కు, మొగం, బుజాలు తాకి చూచింది.

"నీ తండ్రి అలా చేశాడని నీవు ఇలా చేసిపోతున్నావు కదరా?"

"ఏడవ్వద్దమ్మా, అబ్దుల్లా నిన్ను కాపాడతాడు."

వెంటనే చిన్నకొడుకు వైపు తిరిగి బూబమ్మ అన్నది:

"వాడు నన్నేమి కాపాడుతాడు! మన్ను! నా మాట ఒక్కటయినా వింటాడా అని నీవే కనుక్కో!"

"ఎందుకురా అబ్దుల్లా? అమ్మ మాట వినవేమిరా?"

ఆ తమ్ముడు ప్రేమ నిండిన చూపుతో అన్నను చూస్తూ మాటలాగాడు:

"వింటా నన్నా. అయితే నేను పుస్తకం చదవడం చూస్తే అమ్మ తిడుతుంది."

ఆ పరిస్థితిలోను అబూబకర్‌కు నవ్వు వచ్చింది.

"మంచి అమ్మ; చదివితే తిట్టొచ్చా?"

తనకు అవమానమయిందని బూబమ్మ నొచ్చుకుంది.

"చదివితే ఎందుకు తిడుతాను నేను? చదివి చదివి ఊరు వదలరాదూ అనే కడుపు మంటతో ఏమైనా అంటాను ఒక్కొక్కప్పుడు."

"అదేమో సరేనమ్మా, అబ్దుల్లాకూ అంత మాత్రం తెలీదా?"

బూబమ్మ అబ్దుల్లాను తనవైపు లాక్కొని పెద్ద కొడుకు వైపు చూచి అన్నది:

"నీ కోసం ఫలహారాలు తెచ్చాను. అయితే దానిని లోపలికి వదలలేదు."



"నీవు వచ్చావు కదమ్మా. అదే చాలు!"

ఆ మాటలు వినగానే తాను వచ్చిన సందర్భం జ్ఞాపకం వచ్చి బూబమ్మ ఆవేదన తట్టుకోలేక ఏడుస్తూ ప్రభుత్వాన్ని శపించింది.

అబూబకర్ తల్లిని ఊరడిస్తూ అన్నాడు:

"రేపు ఎవరయినా నీ పెద్ద కొడుకు ఏమి చేసేవాడు అని అడిగితే ఏమి చెబుతావు?"

"నాకు తెలీదా! బీడీ పనివాడుగా వుండేవాడని చెబుతాను...."

అలా అంటూనే కొడుకు ఎన్నోసార్లు ఇచ్చిన నిర్దేశం జ్ఞాపకం వచ్చి ఆమె అన్నది:

"సంఘం దళానికి నాయకుడయి వుండేవాడని చెబుతాను."

"భేష్ అమ్మా! అప్పుడు నిన్ను జనం గౌరవిస్తారు."

తల్లి కొడుకుకు ఒక రహస్యం చెప్పింది:

"ఇప్పుడూ అంతేరా అబ్బాయ్. మొదట బూబమ్మను ఎవరు పలకరించేవారు? ఇప్పుడు అందరూ కష్ట సుఖాలు విచారించేవారే.... అయినా నీవు వారి చేతికి చిక్కకుండాల్సింది. కొడుకా!"

"నేను ఎప్పుడూ నీ పక్కనే వున్నానని అనుకోమ్మా."

అబ్దుల్లా అన్నతో అన్నాడు:

"అమ్మ ఎన్నోసార్లు నన్నే అబూబకర్ అని పిలుస్తుంది అన్నయ్యా!"

"ఔనా! నీవు బుద్ధిమంతుడివి. అమ్మను వదలి వుండవద్దు."

"హూం. అన్నయ్యా"

మళ్ళీ పొద్దు అయింది అనే కావలివాని అరుపులు.

"పోతూ పోతూ అప్పు, కుఞంబు, చిరుకండడు – అందరినీ మాట్లాడించి పోమ్మా."

"హూం. చివరికి నాకీ గతి తెచ్చిపెట్టావు కదరా!"

ఏడుస్తూ బూబమ్మ కుఞంబును చూచింది. చిరుకండణ్ణి గుర్తుపట్టింది. అప్పు వద్ద నిలిచి అన్నది:

"నా కొడుకు యింకా చిన్నవాడు. వాడికేమీ తెలీదు. వాడిని ఎప్పుడూ వదలి వుండొద్దంది నాయనా...."

బూబమ్మ వెళ్ళుతుండగా అప్పు కంపిస్తున్న స్వరంతో చిరుకండనితో అన్నాడు :

"ఒక్కొక్కరే్న విడుస్తారు సర్కసులోలాగ. ఒకేమారు వాళ్ళందర్నీ పంపితే ఏమయ్యేదో!"

వస్తున్నవారు ఎవరని చూస్తూ చిరుకండడు అన్నాడు :

"మా అమ్మను సమాధానపరచి పంపితే చాలు. వీళ్ళు ఏడుస్తుండడం చూస్తూ వుండటం ఎంత బాధ!"

వచ్చినవారు కుఞంబు తల్లి—తండ్రి, భార్య శ్రీదేవమ్మ.

మళ్ళీ అదే విలాపం—మౌనంగాను, గట్టిగాను.

"అన్న బాగున్నాడా నాన్నా?"

"హూఁ. కుఞంబు. నీ అన్న వచ్చిన కొన్నాళ్ళు చప్పగా వున్నాడు. ఇప్పుడు హుషారుగా వున్నాడు. నీ తమ్ముడికి వచ్చే నెల పరీక్ష."

"నారాయణుణ్ణి నీలేశ్వరానికి పంపాలి నాన్నా. వాడు చాలా చురుకైనవాడు. వాడిని ఎట్లయినా కాలేజీలోను చదివించాలి."

ఏడుస్తున్న తల్లి అన్నది :

"నీ భార్యకింత చెప్పు నాయనా. ఆమె ఒక్కనాడయినా సరిగ్గా భోజనం చేసి వుంటే...."

శ్రీదేవమ్మ నేలను చూస్తూ కాలిగోటితో నేలమీద గీతలు గీస్తూ, పైటను నోట కరుచుకొని మౌనంగా ఏడుస్తూంది.

మనో వికారాలను ఎప్పుడూ బయటకు చూపని కుఞంబు అన్నాడు:

"అత్త మనస్సు నొప్పించవద్దు శ్రీదేవి."

మరొక బాధ ఏదో పొడుస్తున్నట్లు తండ్రి అన్నాడు :

"ఆమె యింకా చిన్నది...."

అలాగే వదిన, తక్కినవారికి సంబంధించిన మాటలు, పొలం సంగతి, గిత్తల సంగతి.

...కన్నీళ్ళొత్తుకుని బయలుదేరుతూ వాళ్ళూ తక్కిన వారినీ పలకరించి వెళ్ళారు....



చివరకు వచ్చినవారు చిరుకండని తల్లి, తండ్రి, భార్యా.

ఆ తల్లి కొడుకు చేతివ్రేళ్ళను గట్టిగా పట్టుకొంది. తలపై చేయి ఆనించింది. తనదే అయిన ఆ మాంసం ముక్కను తాకి చూచింది. ఆమె ఆక్రందనాన్ని చిరుకండడే కాదు పక్కన వున్న అప్పూ, కుఞంబు ఎవ్వరూ సహించలేక పోయారు. అంతవరకూ విగ్రహం లాగ ఎక్కడో దూరంగా చూస్తూ కూర్చున్న అధికారీ ఊగిస లాడాడు. పహరావాడు ముఖం తిప్పుకున్నాడు.

"వారందరికీ వేరే కొడుకులున్నారు. నాకు ఎవరున్నారు చిరూ? అయ్యో! నాకెవరున్నారింక?"

వంశానికి దీపమై మిగిలినది ఒకే తునుక. ఆ దీపాన్నే ఆర్పివేయ డానికి దుర్మార్గమైన చేతులు ముందుకు వచ్చాయి.

"ఏడవ్వద్దమ్మా. నాకు బదులు, ఇంకా నూరుమంది నీకు పిల్లలు చూపవలసిన ప్రేమ చూపుతారు."

ఆ రెండేండ్లలోనే తల పండిపోయిన తండ్రి సమాధాన పరుస్తూ అన్నాడు :

"ఏడవరాదు కల్యాణీ! ఈ బిడ్డను కూడ భగవంతుడు ఇవ్వనేలేదు అని అనుకో."

"కటికవాళ్ళు! రాతి గుండెవాళ్ళు! కన్న పేగు సంకటం మగ వారికి మీకేమి తెలుసని!"

"అమ్మా..."

సంవత్సరాల క్రితం తాను వ్రాసిన కరపత్రాలను చదువుతున్న అమ్మాయి. "అప్పు అన్నయ్యతో ఈ రోజు చీరలు పంపలేదూ?" తన భార్య, తననే చూస్తున్న రెండు కళ్ళు.

ఆమె అన్నది :

"అన్నయ్య మీకు అరుణ నమస్కారాలు తెలిపారు."

ఆమే కదూ ఆ మాటలు పలికింది! తన భార్య వట్టి ముగ్ధ అని ఒక్కొక్కసారి అనుకొనేవాడు చిరుకండడు... అది తప్పు భావన. ఇక్కడ, తాను ఆమెను ఓదార్చడం లేదు. ఆమె తనకు కొత్త శక్తి యిస్తున్నది...

"చందూ మళ్ళీ దుకాణం పెట్టాడా ?"

"హూఁ. మునుపటిలాగే. . ."

మునుపటిలాగే! అహ్హా!అహ్హా! తనతో ఆమె పలికిన మాట. నిజంగా ఈమె సహచరుడయ్యే యోగ్యత తన కుందా? జీవితమంతా ఇలాంటి సహచరిని పొందేవాడు ఎంత సుఖవంతుడు!

తల్లి రోదిస్తూనే వుంది:

"అయ్యో! అయ్యో! చిరూ! అయ్యో కందూ!"

"అమ్మా ఏడవకూడదు. నాకు సంకటమవుతుంది. నేనూ ఏడవనా? ఇదిగో ఈ రోజు నుంచి ఈమెను నీ కూతురని భావించి చూసుకో. దాని సుఖమే నా సుఖమూ అని..."

మాట సగంలోనే ఆగిపోయింది. రెండు సంవత్సరాల కాలమంతా "ఇలా అయితే" "అలా అయితే" అని మనస్సును కలవర పరచిన ఆలోచన, ఏమి చెప్పాలనే నిర్ణయం సముచితంగానే ఉన్నవి. అయితే చెప్పవలసిన సమయంలో గొంతే చేయి వదలింది.

తండ్రి అడిగాడు:

"దినం తెలిసిందా?"

"ఇంకా లేదు."

"తెలిసిన తక్షణం చెప్పి పంపు. ఇంకొకసారి వస్తాము."

ఇక రావడం వద్దు అనాలని అనుకున్నాడు చిరుకండడు. అయితే, అలా చెబితే వారందరికీ నొప్పి కలుగవచ్చునని వూరుకున్నాడు.

కూర్చున్న అధికారి లేచి, నేరుగా మరొకవైపు చూచాడు. పహరావాడి అనుజ్ఞ వచ్చింది.

"ఇక బయలుదేరండి."

చేతిని అదిమిన అరచేయి. తామరపూవుమీద పెండినీరు నిలిచినట్లు కళ్ళల్లో కన్నీళ్ళు.

ఆ తల్లికైతే మూర్ఛ వచ్చింది. అప్పుడు ఆమెకు యావజ్జీవం సహచరుడైన మగవాడు ఆధారమయ్యాడు. కోడలూ ఆమె బుజానికి బుజమిచ్చింది.



"వస్తాము చిరూ....వస్తాము అప్పూ. కుఞంబు, అబూబకర్ వస్తాము నాయనా."

చివరి గదినుండి అబూబకర్ పగిలి బీటలు వారిన స్వరం.

"కయ్యూరు వారి కందరికీ మా అరుణ నమస్కారం చెప్పండి కామ్రేడ్స్. మేము బ్రతికింది ఎందుకు? చావడం ఎందుకు? అని ఎవరూ మరచిపోరాదని చెప్పండి."

"చెప్పుతాము నాయనా—"

మళ్ళీ చిరుకండని కోసమే చివరి చూపులు....

.... ఆ సందర్శనం అయిన మీదట నెలకొన్న మౌనం క్రూరమయినది. తమచుట్టూ కాలమనే సాలీడు అల్లిన నల్ల వలలను ఆ నలుగురూ ఒక్కటిగా మళ్ళీ కప్పుకున్నారు. (చీకట్లు ముసిరాయి.) ఒక్కొక్క గదినుంచి మాటల ధ్వని వెలువడింది.

.... ఆ రోజు గడచి ఒక వారమయిన తర్వాత జెయిలు అధికారి నుంచి వారికి సూచన వచ్చింది:

మార్చి 29 న మరణ శిక్ష.

"ఈ దినం ఏం వారం!"

"ఓ! ఇక రెండేరోజులు!"

రెండు రోజులు రెండు నిమిషాలలాగ గడవ కూడదా?"

"ఇప్పుడు నా మనస్సు సమాధాన పడింది."

# 10

సంధ్యా సూర్యుడు చిరునవ్వు నవ్వుతున్నాడు. ఆ రాత్రి గడిచి తెల్లవారితేసరి....డిక్-డిక్-డిక్ అనే జెయిలరు బూటుకాళ్ళ చప్పుడు.

"మీ రాత్రి భోజనానికి ఏం కావాలి ? చెప్పండి."

"రాత్రి భోజనానికా ?"

"మీకు ఏదేది ఇష్టమో అదంతా చేయిస్తాము."

"మా కేమీ వద్దు."

"మీ చివరి ఆశ ఏమిటి ? తీరుస్తాము."

"ఏమి అప్పు ? ఏమి కుఞంబు ? అబూబకర్, చెప్పండి. మన చివరి ఆశ చెబితే తీరుస్తారట !"

అబూబకర్ నవ్వు. వ్యంగ్యధ్వని !

"సామ్రాజ్యవాదం నాశనం కావడం చూచి చావాలని మా ఆశ, తీరుస్తారా ? అడుగు చిరుకండా !"

"ఆహా !"

అయినా, అప్పును చిరుకండణ్ని ఒక విషయం వేధించేది :

మాస్టరు....మాస్టరును చూడడం సాధ్యమయితే ?

"ఇదొక ఆశ వుంది కుఞంబ. అడుగుదామా అబూబకర్ ?"

"అడుగు కామ్రేడ్."

"జెయిలరుగారూ, మాకంతా ఉండేది ఒకే ఆశ. మా మాస్టరుతో భేటీ ఏర్పాటు చేయండి."

చెరసాల నియమాలు....

"అతడు ఖైదీ. అది సాధ్యమో కాదో.... సూపరింటెండెంట్ గారిని అడుగుతాను."



* * * *

రెండు జతల బూట్ల సద్దు. మళ్ళీ ఎవరు ? సూపరింటెండెంట్ గారు వచ్చారా ?

వారు తుపాకి ధారులయిన పహరా జవానులు. మధ్య మాస్టరు-ఒక్కొక్క చేతిలో ఒక్కొక్క గొలుసు....

నలుగురూ లేచి నిలుచున్నారు. తరగతిలోని విద్యార్థుల లాగ.

జెయిలరు వచ్చి అన్నాడు :

"చూడడానికి సమ్మతించారు. అయితే, ఎక్కువ ఆలస్యం చేయకండి"

వణుకుతున్న గొంతుతో చిరుకండడన్నాడు :

"మీరంతా కొంచెం దూరంగా వెళ్లతారా ?"

"సారీ, భేటీ సమయంలో మేమంతా ఇక్కడే వుండాలని పైవారి ఉత్తరువు."

అబూబకర్ మండిపోతూ అన్నాడు :

"రహస్యంగా మేము ఇంతలోనే మరొక కుట్ర నడపవచ్చునని భయం, కదూ ?"

"ఉండనీలేవోయ్ అబూబకర్ !"

మాస్టరు ఆ నాల్గు గదుల ఎదుట నిలిచి ఆ నలుగురినీ చూచారు. చిరునవ్వు నవ్వడానికి ప్రయత్నించారు.

మాట్లాడాలి, భేటీ ఏర్పాటు చేయడం సంభాషణల కోసం, అందులోను చివరి భేటీ.

అయితే, నిమిషాలు నిశ్శబ్దంగా దొర్లి పోయాయి.

మాస్టరు ఆ ప్రశిష్యుడైన చిరుకండడు అన్నాడు :

"రేపు ఉదయం మే మందరం వెళ్ళిపోతున్నాము సార్."

ప్రియ శిష్యుడైన అప్పు అన్నాడు :

"మమ్మల్ని మరవద్దండి సార్."

ఆ మాటలకు చెవి ఒగ్గడం తట్టుకోలేనంత బాధ. ఎందుకని ఈ పిల్లవాళ్ళు ఇలాటి భేటీ కావాలన్నారో? ఇంకా ఆ కుఞంబు,అబూబకర్.... ఒకరి ముఖం నుంచి మరొకరి ముఖాన్ని చూస్తూ నిలుచున్నారు మాస్టరు.

లేదు, మాట్లాడేదేమీ ఉండలేదు. మాటలు సాధ్యం కాలేదు.

ఇంకా ఒక నిమిషం ఆలస్యమయితే, దుఃఖం కట్టలు తెంచుకోవచ్చు. అది సరికాదు. అలాటి వీడ్కోలు మంచిదికాదు.

ఏదో మాట్లాడాలని మాస్టరు అన్నారు :

"అప్పు - చిరుకండడు, అందరూ కలిసే ఉండండి... కుఞంబు - అబూబకర్."

"ఉంటాము; జతలోనే వుంటాము."

ఇక అక్కడ నుంచి వెళ్ళిపోవడమే మంచిదని గొలుసులు బిగించిన కుడిచేయి యెత్తి పిడికిలి బిగించి వందనం చేస్తూ మాస్టరన్నారు.

"అరుణ నమస్కారం కామ్రేడ్స్ !"

"అరుణ నమస్కారం సార్ ! అరుణ నమస్కారం కామ్రేడ్!"

చివరి ఆఖరి భేటీ ఆ విధంగా ముగిసింది.

* * *

కారుచీకటి. గదుల వెలుపల నక్షత్రరాశి విరజిమ్మిన మసక వెలుగు. అప్పుడప్పుడు "ఆల్-వెల్" కూతలు. పహరావాడు గంటలు కొడుతున్నాడు. ఎనిమిది తొమ్మిది, పది....నిద్రకు ఆ రాత్రి అక్కడ పనిలేదు. గడియల గిన్నె కొంచెం కొంచెంగా ఖాళీ అవుతున్నది. అయినా, వారి భావాలు ప్రపంచ సంచారం చేస్తున్నవి. కయ్యూరు - కయ్యూరు అక్కడినుంచి స్టాలిన్ గ్రాడ్‌కు; అక్కడినుంచి లండనుకు... ఢిల్లీకి....

"చిరుకండా! కుఞంబు ఏమి చేస్తున్నాడు? మాట్లాడమను అబూబకర్‌ను."

"ఏమి మాట్లాడాలట?"

"ఏమయినా...."

బాల్యానికి సంబంధించిన ఏదో విషయం, ఏదో జ్ఞాపకం.

చిరుకండని మనస్సు, రైతు సభను ఏర్పాటు చేయడానికి తాము పాటుపడుతున్న రోజులను గురించి ఆలోచించింది. ఆ సుబ్బయ్య.... అతనికి భార్య, పిల్లలు ఉన్నారట. అయితే, అతడు పరకీయ ప్రభుత్వం కావలికుక్క, కుక్కవలె చచ్చాడు. తాము అతనిని చంపలేదు. కాని, ఆ చావు నెపంతో తమ హత్యకు ఏర్పాటు చేశారు.... కుఞంబు...



సంఘం భవనానికి అతడు ముందెప్పుడో స్థలం ఇచ్చినందుకు ఇప్పుడు చెల్లించవలసి వచ్చిన మూల్యం ఎలాటిది? అబూబకర్ తన స్వంత విషయం ఒక మారయినా యోచించాడో లేదో....

మూర్ఛ వచ్చినట్టయింది అప్పుకు:

"ఎందుకు అప్పు? ఏమవుతున్నది అప్పూ?"

"ఏమీ లేదు.... ఏమీ లేదు....?"

తాము ఎవరూ ఇక ముఖం వేలాడ వేసుకోగూడదు. 'వీరులలాగ ఉరికంబ మెక్కినారు' అని రేపటి చరిత్రకారులు వ్రాయాలి.

"నాకొక కొరత చిరుకండా?"

"ఏమిటోయ్?"

"మన నలుగురిలోను పాడేవారు ఒక్కరూ లేరు.... ఉండి ఉంటే పాటలు పాడుతూ ఉరితీసే చోటికి పోవచ్చు...."

"ఇప్పుడు జయ జయ ధ్వానం చేస్తూ పోదామట."

కుఞంబుకు తోబుట్టువుల జ్ఞాపకం వస్తున్నది. తర్వాత వేయి మంది సోదరుల— కోటి మంది జాతీయ సోదరుల జ్ఞాపకం. ఇంకొకసారి అవకాశం దొరికితే ఈ పనే తాను చేయడం; మళ్ళీ ఇదే దారినే తొక్కడం.

అబూబకర్‌కు కుట్టి కృష్ణుని చిత్రం కనులకు కడుతున్నది. "కామ్రేడ్" అని సంబోధించడం చాలదని "అన్నా" అని అతడు తనను పిలిచేవాడు.... రేపు దేశం స్వతంత్రమైనప్పుడు, ప్రజారాజ్యం వచ్చినప్పుడు అతడు విడుదలయి కయ్యూరికి తిరిగి వెళ్ళుతాడు; బాలసంఘానికి మారు స్వయం సేవక దళానికి నాయకుడవుతాడు.

"చిరుకండా! చేపలు కరుస్తాయని నీవు నీళ్ళల్లోకి దిగక ఒడ్డుమీదే కూర్చునేవాడివి - జ్ఞాపకం వుందా?"

"హూం."

....నడిరేయి గడిచింది. పహరావారు లాంతర్లు పట్టుకొని అటూ ఇటూ వెళ్ళి వస్తున్నారు. సుయ్‌మంటున్నది గదా గాలి? ఎందుకు, ఎవరూ నిద్రపోలేదా? మాస్టరు, కణ్ణుడు, ఎవరూ నిద్రపోలేదా?

పాటే!... వాళ్ళందరికీ ప్రియమైన పాట! వారందరికీ ప్రేమ పాత్రుడైన కణ్ణడు పాడుతున్నాడు! అది గాలిలో తేలుతూ వచ్చి, గదులలోకి చొచ్చుకొని వస్తున్నది.

అదుగో! వేరేవైపు నుంచి! అందరూ పాడేవారే, ఎందుకు? అవి దొంగలు, దగుల్బాజీలు వుండే జారకాసులు కావా? ఎలాటి దొంగలు, దగుల్బాజీలు? వారికి ఇదేమి అర్థం కాదనా? వారికి పాటలు రావనా?

అది ఎవరి గొంతో? అది ఎవరిదో? ఎవరిదో అది?

"అప్పు! వింటున్నావా? ఎవరూ నిద్రపోలేదు. మనం వెళ్ళే వేళకు ముందుగానే అందరూ మేల్కొని వీడ్కోలు చెబుతున్నారు..."

"హూఁ!...

కుఞంబుకు భావావేశంతో కడుపులో ఏదో బాధ కలుగుతున్నది. అతడు చీకటిని బెదిరించి, గర్జిస్తున్నాడు.

"కోటానుకోటి దళితుల అస్థి పంజరాలపై కట్టిన ఈ సామ్రాజ్యం తప్పకుండా పొడి పొడి అయిపోతుంది. ప్రపంచంలోని సకల కార్మికులు విజయపతాకం ఎగుర వేయనే వేస్తారు!"

గద్గద స్వరంతోనే అబూబకర్ అదేమిటో పాడ నారంభిస్తాడు. అది గద్యమో పద్యమో! లెఫ్ట్ - రైట్ ఆదేశాలో? నాభినుంచి వెలువడి నభోమండలానికి ఎక్కిన ఆలాపనో?

తన గది లోపలినుంచే ఎవరో పాడినట్టవుతున్నది అప్పుకు. ఆడ గొంతుక; మంజుల ధ్వని...

"ఓమన కిడా వే..."

తల్లి :

"అమ్మా... అమ్మా..."

"అప్పూ... ఏయ్ అప్పూ..."

..ఠణ్, ఠణ్, ఠణ్, ఠణ్ ... ఇక రెండు గంటలసేపు.

మేల్కొనే వుంది చెరసాల. కోడి కూస్తున్నది. సరైన పొద్దు బానో! కాదో! అయినా వాతావరణ ప్రభావానికి లోబడి ప్రాకారం ఆవలి మానులనుంచి కాకులు, కావు కావు మంటున్నవి...



మళ్ళీ ఏమీ వినిపించనట్టు సహస్ర కంఠాలతో పాట! ఎన్నటికీ ముగియని పాట!

చల్లని గాలి, ఉషాదేవి వస్తున్నది, వాళ్ళ పాలిటికి చివరిసారి. అదెందుకో ఆమె ఇప్పుడు అవగుంఠనవతి! కట్టుకున్నది నల్లచీర!

చిరుకండడు లేచి నిలబడి అన్నాడు:

"కామ్రేడ్స్! లేవండి! తెల్లవారింది...!"

సాయుధ భటుల వెనుక కాపలా, జెయిలరు, పై అధికారి, జిల్లా కలెక్టర్......

"మార్చ్!"

ఆ నలుగురిని ముందుకు నడిపించారు. దృఢంగా ఉంది వారందరి నడక.

"హాల్ట్:"

జెయిలు అధికారి చేతి గడియారం చూచాడు. ఇక ఐదు నిమిషాలు.

బేడీలు విప్పారు. కిందనుంచి వారిని వధ్యస్థానానికి ఇక తీసుకొని వెళ్ళాలి.

అప్పుడు చిరుకండడు నిర్భీకుడై ఒకే ధ్వనితో అన్నాడు:

"ఒళ్ళు ముట్టుకోకండి. మేమే మీదికి వెళ్ళుతాము:"

"వెళ్ళనివ్వండి!" అన్నాడు కలెక్టరు.

అవసరమయితే సిద్ధంగా వుండడమే మంచిదని సాయుధదళం ముందువరసవారు తుపాకులు గురిపెట్టి నిలిచారు.

ఇంకా రెండు నిమిషాలు.

చెరసాల లోపలినుంచి ప్రజాయోధుల గీతం మరింత స్పష్టమవుతూ వినవచ్చింది.

* * *

కలెక్టరు ముఖంమీద చిరచిర కనిపించింది. అధికారి చేతి గడియారం చూచాడు.

కింద కందకం దానికి ఆనించి నాలుగు పలకలు - మీద వ్రేలాడుతున్న ఉరితాళ్ళు.

"ముఖాలకు ముసుగు వేయండి:"

"వద్దు మాకు ముసుగులు అవసరం లేదు:"

ఉరితాడు ఒక్కొక్క గొంతుకూ ఆభరణ మయింది.

ఉచ్చైస్స్వరంతో చిరుకండడు నినాదం చేశాడు:

"ఇంక్విలాబ్ —"

అప్పు, కుఞంబు అబూబకర్ ప్రతి, నినాదం చేశారు:

"జిందాబాద్!"

"సామ్రాజ్యవాదం—"

"నాశనమగుగాక!"

"విప్లవం—"

"విజయం పొందుగాక!"

అధికారి సైగచేశాడు. ఉరితాళ్ళు గొంతు బిగించాయి; వెలుపలికి రావడానికి సిద్ధంగా వున్న స్వరాలు ఆగాయి. పలకలను అరక్షణంలో తొలగించారు. ఆ నాలుగు దేహాలూ కందకంలో వ్రేలాడినవి. ఉరితాడు ఉచ్చు మరింతగా, మరింతగా బిగుసుకుంది.

"చచ్చేవరకూ స్నేహం...."

వేలాడుతున్న దేహాలనుంచి ధ్వని వెలువడలేదు. అయితే, చెర సాలకు చెరసాలే నినాదాలతో ప్రతిధ్వనించింది.

తెల్లవారింది. సూర్యుడు కనిపించవలసిన సమయం. కాని ఎందుకో వాడి జాడలే లేవు.

అధికారి నెమ్మదిగా అన్నాడు:

"వారసులు శవంకోసం కాచుకొని ఉన్నారు."

"వారికి ఎలా తెలిసింది?"

"ఎలాగో నాకు తెలీదు. వచ్చారు."

"ఏం చేస్తారట? ఊరేగింపు కోసమా?"

"ఊరికి తీసుకొని పోతామని అంటున్నారు."

నిర్ధారకమైన ధ్వనితో కలెక్టరు అన్నాడు:

"సాధ్యం కాదు. శవాలు ఇవ్వకండి. ఇక్కడే పూడ్చిపెట్టండి!"



....చెరసాలకు కొంచెం దూరంలో వున్న ఊరంతా మేల్కొన్నది ఇప్పుడు....నల్లటి గోడలను ఎక్కివచ్చిన జయఘోషలు, శోకగీతాల విప్లవ గీతాల తరంగాలు జనం ఎన్నాళ్ళనుంచో నిరీక్షిస్తున్న మరణ వార్తను – కయ్యూరు వీరుల మరణవార్తను తెచ్చి అందించాయి.

.... .... ....

కయ్యూరులో పగలు ఆలస్యంగా భోజనం చేసి విశ్రమించిన జమీందారు నంబియారు ఏమిచేసినా నిద్ర రాక, ఎన్నోనాళ్ళుగా ఆలోచించిన ఒక పని ముగిసునీ అని, గొడ్డండ్లు పట్టుకున్న బంట్లతోపాటు సాయంకాలం బడిపద్దకు వచ్చారు

అక్కడ మాస్టరు నాటిపోయిన అడవిమామిడిచెట్లు రెండు, ఇరవై అయిదు సంవత్సరాల యువకులలాగ నిటారుగా పళ్ళతో కలకల లాడుతూ నిలిచివున్నాయి

"వీటిని నరికి పడేయండి!" అని నంబియారు ఆజ్ఞాపించారు.

ఆ చెట్లు బలంగా పెరిగాయి. రెండుకాదు, నాలుగు మానుల బలం వున్నట్టు తోస్తున్న ఆ చెట్లను, జమీందారుగారి ఊడిగపు మనుషులు ఎంతో ప్రయాసతో నరికి పడగొట్టారు.

అటు తర్వాత కొంత సేపటికి, చీకటివడగానే, కణ్ణూరినుంచి వేగులవారు వార్త తెచ్చారు....

....వానను ఎదురు చూచి ఎండి మండుతున్న నేల చల్లబడింది. గాలి అటువైపు వీచడానికి నిరాకరించింది. చెట్టు చేమ స్తబ్ధమయింది. నీరవ మయింది ప్రకృతి.

గుడిసెలలో జనం దీపం కూడ ముట్టించకుండా చీకట్లోనే కూర్చుని, మరణించిన ఆ నలుగురిని తలచుకొని తలచుకొని ఏడ్చారు.

'అప్పుకుట్టిని ఎత్తుకొని జానకి వెలుపల ముంగిట్లోనే కూర్చున్నది. పిల్లవాడు ఒకే సమంగా ఏడుస్తున్నాడు. వాడిని సమాధాన పెట్టలేక అలసి పోయి జానకి ఆకాశం చూస్తూ వుండిపోయింది. అక్కడ కోటి చుక్కలు మినుకు మినుకు మంటున్నవి. పడమట ఒకచోట నాలుగు నక్షత్రాలు సమానమైన కాంతితో వెలుగుతున్నట్టు కనిపించింది.

జానకి ఆ నాలుగింటిలో మొదటి నక్షత్రం వైపు వ్రేలు చూప పిల్లవాడితో అన్నది :

"అప్పుకుట్టి అదిగో అక్కడ చూచావా? నాన్న అక్కడ వున్నా నీవు ఏడవగూడదు. ఏడిస్తే ఆయనకు బాధ కలుగుతుంది—"

చాల దీర్ఘమయింది కయ్యూరిలో ఆ రాత్రి.

అలా వున్నా చీకటి గడచి, మెల్లమెల్లగా తెల్లవారింది.



# చివరి అధ్యాయం పిదప

ఠణం ఠణక్ ఠణం....

మంగళం పాడుతున్నారు. "కయ్యూరు వీరగాథ" ఇక్కడికి సమాప్తమయింది. బాంధవుడా! జనం లేస్తున్నారు. లేవండి మీరూ...

ఆ స్త్రీ పురుషుల ముఖాలేమిటి చూస్తున్నారు? వారి చెక్కిళ్ళు తడిశాయనా? బరువు గుండెలను మోసుకొని నిలబడి వున్నారనా?

ఇదేమిటి? నన్నూ ఎందుకు ఇలా చూస్తున్నారు?

తెలిసింది ! ఏదీ—కొంచెం మీ కపోలాలను తాకి చూచుకుంటారా?!

నాకు తెలుసు. అది తప్పు కాదు. అలా కొట్టుకొనే మనస్సే నిర్మల హృదయానికి అద్దం. కాకపోతే ఆ వీరకథను విని కరగని రాతి గుండె ఏదీ?

జనం బారులు తీరి నిలబడి బలిదానం చేసిన వారి స్మారకస్తూపం ఎదుట శ్రద్ధాంజలి ఘటిస్తున్నారు. రండి. మనమూ నిలబడి మన వంతు కోసం వేచివుందాం.

....ఆ అమృతశిలా స్తూపం (పాలరాతి స్తూపం) - ఆ పతనాలయం -

దేశం నలుమూలలనుంచి నిధి సేకరించి ఈ స్మారకం నిర్మించాం.

అరుగో! స్వయం సేవకులు ఎర్రగులాబీలను ఇస్తున్నారు. రండి, తీసుకుందాం.

ఈ కెంపు గులాబీలు మరణించిన అమరవీరుల స్మారకానికి ర్పణం....

పం శిలల మీద రక్తాక్షరాలతో చెక్కిన దానిని చదివారా?

జీవితాన్ని ప్రేమించిన ఆ బాంధవులు ఉత్తమ జీవితం కోసం పాటు పడ్డారు; మడిశారు.

విడిపోయిన సోదరులారా! ఇదిగో మా విప్లవ వందనాలు! ఇదిగో మా అరుణ నమస్కారాలు!

మీ కలలన్నీ నిక్కాలలు కాలేదని మేమెరుగుదుము. మాదేశమేమో స్వతంత్రమయింది. అయితే ఇదింకా సమానత్వ సోదరత్వాల సుఖ శాంతుల వీడు కాలేదు. రాళ్ళ, ముండ్లదారిని నడచి, ఒక ఘట్టాన్నిప్పుడు మేము చేరాము. ఇక్కడి నుంచి మరొక ఘట్టానికి ముందు పయనం. దానినీ విజయవంతంగా ముగించి లక్ష్యం చేరుతామనడంలో మాకు సందేహం లేదు. వీర పరంపర వున్న, నిర్మల చరిత్ర వున్న మన జనతకు ఆ శక్తివుంది-ధారాళంగా వుంది!

ప్రసంగం....

ఈ దేశం వృద్ధ రైతు నాయకుడు మాట్లాడుతున్నారు:

"దేశ బాంధవులారా! ఆ వీరజీవితపు అమర సందేశం కంటే ఎక్కువయిన మాటను మాత్రం నేనేమి చెప్పగలను? వారి కలలను పూర్తిగా నిక్కాలలు చేసే భారం మీది. మీ స్మృతి పటంలో కయ్యూరు వీరుల సంస్మరణం చిరకాలం పచ్చగా వుండనీ! జీవన మార్గంలో ముందుకు సాగే మీ కందరికీ ఆ సంస్మరణం తెలివి ప్రసాదించే వెలుగు కానీ!"

ఓ కన్నడ నాడు కామ్రేడ్! రండి! జనం జయఘోష చేస్తున్నారు. మనమూ గొంతు కలుపుదాం.

"కయ్యూరు అమరవీరుల వీర సంస్మరణకు-"

"అరుణ నమస్కారం"

"కయ్యూరు వీర యోధుల చిరస్మరణకు-"

"అరుణ నమస్కారం"



